శ్రీ రా ము లు

# కవిత్వతత్త్వవిచారవిమర్శనము

గ్రంథకర్త:
కాఖూరి వ్యాసమూర్తి
విజయనగరము.



చెన్నపురి:
వావిళ్ల ప్రెస్సున
ముద్రితము.
1940.

# తొలి పలుకు

---

శ్లో. శ్రీరామం హనుమత్సేవ్యం శ్రీకృష్ణం భీమసేవితం,
శ్రీవ్యాసం మధ్వసంసేవ్యం సకలాభీష్టదం భజే.

సదాస్మరణీయులు:—మందకటాక్షమాత్ర సంజనిత సృష్టిస్థితి సంహారనియమన జ్ఞానాఽజ్ఞానబంధమోక్షహేతువులైన సీతారాములు.

నిత్యస్మరణీయులు:—సృష్టికర్తలు వాణీహిరణ్యగర్భులు, సర్వజీవోత్తములు భారతీముఖ్యప్రాణులు, భాగవతోత్తములు సౌపర్ణీవారుణీపార్వతీ సమేతగరుడశేషరుద్రులు, ఇంద్రకామాది దేవతాబృందములు, సాత్వికమూర్తులు ఋషీశ్వరులు, గోత్రర్షి స్వతంత్రకపి, పితృదేవతలు, సద్వైష్ణవప్రతిష్ఠాపనాచార్యులు మధ్వాచార్యులు, సుధాదివేదాంతగ్రంథకర్తలు జయతీర్థులు, (టీకాచార్యులు.) రాఘవేంద్రతీర్థులు.

చిరస్మరణీయులు:— వాల్మీకి వ్యాస కాళిదాస వాదిరాజాది సంస్కృతకవీశ్వరులు, నన్నయ తిక్కన సూరన (పింగళి) సూరకవి (అడిదము) ప్రముఖులాంధ్రకవీశ్వరులు, ప్రపంచదేశసంరక్షకులైన చారిత్రకపురుషులు.

ముఖ్యస్మరణీయులు:—ఉత్తరాదిమఠాధీశ్వరులు శ్రీసత్యధ్యానతీర్థశ్రీపాదులవారు, విజయనగరసంస్థానాధీశ్వరులు శ్రీ శ్రీ శ్రీ పూసపాటి విజయరామగజపతీంద్రులవారు.

మాతాపితలు:—నన్ను గన్నతల్లి స్వర్గస్థురాలు నరసమ్మగారు, కన్నతండ్రి వేదాంతవిద్యాగురుఁడు కాఖారి హనుమంతాచార్యులుగారు, బాల్యమునుండియు సంరక్షకురాలు పెంపకపుఁదల్లి లచ్చమగారు. శౌత



శ్రీ కాఖూరి వ్యాసమూర్తిగారు, వీరిధర్మపత్ని.

# తొ లి ప లు కు

---

శ్లో. శ్రీరామం హనుమత్సేవ్యం శ్రీకృష్ణం భీమసేవితం,
శ్రీవ్యాసం మధ్వసంసేవ్యం సకలాభీష్టదం భజే.

సదాస్మరణీయులు:—మందకటాక్షమాత్ర సంజనిత సృష్టిస్థితి సంహారనియమన జ్ఞానాఽజ్ఞానబంధమోక్ష హేతువులైన సీతారాములు.

నిత్యస్మరణీయులు:—సృష్టికర్తలు వాణీహిరణ్యగర్భులు, సర్వజీవోత్తములు భారతీముఖ్యప్రాణులు, భాగవతోత్తములు సౌపర్ణి వారుణీపార్వతీ సమేతగరుడశేషరుద్రులు, ఇంద్రకామాది దేవతాబృందములు, సాత్వికమూర్తులు ఋషీశ్వరులు, గోత్రర్షి స్వతంత్రకపి, పితృదేవతలు, సద్వైష్ణవప్రతిష్ఠాపనాచార్యులు మధ్వాచార్యులు, సుధాదివేదాంతగ్రంథకర్తలు జయతీర్థులు, (టీకాచార్యులు.) రాఘవేంద్ర తీర్థులు.

చిరస్మరణీయులు:— వాల్మీకి వ్యాస కాళిదాస వాదిరాజాది సంస్కృతకవీశ్వరులు, నన్నయ తిక్కన సూరన (పింగళి) సూరకవి (అడిదము) ప్రముఖులాంధ్రకవీశ్వరులు, ప్రపంచదేశసంరక్షకులైన చారిత్రక పురుషులు.

ముఖ్యస్మరణీయులు:—ఉత్తరాదిమఠాధీశ్వరులు శ్రీసత్యధ్యాన తీర్థశ్రీపాదులవారు, విజయనగరసంస్థానాధీశ్వరులు శ్రీ శ్రీ శ్రీ పూసపాటి విజయరామగజపతీంద్రులవారు.

మాతాపితలు:—నన్ను గన్నతల్లి స్వర్గస్థురాలు నరసమ్మగారు, కన్నతండ్రి వేదాంతవిద్యాగురుఁడు కాఖూరి హనుమంతాచార్యులుగారు, బాల్యమునుండియు సంరక్షకురాలు పెంపకపుఁదల్లి లచ్చమ్మగారు, శ్రోత

స్మార్తవిద్యాగురుఁడు పెంపకపుఁదండ్రి కీర్తిశేషులు కాఖారి రామమూర్త్యాచార్యులుగారు.

ఉపాధ్యాయులు:—గీర్వాణాంధ్రసాహిత్యవిద్యాగురుఁడు కలవపూడి వెంకటాచార్యులుగారు, జ్యోతిషగురువులు కీర్తిశేషులు ఆదిరాజు జోగావధానులు, వాహినీపతి లింగమూర్తిగారలు, ఆంగ్లాదివిద్యాగురువులు విజయనగరపురపాలకోన్నతపాఠశాలోపాధ్యాయులు.

బంధువర్గము:— జనకసహోదరులు శ్రౌతస్మార్తక్రియానిపుణులు వేంకటనరసింహముగారు (సబ్ పోష్టుమేష్టరు), శేషగిరిరావుగారు (ఆంగ్లవైద్యులు), రామకృష్ణరావుగారు (ఆయుర్వేదవైద్యులు.)

స్మరణీయులు:—మూల రామప్రియబిరుదాంకితులు శ్రీ కానుకుర్తి వేంకటకృష్ణరావు పంతులుగారు, (కీ॥ శే॥) కాదులూరి బాయన్న పంతులుగారు.

నాజనకులకు వ్యాసపూజాధికారము లభించినపుడు నేను పుట్టినందున వారు వ్యాసమూర్తియని పేరుపెట్టిరి. పెంపకమపుడు పెంపకపుఁదండ్రిగారు వ్యాసనరసింహము అని పేరుపెట్టిరి. విజయనగర ద్వైతాద్వైత సభావిషయ విమర్శన విమర్శనము, విగ్రహారాధనము (సుజ్ఞానేంద్రులొనర్చిన పుస్తకమున కాంధ్రానువాదము) అను పుస్తకములను రచించియున్నాను.

కుటుంబము:—౧ *బాల్యక్రీడలందుఁగూడ భర్తపేరడుగునపుడు నన్నే వచించుచుండినదియు, నితరసంబంధములు వచ్చినపుడు ఉచితరీతినిఁ దలితండ్రులకు నచ్చఁజెప్పి నన్ను వివాహమాడినదియు నగు నర్ధాంగి రమణమ్మ. ౨ సంతానము రామరావు, లక్ష్మీనరసింగరావు, హనుమంతరావు, లచ్చమ్మ, రామనరుసు, వేంకటేశ.

---

* దేశమందేదైన ఆచారము వ్యాప్తిలోనుండిన నది బాలబాలికలందును వ్యాపించి గనుబట్టుచుండును. బాల్యవివాహములు వ్యాప్తిలోనున్న దేశమం దిట్టికన్యక గల్గిన దనుటలో వింతలేదు. ఈవిషయము గ్రంథమున కుపయుక్తమగుచుండుటవలన వ్రాయ సాహసించితిని.

# పీ ఠి క.

---

గీ. జానకీమనోనాథుండు జగతి రామ,విభుఁడు శ్రీరామహృదయేశ్వరి భువిజాత,
సీత పరిశుద్ధదంపతుల్ పూతమతులు, నఖిలదేవర్షి సంపూజితాంఘ్రితలులు.

శ్రీయుత కట్టమంచి రామలింగారెడ్డిగారు (ఆంధ్రవిశ్వకలాపరిష త్ప్రథమోపాధ్యక్షులు) 'కవిత్వతత్త్వవిచారము' అనుపుస్తకము నొక దానిని వ్రాసిరి. అందు వారు భారతకవులు, శ్రీనాథాదులు, ప్రబంధ కవులు మొత్త మాంధ్రకవు లందఱియందు దోషములుగలవని వ్రాయు టయేగాక, వారు వ్రాసిన పుస్తకమునకుఁ గథానాయకుఁ డనఁదగు పింగళి సూరన్నను త్రిశంకుస్థానమందు నిలిపిరి. మఱియు నాంధ్రకవులయందే కాక యావద్భారతదేశకవులందఱియందు దోషములుగలవని వ్రాసిరి. ఇంతియకాక వైదికమతాచారములను, స్మృతులను, రామాయణభారతాదులను,పురాణములను గొంతవఱకు విమర్శించి వాటియందును దోషములుగలవని వ్రాసిరి. మనపూర్వులందఱియందు ననఁగా మహమ్మదీయయుగాంతమువఱకైన మనపూర్వులందఱియందును, శాస్త్రములందును దోషములుగలవని వ్రాయుటయేకాక ఆకాలములన్నిటికన్న నేఁడు మనము బ్రిటిషువారిపరిపాలనమాహాత్మ్యమున వృద్ధినొందుచున్నామని వ్రాసిరి. వారు వ్రాసిన పుస్తకమందు యథార్థ మెంతవఱకుగలదో దానిని విమర్శించుట ముఖ్యమని తోఁచి ఈవిమర్శనము వ్రాసి ప్రచురించినాను.

బ్రహ్మశ్రీ వావిళ్ల వేంకటేశ్వరశాస్త్రులవారు ఈగ్రంథమును వ్యాసరూపమునఁ త్రిలిఙ్గపత్రికయందు మొదటఁ బ్రచురపఱచినారు. ఇపుడు గ్రంథరూపమున బ్రచురింప అవకాశమిచ్చిన భాషోద్ధారకులను సార్థకబిరుదుగల్గిన శ్రీశాస్త్రులవారికి వందనము లర్పించుచున్నాను.

ఈగ్రంథమువిషయమై భారతీతీర్థము తరఫున యోగ్యతాపత్రము నొసంగిన జయపుర సంస్థానాధీశ్వరులు, సాలగ్రామపీఠస్థులు శ్రీశ్రీశ్రీ విక్రమదేవవర్మమహారాజావారి యెడలను, అచ్చుప్రతులను సవరించి యిచ్చిన విజయనగరసంస్థానాంగ్లకళాశాలా పండితులు శ్రీ అడిదము రామరావుపంతులుగారి యెడలను కృతజ్ఞుఁడను.

నాకీగ్రంథరచనయందు శ్రీమధ్వాచార్యులవారియొక్కయు, శ్రీగట్టుపల్లి శేషాచార్యులవారియొక్కయు, శ్రీసరస్వతి వేంకటసుబ్బరామశాస్త్రులవారియొక్కయు గ్రంథములు మఱికొన్ని గ్రంథములు సహకారములైనవి.

విజయనగరము.<br>శా॥ శ॥ ౧౮౬౨

ఇట్లు,<br>కాళూరి వ్యాసమూర్తి.

# విషయసూచిక







# తప్పొప్పుల పట్టిక.

| పుట. | పంక్తి. | తప్పు. | ఒప్పు. |
|---|---|---|---|
| 17 | 29 | సంభోగమందలి ధ్వని | సంభోగమందు అని ధ్వని |
| 74 | 18 | ఆక్షేపణపూర్వకముగ | ఆక్షేపపూర్వకముగ |
| 90 | 29 | నమరమునకు | సమరమునకు |
| 133 | 29 | విజృంభింపలేవు | విజృంభించిలేవు |
| 146 | 16 | కాయుచుండినది | వ్రాయుచుండినది. |
| 154 | 21 | చూపుటకు దానిని | చూపుటకు రానివి |
| 182 | 11 | దమ్ము తరువాతగామింపరనియుం | దమ్ముఁ గామింపరనియు |
| 195 | 24 | 196 పుటలోని 'ఏహి క్షుత్త' అనుశ్లోక మిచ్చోట నుండవలెను. | |
| 196 | 17 | 'ఏహిక్షుత్త' అనుశ్లోకమున్నచోట 'ఏకవస్త్రా' అనుశ్లోక ముండవలెను. | |
| 215 | 16 | పినతండ్రి | పెదతండ్రి |
| 244 | 3 | గట్టుడిట్లు | గట్టునపుడిట్లు |

20 'గావింపకఁబోనిచ్చెను' 21 'అయిష్టుఁడు' 121 'కావుననే నుత్తమనాయికానాయకులను' ఇట్టివి తప్పులు గలవు. తెలియక వ్రాసినవియుఁ, బొరపాటునఁ బడినవియు నగుతప్పులను మన్నింపఁబ్రార్థన. తెనుఁగంకెలు లేకుండుట ఒకదోషము.

# కవిత్వతత్త్వ విచారవిమర్శనము.

---

## శ్రీయుత కట్టమంచి రామలింగారెడ్డిగారి పుస్తకవిమర్శనము.

---

## ప్ర భా వ తీ ప్ర ద్యు మ్న ము

శ్లో. శ్రీరాఘవం దశరథాత్మజ మప్రమేయం, సీతాపతిం రఘుకులాన్వయరత్నదీపం
ఆజానుబాహు మరవిందదళాయతాక్షం, రామం నిశాచరవినాశకరం నమామి.

(పింగళిసూరన్న తాను వ్రాసిన ప్రభావతీప్రద్యుమ్నమందు) "ఇంద్రమాతలి సంవాదరూపమునఁ బురవర్ణనముం జేసియున్నాఁడు. ఇంద్రుఁడు చింతాక్రాంతుఁడై యుండఁబట్టి పురవర్ణనాదులచే నతనికి మఱపుఁగల్పింపఁజూచుట సారథి ధర్మమేకదా! కావున నియ్యది ప్రబంధములనెల్ల సర్వసాధారణములగు దిక్కులేని వర్ణనలకుం జేరినదిగాదు. మఱి సార్థకము" (౧౦౦, ౧౦౧) అని రెడ్డిగారు వ్రాసిరి. ఇంద్రుఁడు 'లోకహితకార్యపర్యాలోచనంబునకై చనుదెంచెను' (ప్రభా. ప్ర. ౫౩) అనియు, 'రథికసారథులు తత్తద్వస్తుసందర్శన సమయసముచిత వచోరచనల వినోదించుచు' వచ్చిరి (ప్రభా. ప్ర. ౬౭) అనియుఁ గవి వ్రాసియున్నందున నింద్రుఁడు చింతాక్రాంతుఁడై ద్వారకానగరంబునకు రాలేదని తెలియవచ్చుచున్నది. యజ్ఞాంతమం దింద్రవజ్రనాభులతగవు పరిష్కరించెదనని తండ్రి (కశ్యపుఁడు) చెప్పియుండుటచే సురలోకరాజ్యమును గొననెంచి వచ్చినవజ్రనాభుఁడు దన వజ్రపురి యనుపట్టణమునకు వెడలిపోయెను. అయినను ఏమఱించి పైఁబడునేమో యని యింద్రుఁడు ముందుగనే మేలుకొనన నెంచెను. ఇది యింద్రుఁడు చింతాక్రాంతుఁడై యున్నాఁడు. అనువిషయమును బలపఱుపదు. రథికసారథులు వినోదించిరి అని యున్నందునను, మాతలిపురవర్ణనముఁ జేయకముంద యింద్రుఁడు సంతుష్టి నొందెను. (ప్రభా. ప్ర. ౫౫) అని యున్నందునను రెడ్డిగారు వ్రాసినది

యుక్తముగాఁ గనఁబడలేదు. రెడ్డిగారు తలఁచినటుల రథికసారథుల సంభాషణకథకు సంబంధించినది కానేరదు. ఇంద్రుఁడు చింతాక్రాంతుఁడై చని శ్రీకృష్ణుని శరణుసొచ్చెను అనుదాని నీసంభాషణ సమర్థింపదు.

"తండ్రికిని (వజ్రనాభునకు) బతికిని (ప్రద్యుమ్నునకును) యుద్ధము సంభవించెఁగదా. ఎవరు గెల్చినను దనకు (ప్రభావతికి) దుఃఖమే గదా యను నాలోచన యీపతివ్రతాశిరోమణి కేల తట్టును? ప్రద్యుమ్నుఁడు భార్య నుద్దేశించి 'నీతండ్రినిఁ జంపకున్న మనబ్రతుకు నిలుచు మార్గ మెద్దియు లేదు.' 'ఒండొకత్రోవఁ ద్రొక్కఁగాఁగూడదు, యేమి సేయుదును ఘోరవిచారము పుట్టె నాత్మలో' నని పలుకఁగా, దేవిగారు, (ప్రభావతి) 'విభునిం దమ్ముఁ గాచికొనంగ వేఱుత్రోవ నెమకి కానకంతఁ బితృవత్సలభావముఁ బాఱనూకిన'దఁట! ఈభావము నీమహాకావ్యమున నింతకుముం దెక్కడను జూపినది కాదు. అణుమాత్రమైనఁ దాల్చియుండె ననుటకుఁ జిన్నె లెవ్వియును లేవు. మఱి యెంతోగారాబముతోఁ జూచుచుఁ గోరినకోర్కు లెల్ల నడిగినమాత్రనఁ దీర్చు కన్నతండ్రి కనుగప్పి గాంధర్వ వివాహక్రీడకుఁ జొచ్చినకన్యామణి! అట్లగుట నీమెకుఁ 'బితృవత్సల భావ మెక్కడిది? ఉండెఁబో ఎంతోభద్రముగ మనకెవరికి నెఱుఁగఁబడ కుండునట్లు ఎక్కడనో పాతిపెట్టినది! తండ్రింగూర్చిన హృదయాందోళన మేమేనిగలదా! హిందూపతివ్రతలకు నుండరాదేమో! మనశాస్త్ర ఘోషలలోఁ బరిచయముగలవారి నడిగి తెలిసికొనుండు."(౧౦౩, ౧౦౪) అని వ్రాసిరి. ప్రభావతి యాలోచించి ఉపాయాంతరము లేకుండుటచేఁ బితృవత్సలభావముఁ బాఱనూకినది. ప్రభావతికి పార్వతీదేవి కలలోఁ బ్రత్యక్షమై 'నీకు బ్రద్యుమ్నుఁడు విభుఁడు' అని చెప్పినది. అట్టి దైవ చోదితునివరించిన ప్రభావతియందు దోషము లేదు. కన్యాస్వాతంత్ర్యము నాశించు రెడ్డిగా రిట్లాక్షేపించుట విచిత్రముగ నున్నది. ప్రద్యుమ్నుని గాంధర్వవిధిని వరించినది గావున ప్రభావతికిఁ బితృవత్సలభావము లేదని చెప్పవచ్చునా? ఉపాయాంతరము లేకుండుటచే విభునిఁ దమ్ముఁగాచు కొనుటకై యామె పితృవత్సలభావముఁ బాఱనూకినది. మఱియు రెడ్డిగా రిట్లు వ్రాసిరి.

"ఇట్లు ప్రభావతి మనసన్యాసులవలె తనకు లేనిదాని ధైర్యము తోఁ బారనూకి

క. తాన చని మూలనున్నయ, నూన తదీయాసిఁ దెచ్చి యొసఁగి గెలువుమీ
దానవపతిఁ దక్కినయను,మానము మానుమని పలికె మానవతి పతిన్.

(ప్రభా. ౫-౧౯౮.)

అదిరా! సౌకుమార్యము, సౌమనస్యము మొదలగుకోమలగుణం బుల యపరావతారముగదా యీమానవతి! ఈపరమపవిత్రురాలితో ద్రౌపదిఁ బోల్చిచూడుఁడు! భీమసేనుఁడు కీచకవధార్థమై ప్రతిజ్ఞఁ జేయుచు,

తే. ఎల్లి యెల్లవిధంబుల నెందుఁజొచ్చె,నేని నాధర్మతనయుండు దానవచ్చి
యడ్డపడెనేని, నీప వెంపారుకరుణఁ, గాచితేని నాచేఁ బడుఁ గీచకుండు.

(భా. విరా. ౨. ౨౩౨.)

అని ద్రౌపదితోఁ గఠినాక్షరంబుగాఁ జెప్పుటలో, నాపాంచాలి తనకట్టి యవజ్ఞ నేసినను, నాసూతుఁడు కామాంధుండు గావుటఁ బశ్చా త్తాపపాత్రుండని కనికరించి క్షమించి కావఁజూచునంత యుదారచిత్తురాలని ధ్వనిఁ గల్పించినందున నామహాదేవికిఁ గొఱఁత ఘటిల్లెనా ?" (౧౦౪, ౧౦౫) అనివ్రాసిరి. తప్పించుకొనుటకు రాకుండఁ దండ్రి (వజ్రనాభుఁడు) రౌద్రమూర్తియై సమీపించుచుండెను. అందువలనఁ బ్రభావతి విభునకుఁ గత్తి నందించినది. ఆతనికత్తి నాతని కందించినది. కత్తి నొసఁగి గెలువుమీ, యన్నదిగాని చంపుమీ యని యనలేదు. విభుఁడు గెలిచినయెడల నపా యము తొలఁగును. తండ్రి బంధింపఁబడవచ్చును. పిదప తండ్రికిఁ బశ్చా త్తాపము గలుగవచ్చును. అని యిందు ధ్వనిగలదుకదా. ద్రౌపదీవిషయ ములోఁ గొంత వ్యవధిగలదు. ఈలోపునఁ గీచకుండు పశ్చాత్తప్తుఁడు గావచ్చును. అట్లుకాకపోయినను 'గీచకుని చంపవద్దు, మనమే వేఱొక చోటుకు బోద'మను నభిప్రాయము ద్రౌపదికిఁ గలుగవచ్చును. లేక వాఁడు చావకుండ వేఱొకయుపాయమునఁ గార్యమును సాధింపవచ్చును. కావున భీముఁ డట్లు పలికినాఁడు. ఇక్కడనో సమయము మించివచ్చినది. వేఱొక యుపాయము లేకుండుటచేతనే కత్తి నందించినదని కవి వ్రాయుటచే బ్రభావతికిఁ బితృవత్సలభావము గలదని తేటపడుచున్నది. విషయము

యుక్తముగాఁ గనఁబడలేదు. రెడ్డిగారు తలఁచినటుల రథికసారథుల సంభాషణకథకు సంబంధించినది కానేరదు. ఇంద్రుఁడు చింతాక్రాంతుఁడై చని శ్రీకృష్ణుని శరణుసొచ్చెను అనుదాని నీసంభాషణ సమర్థింపదు.

"తండ్రికిని (వజ్రనాభునకు) బతికిని (ప్రద్యుమ్నునకును) యుద్ధము సంభవించెఁగదా. ఎవరు గెల్చినను దనకు (ప్రభావతికి) దుఃఖమే గదా యను నాలోచన యీపతివ్రతాశిరోమణి కేల తట్టును? ప్రద్యుమ్నుఁడు భార్య నుద్దేశించి 'నీతండ్రినిఁ జంపకున్న మనబ్రతుకు నిలుచు మార్గ మెద్దియు లేదు.' 'ఒండొకత్రోవఁ ద్రొక్కఁగాఁగూడదు, యేమి సేయుదును ఘోరవిచారము పుట్టె నాత్మలో' నని పలుకఁగా, దేవిగారు, (ప్రభావతి) 'విభునిం దముఁ గాచికొనంగ వేఱుత్రోవ నెమకి కానకంతఁ బితృవత్సలభావముఁ బాఱనూకిన'దఁట! ఈభావము నీమహాకావ్యమున నింతకుముం దెక్కడను జూపినది కాదు. అణుమాత్రమైనఁ దాల్చియుండె ననుటకుఁ జిన్నె లెవ్వియును లేవు. మఱి యెంతోగారాబముతోఁ జూచుచుఁ గోరినకోర్కెలెల్ల నడిగినమాత్రనఁ దీర్చు కన్నతండ్రి కనుగప్పి గాంధర్వ వివాహక్రీడకుఁ జొచ్చినకన్యామణి! అట్లగుట నీమెకుఁ 'బితృవత్సల భావ మెక్కడిది? ఉండెబో ఎంతోభద్రముగ మన కెవరికి నెఱుఁగఁబడ కుండునట్లు ఎక్కడనో పాతిపెట్టినది! తండ్రింగూర్చిన హృదయాందోళన మేమేనిగలదా! హిందూపతివ్రతలకు నుండరాదేమో! మనశాస్త్ర ఘోషలలోఁ బరిచయముగలవారి నడిగి తెలిసికొనుండు."(౧౦౩, ౧౦౪) అని వ్రాసిరి. ప్రభావతి యాలోచించి ఉపాయాంతరము లేకుండుటచేఁ బితృవత్సలభావముఁ బాఱనూకినది. ప్రభావతికి పార్వతీదేవి కలలోఁ బ్రత్యక్షమై 'నీకు బ్రద్యుమ్నుఁడు విభుఁడు' అని చెప్పినది. అట్టి దైవ చోదితునివరించిన ప్రభావతియందు దోషములేదు. కన్యాస్వాతంత్ర్యము నాశించు రెడ్డిగా రిట్లాక్షేపించుట విచిత్రముగ నున్నది. ప్రద్యుమ్నుని గాంధర్వవిధిని వరించినది గావున ప్రభావతికిఁ బితృవత్సలభావములేదని చెప్పవచ్చునా? ఉపాయాంతరము లేకుండుటచే విభునిఁ దమ్ముఁగాచు కొనుటకై యామె పితృవత్సలభావముఁ బాఱనూకినది. మఱియు రెడ్డిగా రిట్లు వ్రాసిరి.

"ఇట్లు ప్రభావతి మనసన్యాసులవలె తనకు లేనిదాని ధైర్యము తోఁ బారసూకి

క. తాన చని మూలనున్నయ, నూన తదీయాసిఁ దెచ్చి యొసఁగి గెలువుమీ
దానవపతిఁ దక్కినయను,మానము మానుమని పలికె మానవతి పతిన్.

(ప్రభా. ౫-౧౯౮.)

అదిరా! సౌకుమార్యము, సౌమనస్యము మొదలగుకోమలగుణం బుల యపరావతారముగదా యీమానవతి! ఈపరమపవిత్రు రాలితో ద్రౌపదిఁ బోల్చిచూడుఁడు! భీమసేనుఁడు కీచకవధార్థమై ప్రతిజ్ఞఁ జేయుచు,

తే. ఎల్లి యెల్లవిధంబుల నెందుఁజొచ్చె, నేని సాధర్మతనయుండు దానవచ్చి
యడ్డపడెనేని, సీవ పెంపారుకరుణఁ, గాచితేని నాచేఁ బడుఁ గీచకుండు.

(భా. విరా. ౨. ౨౩౨.)

అని ద్రౌపదితోఁ గఠినాక్షరంబుగాఁ జెప్పుటలో, నాపాంచాలి తనకట్టి యవజ్ఞనేసినను, నాసూతుఁడు కామాంధుండు గావుటఁ బశ్చా త్తాపపాత్రుండని కనికరించి క్షమించి కావఁజూచునంత యుదారచిత్తురాలని ధ్వనిఁ గల్పించినందున నామహాదేవికిఁ గొఱఁత ఘటిల్లెనా?" (౧౦౪, ౧౦౫) అనివ్రాసిరి. తప్పించుకొనుటకు రాకుండఁ దండ్రి (వజ్రనాభుఁడు) రౌద్రమూర్తియై సమీపించుచుండెను. అందువలనఁ బ్రభావతి విభునకుఁ గత్తి నందించినది. ఆతనికత్తి నాతని కందించినది. కత్తి నొసఁగి గెలువుమీ, యన్నదిగాని చంపుమీ యని యనలేదు. విభుఁడు గెలిచినయెడల నపా యము తొలఁగును. తండ్రి బంధింపఁబడవచ్చును పిదప తండ్రికిఁ బశ్చా త్తాపము గలుగవచ్చును. అని యిందు ధ్వనిగలదుకదా. ద్రౌపదీవిషయ ములోఁ గొంత వ్యవధిగలదు. ఈలోపునఁ గీచకుండు పశ్చాత్తప్తుఁడు గావచ్చును. అట్లుకాకపోయినను 'గీచకుని చంపవద్దు, మనమే వేఱొక చోటుకు బోద'మను నభిప్రాయము ద్రౌపదికిఁ గలుగవచ్చును. లేక వాఁడు చావకుండ వేఱొకయుపాయమునఁ గార్యమును సాధింపవచ్చును. కావున భీముఁ డట్లు పలికినాఁడు. ఇక్కడనో సమయము మించివచ్చినది. వేఱొక యుపాయము లేకుండుటచేతనే కత్తి నందించినదని కవి వ్రాయుటచే బ్రభావతికిఁ బితృవత్సలభావము గలదని తేటపడుచున్నది. విషయము

గ్రహింపక నిష్కారణముగఁ బతివ్రతలను సన్న్యాసులను రెడ్డిగారు నిందించిరి.

"ప్రభావతియొక్క కామనిర్భరత యేవంపుఁబాటుగా దోఁచునే కాని రమణీయమని యెన్నుట దుస్తరము. వచ్చినయావేశముం జూడుఁడు.

ఉ. ఇట్టి మనోహరాంగుఁ డొకఁ డెందయినంగలఁడేని, కల్గియుం
గట్టిగ నాకతండు బిగికౌఁగిటఁ జేర్పఁగవచ్చునేని, నే
నిట్టటుఁ గొంకినన్ విడక యిష్టవిహారములెల్లఁ గాంక్ష జే
పట్టి యొనర్చునేని, రసభావము లెట్టివి యొక్కొ యత్తఱిన్. (ప్రభా. ౩. ౪౧.)

మఱి చెలికత్తె ప్రభావతియొక్క విరహచిహ్నములను శుచిముఖికిం జూపుట దిలకింపుఁడు.

సీ. ... ... ... ... ... ...
సుదతి పాలిండ్లఁ గస్తురి నల్పుగాదు సూ, కనుదోయి కాటుక కప్పుగాని
... ... ... ... ... ...
తే. యూర్పువేఁడిమిఁ గృశత బాష్పోదయమున, గండపాండిమదత్త్వవికారములను
గానఁబడియెడు నోవిహంగమ పురంధ్రి, యింక నీచేత నున్న దీయింతిబ్రతుకు.
(ప్రభా. ౩-౭౭.)

చెలికత్తె లీరీతిఁ జెయివేసి విప్పిచూపుట కోర్చెడురాజకన్యక లెంత సుకుమారులు! పూర్వము అవికెల ధారణమే యున్నట్టులేదు. రాణివాసములో నేమైలయు సోఁకక పెరిగిన కన్యామణి తనభావము ప్రకటించు రీతి వినుండు.

సీ. ఆరతికిఁ గరంబు లైతిరే నవ్విభుఁ, గౌఁగలింపఁగ నబ్బుఁ గరములార
ఆయింతికిఁ గుచంబు లైతిరే నతనివ, క్షోనిపీడనమబ్బుఁ గుచములార
.............................................
తే. యట్లు కానోచకేల నాకైతి రకట, యని నిజావయంబుల కాత్మ వగచు
.............................................

ఇట్లు అంగములంగూర్చి పలవించుట గణికలకైనఁ దగునా? మోహమనఁగా వీరికి దేహక్రీడయేకదా! ఇదియా శృంగారము! 'అయ్యో! నాకుచములారా! మీరు ఆయమ్మను జేరియుండిన సుఖపడుదురుగదా!'

యని యెవరైనఁ దలంతురా! ఆత్మతృప్తిఁగోరుదురే కాని, యంగాంగము లకుఁ బ్రత్యేకసుఖమున్నదని భ్రమించి వాని ప్రారబ్ధమునకై విలపించువా రున్నారా? శృంగార ప్రకృతి మనకవులకు నగోచరార్థము. సుఖ మెఱుంగు నది మనసు. ఇంద్రియములకు నెఱుక నహి. అవి జ్ఞానము కర్మము మొద లగు క్రియల కుపకరణములు. మనసు ప్రపంచముం దెలిసికొనుటకు నిచ్ఛారీతిఁ గార్యములఁజేయుటకు ననువైనమార్గములు. వానికిఁ బ్రత్యేక ముగ సుఖము ననుభవించు ప్రభావములేదు." (౧౨౧—౧౨౮) అని వ్రాసిరి. చిత్రఫలకసందర్శనమునఁ బ్రభావతికి మన్మథావస్థగల్గినది. కలలో లభించిన చిత్రఫలకమగుటచే నాపురుషుం డుండునా యని సంశయించి నది. కాని ఆకలలోనిచిత్రఫలకము ప్రత్యక్షముగఁగనఁబడుచుండుటవలనఁ బ్రభావతికి ఆశగల్గినది. అప్పురుషుఁ డుండినను దనకు లభ్యుఁడు కావలెను. పిదప వానివలనఁ దనకు సౌఖ్యము గలుగవలెను. అట్లుసిద్ధించినవానివలనఁ దన కత్యంతము రతిసుఖము గలుగునని 'రసభావము లెట్టివియొకొ్క యత్తఱిఁ' అని తలఁచినది. ఆపురుషుఁడు లభించునా యనుసంశయము గలిగి కృశించినది. వానిపొందు లభింపనపుడు తనబ్రతుకు వ్యర్థమని తల పోసినది. కుచాద్యవయవములు వల్లభునకు మనోహరములు. ఒకొ్కక్క యంగమం దొకొ్కక్కవిధమగుసుఖ విశేషముగలదని లోక మెఱిఁగి యున్నవిషయమే. మధురమనున దొక్కటే యయినను అం దనేకవిధ ములు గలవుకదా. అంగములవలననే మనసునకుఁ గష్టసుఖములు గలు గును. వాటి అనుభవము మనసుది. ఏయంగమువలన నెట్టి సుఖవిశేషము గలుగునో యది మనసునకుఁ దెలియును. విమర్శకులకుఁ దెలియదేమొ! ప్రభావతినిజావయవంబుల కాత్మ వగచినది. అంతియకాని యవయవంబులు వగవలేదని రెడ్డిగారు గ్రహించియుండరా! ఆపురుషునకు సుఖమునీయక వ్యర్థమగు నీయవయవంబు లెందుకు అని ప్రభావతి విచారించినది. తన వలన నాతఁ డనేకసుఖము లనుభవింపవలెనని కోరినది. అది నెఱవేఱనం దున దాను దుఃఖించుచున్నది. ఆపురుషునకుఁ గానపుడు తనయంగములు వ్యర్థములు. మనసో, వానిని విడిచియుండునది కాదు. కావున నిష్టవస్తువు ప్రాప్తికానందున కృశించినది. కృశించి తెల్లఁబడుట మొదలగునవి చెలి కత్తెలు హంసకుఁ జూపించిరి. ఆపురుషుఁడు లభింపనియెడల ప్రభావతి

జీవింపదని చెలికత్తెలు సెప్పిరి. మోహమనఁగా కామేచ్ఛయే యని రెడ్డి గారికిఁ దెలియదు. అందు ప్రేమయుండిననే రాణించును. లేనియెడలఁ జెడును. పతివ్రతలకు మోహము, ప్రేమ రెండు నుండును. మోహవంతులకు గామేచ్ఛ యవశ్యముండును. ఎందులకు వానిని మోహించినది. అనగా సుఖమనుభవించుటకే యని నిశ్చయము. ఎందులకు ప్రేమించినది. అనగా వానిని సుఖపెట్టుటకని నిశ్చయము. ఏపురుషుని పతివ్రత వరించునో వాఁడు లభ్యమైనచో వానిని సుఖపెట్టి తాను సుఖించును. (వానిని సుఖపెట్టుటలోనే తనసర్వసౌఖ్యము లిమిడియుండును.) లభింపనపుడు కామేచ్ఛ నణఁచి శీలమును సంరక్షించుకొనును. కట్టుకొన్న వానికే విడాకులు ప్రాప్తించుచున్న నీకాలములో పవిత్రప్రేమ సన్నగిల్లుచున్నది. కావునఁ గొందఱికి శృంగారప్రకృతి తెలియకపోవుచున్నది కాఁబోలును. అయినవానినే విడుచుట న్యాయమని తోఁచువారికి కానివారికై విచారించు టాశ్చర్యము గలిగించునేమో !

సీ. "ఓహంసి..........................

తడయక ప్రద్యుమ్నుకడ కింక నొకమాఱు పోయి నుస్తరమైన నాయవస్థ
చెప్పి చేరికఁగొంత చేయవచ్చునొ రాదొ యాదురాశాపాశ మెందుఁ దెగని

తే. బంధమై ప్రాణముల వెలువడఁగనీక, యాఁగి పెంచెడు మదనాగ్ని నహరహంబు
నీవు చని యవుగాములు నిశ్చయించి, యాశఁదెగఁగోయు మదియె మత్ప్రాణరక్ష."

వరుండు వలచివచ్చిన నుత్తమురాండ్రు సంతసింతురు. ఒడంబడుదురు. ఈకన్యయో వాఁడు, కరుణ, పశ్చాత్తాపము వీనిమైవచ్చినను జాలుననుచున్నది! వలపునఁగూడ బిచ్చమడుగువా రెట్టివారు? దానితోఁ దుష్టిజెందువారింకను నెట్టివారు. ఈలాలసత చిత్తవికారముగాదు. మనోవిభ్రమముగాదు. ఆత్మస్పర్శలేని శరీరతాపము. రోగికిమందువలె, వినికిచేతనే ప్రజ్వరిల్లుకన్నెలకు నాయకసంగమమును తాపహారము మనోహారమనుట బొంకు" (౧౨౮, ౧౨౯) అని వ్రాసిరి. ఉత్తమురాండ్రు వరుండు వలచివచ్చిన సంతసించెదరు. వానికై తాము బ్రయత్నింతురు. విఫలమైన శీలమును సంరక్షించుకొందురు. ఉత్తమురాండ్రకు నాయకసంగమము మనోహరము, తాపహరము. నీచులు ప్రేమత్యాగమే కావించి విడాకులొసంగెదరు. ప్రభావతికి చిత్రపటమును బార్వతి

యొసంగినది. దైవచోదితుఁడైన యాపురుషునికై (ప్రద్యుమ్ననకై) ప్రభావతి యెంత యాత్రతగొనియున్నదో రెడ్డిగారికిఁ దెలిసినదికాదు.

"ప్రభావతీదేవి కన్నెయయ్యు నారితేఱిన గణికలవలె భోగసాధనములెల్ల సమకూర్చి సర్వసన్నాహసమేతురాలయ్యుఁ బ్రియుఁడు రాఁ గొంతదామసించినందున, మఱియొక విరహప్రలాపమునకు మొదలిడఁ జొచ్చి యేమనుచున్నదనఁగా,

క. వత్తు నవశ్యము నేఁడని, చిత్తము తమిరేఁచి యంతఁ జింత యొకతె పై
హత్తిన నది పృథపుచ్చినఁ, బుత్తురు మగవారిమాట పొసఁగదు నమ్మన్.

(ప్రభా. ౪-౧౪౭)

ఇట్లుత్కంఠఁగొనియుండియు శాస్త్రప్రకారము చంద్రోపాలంభనము సమకూర్చిన యీపెయొక్క మనస్థైర్యమును, కవియొక్క సందర్భశుద్ధిని పొగడుటకు నాదిశేషునకైన నలవియా?" (౧_౨౭, ౧_౨౮). అని వ్రాసిరి. ప్రభావతి ప్రద్యుమ్నుని వలచినది. అందుకై స్వయముగాఁ బ్రయత్నించినది. తలిదండ్రులప్రయత్న మిందు లేదు. అదిగాక నత్యంతము రహస్యమైనది. కావున ప్రభావతి స్వయముగా భోగసాధనములను సరిచూచినది. (చెలికత్తెలు సమకూర్చుచున్నదాని పరికించి సరిచూచినది.) అది గణికలకృత్యమని వ్రాయుటసాహసము. శ్రీరాముఁడు ఏకపత్నీవ్రతుఁడని సీతకుఁ దెలియును. తనయం దగణ్యమైన ప్రేమగలదని తెలియును. ఎట్లయిన తనయునికిఁ దెలిసికొని సంరక్షించుననియుఁ దెలియును. అయినను సీతాదేవి యిట్లు శంకించినది.

శ్లో. పితుర్నిదేశం నియమేన కృత్వా వనాన్నివృత్తశ్చరితవ్రతశ్చ,
స్త్రీభిస్తు మన్యే విపులేక్షణాభి స్త్వం రంస్యసే వీతభయః కృతార్థః.

(సుం. ౨౮-౧౪)

(ఓరామా! నీవు నీతండ్రియాజ్ఞప్రకారము వనవాసముఁ జేసి ముగించి, యయోధ్యచేరి, భయములేక కృతార్థుఁడవై విశాలముగనుండు కన్నులుగలస్త్రీలతో రమించుచున్నావు.) శ్రీరామునిస్వభావముఁ జక్కగ నెఱింగిన సీతామహాసాధ్వికూడ ఇట్లు శంకించినది. అదివఱకు సంబంధమేలేని ప్రద్యుమ్ననుఁగూర్చి ప్రభావతి శంకించినది, అని సూరన్న

వ్రాయుటలో నాక్షేపణ లేనేలేదు. రెడ్డిగా రిట్లు వ్రాసియున్నారు. "విరాళిపాలైన (వారు) నిర్హేతుకములగు నుత్సాహనిరుత్సాహస్థితులం దాల్చి లేనిపోని కారణముల నూహించుట మోహగ్రస్తులకు స్వాభావిక మైనస్థితి" (౧౩౩) అని వ్రాసిరి. ఇట్లు వ్రాసియు నిప్పట్టున నాక్షేపించిరి. ప్రియుఁడువచ్చునని తెలిసినందున ప్రభావతికి వేగిరపాటుగలిగినది. అది సహజమే. ఆస్వల్పకాలమందలి యాలస్యము దుర్భరముగనుండెను. అందు వలనఁ జంద్రోపాలంభనగావించిన దా ప్రభావతి. విరహోద్దీపకమైనవి చంద్రమందమారుతములు. అవి మరింత ప్రేరేపగా నాపె వానిని నిందించి నది. మన్మథోద్రేకము గల్గినదిగావున మన్మథుని నిందించినది. ఇదంతయు మనసులోఁగలుగు నాందోళనచేసంభవించిన యవస్థయైయున్నది. అంతియ కాని చంద్రోపాలంభన పూర్తియగువఱకు మందమారుతమువీవలేదని తలంపవచ్చునా? 'ఇట్లు ముప్పదిపద్యముల రోదనవఱకు చెంతనున్న ప్రద్యుమ్నుఁడుగాని, ప్రాణసఖులగు శుచిముఖీరాగవల్లరులుగాని చూచి సహించిరా' అని రెడ్డిగా రాక్షేపించిరి. గణములు యతిప్రాసచూచు కొని పద్యములలోఁ బ్రభావతి రాగవరుసగానేడ్చినదని రెడ్డిగారభిప్రాయ పడిరేమొ తెలియదు! విభుని నూతనసంగమంపువేళ పడంతులవర్తన ములు గడువక్రములు అని కవిచెప్పినది రెడ్డిగారికి రుచింపలేదు. ప్రభా వతికిఁగల్గినసిగ్గు, మురిపెంపు, చెలికత్తెలమధ్యవర్తిత్వము రెడ్డిగారికి విర సముగఁ దోఁచినది. "కోమలత, మార్దవము, సౌకుమార్యము మొదలగు సౌమనస్యంబులకు వెలియైనవగుట నాగరికపుఁజందమువారికి నింపుగావు" (౧౨౭) అని వ్రాసిరి. ఇది అసమంజసము. స్త్రీస్వాతంత్ర్యవాదులకుగల్గు విచిత్రపుటూహలలో నిదియొకటి. రెడ్డిగారుచెప్పినదోషమేదియు నిచ్చట లేదు. విరహిణీస్త్రీచేత చంద్రోపాలంభనాదులు గావించుట కావ్యశోభ. పాఠకునకడుగడుగునకు హాయినిగూర్చునట్టిరసమందు వెల్లివిరియుచుం డును. మనుచరిత్రలో నిట్లు వర్ణింపబడినది.

శా. వాలారుంగొనగోళ్ల నీవలసతఁ వాయించుచో నాటకుఁ
మేళంబైన విపంచి నిన్నమొదలుఁ నీవంటమిం జేసి యా
యాలాపంబె యవేళఁ బల్కెఁడుఁ బ్రభాతాయాతవాతాహతా
లోలత్తంత్రుల మేళవింపఁ గదవే లోలాక్షి దేశాక్షికిన్. (౩-౫౭)

ఈపద్య మెంతరసవత్తరముగా నున్నది. అది కావ్యశోభ. అది తెలియనివారికి రోఁతకాక మరేమగును. ఇష్టమువచ్చినట్లు కావ్యమును దూషించుట గొప్పపొరపాటు.

"ప్రద్యుమ్నుఁడు నిష్ఠురముగా 'దానవునకు నుదయించినదానవు గావున లతాంగి! దయచాలదు' అని భార్యమీఁదఁగోపమువచ్చిన నామె పుట్టుపూర్వోత్తరములనెల్లఁ దడవితడవి 'వాపోవవలయు' నను సనాతన హిందూగృహస్థధర్మము నుద్ధరించుటయు మిక్కిలి చిత్రము" (౧౩౦) అని వ్రాసిరి. వంశసంరక్షణ మవశ్యకర్తవ్యమనునది నేఁటివఱకుఁగూడ హిందూసంఘమందుఁ గలదు. ఎంతకును బొలయలుక విడువకుంటచే భార్యపై ప్రద్యుమ్నుఁడు నిష్ఠురముగఁబల్కినది రెడ్డిగారికి చిత్రముగ గనఁబడినది. అవును. స్వతంత్రలక్షణములో విడాకులే కాని నిష్ఠురము లాడుహక్కు ఉండదేమొ!

"కల్పనయందు నీకావ్యము నిర్దుష్టమనియంటిమి అమ్మాటకు బాధకము లొండురెండు గన్పట్టెడి సునాభుని (వజ్రనాభునితమ్ముని) గూఁతులకు గదసాంబులు పతులగుదురని నారదు లాశీర్వదించిపోఁగా, నాకన్యలు 'ఎక్కడిద్వారక, ఎక్కడిగదసాంబు లిదివిన్నఁ బెనుచేటు స్వామిచేత, నసురులకుఁ బగవీడట యాపురంబు' అని యాశీర్వాదబల ముచే వెల్లివిరిసినతమి 'భోగయోగ్య మగుప్రాయము'నకు మున్నే తమ్ముఁ దొందరపెట్టఁ, జాలఁబరితపించిరట! ఋషులయాదేశము విన్న మాత్రన మనసు చెప్పినదిక్కునకుఁ ద్రిప్పుట, మనవారి సాధుగుణమును వినయమునుజూపు చిత్రమేమొ! భోగయోగ్యమగు ప్రాయము కుదరక మునుపే పతిచింతందాల్చుసామర్థ్యము గలవారౌటగాఁబోలు, బాల్య వివాహములకు నిజమైన నిదానము! (౧౪౩) ద్వారకాపురిలోని గద సాంబులంగూర్చి సునాభునికూఁతులకుఁదెలిసిన యామాత్రము వారి యక్కగారైన ప్రభావతికిఁదెలియకపోనేల? ప్రద్యుమ్నుఁడు భర్తయని యెఱింగియు దిక్కులేనిపక్షిరీతి నావెరోదనముఁజేయుట కృత్రిమముగ్ధ త్వమా! మఱియు, కృష్ణుఁడు అనామధేయుఁడుగాఁడు. దనుజశత్రువు! అట్లగుట నతనియు నతనియింటివారియు సంగతులు గడురహస్యములు గానుండునా? అందును ముఖ్యముగా విరోధులయిండ్లలో! అందును

ఇంద్రునిపై దండెత్తిగెల్చిన వజ్రనాభునిపురిలోను, గృహములోను!" (౧౪౬) అనివ్రాసిరి. సునాభునికూఁతుండ్రకు (చంద్రవతీగుణవతులకు) గదసాంబులు (యాదవులు) పతులగుదురని నారదుఁడు చెప్పెను. దేవ మానియు నాలోచించియే యనఁగాఁ జెప్పినందున నిబ్బంది తటస్థింప దని యెఱింగియే యారహస్యమును బయల్పఱచెను. నారదుని నిందు విషయమై ప్రశ్నించినవారు చంద్రవతీగుణవతులదాదులు. ఆరహస్యము బయల్పడనీక వారు దాఁచిరి. కావున నెవరికిని తెలిసినదికాదు. సునాభుని కూఁతు లప్పటికి బాలికలుగారు. భోగయోగ్యమైన ప్రాయముననే యున్నారు. అది క్రమముగానిండి సంగమాభిలాష గలిగించినది. "క్రమ మున భోగయోగ్యమగుప్రాయము నిండుచురాఁగ భర్తృసంగమన మనోరథంబు నతిగాఢముగాఁగ" (౪-౧౮) అని కవివ్రాసియున్నాఁడు. విషయమును దెలిసికొనక ఋషులను, బాల్యవివాహములను రెడ్డిగారు నిందించిరి. సునాభునికూఁతుండ్రవద్ద పుట్టినరహస్య మట్లేదాగినది. కావున నందుమూలముగాఁ బ్రభావతికిఁ బ్రద్యుమ్నవృత్తాంతము దెలియునవ కాశము లేదుగదా. ప్రభావతి యిట్లు పలికినది.

తే. వజ్రనాభుండు మును స్వయంవరపువిధికి, నను నియోగించి దేవగంధర్వసిద్ధ
యక్షవిద్యాధరాదుల నసురవరుల, విశదముగ వ్రాసి చూపించె వేఱువేఱ. (3-౯౮)

చ. జనకుఁడు నప్పుడీ సకలసద్గుణపూర్ణుని వ్రాసి చూప నా
కనుపఁడు ప్రాయునంతటిసమర్థులు లేమినొ తానెఱుంగఁడో
మనుజుఁడటంచుఁ గైకొనఁడొ మత్కులవైరితనూజుఁడంచు మా
ననొ యెఱుఁగ సురారికులనిర్మథనుం డని విందుఁ గేశవున్. (3-౧౦౦)

అని కవి వ్రాసియున్నాఁడు. వజ్రనాభునిపురము పరులుచొరరానిది. వాఁడు ప్రభావతికి దేవతలయొక్కయు రాక్షసులయొక్కయు పటముల నిచ్చెనేగాని మనుజుల పటములేవియు నీయలేదు. కృష్ణుఁడు జగత్ప్రఖ్యాతిగల పురుషుఁడుగాన నాతనిపే రంతట నిండియున్నది. కాని ప్రద్యుమ్నాదులపేరులు ప్రసిద్ధిగాలేదు. ప్రభావతికి ప్రద్యుమ్నుఁడు తనభర్త యనిమాత్రము దెలియును. "ఇట్టి మనోహరాంగుఁ డొకఁ డెందయినం గలఁడేని"(3-౪౧)అని కవివ్రాసినందున నాతఁడెచ్చటివాఁడో, యెవఁడో ప్రభావతికిఁదెలియదని నిశ్చయ మగుచున్నది. పార్వతీదేవియు 'నీవిభుఁడు

ప్రద్యుమ్నుఁడు' అనిమాత్రము చెప్పెనుగాని యాతనిసంగతి నేమియుఁ దెల్పలేదు. అదియు కలలోఁదెల్పెను. అందువలనఁ బ్రభావతి పూర్తిగా నమ్మలేదు.

చ. కమలదళాక్షిరో వినవుగా కల యొక్కటి గంటి వేఁకువన్
సమధికమైనయద్భుతమొనర్చుచు నున్నది యెన్నుకొన్న లో
కమునను గన్నవిన్నయదిగాదది కొంతనిజంబు కొంతస్వ
ప్నమునని పల్కి సిగ్గుకతనన్ మఱిచెప్పక దాఁచె దాఁచినన్. (ప్రభా. ౧-౧౨౨)

ఉ. ఇంతబెడంగు లోకమున కెవ్వరికున్నది యంబ తానిజా
త్యంతికనైపుణీమహిమ మంచన వ్రాసెనొ యేమొకాక యా
చింతయుఁగూడ దీతనిసృజించియె జోడుగఁగోరిసుమ్ముదా
నెంతయు నేర్పుమీఱ నజుఁడిట్లు సృజించె నినుం బ్రభావతీ. (ప్రభా. ౧-౧౪౨)

అని కవి వ్రాసియున్నాఁడు. కలగావున నమ్మలేదు. ఆకలలోఁ బార్వతి యొసంగిన చిత్రఫలకము ప్రత్యక్షముగాఁ గనఁబడుచున్నందున కొంత యథార్థమని నమ్మినది. పార్వతీదేవి తానై కలలోఁ బ్రత్యక్షమై చెప్పియున్నందున, చిత్రఫలకము యథార్థమగుటవలన నమ్మవచ్చునని తలంచినది. ఏమైన నదికల. ఒకవేళ నాపురుషుఁ డుండినను దన్నాతఁడు వరించునో లేదో, ఎక్కడివాఁడో యనుసంశయములు బాధించుటవలనఁ బ్రభావతి విచారించినది. ఇందుఁ గృత్రిమముగ్ధత్వ మేమున్నది.

"వజ్రనాభుని పురింజొచ్చునుపాయమునకు సూచకముగనుంటయె భద్రుని చరిత్రముయొక్క ముఖ్యోద్దేశము. (వసుదేవుఁడొనరించుచున్న యాగమందు భద్రుఁడు నటనమొనరించెను. అదిగాంచి వజ్రనాభునిచంపింప నుపాయమునాలోచించుచున్న కృష్ణుఁడు ప్రద్యుమ్నాదులను నటవేషమున వజ్రనాభుని పురమునకుఁ బంపి కార్యమును సాధింపనెంచెను.) ఉపాయాంతరము లున్నయెడల నీచరిత్రంబు వ్యర్థంబగును. కాన నితరములగు వెరవులు సాధ్యములని కవి కనఁబఱచియుండుట గొప్పపొరపాటు. కథయొక్కకూర్పు బిగితప్పనదనుటకుఁ దార్కాణములు

తే. అప్పుడు ప్రభావతికి నొక్కయలివ విరులు,గొనుచుఁబోవంగ నంను నింపునఁజరించు
తేఁటిగమిలోనఁ దానొక్క తేఁటి యగుచు,నేగె మాయాఘనుండు రతీశ్వరుండు.

(౪-౧౨౭)

తేఁటియైనవాఁడు హంసయేల కాఁగూడదు. ఆపురిఁ బ్రవేశము హంసలకు సుగమము. అవి వాలాయముం బోవుచు వచ్చుచుండునవి.

చ. తడవులఁబట్టి యేము సతతంబును బోదుము వాని వీటికిన్
గడుమతిచాలమిం గడుపుఁగక్కుఱితి స్సురలోకనాథ. (౧-౧౧౮)

అని శుచిముఖి (హంస) యింద్రునితో నివేదించి యతనికొఱకై వేగుపనినప్పుట కొప్పుకొన్నది. కావున 'మాయాఘనుండు రతీశ్వరుండు' భద్రవేషముఁదాల్చినది చూడఁగా గోటితోఁబోవుదానికిఁ గొడ్డలి తెచ్చినట్లు! సునాభునితనయలకు నీప్సితసిద్ధికిఁ గారణము చిలుకరాయబారము. ఇంతేకాదు. వజ్రనాభుఁడు ప్రాణములతో నుండగానే

శా. ... ... ... సంగ్రామవృ
త్తాంతంబుల్ విని తార్క్ష్యవాహనుఁడు చక్రాద్యాయుధప్రోల్లస
త్కాంతిక్రాంతదిగంతరుండయి వడిన్ దావచ్చె నచ్చోటికిన్. (౬-౨౧.౨)

సమారాధనకు బ్రాహ్మణులవలెఁ దండోపతండములుగా నింకెందఱువచ్చిరో! ఇఁక వజ్రనాభునిపురమన్ననో తపమున బ్రహ్మఁ బ్రసన్నుఁజేసి, మేరువుప్రాంత మారుతాతపములకు న్నిజానుమతిఁదక్కఁ బ్రవేశమొనర్పరానిది'గా నతనిచే నిర్మింపఁబడినది! అనుమతిలేక కృష్ణుఁడిప్పుడు చొచ్చినట్లు ఇఁక గొంతముందుగావచ్చియుండిన నెవరైనఁ దలదీసిఁయుందురా? విష్ణువుయొక్కమాహాత్మ్యమున కతిశయముఁగల్పఁబోయి బ్రహ్మసంకల్పమునకు కథాకల్పనమునకు విచ్ఛేదముఁ దెచ్చిపెట్టికొనియుండుట మంచిబేరముగాదు. మఱియు ప్రభావతియొక్కగదినుండి తనవిడిదివఱకు రాకపోకలు నిర్విఘ్నముగ నెఱవేఱుటకై ప్రద్యుమ్నుఁడు భూవివరమొకటి గల్పించెనఁట. ఇదియు నిరర్థకశ్రమము కాకి, పిల్లి, యెలుక ఇత్యాదిగృహజంతువుల రూపముందాల్చి యథేచ్ఛముగ నేల సంచరింపరాదు? ఈకావ్యములో నొక్కకామముచేతనేగాదు, ఊరకయు నిట్టి చిత్తభ్రమ లప్పుడప్పుడు గల్గుచుండును." (౧౪౬-౧౪౮) అని వ్రాసిరి. వజ్రనాభుని యనుమతిలేనిది యాతనిపురము ప్రవేశింపగాదుగావున శుచిముఖిగావించిన యేర్పాటువలన వజ్రనాభుని యనుమతినొంది భద్రవేషమునఁ బ్రద్యుమ్నాదు లాతనిపురమును బ్రవేశించిరి.

చ. బలవిభవాభిశోభితుఁడభంగురశౌర్యధురంధరుండు కా
వలసినమాయలు న్దివిజవైరులకంటెఁ గరంబు నేర్చు. (ప్రభా. ౨-౨౫)

అని ప్రద్యుమ్నునిగూర్చి చెప్పఁబడినది. ఇదేభావమును బంచమాశ్వాసములోని ౮౪, ౯౩ పద్యములు వ్యక్తపఱచుచున్నవి. కావుననే మాయలునేర్చిన ప్రద్యుమ్నుఁడు తేఁటిరూపమున నంతఃపురముప్రవేశించి యభీష్టసిద్ధినొందెను. ప్రభావతిపొందుమాత్రమేగాక దేవలోకహితకార్యమొకటి (వజ్రనాభునివధ) ముఖ్యముగాఁబ్రద్యుమ్నుఁడు గావింపవలసియున్నది. అందుకొఱకే గదసాంబులు మొదలగువారి సహాయసంపదతోఁ దత్పురముప్రవేశించెను. వారందఱు ప్రద్యుమ్నునివలె మాయలనేర్చినవారుగారు. కావునఁ బ్రద్యుమ్నుఁడుఁగూడ వారితో భద్రవేషమునఁ బురముప్రవేశించెను. వజ్రనాభుని మెప్పించి తత్పురనివాసము గల్గించుకొనుట ముఖ్యముగావున సహాయులయునికికై ప్రద్యుమ్నుఁడు గూడ భద్రవేషమునఁ బురముప్రవేశించెను. అవసరముగల్గినవెంటనే గదసాంబాదుల సహాయముగల్గుటకై ప్రద్యుమ్నుఁడు భూవివరము గల్పించెను. ప్రభావతీభోగలాలసుఁడై ప్రద్యుమ్నుఁడు "తదనంతరంబ కార్యాంతరచింత చిత్తంబునఁ బొడమ...... (ప్రభావతీ!) ఇక్కడనుండి మదీయ నివాసంబుదాఁక భూవివరంబు గల్పించుకొనిపోయెదఁ దద్ద్వారంబన్యులకెఱుకపడకుండునట్లుగ సంవరణంబు గావింపుము" (ప్రభా. ౫-౫౫) అని కవి వ్రాసెను. ఆభూవివర మనంతరము గదసాంబుల యిష్టావాప్తికిఁ గూడ పనికివచ్చెను. ఉత్తములయేర్పాటునం దిట్టివిశేషలాభముండునని కవి సూచించెను. ఈభూవివరము యుద్ధసమయమున నుపయోగమైనటులఁగూడ కవి గదసాంబులు... "పూర్వవిహితమహీవివరద్వారంబున నాక్షణంబ ప్రవేశించి" (ప్రభా. ౫-౧౯౩) అని వ్రాసెను. మఱియుఁ గవి యిట్లువ్రాసియున్నాఁడు.

ఉ. కాంచనదీప్తిచేఁ బసిఁడిగట్టు తెఱంగు నగళ్లకోట సూ
చించఁగఁ దాను భాస్కరుని చెన్నువహించెను దానిఁ జుట్టి రా
సంచరణం బొనర్చుచును శౌరితనూజుఁడు కోటచుట్టునుక్
షించినదైత్యసైన్యము వడిం దమమున్వలె విచ్చి పాఱఁగన్.

క. లగ్గలకునట్లు కోటకు, దగ్గఱు తనమొనలనెల్లఁ దఱిమి తఱిమి పే
 ర్గ్గలికచూపుమరుపో, టగ్గించుచు వజ్రనాభుఁడతని నెదిర్చెన్.

క. అదియంతయుఁగని మనముల, గదసాంబులు గినిసి కోటగవకులు దెఱిపిం
 చి దురాధర్షాటోపత, నెదిర్చిరి సునాభముఖుల నింద్రాహితులన్.

(ప్రభా. ౫-౨౦౦, ౨౦౧, ౨౧౧)

ఈపద్యములలో నంతఃపురములోఁ బ్రారంభమైన యుద్ధము ఘోరరూపముదాల్చుసరికి పట్టణబాహ్యప్రదేశమున జరుగుచున్నటుల కవి వ్రాసియున్నాఁడు. కావుననే కవి యనంతర మిట్లువ్రాసెను.

శా. అంతంగేశవుఁడంచవేగరులచే నాదైత్యసంగ్రామవృ
 త్తాంతంబు న్విని తార్క్ష్యవాహకుఁడు చక్రాద్యాయుధప్రోల్లస
 త్కాంతిక్రాంతదిగంతరుండయి వడిన్ దా వచ్చె నచ్చోటికిన్
 సంతోషంబున వజ్రి సత్వరగతి న్సంధించి సేవింపఁగాన్. (ప్రభా. ౫-౨౧౨.)

అచ్చోటికిన్ అని కవి ప్రయోగించెను. అంతియకాని యంతఃపురములోనికి శ్రీకృష్ణుఁడువచ్చెను అని వ్రాయలేదు. రాజకీయము (యుద్ధ విషయము) ప్రపంచజ్ఞానము గల్గినవాఁడు కావున కవి చక్కఁగ వ్రాసియున్నాఁడు. యుద్ధము ప్రారంభమైనయెడల పురముదాటి వెలుపలరండు అనునది శ్రీకృష్ణుని మొదటియేర్పాటని రెడ్డిగారికి బోధపడినదికాదు. కవి స్పష్టపఱచినను రెడ్డిగారి కవగాహన కాలేదు. యుద్ధనైపుణ్యము లేక పరాక్రమవిహీనులై యస్వతంత్రులై మహాత్మదీయకాలముకన్న నికృష్టులై నేఁటిభారతీయులు కూటికిలేని బీదజనులైనారు. కావున నిది కాల దోషమని రెడ్డిగారు సమర్థించెదరేమొ!

# కవిత్వతత్త్వ విచారవిమర్శనము.

---

## శ్రీయుత కట్టమంచి రామలింగారెడ్డిగారి పుస్తకవిమర్శనము.

---

### కళాపూర్ణోదయము.

"పింగళిసూరన్న వ్రాసిన కళాపూర్ణోదయములోని మణిహార వృత్తాంతము కథనెల్ల నేకీభూతముజేయ బ్రాఁకియుండుతీఁగవంటిది అని వ్రాసి మఱియు రెడ్డిగారిట్లువ్రాసిరి ఈరీతికల్పన మహోత్తరమైన దయ్యు నిష్కళంకంబుగాదు. ఎట్లన, నీహారముయొక్క నాయకమణి యెవ్వరి హృదయస్థలంబున నెంతవఱకు సోఁకియుండునో, యంతతడవును వారికి సర్వజ్ఞత్వము, వాక్యపటుత్వమును సిద్ధించునని విష్ణువువరము. దానిసత్యము ననుభవమునకుఁ దెచ్చికొనులోపల సుగ్రహుండు శాపహతుఁడాయె! మధురాపురి బ్రాహ్మణుఁడన్నవో దానిని గంఠములో ధరింపక పూజసేయుచు బహువర్షములున్నాఁడఁట! వానిభార్యయొక్క చిత్తస్థైర్యమెంతదృఢమో! ఆపె గూడ దొంగతనముగానైన దానిని వేసికొనలేదు. శ్రీకృష్ణుఁడు మణికంధరునిమెడలో వేసినాఁడుగాని యది 'బాలతఁగనుపట్టు విష్ణునికలాపముగావునఁ దద్భుజాంతరస్థితికి చాలకొప్పి గళసీమనయెంతయుగుప్తమై' యుండెనఁట! బాలతఁగనుపట్టు అను విశేషణము సమంజసమా? పూజారి బ్రాహ్మణుఁడిచ్చినది బాలకృష్ణునకా? షోడశసహస్రమహిషీయుతునకా? (మణికంధరుఁ డలఘువ్రతునకు, నాతఁడు కళాపూర్ణునకు దానినొసంగిరి.) పిమ్మట శిశువుగానున్న మధుర లాలసకుఁ గళాపూర్ణుఁడు వేయఁగా నాయకరత్న మాపెహృదయంబు సోఁకునట్లుపడినది! సమయముఁజూచి పడవలసినచోటఁబడినదిగదా! ఎంత తెలివిగలపతకము! అట్లు సర్వజ్ఞయైన యబ్బాలికామణి యనేకుల పూర్వ వృత్తాంతముం దెల్పి సత్త్వదాత్మునిచరిత్రమునకు వచ్చునప్పటి కాపె 'యటు

నటుఁగదలఁగఁ దన్మణిహృదయస్థలముఁ బాసికడకేఁగుటఁ దెలివియుడి గెను!' ఇట్లువ్రాయుట కామరూపధారణమునకన్న నభావ్యము, ఏలన, సత్యముగానుండునా యనుశంకఁగలుగఁజేసి కథయందు నమ్మికను భ్రమను బోఁగొట్టుఁగావున ఇఁక ముందఱి వృత్తాంతమింకను ప్రాయోభావమునకు దూరము· (ఈహారమం దిట్టిమహత్తుగలదని తెలియమి మావారుదాఁచి మఱచిరి. చెలులాభరణసమయమున దీనివిషయమై ముచ్చటింపఁగా) సుముహూర్తలబ్ధంబైన ప్రథమభూషణంబనియు, భవద్దత్తంబనియు నత్యాదరంబున దెప్పించి హృదయభాగస్పర్శి నాయకరత్నంబుగా నిపుడు ధరించియున్నదాన (కళా ౮-౧౮౯) (అని కలభాషిణి కళాపూర్ణునితోఁ దెలిపెను.) ఇందలి యసంభావ్యములు రెండు. కన్యగానుండునపుడు ఆరాజు గాలియైనసోఁకునా దేవుఁడాయని వ్యథఁగూర్చున్న విరహవేదన కాలమున, పెండ్లినాఁడు. ఎన్నఁడునురాని ప్రసంగవశము ఇప్పుడేలపైఁ బడవలయును? రెండవది. 'హృదయభాగస్పర్శి నాయకరత్నంబుగా' ధరింపబుద్ధి నిష్కారణముగా నేల పొడమవలయు? లోకములో నదృష్ట ములు, నిర్హేతుకములునైన యాకస్మికములు లేకపోలేదుగాని, పదేపదే వలసినచోట్లనెల్లఁ గాకతాళీయన్యాయముల నాశ్రయించుట కల్పనకు మిక్కిలిఁగొఱంత. కామరూపములు, దివ్యదృష్టి, ఇత్యాదులు అన్నికష్ట ములకు ననుకూలించు సాధనములుగానఁ బ్రశస్తములుగావు. సర్వసందర్భ ములలోఁ జేరజాలినవి యీకథలోఁ దప్పక చేర్పఁదగినయంశములని చెప్పవీలులేదు. గనుక, నిట్టి వేసందర్భములను జేర్పకుంటమేలు. కథకెల్ల సూత్రమువలెనుండు నీహార మిన్నివక్రముల కాస్పదమగుట చింతా వహము! (౧౯౦ - ౧౯౩) అని రెడ్డిగారువ్రాసిరి. మధురాపురిబ్రాహ్మణుఁ డద్దివ్యహారము దేవతాలయంబున లభ్యమైనందున నతిపవిత్రమైనదిగ నెంచి దానిని వేల్పుఁబలె భక్తి బూజింపఁజొచ్చెను. భర్తభక్తిమై పూజించుహారమును భార్యయెట్లుధరించును? ఆతనిభార్యగూడ దొంగ తనముగానైన దానిని వేసికొనలేదు. అని రెడ్డిగా రాక్షేపించుట సమం జసమైనదికాదు. దేవతాలయంబున లభించినచోట నాహారము నాబ్రాహ్మ ణుఁడు శ్రీకృష్ణునకు సమర్పించెను. శ్రీకృష్ణుఁ డాహారమును ధరించెనో లేదో? తత్కాలమందు ధరించినను బెద్దదిచేయించునవసరము లేకుండ

వచ్చును. కవి మొదట నిట్లుచెప్పియున్నాఁడు. సుగ్రహుండను తాను భక్తిఁ గొల్చు బాలకృష్ణుని వటపత్రశయనునిగూర్చి తపముచేయఁగాఁ 'జరణాం గుళీపాన జాతలాలాభిషిక్తంబైన చిన్నహారంబుతోడఁ' (కళా ౮-౧౬౧) ప్రత్యక్షుమై 'అద్దేవదేవుండు తనమెడనున్న రత్నహారంబుఁదిగిచి...... యిచ్చి యంతర్ధానంబునొందె' (కళా ౮-౧౬౪) అని వ్రాసియున్నాఁడు. వటపత్రశయనుని మెడనున్న హారముగావున నది చిన్నహారమే. మహారాజుగాక బ్రాహ్మణుఁడు దానినిఁ గైకొనియెను గావున నాతనికి దానిని బెద్దదిచేయించుభాగ్యము లేకపోవచ్చును. లేక దేవతాలయంబున లభించి నదిగావున దాని నట్లే శ్రీకృష్ణునకు సమర్పించెననియైనఁ జెప్పవచ్చును. శ్రీకృష్ణుఁడు దానిని మణికంధరునకొసంగఁగా నాతఁ డలఘువ్రతునకు,నాతడు కళాపూర్ణునకు సమర్పించిరి. వటపత్రశయనుని మెడలోనిదగు నాహారము శిశువుగానున్న మధురలాలసమెడలో గళాపూర్ణునివలన వేయఁబడినది. బాలతగనుపట్టు వటపత్రశయనుని మెడలోనిహారము శిశువగు మధురలాలసధరింపఁగా హృదయభాగస్పర్శియైనది. హృదయభాగస్పర్శియగుట వలన నాశిశువునకు సర్వజ్ఞత్వము గలిగినది. సమయముఁజూచి పడవలసిన చోటఁ బడుటయే దివ్యహారమాహాత్మ్యము. అది భగవత్ప్రసాదమహిమ. ఆహారమం దట్టిమహిమగలదని యెవరికిని తెలియదు. మధురలాలస రాజాధిరాజుకూఁతురును జక్రవర్తిభార్యయు నగుటవలన నగలకుఁగొదువ యుండదుకదా ? కావున నీహారముసంగతి యెవ్వరికిని జ్ఞప్తిరాకపోవుట తటస్థింపవచ్చునుగదా. విరహవేదనావసరమునఁ బ్రసంగము రాకుండుట గూడ నొకభూషణమే. వివాహకాలమందు నూతనాభరణములు వచ్చును గదా. కొద్దిపాటి ధనవంతుల యిండ్లలోఁగూడ నగలవిషయమైన మఱపులుగలుగుట సహజముగానున్నది. అట్టిస్థితిలో రాజాధిరాజులు చక్రవర్తులభవనములలో మఱపుండుటయం దాశ్చర్యమేమిగలదు. ప్రసంగవశమున నాహారము కళాపూర్ణలబ్ధంబైన ప్రథమభూషణంబని తెలియ వచ్చుటచే సదా దానిని ధరింపనెంచి సరిపోవునట్లు పెద్దదిగావించి మధురలాలస ధరించినది. అది భగవద్దత్తమనియు దివ్యమైనదనియు వారికిఁ దెలియదుగావున మధురలాలస దానిని పెద్దదిచేయించుకొని ధరించినది ఒకరి మనస్సు ,ఒకరికిఁదెలియుట హారమందలి గొప్పవిషయము. (సంభోగ

మందలి ధ్వని. స్త్రీపురుషరతిసుఖ ముభయులకుఁ దెలియుచుండెనని భావము) కావున మణిహారవృత్తాంతములో నాక్షేపణీయమైన విషయమే లేదు. మహాకవులందు దోషముండునా. అభిప్రాయము కానందునఁ గలిగినశంక లనేకములు.

(మణికంధరునితీర్థయాత్రాభివర్ణనమువలన వైపుల్యము వైరస్యము గలిగినది. మణికంధరుని తపోభంగమునకై రంభ రానున్నదిగావున నాపె కసహ్యము గలుగకుండుటకై కవి మణికంధరునిచేతఁ గొన్ని స్నానములు చేయించి శుభ్రకాయునిఁగాఁ జేయ నెంచెనే మొ!) అనాదరణపాత్రమగు నీప్రసంగములకు నాహుతిగానీఁబడినవి సుమారు నలువదియైదుపద్యములు! (ఇది శృంగారభంగము. నలకూబరునిపై మోహముగలకలభాషిణి) కాలము నేరీతిఁగడపెను? నలకూబరస్మరణలోనా? విరహవిషయమైన సఖులతోడి సల్లాపములలోనా? కవియా యక నొంటిగా విడిచి మఱచియుండుట మహాపాపము. పొరపాటు! యాత్రవలనఁ గలిగినఫలమిదియే. త్వరలోఁ దపోవర్ణనముం బ్రదర్శించి హృదయసాఫల్యమందఱకుఁ జేసియుంచినబాగు" (౧౮౪, ౧౮౫) అని వ్రాసిరి. మణికంధరునకు నారదశిష్యత్వమునగాన కళాప్రవీణతగలిగినది. కలభాషిణియందీతనికి మోహముగలదు. అది కొనసాగని కోరికయని యాతఁడు తలంచుకొనియెనుగాన విద్యపూర్తియైన పిమ్మట నారదోపదేశానుసారము విష్ణుస్థలములందు గానవిద్యను సార్థకమొనరించుకొనుచు నాతఁడు విష్ణుభక్తి గలిగి తపముచేయ మొదలిడెను. రాగయుక్తమగు మనసుగలవాఁడగు మణికంధరునితపస్సు రంభవలన విఘ్నమైనది. అని కవి యిందు ధ్వనింపఁ జేసియున్నాఁడు. నిశ్చలమైన వైరాగ్యము లేనివాఁడనిభావము. నారదుఁడును నీరహస్య మెఱిఁగియే,

సీ. తనశక్తికొలఁది సత్కర్మముల్ ఫలవాంఛ మాని కృష్ణార్పణమతి సలుపుట
ప్రతిషిద్ధకర్మంబు పరిహరించుటవిష్ణు భక్తిపైఁ గ్రమమునఁబాదుకొనుట
తద్భక్తిగల పుణ్యతములసంసర్గంబు దుర్జనులున్నట్టి తోవఁజనమి
విష్ణుసన్నిధికళా విఖ్యాతవివిధదివ్యక్షేత్ర తీర్థయాత్రాచరణము

తే. బ్రహ్మచర్యంబుఁ దపము వైరాగ్యగుణము, వలయు వైకుంఠమునుగోరు వారికెల్ల
నీనిలోపలఁగొన్ని గావింపఁగనిన, పృథఁజనవు చేర్చుఁగ్రమమున విష్ణుపదము.

(కళా, ౨-౧౦౭.)

అని చెప్పియున్నాఁడు. రంభవలన దపోభంగమైనను గ్రమముగా విష్ణుభక్తిదృఢమై వైకుంఠముగల్గునని యిందు ధ్వనించుచున్నది. కావున మణికంధరునితపస్సు వ్యర్థముకాదు. కలభాషిణి మణికంధరునియందుఁదగిలినమనసును మరలించుకొనుచు నలకూబరునివరించినది. కలభాషిణీ మణికంధరులు నారదశిష్యత్వమున నాలుగేండ్లొకచోట నుండిరి. మణికంధరునకు వైరాగ్యమబ్బుటకును గలభాషిణికి నలకూబరునందు మోహము వృద్ధినొందుటకుఁ గవి తీర్థయాత్రనువర్ణించి మఱిరెండేండ్లకాలముఁ బెంచెను. కలభాషిణియందు మణికంధరునకుఁ గలమోహమును మరలించుటకు రెండేండ్లువెచ్చించుట తగునని కవితలంచెను. అదిగాక కలభాషిణికి మణికంధరుఁడు దుర్లభుఁడైనాఁడు నలకూబరుఁడో యంతకన్న దుర్లభుఁడు. రంభాసంభోగలాలసుఁ డాతఁడు. వానిపొందు దుర్ఘటము. అనునది కవి మఱి రెండేండ్లుపెంచుటవలన ధ్వనింపఁజేసియున్నాఁడు. లేక మణికంధరునియందుఁ గలిగినహృదయకాంక్ష మరలించి వేరొకనివరించిన దానివిరహ ముపేక్షణీయమని కవి యిట్లు తీర్థయాత్రను బెంచి సమర్థించెననియుఁ దలంపవచ్చును.

"ఈఘట్టమునకన్న సందర్భశుద్ధిలేనిది పంచమాశ్వాసములో ౧౩౨-వ పద్యము మొదలు ౧౭౮-వ పద్యమువఱకును గల పసిపాపచేఁ జేయఁబడిన యోగవిద్యావిషయకమైన దీర్ఘప్రసంగము. ఈవిమోచనమార్గప్రదర్శనము శుద్ధముగ ననవసరము. అసంగతము. అసమ్మతమును!" (౧౮౫, ౧౮౬) అని వ్రాసిరి. యోగవిద్యావిషయమునుగూర్చి ప్రశ్నించినవాఁ డలఘువ్రతుఁడు. సమాధానమిచ్చుచున్నది కడులేఁతవయసు గల్గినబాలిక. కావునఁ జదువరుల కాశ్చర్యము గల్గకమానదు. ఆపసిబాలకిన్ని అంశము లెట్లు తెలిసినవి. అని యడుగడుగునకు నాశ్చర్యము, సంతోషము గలుగుచుండును. కావున నట్లుగాఁగొంత ప్రసంగమును బెంచి కవి వ్రాసెను. ప్రధానకథకు సంబంధములేనిదని తలఁచి రేగాని రెడ్డిగారిందున్న యద్భుతమును గనిపెట్టినారుకారు.

"శల్యాసురుని తరువాతిగతి యేమాయెనో తెలియదు! వానిది, వ్యసనకరమును వ్యర్థమునైన శుష్కజీవితము! నిష్కళంకప్రీతిచే విశోభితము" (౨౨౦) అని వ్రాసిరి. ఈశల్యాసురుఁడు మహిషాసురు మాతు

లునికుమారుఁడు. మహిషాసురుండు దుర్గానిహితుఁడగుటవిని దుర్గపైఁబగ సాధింప నుపాయమన్వేషించుచుండఁగా నభినవకౌముది యను నప్సరోజాతికన్యక వానికంటఁబడినది దానిని వాఁడు మోహించి వేఁడఁగా నాపె తిరస్కరించుటయేగాక 'నిన్ను (శల్యాసురుని) జంపినవానిని వరించెదనని ప్రతినఁబూనెను. వాఁడును దన్నుఁ జంపఁబూనిన వానినిఁ జంపు నుపాయమును వెదకుచు మృగేంద్రవాహనయొక్క యాలయంబుఁ జేరి అందున్న శాసనముఁ జదివికొని తత్ప్రకార మచ్చోటనున్న గండకత్తెరచేఁ దనశిరంబు ఖండించుకొనియెను. అందువలన వాఁడు 'తన్నుచంపబూనిన వానిఁ జంపువరము సాధించుకొనియెను. ఇంతలో మరల దైవవశమున అభినవకౌముదిగూడ అచ్చోటుకువచ్చుటతటస్థించెను. వరగర్వంబుననున్న శల్యాసురునిఁ జంపునట్టివాఁడు మణికందరుఁడని అభినవకౌముది దేవి (మృగేంద్రవాహన)వలనఁ దెలిసికొనియెను. మణికంధరుండు దదాలయంబున విడిచిన దివ్యాయుధంబుఁ గైకొనివచ్చు నభినవకౌముదిం గాంచి వాఁడు (శల్యాసురుఁడు) 'చంపవలదు,' నీకు నిష్టదైవతముల యాన సుమ్ము, నాకు దెగిమ్రగ్గదవని తల్లడిల్లుచున్నా'నని మోహావశుఁడై పలుకఁజొచ్చెను. అప్సరసయు వానిని వంచించుచు మణికంధరుండున్న శ్రీశైలమునకుఁ బోయెను. వాఁడామోసమును గ్రహించి మోహాగ్రస్తుఁడుగాన అభినవకౌముదికిఁ దాఁకకుండ శిలలతతులఁగురియించుచు నిఖిల జంతుతతుల నేలఁగలపుచు జగద్ద్రోహమునకుఁ గడంగెను. అది చూచి అచ్చటనున్న మణికంధరుఁడు వానినిఁ జంపి వానివరబలమునఁ దానును మృతినొంది ఉత్తరజన్మమునఁ గళాపూర్ణుఁడన ప్రసిద్ధుఁడై ఈ అభినవకౌముదిని వివాహమాడెను. తొలుతఁ దన్ను మడియించువానిని వరించెదనని పల్కిన అప్సరసయుం దడియాసఁగల్గిన శల్యాసురుఁడాపె కొక్క కీడునుగావింపకఁబోనిచ్చెను. అట్టి వీఁడు ప్రబంధనాయకులకన్న నిస్సంశయముగ మేలైనవాఁడన్నారు రెడ్డిగారు. ప్రబంధనాయకులలో నున్నఘనత, సహిష్ణుత రెడ్డిగారికి అవగాహనము కానందున వచ్చినపొరపాటిది. ప్రథమములో వాని నాయువతి వరింపలేదు. పైఁగాఁ దన్నుచంపువానిని వరించెదనని శపించినది. కావుననే వాఁడాపెకుఁ గీడు చేయలేదు. బాధింపఁజూచినఁ దనయభీష్టము నెఱవేఱదు. అదిగాక తన్ను

శపించునను భయముగూడగలదు. కావుననే తన్నుఁ జంపఁబూనువానినిఁ జంపువరమును వాఁడు కష్టపడి సంపాదించుకొనియెను. ఆశయుండినంత కాలము అభినవకౌముది నాశ్రయించినాఁడు. మోసగించుచున్నదని తెలియరాఁగానే ప్రపంచక్షోభకు మొదలిడినాఁడు. వలవనికాంతకై ప్రాఁకులాడుటయేతప్పు. సాధ్యముకానప్పుడు ఆశను విడుచుకొనవలయును. కాని శల్యాసురుఁడు ప్రపంచక్షోభఁ గావింపఁజొచ్చెను. అయిష్టుఁడు, బాధించుచున్నవాఁడుగాన వాఁడు మరణించినఁగాని అభినవకౌముదికి గత్యంతరము గనఁబడదు. అయినను అభినవకౌముది వాని యవస్థకుఁ గనికరముఁబూనవలయునన్నారు రెడ్డిగారు. ఇది నిశ్చయముగా భావశూన్యమైనపలుకు. అభినవకౌముదియొక్క ప్రేమసంపాదింప బ్రపంచక్షోభఁగావించుట రాక్షసకృత్యము. ఈహింస మాన్పుటకైన నామె తన్నంగీకరించునని వాఁడు తలంచుట అడియాస. అది ప్రేమస్వభావము కాదు. కామక్రోధములతోఁగూడిన తమోమూర్తి శల్యాసురుఁడని కవి సూచించెను. వానిమోహము నిష్కళంక ప్రీతిచే విశోభితమన్నారు రెడ్డిగారు. శల్యాసురుని నందువలననే కవి అర్ధాన్నములో విడిచెను. శ్రీరాముఁడు తల్లివిషయమై దుఃఖించి యిట్లు పలికెను.

శ్లో. ఏకోహ్యహమయోధ్యాం చ పృథివీం చాపిలక్ష్మణ,
తరేయమిషుభిః క్రుద్ధో నను వీర్యమకారణమ్.

(అయో. ౫౩-౨౫)

(లక్ష్మణా! నేనొకఁడే అయోధ్యను భూమిని కోపముఁ గలవాఁడనై బాణములతో నాక్రమించుకొగలను. కారణములేక వీర్యమును జూపుట తగదు).

ఉత్తముఁడుగాన రాముఁడు అకార్యము చేయ నెంచుకొనలేదు. అధముఁడుగాన శల్యాసురుఁడు జగద్ద్రోహమునకుఁ గడంగెను.

సుగాత్రి అలంకృతయై ప్రథమసంగమమువేళ విభునిఁజేరఁగా శాలీనుఁ డామెనాదరించలేదు. అత్తగారుకోపించి అల్లునకుఁ దోఁటపనుల నొప్పగించెను. విభుఁ డట్లు తోఁట పనులుగావించుట కోర్వనిదై సుగాత్రి భూషణంబులుదీసి విభునకు సహాయముఁజేయఁబోగా మోహపరవశుఁడై శాలీనుఁ డామెను రతులఁదేల్చెను. కాని అలంకృతయై రాత్రి పడుక

టింటికిరాఁగాఁ బలుకరించనైనలేదు. తోఁటపనులు సేయురూపు మదిని హత్తియుండుటచే వానికి అలంకృతయైన భార్యయందు మనసుపోలేదు. తోఁటకువచ్చినపుడే ఇష్టరతులఁ దేల్చుచుండెను. ఈకథలో సుగాత్రిని శాలీనుఁ డట్లు పూఁదోఁటలో వరించుటకుఁగల కారణము సహజసౌందర్యాభిలాషయన్నారు రెడ్డిగారు. గోపికాస్త్రీలు సహజసౌందర్యవతులై వెన్నెలలో ఆలఁగాంచుసుందరులనియు వారు ప్రబంధనాయికలకన్న నెన్నియోమడుంగులు ప్రీతిగలవారనియు, అట్లుగనే కృత్రిమములగు తళుకుబెళుకులనువదలి గొల్లభామరీతి నున్నఁగాని భార్యను దగ్గఱఁ జేర్పనని శాలీనుఁడు సంకల్పించికొన్నాఁడేమో యనియు రెడ్డిగారు వ్రాసిరి. (౨౨౧, ౨౨౨) కాని రెడ్డిగారుతలఁచినటుల శాలీనుఁడు సహజసౌందర్యాభిలాషి కాఁడు. భార్య పడుకటింటికి రాఁగాఁ జలింపనివాఁడు అరసికుఁడు. తొలిసంగమపువేళ రాత్రి దగ్గఱకువచ్చినభార్య నాదరించకుండుట మఱియు అరసికత. ఇట్టిశాలీనుఁడు రసికశిఖామణి కాఁబోలు నన్నారు రెడ్డిగారు. (౨౨౨) శాలీనునకు తోఁటపనులు చేయురూపునం దిష్టముగాని రెడ్డిగారు తలఁచినటుల సహజసౌందర్యమం దిష్టమని యర్థము కాదు. పూఁదోఁట సహజసౌందర్యము కాదు. తోఁటకురమ్ము అని భార్యతోఁజెప్పకుండుటయు, భార్యయొక్క అలుకను దీర్పకుండుటయు వానితల తిక్కగాని శృంగారము కాదు. శాలీనుఁడు భార్యాసుఖమెఱుంగును. భార్యయొక్క సౌందర్యము చెడకుండ నావెకు సంతానము గలుగకుండునట్లు వరముఁబడసెను. శాస్త్రనిషిద్ధమగు దివామైథునము నపేక్షించెను. ఇదంతయుఁ దలతిక్కగాని శృంగారము గానేరదు. విభుఁడొల్లకున్న సుగాత్రి 'నాకును మంగళసూత్రం బీపాటిశుభస్థితి నుండుటయు పదివేలనుచు నెంచుకొనియు వేఱొక్కలాగుననుండక యతనికి నాయురభివృద్ధికరంబులని వివిధాలంకారంబు నెప్పుడు నేమరకయ తాల్చుచుఁ దనతల్లి యతని నేమియు నిట్టట్టాడకుండం బ్రార్థించుచుండె' (కళా ౪-౭౩) అని కవివ్రాసినదానిని రెడ్డిగా రిట్లాక్షేపించిరి. "భర్తకు నొకపిచ్చియైన భార్యకు నొకపిచ్చి! తన యలంకారము లాయనకు నాయురభివృద్ధికరములనుట పిచ్చియైనను మేలుచేయుమంత్రములలో నొకటిగాన ననింద్యము" (౨౨౪) అనివ్రాసిరి. శాస్త్రములను దూషిం

చినవారికి అడ్డులేదుగాని భార్య అలంకారములుధరించుట భర్తకుశ్రేయ మని శాస్త్రములలోఁ గలదు.

"పశుప్రాయమగు శృంగారమునకన్న నిదియెంత మేలు! చూచి చూడకమునుపే కామినులఁగవయ నుంకించుట లోలత్వము. నీచము! ఇక్కడ భార్యయెడఁగూరిమి, ఆపెతనసహాయమునకై స్వయముగావచ్చి నందుకు మెప్పు, బడలినందుకుఁగనికరము గొప్పబుద్ధిఁజూపినందులకుదార వర్తన యనుగౌరవము. ఇట్లు స్నేహము మర్యాద. వీనికనుకూలములైన భావములతోఁగలసిన శృంగారము చూపఁబడియున్నది. ఇది శ్రేష్ఠము. మానసికము. శాశ్వతము. పెఱయవియంగరాగములు. తుచ్ఛములు. చంచలములు. మనసుతోఁగలసినట్లు కామేచ్ఛవర్ణించుట మనలో నంతగా లేదుగాన నీచరిత్రము నవ్యలీలాలలితంబు" (౨౨౭) అనివ్రాసిరి. శాలీను నకు భార్యయందు మర్యాదలేదు. స్నేహములేదు. ఉండిన తోఁటలో సంగమమైన రాత్రి భార్య గదిలోనికిరాఁగా నాతఁడు పలుకరించనైనఁ బలుకరించెనా? ఆపె దీనాలాపములు వినియెనా? లేదు. నిరాదరణఁ జూపెను తోఁటపనులు గావించురూపమందు వానికి మనసులగ్న మైనది. వెంటనే కౌగిటఁజేర్చి రతులఁ దేల్చినాఁడు. కావున నాతోఁట రూపమందేగాని భార్యయందు వానికిఁ బ్రీతిగనఁబడదు. ఇందేమి తేలు చున్నది. వాఁడు తోఁటలో సుగాత్రినిఁజూచిచూడకముందే గవయ నుంకించెనుకదా. కావున నీచరిత్రమునను గూడ రెడ్డిగారి ఆక్షేపణ లన్నియునున్నవి. తోఁటలోనిరూపముతో వచ్చిన రమించును, లేని యెడల భార్యను బలుకరింపనైనఁ బలుకరింపఁడా శాలీనుఁడు. కావున రెడ్డిగారు తలంచినదంతయుఁ బొరపాటు. చూచిచూడకమునుపే కామి నులఁ గవయనుంకించుట లోలత్వమన్నారు రెడ్డిగారు. లోలత్వమే! అందు ఉత్తమభావము నీచభావము అనుభేదముమాత్రము గలదు. దుష్యంతుఁడు శకుంతలనుగోరుట ఉత్తమము. రావణుఁడు పుంజికస్థలను గోరుట నీచము.

"ఈకథయందలి (కళాపూర్ణోదయమందలి) పాత్రములపైకి నాకుఁ బ్రియతమకలభాషిణి. నిక్కువమైన శృంగారభావములకుఁ బ్రకా శకురాలు...ఏకకాలంబున నిరువురియెడ మనసుదగిలినదానిఁగా వర్ణిం

చుటకాధారముగా, కవి యీపెను గణికంజేసినఁ దప్పులేదని యిట్టి పుట్టుకనారోపించినాఁడో...కృష్ణునికొలువునకు నప్పుడప్పుడు నారదుఁడు వచ్చుచుండ నతనితోడన వచ్చుశిష్యుఁడగు మణికంధరుని సాహిత్యపటిమను గుణసంపదకును మెచ్చి వానియెడ బద్ధానురాగయైయుండియు, జాతిదోషంబుచేఁ గాఁబోలు నలకూబరుని రూపలావణ్యాది సౌభాగ్యంబులకు మెచ్చి తదాలోకనంబునం దనియక వానివిమానంబుతోఁ గొంతదవ్వరిగి యంతమగిడి యాతనితెఱం గెఱుంగంగోరి నారదుం జేరి ప్రార్థింపుడు, నమ్మునియు రంభకువైరిని నొక్కర్తె నిల్పనెంచినవాఁడుగావున 'సవతి యన నింకనొకతె వెదకవలయునా! దైవవశమున నీవకానేరవే' అని పల్కుచున్నాఁడు. హృదయపూర్ణమైనవలపు వినయము, అధైర్యము దైన్యము మొదలగుభావములతోఁ గలసియుండును. విఱ్ఱవీగదు. అభీష్టసిద్ధినిశ్చయమని యుదాసీనతయు గర్వముఁగాంచదు. దీనికి దృష్టాంతముగఁ గలభాషిణియిచ్చిన ప్రత్యుత్తరముఁ జూడుఁడు.

క. ..............అంతటిరూప, శ్రీవైభవసతికిఁ గాక సిద్ధించునె యా
దైవనియుక్తియు మాటోం, బ్లైవిధమునఁ బాట్లపడిన నిద్ధవివేకా. (కళా. ౧-౭౪)

నారదుఁడు సర్వజ్ఞుఁడు మణికంధరునికి నాపైపైఁ గోరికయుండుట నెఱింగిన వాఁడుగావున, నీనూతనరాగజ్వాలలో నాప్రాఁతవలపెక్కడ భస్మమగునో యని దానికిం బ్రతిక్రియచేయుటకోయన, 'నాశిష్యుఁడు చేసిన దండకము చదువుమమ్మా! విందము' అని యాపెచేఁ జెప్పించుచున్నాఁడు. (౨౫౦-౨౫౨) ఏకకాలమునందే యిరువురియెడఁ జిత్తము హత్తినట్లున్నది. ఇదిభావ్యమా? అభావ్యమా? మనసు ఒకేకాలమున నిద్దఱపై సమముగఁ బాఱునా? అనేకులపై మోహముండుటనిజమా? ఇది కష్టతరమైనప్రశ్న. మణికంధరునివలచినది. నలకూబరుని వలచినది. ఈరీతి నిరువురిమీఁద దుస్తరమోహముం బూనియుండిన యొకస్త్రీని చరిత్రముంజదువుటచే నెఱుంగుదును. సుమారు నూఱుసంవత్సరముల క్రింద ఫ్రాన్సుదేశములో గణ్యయు విద్యాగంభీరయుఁగానుండి వెలసిన 'లిస్‌పినాజ్' అనునామె. కాఁబట్టి యిట్టివర్తనము అస్వాభావికమనరాదు. అపూర్వాపమనవచ్చును: అపూర్వాప శృంగారముల సూచించిన సూరన్నయే. 'కవిగాననిచ్చోఁ గాంచెడు కవి (౨౬౨, ౨౬౩) అనివ్రాసిరి. కాని

రెడ్డిగారు తలఁచినటులఁ గలభాషిణి ఏకకాలమున నిరువురియెడ మనసుఁ దగిలినదికాదు. నలకూబరసంగమాభిలాషిణియైయుండిన కలభాషిణి నారదుండొసంగిన వరముకతంబున రంభారూపముంధరించి వచ్చినది. తీర్థయాత్ర ముగించి తపంబుఁ గావించుచున్న మణికంధరునిదపంబు రంభవలన విఘ్నంబయ్యెను. వంచించిపోవుచున్న రంభను విడువలేక మణికంధరుఁడు రంభాప్రియుండగు నలకూబరురూపము ధరించివచ్చెను. అప్పుడు రంభారూపముధరించి వచ్చుచున్న కలభాషిణి వానికెదురైనది. ఆకపట రంభా నలకూబరులకు సంయోగము తటస్థించినది. తన్నుఁగూడినవాఁడు మణికంధరుఁడే యనితెలిసికొని కలభాషిణి లజ్జించియుండఁగా మణికంధరుఁడామెఁగూర్చి తగుమాటల సమాధానమిచ్చెను. నారదుఁడు శ్రీకృష్ణుని యొద్ద గానవిద్యనభ్యసించి వెడలి పోవుతరిని శిష్యురాలగుకలభాషిణి నమస్కరింపఁగాఁ 'గొమ్మ నీవాత్మలోఁ గోరినట్టి కాంతు రంభామనోహరాకారుఁడగుచు మెఱయువానినిగూడి రమింపఁగలవు.' (కళా ౧-౭౬) అని ఆశీర్వదించెను. నలకూబరసంగమ మాపెకుఁగలుగదని ఇందువలన స్పష్టమగుచున్నది. ఇట్లాశీర్వదించినను గలభాషిణి యిందలి యథార్థమును గుర్తింపక నలకూబరునే వాంఛించెను. కావున నప్పుడు మణికంధరునియందాకలభాషిణికి మనసులేదని రుజువగుచున్నది. 'నలకూబరుఁ గూడెదవని పలుకక యిట్లనిన సత్యభాషణుపలుకుల్ ఫలసిద్ధినినరయఁగఁ దొయ్యలినను మునునీవుగోరు టనృతంబగునే' (కళా. ౪-౨౭) అని మణికంధరుఁడు పల్కినట్లుగాఁ గవివ్రాసెను. కలభాషిణి తన్నువరించినది అనునది మణికంధరున కీనాఁడు తెలిసినదికాని ఆనాఁడు తెలియలేదు. ఆత్మలోఁ గలభాషిణి వాంఛించినట్టి పురుషుఁడు తానగునో కాదో ఆనాఁడు నిర్ధారణగాలేదు. కలభాషిణిని వలచియున్నవాఁడు కావున నారదాశీర్వచనమందలి యథార్థమును మణికంధరుఁడు గుర్తింపఁగల్గెను. అన్యాసక్తచిత్తయగు కలభాషిణి గుర్తింపలేదు. 'రంభాసాన్నిధ్యశోభితాభినవ విలాసభాసురుండైన నలకూబరునిరూపునమర్తినట్టి చిత్తంబునకుఁ దదన్యం బెట్టిదియైనను మఱియింపుగామియుఁ జిత్రంబుగాదు' (కళా ౪-౨౯) అని మణికంధరుఁడు పల్కుటచేఁ గలభాషిణి తన్నుఁ బ్రేమింపలేదనియే చెప్పినట్లయినది. దీని నీ క్రిందిపద్యము మరింత [illegible] మణికంధరుఁడు కలభాషిణితో నిట్లు పలికెను.

తే. ఏమియేమియొ నాఁడునీహృదయమునను, గోర్కెయొక్కటిగలుగుట గొమ్మవింటి
నది ప్రవృద్ధంబుగాఁబెంచి నాత్మలోన, విడిచిపెట్టితో వీణపై వేడ్కయెల్ల.
(కళా. ౩-౧౩౫)

మణికంధరుఁ డిట్లడుగఁగా నలకూబరునందుఁ దనకుఁ బ్రేమగల దనియు ఆతనిఁబొందుటకయ్యే అనేకమైన పాట్లుపడితిననియుఁ గలభాషిణి యిట్లుపలికినది.

చ. అనుటయు లజ్జ నజ్జలరుహానన యించుక యోరగాఁగవం
చిన మొగమొప్ప నేమనుచుఁజెప్పెద దాననచేసికాదె యో
యనఘచరిత్ర నాకుఁగలయట్టిబలంగములెల్ల బాసి యీ
ఘనగహనప్రదేశములఁగష్టపుఁబాటులఁగుందితిం గడున్. (కళా. ౩-౧౩౬)

మణికంధరునిమీఁద మోహమువిడుచుటకుఁ గలకారణ మిట్లు కలభాషిణి మణికంధరునితోడనే పలికినది.

ఉ. ఆవిధినుండునంతట నొకప్పుడు నిన్నునుజూచుచో మణి
గ్రీవుని పేరుదోఁచె మదికిన్ మణికంధర యేకదేశసా
మ్యావగుణంబుచే నతని నాతనియన్నను మద్దిచెట్లుగా
దైవతమౌని దిట్టినవిధంబు మనంబునఁ బాఱెనంతటన్. (కళా. ౪-౧౯)

నారదశాపభయంబున మణికంధరునిమీఁదఁ బ్రేమవిడిచితినన్నది. నలకూబరసంగమాభిలాషయై యేవనమునకుఁ గలభాషిణివచ్చినదో అదే వనములో మణికంధరుఁడున్నాఁడని కలభాషిణికిఁ దెలియును. నారదుని వలని భయమీసందర్భమున లేదు. అయినను నలకూబర సంగమాభిలాష విడిచి మణికంధరు నపేక్షించలేదు. '(మణికంధర) యంతట సముంచిత తావకరూపరేఖ దోప్పే నొక కొంతగల్గఁగని యిచ్చఁగుబేరతనూజుఁ గోరితిన్?' అని కలభాషిణిపలికినది. దీనిచే నలకూబరునిఁగన్న మణికంధరుఁడు సౌందర్యవంతుఁడని తెల్లమగుచున్నది. అంతటిరూపవంతుని పొందులభించినందుకు యథార్థరంభయుద మొందలేదు. పైఁగా వానిని శపించినది. ఎందువలన? రంభకు మణికంధరునందు ప్రేమలేదు, నలకూబరునం దగణ్యమైన ప్రేమగలదుగావున. కలభాషిణి మణికంధరు నిట్లు ప్రేమించెనా? వాఁడున్న వనములోనికివచ్చియు వానికొఱకై ప్రయ

త్నింపలేదు. నలకూబరునికన్న మణికంధరుఁడు సౌందర్యవంతుఁడని తానే చెప్పినది. నారదునిభయ మప్పుడు లేదుకదా. కావునఁ గలభాషిణి మణికంధరుని ప్రేమింపలేదని నిశ్చయమగుచున్నది. రంభకన్నఁ గలభాషిణి సౌందర్యవంతురాలే. అయినను ఇంద్రుఁడు రంభ కదివఱకుకన్న గొప్పసౌందర్య మొసఁగియున్నాఁడు. కావుననే మణికంధరుఁడు రంభను జూచి చలించెను. మణికంధరుఁడు దగ్గఱనున్నప్పుడే నారదునితో రహస్య మపేక్షించి వాని నావలకుఁబంపించి కలభాషిణి నలకూబర ప్రశంసఁదెచ్చినది. ఇదియు నలకూబరాభిలాషనే సమర్థించుచునుగదా. రంభకన్న రూపవంతురాలయ్యు నట్టిసౌందర్యము తనయందున్నదని నారదునివలన నొకిమోస్తరుగాఁ దెలిసినదయ్యు కలభాషిణి రంభయొక్కరూపమునుధరించి నలకూబరుని వరింపఁబోయినదిగాని వానికన్న సౌందర్యవంతుఁడగు, అదే వనములోనున్న మణికంధరునిఁ దలంపలేదు. అంతియకాదు. రంభాలోలుఁడై రంభచే వంచింపఁబడి మణికంధరుఁడు పరితపించుచున్నాఁడని తెలిసియు, రంభారూపముధరించు సామర్థ్యముగలదయ్యు, కలభాషిణి మణికంధరుని సంతోషింపఁజేయనెంచలేదు. మఱియుఁ గలభాషిణి మణికంధరుఁడు దుర్లభుఁడని విడిచినది. నలకూబరుఁడు మాత్రము సులభముగలభించువాఁడా ? నలకూబరునికొఱకై అనేకమైనపాట్లుపడి నారదునివలన వరము సంపాదించి రంభనువంచించి వానిని గూడఁబోయినది. నిష్కల్మషప్రేమగల్గిన రంభను వంచింపనెంచినది గావున కలభాషిణి వంచింపఁబడినది. అని కవి చక్కగ సమర్థించివ్రాసినాఁడు. రంభానలకూబరుల అన్యోన్యప్రేమకుఁ గలభాషిణి ఈసుఁజెందినది. నలకూబరునిఁగాంచి తనివి నొందక వానివిమానమువెంటఁ గొంతదూరమరిగి కనుమఱుఁగు నంతవఱకుఁజూచినది. కలభాషిణికి అంతరంగంబున నలకూబరసంగమాభిలాషం బతిశయిల్ల (కళా 3-౮౧) అని కవి వ్రాసియున్నాఁడు కావున మణికంధరునిఁ గలభాషిణిప్రేమింపలేదు. సరస్వతికిని బ్రహ్మకును నడచిన ప్రణయకలహముంగూర్చి రంభతోఁజెప్పుచున్న చిలుకనుజూచి కోపించి సరస్వతి,

చ. కలఁకకయోసి! యేమిటికితల్ దలపెట్టినదాన విచ్చటన్
తెలియుమునుగాన నీవు పెనుద్రిమ్మరికూఁతలదానవే కదా

భళిభళి యీవికారముల భ్రాంతి యవిఘ్నత జాగిలంబవై
యిలపయిఁబుట్టుమంచు శపియించెమనంబున నల్క హెచ్చఁగన్. (కళా. ౫-౫౦)

ఆచిలుక లంజెయై భువిలోనఁబుట్టి కలభాషిణియనఁ బ్రసిద్ధినొందినది. మణికంధరునిఁ బరిత్యజించి నలకూబరుఁ గోరినందులకుఁ జింతించి కలభాషిణి

శా. పూతంబైనమదీయపుణ్యయుగ మోపుణ్యంపుటిల్లాలనీ
పాతివ్రత్యముచందముల్ విన మదిన్ భావింపఁగానెట్టిదు
ర్నీతిప్రక్రియవారికైనఁగృపతో నీవచ్చినంగల్గుఁద
త్పాతివ్రత్యము నాకు మీఁదనయినం బ్రాపింపదీవింపవే. (కళా. ౮-౧౭౭)

అనిప్రార్థించినది. కావునఁ గలభాషిణి మణికంధరునిమీఁదిప్రేమ త్యజించినది. ఇట్టికలభాషిణియొక్క శృంగారము ఉత్తమమని రెడ్డిగారు వ్రాసిరి. గుణములఁ బ్రబంధనాయికలగు కులస్త్రీలకన్న మేలైనది. (౨౫౦) అని పొగడిరి. రెడ్డిగారు కలభాషిణీపాత్రము విషయమై వ్రాసినవన్నియు సమంజసములుగావు. కవి ఈపాత్రను నీచపాత్రనుమాత్రము గావింపలేదు. కావుననే గణికంజేసినాఁడు. మణికంధరునితోఁ గలభాషిణి యిట్లు పలికినది.

చ. అనుఁడుఁగృతార్థవై తిఁగుటిలాత్మకుఁడెవ్వఁడు నన్నుసట్లుపం
చనమునగూడునో యనువిచారమువానెను నీదుపొందు నా
కనభిమతంబెనీకుఁ బగనన్నుతలంపున నీతలంపు నేఁ
గనమినిద్రిప్పుదున్ హృదయకాంక్ష నినుంగనుఁగొన్నవేళలన్. (కళా. ౮౧౭)

ఉ. దానసగుండెఘుబ్బుమన దానెయకన్ విడిచెం ద్వదంగసం
గానుభవేచ్ఛ యిట్టిడినయట్టిది యీడిగ నామచిత్తమో
మానితశీలయంతట సమంచితతావకరూపరేఖ చొ
ప్పెనొకకొంతగల్గఁగని యిచ్చఁగుబేరతనూజుఁగోరితిన్. (కళా. ౮-౨౦)

అనిచెప్పినది. కావునఁ గలభాషిణి మణికంధరునిఁ బూర్తిగా నెప్పుడును ప్రేమింపలేదనియు, వానినిగాంచినప్పుడెల్ల హృదయకాంక్షను ద్రిప్పుకొనుచుండెడిదనియు శాపభయము తలంపునకువచ్చినది మొదలు ఆశనే విడిచినదనియుఁ బిమ్మట (మణికంధరునిమీఁదిప్రేమ పూర్తిగవిసర్జించి) నలకూబరుని వరించినదనియుఁ గవిచక్కఁగ వ్రాసియున్నాఁడు.విషయమిట్లుం

డఁగా 'మణికంధరునికి నాపైఁ గోరికయుండుట నారదుఁడెఱుఁగును గాన, నీనూతన రాగజ్వాలలో(నలకూబరాపేక్షలోఁ) బ్రాఁతవలపు (మణికంధరునిమీఁదిప్రేమ) భస్మముకాకుండ మణికంధరుఁడు చేసినదండకమును నారదుఁడు కలభాషిణిచేఁ జదివించెనని రెడ్డిగారు వ్రాసిరి. ఇది అసందర్భము. నారదుఁడట్టిప్రయత్నముచేయలేదు. కలభాషిణికి అసలు మణికంధరునందుఁ బ్రేమయుండినకదా అట్టిప్రయత్నముచేయుట! అదిగాకకలభాషిణికి నలకూబరసంగమాభిలాష హెచ్చించుటయే నారదుని ప్రయోజనము. రంభకున్నగర్వము నడంపనెంచియున్నవాఁడుగదా! కావుననే నారదుఁ డిట్లు కలభాషిణితోఁబల్కినాఁడు.

క. సవతియన నింతనొకతెకా, భువిలోపల వేఱువెదకఁబోవలయుఁనె యో
ధవళాక్షి నీవకాస్వైరవె దైవనియుక్తిఁగొంతప్రాప్తిగలిగినన్. (కళా ౧-౭౩)

మఱియు సరస్వతీదేవిచే శపింపఁబడినచిలుకనుజూచి కనికరించి 'మీయమ్మశాపంబునకు నోఁగాదన నెవ్వరికి నెట్లువచ్చునదియట్లు(కలభాషిణి వైపుట్టి) అనుభవించి తదనంతరజన్మంబున మదాశయుండను జగతీపతికి మధురలాలసయనం దనయవై జనియించి కళాపూర్ణుండనురాజునకు భార్యవై యనన్యసాధారణంబైన యైశ్వర్యభోగంబులనుభవించుచు సహజంబైన పరమపాతివ్రత్యంబున సకలధర్మంబులను సాధించి కృతార్థ వయ్యెదు. విచారింపకుము! (కళా. ౫-౫౩) అని బ్రహ్మవరంబొసంగెను. కావునఁ గలభాషిణివిషయమై రెడ్డిగారుతలంచినదంతయుఁ గేవలము పొరపాటు. కలభాషిణియొక్కస్వభావము తెలియక పోవుట యనునదేగాక ప్రబంధస్త్రీల సుగుణములుగూడ రెడ్డిగారుగ్రహింపలేదనునది ఇందువలన స్పష్టమగుచున్నది.

"(కలభాషిణికి) మనోరథ మొకరీతిఫలించెనేకాని పరిపక్వమయ్యె ననుట నిర్వివాదముగాదు. అయిననేమి! ఈపె ప్రబంధముల నాచకన్నె గాదుగావున, కొంచెముతోఁ దృప్తిఁజెందగల యుదారురాలు" (౨౫౯) అని వ్రాసిరి. ఇది యథార్థము కాదు. రంభలేనివేళఁగనిపెట్టి రంభామనోహరునిఁగూడ నెంచినదికలభాషిణి. అంతతోవిడువలేదు. రంభను గలకాలము వంచింపఁజూచినది. రంభతోఁ గయ్యమునకుఁ గాలు దువ్వినది. లాభములేనందున, వాఁడు తన్ను విడిచినందున రంభచే శపింపఁబడి తిరిగి

వచ్చినది. దొంగబ్రతుకు, అందున్న భయము, కపటగాంభీర్యము ఇందు వ్యక్తమగుచున్నవిగాని స్వచ్ఛమగుప్రేమ అందున్న ఆనందము ధ్వనించుచున్నవా? ప్రియుఁడుదొరికినదే తడవుగా సంభోగము నపేక్షించినది కలభాషిణి. అయినను విషయముగ్రహింపక 'ప్రబంధస్త్రీల వలెఁగాక కలభాషిణి ఉదారురాలని రెడ్డిగారువ్రాసిరి. ఉత్తమపాత్ర లందలి నునుసిగ్గు రెడ్డిగారి కవగాహనయే కాలేదేమొ.

"(తన్నుఁబొందినవాఁడు మణికంధరుఁడేయని తెలిసిన పిమ్మట వెను కటిచరిత్రమంతయుఁ దెల్పి) లజ్జాశోకంబు లడరఁ నవనతముఖియైయున్న కలభాషిణికి సమాధానముఁజెప్పి నిదర్శనముగా సుగాత్రీశాలీనులచరిత్రంబు వక్కాణించి మణికంధరుం డావెకుందును బోఁగొట్టెను ఈని దర్శన మేలయనఁగా: ఒకరిపైఁబ్రేమయుండినను వారేదేనొక క్రొత్తరీతి నుండినంగాని మతిసమ్మతింప దనుశృంగారన్యాయమునకు! ఇది శృంగార విశేషములకుంజేరినభావప్రకృతి. భార్యయందైనఁగాని, సర్వకాలముల సర్వావస్థల నేకరీతియగు మక్కువందాల్చినవా రుండరు. ఏదోనొకవిలాసమువహించి రెుప్పారిరేని తమి తనంతట రేఁగును. మనుష్యులును బలు మూర్తులుగలవారని యంటిమిగదా! హృదయవికాసము గలిగించునవి యందుఁగొన్ని మాత్రము. మఱియొకరి కొకమూర్తిపైఁబ్రీతి. ఇంకొకరి కింకొకమూర్తిపైఁబ్రీతి. రేఖలు, లీలలు, విలాసములును తత్తద్హృదయ సారములప్రకారము సుఖదుఃఖావహములగుట వింతగాదు" (౨౬-౨) అనివ్రాసిరి. ఒకరిపైఁబ్రేమయుండినను వారేదేనొక క్రొత్తరీతినుండినఁ గాని మతి సమ్మతింపదు. అనుదానికుదాహరణముగా సుగాత్రీశాలీనుల చరిత్రము చెప్పఁబడలేదు. సుగాత్రియందు శాలీనునకుఁ బ్రేమయే లేదు. పూలవనమందుఁజూచిన (సుగాత్రీ) రూపమందే వానికిఁబ్రీతి. అట్లే నలకూబరునందుఁ గలభాషిణికిఁ బ్రేమగలదు. ఆరూపమునుబొందియే సుఖించినది. గృహమం దలంకృతయైవచ్చిన సుగాత్రిపై శాలీనునకు మోహము లేదు.అట్లుగనే మణికంధరునియందుఁ గలభాషిణికి మోహము లేదు. ఆరామసుగాత్రియందు శాలీనునకు మోహము. నలకూబరరూపమందుఁ గలభాషిణికిమోహము. వనమందు సౌఖ్యమిచ్చినభార్యయేగృహమున దరికివచ్చినను శాలీనుఁడు మాట్లాడింపలేదు. మణికంధరుఁడున్న

వనంబునకుఁబోయి కూడ కలభాషిణి వానిని దలంపలేదు గృహమందలి అలంకృతరూపము నాకింపుగాదు, రేపు పూఁదోఁటకు మామూలుగా రమ్ము అని శాలీనుఁడు సుగాత్రితోఁ జెప్పలేదు. కారణము ఉద్యాన రూపమేగాని ఇతర మాతని కవసరము లేదు. అదికనఁబడినపుడే సుఖించును. సిద్ధునితో మణికంధరుఁడున్న వనమునకువచ్చియుఁ గలభాషిణి మణికంధరునిఁ దలంపలేదు. నలకూబరరూపమే యామెకుఁ బ్రియము. అదికనఁబడిననే సుఖించును. కావుననే మణికంధరుఁడు స్పష్టముగా నిట్లుచెప్పియున్నాఁడు. 'నలకూబరునిరూపున హత్తినట్టిచిత్తంబునకుఁ దదన్యంబెట్టిదియైనను మఱియింపుగామియుఁజిత్రంబుగాదు. పురుషులందు నొక్కొక్కవేళ గుణంబుననిట్టివిగలవు' అని సుగాత్రీశాలీనులచరిత్రము నుదాహరించిచెప్పెను. తనపైఁ గలభాషిణికిప్రేమలేదని మణికంధరుఁడొప్పుకొన్నను, గవిఒప్పించినను రెడ్డిగా రొప్పుకొనరు. ఇది విమర్శనమహాత్మ్యమేమొ! కావచ్చును! సూరన్నకుఁదెలియని కొన్నిస్వారస్యము లాతని కావ్యములలోనున్నవని రెడ్డిగా రిట్లువ్రాసిరి.

౧ "ఈ. (కలభాషిణీ) పాత్రముంగూర్చి యింతవిపులముగ వ్రాసినందుకు క్షమాపణార్థమై కారణములఁ జూపవలయు. సూరనార్యుని వాఙ్మయసృష్టినెల్ల నియ్యది నిస్సంశయముగ నగ్రగణ్యము. దీనికిందీటగు చరిత్రమింకేయ్యదియు లేదు. శృంగారవర్ణనముం జేయుటలోను ప్రబంధముల వెఱ్ఱులేవియు వేయలేదు. నలకూబరునికై నాలుగేండ్లకన్న నెక్కువగఁ గాచియుండెఁగదా! ఇష్టముండినఁ జెలికత్తెలతో మొఱలిడుట, ఉద్యానవనములోఁబడిపొరలుట, చంద్రాదిదూషణము, ఇట్టివికారచేష్టలన్నియుఁ జేసినట్లు చెప్పియుండవచ్చును. కాని, కవి యీవిషయములఁదలంపనైన లేదని తోఁచుచున్నది. భావనాశక్తిమై వ్రాయువారలకు మనసు పాత్రములయందలీనముగనుండుఁగావున సహజరాగములుదప్ప నితరములు దట్టవు. మఱియు, నీశాస్త్రీయఘోషలకు మధురలాలసాచరిత్రములోఁ (గలభాషిణియొక్క ఉత్తరజన్మలోఁ) బ్రవేశమున్నదిగాన నిటననవసరములని కవి వానిని విడిచిపెట్టెనేమొ? కారణము లేయేటనైనఁబోనిండు! మనకులభించినదన్నదో మనసువశముగాకపోవునంత రమణీయమైనకథ. కవికిఁ గృతజ్ఞులమై నమస్కారము, రసికులకు స్వాగతమును!" (ఆంధ్ర

౨౬౬) అని వ్రాసిరి మణికంధరునిమీఁది మనసుఁ ద్రిప్పుకొని నలకూబరునివరించినది గావునఁ గలభాషిణియొక్క ప్రేమ గాఢమైనదిగఁ గవియెన్న లేదు. కావుననే ఉత్తరజన్మలో విరహవేదనను వర్ణించెను. మణికంధరుని విషయమగు విరహవేదనయే కలభాషిణికుండినయెడలఁ గవి అవశ్యము చంద్రాదిదూషణములను గావించి యేయుండును. విషయమును గ్రహింప లేకుండుట అందువలనఁ బ్రబంధములలో వెఱ్ఱివికారములుండునని తలంచుట పొరపాటుయొక్క లక్షణము. తలంచినదెల్ల గ్రంథరూపమున వ్రాయుట కూడనిపని.

(౨) "కళాపూర్ణోదయములో రాజవర్ణనఁ జేయలేదు. ప్రభావతిలోను జేయలేదు. ఇందులకు గతంబేమియొకో! బహుశః గ్రంథాదిని రెంటియందును రాఁదగినమహాత్ముఁడు కృష్ణుఁడు. ఇతఁడు సుప్రసిద్ధుండు గావునఁ గవి యితనికూర్చిన ప్రస్తావనము లనావశ్యకములని విరమించెనో: యోజింపుఁడు. తెలిసిచేసిన మనకేమి? తెలియకచేసిన మనకేమి. పాకము బాగున్న నామోదించుటయేసరి" (౧౮౭) అని వ్రాసిరి ద్వారకానగరవర్ణనము, ద్వారకానగరాధీశునివర్ణనము కవి రెండుకావ్యములలో నాదినిఁ జేసియున్నాఁడు. ఇదంతయు రెడ్డిగారిమతము ప్రకారము అసమంజసమే. కవి వ్రాసినదిచూడక రెడ్డిగారువిమర్శించిరని ఇందువలన స్పష్టమగుచున్నది.

"ఇంతమంచిసుందరమగుఁ (గలభాషిణీ) పాత్రము వర్ణనము శోకాంతముగాఁజెప్పుట కిష్టములేమిచేతనో, మఱి, మనకవులకుంబట్టిన దౌర్భాగ్యమతంబుకతంబుననో, మణికంధరఖండితమస్తకమగు నాలలనా శిరోమణి కాళికాదేవి కరుణాప్రసాదంబున పునస్సహితమస్తకయు, నిజపురీవర్తినియునై తన బంధుమిత్రాదుల నలరించుచు, సుమారు రెండు సంవత్సరములుండి పిమ్మటఁ గాలప్రాప్తమరణమాయెనని కరుణరసప్రధానమగు నీభాగముయొక్క సొంపును గవి వికలంబొనర్చియుండుట భాషా దుర్దశగదా? రసములలో శోకరసమునొక్కటి. ఇదిమాత్రము నిషేధ్యమననేల? శోకప్రధానముగా వ్రాసినఁ గవిత్వము మొక్కపోవునా? మొత్తముమీఁద భారతమే శోకాంతమఁట! దానికిరాని తక్కువ వెలితానికివచ్చునా?" (౨౬౬, ౨౬౭)అని వ్రాసిరి. స్త్రీ, అందునఁదనకిష్టురాలు,

అట్టికలభాషిణినిచంపుటకు మణికంధరుఁడు కొంతసంకోచించెను. ప్రియుని చేతఁ దాను (కలభాషిణి) చనిపోవుట ప్రియునకెంతయో ఉపకారమగుచున్నది. అందువలనఁ గలభాషిణి ధైర్యముగాఁ జనిపోవ సమకట్టినది. కావుననే ఫలమందు వ్యత్యాసము కవియిట్లు కనఁబఱచెను 'మృగేంద్రవాహన(దేవి) యతనినుద్దేశించి, యోమణికంధర నీవు దయాకులత్వంబునంజేసి యాబలిసమర్పణవిధానం బొకించుక విలంబనంబునంజేసి సలిపితివి గావున జన్మాంతరమాత్రవ్యవధానంబున సద్యోయౌవనుండవగుచు మహారాజ్యవైభవంబు లనుభవించెదు. కలభాషిణియుఁ బ్రాణభయంబు లేశంబును లేక మత్ప్రీణనతాత్పర్యధైర్యాదిగుణంబులచేతను మిక్కిలి మెప్పించెంగావున మామక ప్రసాదవిశేషంబునంజేసి యిపుడు పునస్సహితమస్తకయు నిజపురీవర్తియునై తనబంధుమిత్రాదుల నలంకరించునని యానతిచ్చె' (కళా. ౮-౧౮౬) అని కవి వ్రాసియున్నాఁడు. మణికంధరుఁడు మఱుపుట్టువున కళాపూర్ణుఁడై పుట్టనున్నాఁడు. కలభాషిణి వానికి భార్యగా మధురలాలసయనునామమునఁ బుట్టనున్నది. భర్తకన్న భార్య ముందు పుట్టకూడదు. భర్త భార్యకన్న పెద్దవాఁడై యుండవలయునన్నది భారతీయాచారము. కళాపూర్ణుఁడు సద్యోయౌవనుఁడైనను భార్యచిన్నదిగా నుండవలయునుగానఁ గవి వారిజన్మలకుమధ్య రెండేండ్లు వ్యవధానముంచెను. పెద్దవయసుగల్గిన స్త్రీలనువివాహమాడుట, అది గౌరవముగా నెంచుట పాశ్చాత్యులయాచారము. తద్వాసనావిశేషముగల్గినవారికీవిషయ మెట్లు గోచరించును? రెడ్డిగారు *షేక్స్పియరు వ్రాసిన కామెడీ

---

## కామెడీ ఆఫ్ ఎరర్స్ (తబ్బిబ్బులప్రహసనము)

ఒకవర్తకునకు కవలపిల్లలుపుట్టిరి. అదేసమయమున కొకపేదదానికిఁగూడ కవలలు గల్గిరి. ఆకవలను నీవర్తకుఁడు బానిసలుగా ధనమునకుఁగొని తనయొద్ద నుంచుకొనెను. వర్తకుఁడు, భార్య, కవలలు, సేవకులు (పేదదానికవలపిల్లలు) కలిసి ప్రయాణమొనర్చుచుండఁగాఁ బడవ బ్రద్దలైపోయినది. తండ్రి, చిన్నకొడుకు, చిన్నసేవకుఁడొకవైపునకు, తల్లి, పెద్దకొమారుఁడు, పెద్దసేవకుఁడును మఱియొకవైపునకుఁ గొట్టుకొనిపోయిరి. కొన్నియేండ్లయినపిమ్మటఁ దమ్ముఁడు తండ్రియనుమతిఁబొంది తల్లిని అన్నను వెదుకఁ బోయెను. తండ్రియుఁ నా పెద్దకుమారుని వెదకుచు నొకదేశమునకువచ్చి విరోధిదేశమువాఁడగుటచే

ఆఫ్ ఎర్రర్సు, సూరన్న వ్రాసిన కళాపూర్ణోదయము ఒకవిధమున నున్న

---

బంధింపఁబడి రాజునెదుటఁ దనచరిత్రమంతయు విన్నవించెను. అదేసమయమునకు చిన్న కొమరుఁడు, వానిసేవకుఁడు అదేదేశమునకువచ్చిరి. అదియే (కవలలోఁ బెద్దకుమారుఁడు) అన్న నివసించుస్థలము. తనసేవకుఁడు పనిమీఁదవెడలియుండఁగా అన్నయొక్క సేవకుఁ డచ్చటకువచ్చి తనయజమానుఁడేయని భ్రమపడి 'అమ్మగారు భోజనమునకుఁ బిలుచుచున్నా ర'ని తమ్మునితోఁ జెప్పెను. తమ్మునికామాట లర్థముకాలేదు. 'నేనిచ్చినడబ్బు నెచ్చట నుంచితివ'ని యడిగెను. సేవకున కదిబోధపడలేదు. సేవకులిద్దఱునుగూడ కవలపిల్లలేకదా. తమ్ముఁ డీప్రసంగమునకుఁ జీకాకునొంది ఆసేవకుని నొక్కటి కొట్టఁగా వాఁడు వెడలి పోయెను. సేవకుఁడిట్లగుటకుఁగారణ మాదేశము మాంత్రికదేశమనియు నచ్చట మనసులు శరీరములు మాఱిపోవుచుండుననియుఁ దమ్ముఁడు తలంచెను.

౨ అంకము.

తన్నులుతిన్న సేవకుఁ డింటికివచ్చి యజమానునకుఁ బిచ్చియెత్తినదని చెప్పెను. సందర్భము చాలనిమాటలాడెనని చెప్పెను. ఇంతలోఁ దమ్మునివద్దకు వానిసేవకుఁడుచేరు కొనెను. 'నీమనసు కుదుటఁబడినదా, బంగారములేదన్నావు, యజమానురాలు భోజనము నకుఁ బిలుచుచున్నదన్నావు. నాయిల్లీదేశమందే లేదుకదా, నీకుపిచ్చియెత్తినది. నాకింతపిచ్చిగా జవాబుచెప్పెదవా' యని తమ్ముఁడుపలుకఁగా ఆసేవకుఁడు తెల్లఁబోయి "నీవునన్నుపంపినది మొదలు ఇదేనీవద్దకువచ్చుచున్నా'నని' చెప్పెను. అదేసమయమునకు అన్నయొక్క భార్య, దానిచెల్లెలు అచ్చటకువచ్చిరి. అది బహిరంగస్థలము. 'నీవు వేఱొక తెను బ్రేమించితివి. వాగ్దానములన్నియు మఱచితివి. ఇది తగదు. ఇంటికిరమ్ము' అని గృహిణి పిలిచెను. 'నీవెవరో నాకుఁ దెలియదు. నేనీదేశమునకువచ్చి రెండుగంటలైనది' అని తమ్ముఁడు పలికెను. 'ఈసేవకునిద్వారానే నేను నీకు కబురుపెట్టితిని'అని మరలనామె పలుకఁగా 'నాజన్మలో నీమెను నేను జూడలేదు. మాట్లాడలేదు' అని ఆసేవకుఁడనెను. 'ఈమెను నేను కలలోవివాహమాడితినా, మాపేళ్లీమెకెట్లుతెలిసినవి' అని తమ్ముఁడాశ్చర్య పడెను. అది దయ్యాలదేశమనియెంచినందున భయపడి తమ్ముఁడు, వానిసేవకుఁడామెవెంట నింటికి భోజనమునకై వెళ్లిరి. ''ఎవరిని లోనికి రానీవలదు'' అని ఆసేవకుని కాగృహిణి యాజ్ఞాపించినది. వీథితలుపులు మూయఁబడెను.

3 అంకము.

అన్నవద్దకు వానిసేవకుఁడు చేరుకొనెను. 'నన్ను నీవు కొట్టినావు' అని ఆసేవకుఁడు చెప్పుకొనెను.అదిఅన్నకర్థముకాలేదు.వారుభయులింటికివచ్చి వీథితలుపులుకొట్టిరి.లోనున్న

దన్నారు. వారుభయులును సమకాలీనులు అని వ్రాసిరి. షేక్స్పియరు

---

తమ్ముని సేవకుఁడు తలుపుతీయడు. 'ఇంటికి భోజనమునకై రాఁగాఁ దలుపుతీయవేమి' అని అన్న పలికెను. 'మరొకప్పుడురా. ఇప్పుడు వీలులేదు' అని లోని సేవకుఁడు పలికి తన పేరుచెప్పెను. దానికిఁ బైనున్న సేవకుఁ డాశ్చర్యపడి "నా పేరును నాపనినిగూడ దొంగిలించితివా' యని పలికెను. తలుపుబ్రద్దలఁగొట్టి లోనఁ బ్రవేశింపవలెనని పైనున్నవారు తలఁచిరి. 'ఏమది' అని గృహిణి యడిగినది. వీధిలోనున్న భర్త (కవలలో అన్న) భార్యను పిలిచెను. తన్ను వేఱొకఁడు భార్యయని పిలుచుచున్నటులఁ దలఁచి యామె వానినిబొమ్మనెను. మధ్యస్థుఁడొకఁడదిసమయము కాదనియు, సాయంత్రమెక్కడవే వచ్చి చూడుమనియుఁ జెప్పఁగా, భార్యకు బుద్ధిచెప్పుటకై త్రాడొకటికొని తెమ్మని తన సేవకునికాజ్ఞాపించి భర్త వేఱొకచోట భుజించుటకు వెడలిపోయెను. గృహిణియొక్క చెల్లెలు తమ్ముని నోదార్ప వచ్చెను. 'మీఅక్క నాభార్యకాదు. నిన్ను వివాహమాడ నిచ్చగలదు. నీకు మగఁడు లేఁడు. నాకు భార్యలేదు' అనిపలికి తమ్ముఁడు దానిహస్తమిమ్మని ప్రార్థించెను. పిదపఁ దమ్మునితో నాతని సేవకుఁడు ఆయింటవంటది తన్ను ప్రేమించినదని చెప్పి ఆమెదేహమునంతయు దేశములతో వర్ణించెను. ఐర్లెండు, స్కాట్లెండు, ఫ్రాన్సు, ఇంగ్లండు, స్పైను, అమెరికా, ఇండీసు, బెల్జియా, నెదర్లేండు ఈదేశములను జేర్కొనెను. 'నేనుదానిమనిషినై పోలెని, నా పేరుచెప్పెను, నాదేహమందలి రహస్యమైనగుఱుతులను జెప్పివైచినది. భుజముమీఁద నున్నగుఱుతు, కంఠముమీఁదనున్న పుట్టుమచ్చ, ఎడమచేతిమీఁదనున్న కాయ చెప్పివేసినది' అని తమ్మునితో నాతని సేవకుఁడు చెప్పుకొనెను. 'పడవయేదైన తీరమునకువచ్చినదేమో చూడుము' అని తమ్ముఁ డాసేవకుని పంపివేసెను. 'మనల నందఱెక్కడ నెఱిఁగియున్నారు. మనకెవరు నిచ్చుటఁదెలిసినవారులేరు' అని పలికెను. ఆతమ్మునివద్దకుఁ గంసాలియొకఁ డప్పుడువచ్చి అన్నయనుకొని వానికై తాను తయారుచేసిన బంగారపుగొలుసునిచ్చివేసి దానిసొమ్ముకై రాత్రి వచ్చెదనని పలికిపోయెను. వీధిలో గొలుసు లభించినందులకుఁ దమ్ముఁ డాశ్చర్యపడెను.

### ౪ అంకము

గొలుసుచేసినకంసాలి ఒకనికప్పుపడియుండెను. డబ్బుకై వాఁడు అధికారియుక్తముగావచ్చి తగాయిదా చేసెను. గొలుసుసొమ్ముపుచ్చుకొని బాకితీర్పనెంచివచ్చుచున్న కంసాలికి అన్నయెదురుపడెను. త్రాడుకొని తెచ్చుటకై వానిసేవకుఁడు పోయియుండెను. డబ్బునిమ్మని కంసాలి అన్ననడిగెను. 'గొలుసేది' అని అన్నయడిగెను. ఇదిదగాగానున్నందున, డబ్బుబాకియున్నందున అన్ననచ్చుట నిర్బంధించిరి. పడవకై వెళ్లిన తమ్ముని సేవకుఁ

తనకన్న నెనిమిదేండ్లు పెద్దయైనభార్యను స్వీకరించెను. సమకాలీనుఁడైన

---

డచ్చటకువచ్చుట తటస్థించెను. 'పడవసిద్ధముగానున్నది' అని చెప్పెను. అన్నకది అర్థము కాలేదు. 'నేనుఖైదుచేయఁబడితిని, ఈతాళముగొనిపోయి భార్యకిచ్చి సొమ్ము తెమ్ము'అని పలికెను. ఆయింటికిఁబోవుట కాసేవకునకుభయమైనను అదితనయజమాని యాజ్ఞయను కొని గృహమునకుఁబోయెను. అప్పుడు గృహిణి, దానిచెల్లెలు నాఁటివిచిత్రమును గూర్చి మాట్లాడుకొనుచుండిరి. ఆరోజు నసింటభుజించినవాఁడు (తమ్ముఁడు) ఆదేశమునకుఁ గ్రొత్తగవచ్చినట్లుగాఁ దనతోఁజెప్పెనని చెల్లెలక్కతోఁజెప్పెను. ఇంతలో సేవకుఁడింటికి వచ్చి డబ్బుతీసుకొనివెళ్లిపోయెను. 'నన్నందఱు మాట్లాడించుచున్నారు. చిరపరిచయు స్థునివలెనే నన్నందఱు చూచుచున్నారు' అని తమ్ముఁడాశ్చర్యపడుచుండఁగా నాతని సేవకుఁ డాడబ్బుతెచ్చియిచ్చెను. దానితో నాతఁడు మఱియు నాశ్చర్యపడెను. వీధిలో ధనము, గొలుసు దొరికినందుల కాతఁడు మిగులనాశ్చర్యపడెను. తెల్లబోయెను. అప్పు డచ్చటకొకవేశ్యవచ్చి 'భోజనముదగ్గర నాకిస్తానన్నగొలుసిమ్ము, లేనిచో నాదగ్గర తీసు కొన్నఉంగరమైననిచ్చివేయుము' అని అడిగినది. అందుకుతమ్ముఁడు దబాయించెను. అది చూచి వానికిపిచ్చియెత్తినదనితలఁచి ఆవేశ్య ఈసంగతి నెఱిగించుటకై గృహిణియింటికిఁ బోయినది. డబ్బుఇంటినుండి తెమ్మని సేవకునిపంపించి యెదురుచూచుచున్న అన్నవద్దకు వానిసేవకుఁడు త్రాడుకొనుక్కొనివచ్చెను. వానినిజూచి 'తెచ్చావా' యని యడుగఁగా వాఁడు త్రాడుచూపించెను. 'డబ్బేది'యనఁగా 'డబ్బిచ్చితెచ్చా'నని చెప్పెను. ఆమాటతో అన్నకు మతిపోయెను. సేవకుఁ డింటివద్దనుండి తెచ్చినది ౫౦౦ రొక్కముగలను. అప్పు డచ్చటకువేశ్య, భార్య, ఆమెచెల్లెలు, ఉపాధ్యాయుఁడొకఁడువచ్చిరి. యజమానునిగాంచి వానికిఁబిచ్చియెత్తినదనితలంచిరి.'నేనింటికిరాఁగా నీవుతలుపుతీయలేదు'అనిఅన్నపలుకఁగా 'నీవింటిలోనే భోజనమొనర్చితివి. డబ్బుకై కబురుపంపఁగా వీనిద్వారా పంపినాను' అని గృహిణి పలికినది. 'నేను త్రాడుకొఱకు మాత్రమే వెళ్లియుంటిని. నేనుత్రాడుకొన్నట్లుగా దేవుఁడు, త్రాడుచేసినవాఁడు సాక్షులు' అని యాసేవకుఁడనెను. సేవకుఁడిట్లుపలుకుచుం డుటచే వేశ్యాభార్యాదులు యజమానునకు, సేవకునకుఁగూడ పిచ్చియెత్తినదని నిశ్చయించి వారుభయులనుబంధింపించి యింటికిఁబంపిరి. వెనువెంటనే తమ్ముఁడు, వానిసేవకుఁడు అక్క డకువచ్చుట తటస్థించెను. బంధింపఁబడినయజమానుఁడు సేవకుఁడు విడిపోయి కత్తులుపట్టి వచ్చుచున్నారని వారందఱుతలఁచి భయపడిపోయిరి.

౫ అంకము.

మెడలోగొలుసువేసుకొని వచ్చుచున్నతమ్ముని జూచి కంసాలి వానితో మాట్లాడు చుండఁగా గృహిణ్యాదులు మఱికొంద ఱచ్చటకువచ్చి 'అయుభయులను, (తమ్ముని వాని

సూరన్న కథలోనైన పెద్దభార్యను జూపవలదా అని రెడ్డిగారిట్లు

సేవకుని) బంధింపుఁడు’ అనిరి. అదివిని వారిద్దఱు దగ్గరగానున్న మఠమునకుఁ బారిపోయిరి. గృహిణి ఆమఠమునకుఁబోయి ‘ఆపరుగునవచ్చినవాఁడు నావిభుఁడు,మనసుచెడియున్నది. వానినాకొప్పగించుము’ అని ఆమఠాధికారిణిని కోరెను. కాని, ఆమె నిరాకరించినది. ఈయవమానమును భరింపలేక రాజునొద్ద గృహిణి ఫిర్యాదుచేసినది. కట్లుత్రెంపుకొని అన్నయు వానిసేవకుఁడు ఆదేసమయమునకు రాజునొద్ద ఫిర్యాదుచేసికొనుటకై వచ్చిరి. తానదివఱకు రాజునకొనర్చిన మేలిపనులన్నియు నుగ్గడించి ‘న్యాయ మిప్పింపుఁడ’ని అన్న ప్రార్థించెను, ఆగృహిణి లంజె అయినదనిచెప్పెను. ‘ఈదినము మాచెల్లెలు ఈతఁడు యింట నేభుజించిరి’ అని గృహిణి పలికినది. ‘నేచేసినగొలుసిదివఱకు వీనిమెడలోఁజూచి యుంటిని’ అని కంసాలి పలికెను. ‘నాభార్యనన్నుకట్టించినది. అదివిడిపించుకొని న్యాయమునకై యిటకువచ్చియున్నాను’ అని అన్నపలికెను. ఇదంతయువిని రాజు మఠాధికారిణికి కబురుపంపించెను. అప్పుడక్కడ నిర్బంధముననున్నతండ్రి ‘నన్ను మీరెఱుఁగుదురా, నాకంఠధ్వనిని పోల్చలేదా’ అని అన్నను వానిసేవకుని నడిగెను. వారు తెలియదనియు, నాతనినిఁ జూచియుండలేదనియుఁ బలికిరి. ‘నాజన్మలో నేను నాతండ్రినిఁ జూడలేదు, ఆతఁడు (తండ్రి) నిర్దేశించినదేశమును నేనెప్పుడును జూడలేదు’ అని అన్నపలికెను. అదియథార్థమేయని రాజంగీకరించెను.ఇంతలోఁదమ్ముని, వానిసేవకునిఁగొని మఠాధికారిణి రాజసభకువచ్చినది. ‘ఇరువురుభర్తలను జూచుచున్నాను’ అని గృహిణి వచించినది. సేవకులిద్దఱు చిఱుబుస్సులాడుకొనిరి. తండ్రి ఆమఠాధికారిణి తనభార్యయేయని గ్రహించెను. మఱియు ‘నాపెద్దకొడుకేడి’ అని ప్రశ్నించెను. రాజప్పుడు సంగతినంతయు గ్రహించెను. ఇంట నీదినముభుజించిన దెవరని గృహిణియడుగఁగా నేనని తమ్ముఁడు బదులు పలికెను. తమ్మునిమెడలోనిగొలుసుచూచి ‘అదిగో నేనిచ్చిన గొలుసు’ అని కంసాలి పలికెను. గృహిణిపంపినసొమ్ము తనకుఁజేరినదని తమ్ముఁడువచించెను. వేశ్య కుంగరమిచ్చివేయఁబడెను, నలుగురుకవలలలో నడచిన ప్రసంగ మిచ్చటఁ గొంతవ్రాయఁబడి నాటకము పరిసమాప్తిచేయఁబడినది.

కవలలుగాఁబుట్టినవారున్నారు. కాని వారిపేళ్లుకూడ నొకటేకానేరవు. అన్నదమ్ములపే ళ్లొకటిగాను, సేవకులపే ళ్లొకటిగాను ఈనాటకమందుఁ జెప్పఁబడినవి. పేళ్లు వేఱువేఱుగానున్నటుల మొదటియంకములోఁ జెప్పఁబడియున్నదికాని నాటకరచనయందదికనఁబడలేదు. మఱియు కవలలుకావచ్చునుకాని కంఠస్వరములు పుట్టుమచ్చలదగ్గర నుండి ఒకేరీతినుండవు. ఈయసందర్భము లిందుగలవు. ఇందుగలపాత్రలన్నియు లోకజ్ఞానము ఇంగితజ్ఞానము గల్గినవికావు. ఒకరినొకరు తెలిసికొనుటకనేకావకాశములుఁలభించి

వ్రాసిరో తెలియదు. ఇంగ్లీషువారికి మనకు సంబంధ మప్పటినుండి

నను వారుగుర్తెఱుఁగలేకపోయిరి. 'యజమానురా లింటికి భోజనమునకు రమ్మన్నది' అని అన్నయొక్క సేవకుఁడు పిల్చినపుడే తమ్ముఁడు అన్నవిషయమై వితర్కించుకొనవలసి యున్నది. తనరూపమునుబోలి అన్నయొక్క ఆకారముండుననియు, సేవకులుగూడ కవలలుగాన నావచ్చినవాఁ డన్న సేవకుఁడై యుండుననియుఁ దమ్ముఁ డాలోచించుకొనవలసి యున్నది. గృహిణి నడివీథినిఁ జూడవచ్చినపుడు జరిగిన ప్రసంగములో నామెయన్న భార్య యగునని తమ్ముఁడు తెలిసికొనవలసియున్నది. అదిమాంత్రికదేశమనియుఁ గావున నిట్టివిషమ సంఘటనము జరుగుచున్నదనియుఁ దమ్ముఁడు తలంచెను అని సందర్భము చాలనితలంపును షేక్స్పియరిచట వ్రాసియున్నాఁడు. అన్నతనయింటఁ బ్రవేశింపఁబోయినప్పుడు నడచిన సంగతివలన నిజస్థితి వెల్లడియగుచుండినను తమ్ముఁడు గ్రహించుకొనలేదు. భయయుక్తమగు మనసుగల్గినవాఁడయ్యు ఆశ్చర్యసంఘటనమందుఁ దగులొ్కనియున్నవాఁడయ్యు గృహిణి యొక్క చెల్లెలిని 'కరమునిమ్మ'ని పల్కినట్టిరసికుఁడాతమ్ముఁడు. అనేకదేశములను వంటదాని వంటవర్ణించినరసికుఁడు వానిసేవకుఁడు. అదిమాత్రమే వారికున్న ప్రజ్ఞావిశేషము. గృహిణి తన్నుభర్తగాభ్రమించినది. వంటది తనసేవకుని భర్తగాభ్రమించినది. అని తెలిసికొనియు తమ్ముఁడు, వానిసేవకుఁడు యథార్థమును గుర్తింపలేకపోయిరి. అన్న నెట్లుగాగుర్తింపఁ దలఁచి వెదుకవచ్చిరోకదా. ఇంగితజ్ఞాన మొకపిసరంతయైన వారియందుఁగానరాదుకదా. సేవకులయొక్క తబ్బిబ్బులు, అచ్చటిప్రజలు చూపుచున్న ఆదరణ, కంసాలియొక్క వృత్తాంతము, వేశ్యావృత్తాంతము, ధనలాభము ఈనిదర్శనములేవియుఁ బనికిరాక వారి యందు నిష్ప్రయోజనములైనవి. గొలుసు, ధనము నడివీథిలో లభించినందుల కాశ్చర్య పడెనేకాని కొంచెమైనను అన్నయచ్చటనున్నాఁడాయని తమ్ముఁడువితర్కించుకొనలేదు. బుద్ధినుపయోగించలేదు. ఇరువురికంఠధ్వను లేకరీతినున్నవి. లోనున్నవాఁడు (తమ్ముఁడు) విభుఁడనుగాననుచున్నాఁడు. వీథిలోనుండిపోయినవాఁడు విభుఁడననుచున్నాఁడు. అయి నను ఆగృహిణి వీథితలుపుతీసి పరీక్షించలేదు. న్యాయస్థానమున సులువుగ నిరువురనుభర్త లుగాఁజేరొ్కనిన దాగృహిణి. భార్యతలుపుతీయనందునఁ బైదానికై వెడలిపోయినట్టి వాఁడు దానిమగఁడు (కవలల 'అన్న) ఇంకతండ్రిసంగతియు నిట్లేయున్నది. రాజసభలో 'నన్ను మీ రెఱుఁగరా'యని తానడిగినపుడు పెద్దకుమారుఁడు, వానిసేవకుఁడు 'తెలియదని' పలుకుట, మఱియు రాజసభయందలి గృహిణి, పెద్దకుమారులయొక్క వచనములు వీఁటి వలనఁ దనచిన్నకొమరుఁడన్న నన్వేషించుచు నాదేశమునకువచ్చినాఁడు అని తండ్రి గ్రహింపవలసియున్నది. కాని ఆతఁడంతకన్న తెలివిమాలినవాఁడు. రాజునునట్టివాఁడే. తండ్రివలన రాజప్పుడే అన్నదమ్ములు కవలలనియు, వారిసేవకులుగూడ కవలలనియు,

ప్రారంభమైనది అన్నట్లు కావ్యములోనైన సూరన పెద్దభార్యను జూప

---

తమ్ముఁడును వానిసేవకుఁడు అన్నను వెదుకుచున్నారనియు వినియున్నాఁడు. ఇట్టితబ్బిబ్బులు జరుగుచున్నందున తమ్ముఁడును వానిసేవకుఁడును తనదేశమునకు వచ్చినారా యని రాజు ఊహింపవలసియున్నది. అదితోఁచక మఠాధికారిణిని సభకుఁబిలిపించినాఁడా రాజు. తమ్ముని తోడను, వానిసేవకునితోడను మఠాధికారిణి రాజసభ ప్రవేశించినపుడే విషయము తెల్లమగుచున్నది. ఇక్కడనుండి నాటకముమఱియు నసహజముగనున్నది. తండ్రి తనభార్యను గుర్తించియు పెద్దకొమరుఁడేడీయని యూమెనడుగుట బుద్ధిలేనిమాటయైయున్నది. పెద్దకుమారుఁడు, వానిసేవకుఁడు తల్లినుండి వేఱయిరి అనిచెప్పుట క్రీప్రసంగమును కవి తెచ్చిపెట్టినాఁడు. రాజున కిప్పటికి సంగతిబోధపడినది. ఇంతతోనైన నాటకమాపుచేయఁబడలేదు. ఇంటభుజించినదెవరని గృహిణియడుగుట, 'నే న'ని తమ్ముఁడు బదులుపలుకుట, అదిగో గొలుసని కంసాలిపలుకుట, సొమ్ముపంపితినని గృహిణిపలుకుట, అదినాకు చేరినదని తమ్ముఁడనుట,. ఆటువైవ్రాయఁబడినసంగతులు అనవసరప్రసంగములై అభిప్రాయశూన్యములైయున్నవి. ఈనాటకములో నడివీధిని గృహిణివచించినపలుకులు మిక్కిలి విరసములుగనున్నవి. అన్నిటికన్న నసందర్భమైనది 'నేనిద్దఱుమగలను జూచుచున్నాను' అని గృహిణిపలికినవచనము. 'ఇందునానాథుఁడెవరు' అని వితర్కించెదరే కాని మనోనాథుని గూర్చి యిట్లేగృహిణియుఁ బలుకఁజాలదు.

## కళాపూర్ణోదయము.

మణికంధరునితపంబు విష్ణు మెచ్చరింప నింద్రునానతిని రంభవచ్చి కార్యసాఫల్యమందినది. సంభోగసుఖపారవశ్యమున 'నలకూబర, విడువిడురా' అని రంభ అన్యనాథునిఁ బేర్కొనుటను విని మణికంధరుఁడు చిఱ్ఱుబుఱ్ఱుమనియెను. అందుచే వాఁడు తాఁజేసిన తపంబువెచ్చించి నలకూబరరూపముంధరించివచ్చి రంభంగూడి తనియించుచుండెను. ఆసమయములోఁ గలభాషిణి నొకఁడు మన్మథార్తుఁడై బాధించుచుండఁగా మానసంరక్షణార్థ మామె కేకవేసినది. అదివిని నలకూబరరూపముననున్న మణికంధరుఁ డామెను సంరక్షింపవచ్చెను. లోగడ నారదుఁడను గ్రహించిన వరంబుకతంబునఁ జిరకాలకాంక్షితంబైన మనోరథంబు పరిపూర్ణంబుగావించుకొన నెంచియున్న కలభాషిణి రంభరూపముంధరించి నలకూబరుఁడేయను నుద్దేశమున నామాయానలకూబరుని గూడి రతిసుఖమనుభవించినది. అప్పుడు సత్యరంభ అచ్చోటకువచ్చెను. మాయానలకూబరుఁ డాశ్చర్యమొంది ఆయుభయులను దిలకించుచుండెను. సత్యరంభ నట్లు వాఁడుదిలకించుటకు సహింపనిదై మాయారంభ 'ఇదిమాయలాఁడి, వున నెడఁజేయుము. లోగడనిట్లేఅసురకాంతవలన సీతకు శ్రీరాముని

లేదు. కావుననే సూరనకు భావనాశక్తి పరిపూర్ణము కాలేదన్నారు

వియోగము దటస్థించినది. 'అని పలుకుచు వానికంఠమును గౌఁగిలించుకొని అచ్చోటు వాసిపోవుటకు వానిఁద్వర పెట్టినది. మాయానలకూబరుఁడును 'రక్కసివా, పిశాచివా నీవు' అని సత్యరంభంగూర్చి పలికెను. స్త్రీరక్షణార్థము వాఁడు తన్నువిడిచివచ్చినసంగతిని సాంకేతికముగా యథార్థరంభపలుకఁగా 'నిది మాయలాఁడి, మనచరిత్రమును దిలకించి మోసమొనర్ప నెంచుచున్నది' అని పలికి మాయారంభ నేర్పుమై విషమపరిస్థితిని తప్పించుకొన్నది. 'తుచ్ఛకుము, నన్నీతఁడు చంపినను చంపనిమ్ము. నాప్రాణాచిరియైన వలపులపంటను నీకై దిగవిడిచిపోయెదనే. నావల్లభునిగౌఁగిలించియున్న నిన్నుఁజూచి సహింపఁజాలను'అని సత్యరంభ కోపగించుకొన్నది. అంత నిరువురురంభలకు వాగ్యుద్ధము ప్రారంభమైనది. పిమ్మట నారదుఁ డచ్చటకు వచ్చెను. ఒకభావమున సత్యరంభ గుఱుతునొకటి చెప్పఁగా మాయారంభయు వేఱొకభావమున నదేగుఱుతువాకొనెను. నారదుఁ డవిరెండును యథార్థములే యని పలికి వెడలిపోయెను. 'నీవు నిక్కంపురంభవగుదేని నిదర్శనము దెచ్చికొమ్ము' అని మాయానలకూబరుఁడును 'వధూవరులేకతంబుననుండ నిట్లుసిగ్గువిడిచి రావచ్చునా' అని మాయారంభయుఁ బలికిరి. 'దేవసభకురమ్ము, యథార్థమువ్యక్తమగును' అనుచు సత్యరంభ మాయారంభఁ గొంగుపట్టి లాగినది. 'నిన్ను గణింపక భయమువిడిచి ఈద్రిమ్మరిరక్కసి యేమిచేయుచున్నదో చూడుము'అని మాయారంభ పలుకఁగా'అయిన నేమి, దేవసభలోనే దీనికిఁదగిన ప్రతిక్రియఁ జేయుదము' అని మాయానలకూబరుఁడు పలికెను. 'తిరుగఁబడి నను విడుచుదాననుకాను, దేవసభకు రమ్ము' అని సత్యరంభపలికినది. 'గొప్పగా బ్రతికినదానను, సరివారిలో నగుపాట్లు, ఈపిశాచిని సరిచేసికొని దేవసభకుఁ బోఁజాలను. ఎట్లయినఁ గానిమ్ము, భూమిమీఁద నేయుండెదను' అని మాయారంభ పలికినది. 'ఈనేర్పు చూచితివా, తనగుట్టు బయల్పడునని నాకగమనంబు పరిహరించుచున్నది. నేలవిడువనని నీపైనాన పెట్టుటఁజూడ ఖేచరత్వంబుకలిమియు సందియంబు' అని సత్యరంభ పలుకగా నదివివేకమార్గంబయగునని నలకూబరుండు తలఁచి తద్వాక్యంబులకు నిరుత్తరయైయున్న మాయారంభను మెడఁబట్టి ద్రోసెను. ఆకపటితో మఱిమాటాడనీయక వానిని సత్యరంభ మరల్చుకొనిరాఁగా నారంభను వాఁడోదార్చుచుండెను.

ఇంతలో సత్యనలకూబరుఁ డక్కడకువచ్చి 'ఎవఁడా దురాత్ముఁడు.నారూపుధరించి నాప్రియురాలను మోసగించుచున్నాఁడు' అని పలికెను. 'నీరూపుధరించుటయేగాక నీవే కపటివని ఈరక్కసుఁడు వల్కుచున్నాఁడు. వీఁడెవఁడో తెలియునట్టి యుక్తినిఁజెప్పుము' అని రంభ పలికినది. అదివిని సత్యనలకూబరుఁడు సహింపనివాఁడై 'నామాటలు నమ్మఁజాల

కాఁబోలు రెడ్డిగారు. భర్తకన్న భార్య చిన్నదిగా నుండవలయు ననుఅభి

---

చేని మాయుభయులకు దూరముగ నుండుము. వీనిఖండించివచ్చెద. పిదప నన్ను నీయిచ్చవచ్చినట్లు పరిశోధింపుము.' అనిపలికెను. రంభ భయపడి కపటనలకూబరునిఁ గౌఁగిలించుకొని 'ఓవిబుధులారా, నిరాయుధుఁడైయున్న నావల్లభుని నీ దనుజుండు చంపనున్నాఁడు. రక్షింపుఁడు' అనికేకలిడెను. 'నన్నే దనుజునిగాఁ దలంచితివా. నేను నిరాయుధునిఁ జంపువాఁడను గాను. వాఁడే నిక్కంపు నలకూబరుఁడని నీకు సంశయమున్నను, యుద్ధములో జయాపజయంబుల నిశ్చయంబులుగాన ననిష్టమొకవేళ నేర్పడునేమో యనుసంశయము నీకున్నను నేను యుద్ధమొనర్పను. ఓర్చుకొనియుండెదను. పూర్వరహస్యములనడిగి ఉచితముగ మాయందలి యథార్థమును గుర్తింపుము. నాయెదుటన వానిగౌఁగిలింపకుము. ఇది తేలువఱకు దూరముననుండుము.' అని సత్యనలకూబరుఁడు పలికెను. విభునిఁగాచికొనుట కదియేబాగున్నదని తలఁచి రంభ దూరమేగి ఇరువురను బరీక్షింపఁ జొచ్చెను. 'ఇంద్రునానతి మణికంధరునిఁ దపోవిఘ్నమాచరింపవచ్చిన నీవు కార్యము ముగించుకొని ఎంతవేగమరుదెంతువోయని వేచుకొని యుండఁగా నాకీ సంగతిని నారదుఁడెఱిఁగించెను. వీఁడెట్లు నిన్నులంకించుకొనియెను. అని సత్యనలకూబరుఁడు పలికెను. రంభ ఆశ్చర్యమొంది కపటనలకూబరు నీక్షింపఁగా వాఁడు "ఏమట్లుచూచెదవు. నినుబోలువనిత నీకును, నన్నుబోలువాఁడు నాకును సంభవించి మనలను గలంచెదరని ఆదేవమునియే పలికియున్నాఁడు గదా. అది వృథపోవునా. వీని నిప్పుడే దునిమెదను' అనిపలికి కత్తి తెచ్చుకొనుటకుఁ బోఁబోవ సత్యనలకూబరుఁ డాయుధంబువిడిచి వానిపైఁ దలపడెను. ఇద్దఱును ఘోరముగాఁబోరి అలసియెడగా నిలిచిరి. వారినిఁజూచి 'నేనొకప్రాక్తనవర్తనము(రహస్యము)నడిగెదను. దానికి సమాధానమిండు.' అనిపలికి "తొల్లి కళాపూర్ణుండనువాని ప్రసంగ మెచ్చటగలిగెఁ దత్ప్రకారంబేమి నీవు వింటివి' అని యిరువురనడిగెను. అందుకు సత్యనలకూబరుఁడు మాత్రమే సదుత్తరంబిచ్చెను. రెండవవాఁడు వెలవెలబొఱుచు నూరకుండెను. అదిచూచి రంభ సత్యనలకూబరునిఁ జేరెను. సత్యనలకూబరుఁడు రంభను మఱి వానితో మాటాడనీయలేదు. రంభరూపునఁ దానుండునపుడు తన్నుఁగూడినది మాయానలకూబరుండని విని కలభాషిణి ఆకపటాత్ముఁ డెవ్వఁడోకదా' అని పలుకఁగా "నేనే" నని మణికంధరుఁడు బదులు పలికెను.

రంభ లిరువురు (స్త్రీలు) వాగ్యుద్ధముతో సరిపుచ్చిరి. నలకూబరు లిద్దఱు (పురుషులు) చేతులు కలిపిరి. స్త్రీపురుషస్వభావములను గవి యిచ్చటఁ జిత్రించినాఁడు. రంభం గూర్చి 'నినుబోలువనిత నీకుగలుగును.' అని నారదుఁడు పలికినది కలభాషిణికి మణికంధరునకుఁగూడ తెలిసియున్నది. ఇరువురురంభలు దటస్థించినసందర్భములో నారదవాక్య

ప్రాయము మనసునఁ బెట్టుకొనియే సూరన కలభాషిణికి మఱిరెండేండ్లు ఆయువునిప్పించినాఁడు. అదిగాక కళాపూర్ణుఁడు పుట్టినపిమ్మట మధుర లాలసపుట్టునని యిట్లుచెప్పఁబడియున్నది. మదాశయుఁడు గర్వోద్ధతుఁడై స్వభావనామసిద్ధునిఁ జేరినపుడు ఆతఁడు 'మణికంధరుఁడు కళాపూర్ణుఁడై పుట్టినఁబిమ్మట ఆతనికి సేవచేయుట మీకు తప్పదు' అనిశపించెను. మఱియు 'కళాపూర్ణునొద్దనున్న మణిశలాకమహత్వంబున మీకు (మదాశయునకు) తనయ (మధురలాలస) గలుగును' (కళా ౫-౨౧౭) అని చెప్పఁబడినది. మఱియుఁ గళాపూర్ణోదయప్రబంధమునకు మూలభూతకథయగు సరస్వతీశృంగారప్రణయకోపకథలో నిట్టియంశము స్పష్టముచేయఁబడినది.

---

ప్రశంసగల్గినది. అప్పుడు రంభరూపమునన్నది కలభాషిణియని మాయానలకూబరుఁడు గ్రహించుటకు వీలుగలదు. మాయానలకూబరుని కాముకునిగనొనర్చి కవి యీభావమును మఱుఁగుపఱచినాఁడు. సొబగుకూర్చినాఁడు. ఆరెండవది మాయధారియని సత్యరంభ తేల్చినందున మాయానలకూబరుఁ డారెండవదానిని విడువవలసివచ్చినది. తపోభంగ మొంది కాముకుఁడై యున్నవాని కేరంభయైననేమియనునది కవి యిచటఁ జిత్రించినాఁడు.మణికంధరుఁడు నలకూబరరూపమున సత్యరంభ నదివఱ కనుభవించియున్నాఁడు. కావున నే సత్యనలకూబరుఁడు గనఁబడినపుడుగూడ రంభ మాయానలకూబరునికంఠమును గౌఁగిలించుకొనెను" అని కవి వ్రాసియున్నాఁడు. ప్రియరక్షణార్థము రంభ దేవతలను బ్రార్థించినది. ఆరంభ నలకూబరుని మనసారఁ బ్రేమించియున్నది. రంభ పైవాని నట్లాలింగనమొనరించుకొని యుండుటను సత్యనలకూబరుఁడు సహించలేదు. యథార్థము తేటపడువఱకు నెడగానుండుమని పలికినాఁడు. కవి యిక్కడనుండి రంభ నిరువురకు దూరముగ నిలఁబెట్టినాఁడు. రంభ నేర్పుఁజూపి మాయారంభను గెంటించినది. తపము మెచ్చించుకొని రూపమున, స్వరమున, అన్నిట నలకూబరసమత్వమును సంపాదించిన మణికంధరునియొక్క మాయదారితనమును రంభ నేర్పుమై దెలిసికొనినది. నలకూబరాకారుని నసహ్యించుకొనినది. అన్యవాంఛయందలి చెడుగు, నిక్కపుప్రేమయందలి నిర్మలత్వము, మహాత్ములయెదుట సక్రమముగ మెలంగనిదానికి ప్రతిఫలము, మహాత్ముల యొక్క ఉదారమైన కనికరము కవి యీస్థలమందు సువ్యక్తము సేసియున్నాఁడు.

షేక్స్పియర్ 'కామెడీ ఆఫ్ ఎర్రర్సు' కేవలము వినోదార్థమే వ్రాసియున్నాఁడు. సంభవాసంభవముల నాతఁడు పరిగణింప నెంచుకొనలేదు. పింగళిసూరన్న కళాపూర్ణోదయమును వినోదముకొఱకుమాత్రమే రచించలేదు. లోకాతీతవిషయముం గొన్ని లోకరీతి నందు వ్యక్తముచేసియున్నాఁడు.

"మదాశయుండు రూపానుభూతిసహితుండై యాకళాపూర్ణునకు సేవఁ జేయుచుఁ దన్మణిశిలాకమహత్త్వంబున మధురలాలసయను తనయం గాంచెను" (కళా ౫-౮౦) అని చెప్పఁబడినది. ఈవిషయమంతయు రెడ్డి గారు పరికించలేదు.

"ఇట్టి యుద్గ్రంథమునఁ గల్పనాభంగములుండుట చింతనీయము! కృష్ణుని భార్యలయొద్ద కలభాషిణీ నారదులు గానవిద్య నేర్చికొనుటకై కడపినకాలము నాలుగేండ్లు. మణికంధరుఁ డంతఃపురములోనికిఁ బోఁగూడదనియేమో వానికిఁ బ్రయాస మావంతయు లేకయ 'పుండరీకాక్షుని యనుగ్రహవిశేషంబున సకలరహస్యసంగతవిద్యాసంపన్నతచేత నారదకలభాషిణులయట్లు యత్యధికుండవు', భాగ్యము లభించినది! ఈయనుగ్రహవిశేషముం బ్రయోగించి వారికిని సద్యఃకాలమహానీయత ఘటించి కలభాషిణివిరహకాలమును మట్టుచేసియుండరాదా? కృష్ణకాంతలశిక్షయు ననావశ్యకమాయె. దానితోఁ గల్పనయు న్యూనమాయె' (౨౬౭) అని వ్రాసిరి. మణికంధరుఁడు నారదునిశిష్యుఁడు. తాను (నారదుఁడు) నేర్చుచున్నది శిష్యునకుఁ జెప్పుచుండెనని తలంపవచ్చునుకదా. నారదకలభాషిణులకు జాంబవతి, సత్యభామ, రుక్మిణివరుసగా మూఁడేండ్లు గానవిద్యను జెప్పిరి. నారదుఁడదివఱకే సంగీతములో గొప్ప నేర్పుగలవాఁడుకదా. అట్టినారదునకు సంగీతమందలి మెలఁకువలను నాముగ్గురు బోధించిరి. ఇంక మణికంధరుఁడో గానవిద్య ఉగ్గుపాలతోవచ్చు గంధర్వజాతివాఁడు. అందున నారదునిశిష్యుఁడు. కావునఁ గృష్ణకాంతలవద్ద గురువు నేర్చినది తానును దెలిసికొనుచు మణికంధరుండుగూడ ప్రాజ్ఞుఁడగుచువచ్చెను. నాల్గవయేఁట శ్రీకృష్ణుఁడే స్వయముగా ముగ్గురకును (నారదకలభాషిణీమణికంధరులకు) గానవిద్య చెప్పెను.

క. అమ్మువురకు గానము హరి, యిమ్మెయినఖిలంబు నేర్ప యిఁక మీసంగీ
తమ్మునకు నీడు లేదు జ, గమ్ములనని పలికి మోదగరిమందేల్చెన్. (కళా ౨-౩౭)

అని చెప్పఁబడినది. కృష్ణకాంతలవలన శిక్షలేకుండినను మణికంధరుఁడు శ్రీకృష్ణానుగ్రహవిశేషమునఁ బ్రాజ్ఞుఁడైనాఁడు. నాల్గవయేఁట శ్రీకృష్ణుఁడే ముగ్గురకును గానవిద్య నేర్పెను. అదిగాక కృష్ణభార్యలవలనఁ గలభాషిణి (కథానాయిక) కృష్ణునివలన మణికంధరుఁడు (కథా

నాయకుఁడు) ప్రాజ్ఞులెరి అను ఇంకొక్క విశేష మిందు వ్యక్తమగుచున్నది కదా. ఇది కల్పనాదోషమన్నారు రెడ్డిగారు.

"(కళాపూర్ణోదయములో) షష్ఠాశ్వాసము తుద మొదలు క్షమార్హములుగాని దోషములు దట్టముగనుండుటచేత, వీనిచింతయావశ్యకము...(కళాపూర్ణున) కీవఅకే యభినవకౌముది భార్యయాయెను. మధురలాలస తాను గళాపూర్ణుని భార్యయగుటకై యవతరించినదని తెలిపెఁగావున.

క. ఆమధురలాల సాకథ, లేమియు శుద్ధాంతమునకు నేగకయుండర్
భూమిపతియడఁచె నభినవ, కౌముది విననేలయనుచు ఘనయత్నముతోన్.

(కళా ౬-౧౯౦)

ఇది హాస్యమా ? ప్రయోజకమా ? ఎట్లును అభినవకౌముది కోపతాపములు లేక ద్వితీయవివాహమునకు సమ్మతించుచున్నదిగావున నీజాగ్రత్తయేమియుఁ బనికిరాదు!" (౨౬౮) అని వ్రాసిరి. సవతిపుట్టినది అని అప్పటినుండియు నభినవకౌముది కెందుకు తెలియవలయును అని కళాపూర్ణుఁడావర్తమానము నణంచెను. అభినవకౌముదియం దాతనికున్న ప్రేమను ఇది వ్యక్తముచేయుచున్నది. మాసములపిల్లయగు మధురలాలసకు యౌవనము వచ్చినప్పటిస్థితి ద్వితీయవివాహము. అభినవకౌముది అప్పుడు సమ్మతించునో లేదో అది యీనాఁ డెట్లు నిర్ధారణయగును. ఇప్పుడే తెలియనిచ్చుట అనవసరమగుకలతకుఁ గారణముగ నేర్పడవచ్చును. అభినవకౌముది ఇందుకు సమ్మతించునని కవికిని కవివలన రెడ్డిగారికిని తెలిసినదిగాని కళాపూర్ణునకుఁ దత్కాలములోఁ దెలియదుకదా. అభినవకౌముదికితెలిసి ప్రయోజనము లేదుగావున కళాపూర్ణుఁడు తెలుపనెంచుకొనలేదు.

"ఇఁక నింతలోఁ గళాపూర్ణుఁడును అభినవకౌముదీ విహారములచేతను రాజకార్యములచేతను మధురలాలసను మరచినాడఁట! అన్నియద్భుతముల శిశుప్రాయముననచెప్పినదానిని, సమీపమున సామంతునింటఁ బెరుగుదానిని మఱచుటయఁట! ఈమఱపునకుఁ గారణము కళాపూర్ణునియొక్క బుద్ధిహీనతగాదు, మఱి కవియొక్క! ఈమ

అపురానిచో శాస్త్రీయమగుహాయలున కవకాశముండదు. అలంకార క్రమములు వేయకుండినఁగావ్యము చెడునను భ్రమచేత రాజునకు భ్రమఁ బెట్టినాఁడు! ఈచిత్తశోష రాజునదిగాదు. శాస్త్రవిధేయతంబూనిన కవిది.” (౨౬౯, ౨౭౦) అని వ్రాసిరి. శిశుప్రాయముననున్న మధురలాలస దివ్యమణిహారధారణమహాత్వమున ననేకాద్భుతవిషయములను దెల్పినదని అప్పటిలో నెవ్వరికినిఁ దెలియదు. అది దైవావేశమని యందఱును నమ్మిరి.

శా. ఆవాక్ప్రౌఢిము నాసుబోధముఁ దిరంబై యుబ్కియట్లబ్బు దై
వావేశం బపుడెద్దియో తదతిమాహాత్మ్యంబు రప్పించెఁగా
కావేశంబెలియంగ లేమ తగసంప్రార్థించి తద్దివ్యబో
ధావిర్భావనిధానముం గటకటాయంచుండె నుర్వీశుఁడున్. (కళా ౩-౧౮౫)

వెంటనే మధురలాలస మామూలు శిశువై పోయినది. అది మొదలు ఎన్నఁడును ఎట్టివిశేషముగాని ఆమధురలాలసయందుఁ బుట్ట లేదు. కళాపూర్ణుఁడు మధురలాలసనుశిశువుగానున్నప్పుడే చూచెనుగాని యౌవనమున నున్నదానిని జూడలేదు. అదిగాక తనకొఱకై వేచియుండి వరించినదియు, పతివ్రతయు, యౌవనవతియు, రూపవతియునగు అభినవకౌముదియం దిష్టవిహారములఁదేలికళాపూర్ణుఁడానందించుచుండెను. అన్ని అద్భుతములనుజెప్పిన మధురలాలస వృత్తాంతము అభినవకౌముదికిఁ దెలియనీయకుండుటలోఁ గళాపూర్ణున కభినవకౌముదియందున్న అగణ్యమైనప్రేమ వ్యక్తమగుచున్నది. మఱియుఁ గళాపూర్ణుఁడు జగదేకసార్వభౌముఁడు. నిరంతర రాజకార్యనిమగ్నమానసుఁడు. కావున నాతఁడు మధురలాలసను మఱచుటలో వింతలేదు. ఈ మఱపునుగూర్చి మఱియు రెడ్డిగా రిట్లు వ్రాసిరి. “ప్రియురాలిని దుష్యంతుఁడు మఱచినట్లు కాళిదాసుఁడు వర్ణించినరీతితోఁ గళాపూర్ణుని మఱపుకథను బోల్చిచూచిన, నీసందర్భమున సూరన్నకవిత్వమెంత శుష్కించినదో తెలియును” (౨౭౭) అని వ్రాసిరి. ఉద్యానవనములో మధురలాలసను గాంచివచ్చిన కళాపూర్ణుఁడు నర్మసచివునితో నిట్లు చెప్పుచున్నాఁడు.

ఉ. ఆనలినాక్షి కన్నెగతి నప్పుడు దోఁచె మదీయదృష్టికిన్
దాని తెఱంగు నీవెఱిఁగినన్ వినిపింపు మెఱుంగకున్న నీ
చేనయిన ట్లిఁకం దెలిసి చెప్పుము................ (కళా. 2-౧౫)

ఆపె మదాశయుపుత్రి మధురలాలస యని ఆతఁడు చెప్పఁగా

చ. అనుటయు నెట్టిటూ తెలుపవయ్య మహాత్మక యేల నేనె ది
ట్లనయము నింపుసొంపెసఁగ నప్పెయినాపువుఁదోఁట నేనుగ
న్గొనినదియా మదాశయతనూభవయే యది యింత వేగిరం
బున నె మనోజ్ఞయౌవనముఁబూనెనె యద్భుతమెన్న నాపుడున్. (కళా 2-3౨)

అని కళాపూర్ణుఁడు పల్కినాఁడు. అభినవకౌముదీవిహారవిశేషమున నితరాపేక్ష లేకుండెను. అట్టికళాపూర్ణుఁడు మధురలాలసను ప్రేమించెను అనుటలో మధురలాలసాసౌందర్యగరిమను గవి ధ్వనింపఁజేసెను. మఱపునకుఁ గారణముఁజూపెను. కళాపూర్ణున కంతకుముందు మధురలాలసయందు తలంపు లేదనియుఁ గవి స్పష్టపఱచెను. మఱపనఁగా నిదియే భావము. అది ఇంత వేగముగ యౌవనవతియైనదా అని చెప్పించి అభినవకౌముదీవిహారవిశేషమునకు స్వారస్యమును గూర్చెను.

"మధురలాలసకో యుద్రేకము బలమైనది...... మొగము తెల్లబాఱినది. ఉండు కొంచెముమతియుఁబోయినది 'ఒక తెఁబిల్వఁబోయి మఱియొక్క తెఁ బేరొక్కనిపిల్చు' నఁట! ఒక్కెడ కేగఁజూచి మఱియొక్కెడ కేగు'నఁట! భోజనశాలకుఁ బోవుదమనిలేచి పెరటితట్టునకు మఱచినట్లు వెళ్లునేమో! పురుషునితో మాటలాడియుండకపోయినను.

సీ. ఏమి కన్నులఁగన్న హృదయేశురూపంబు దోఁపక యదిమున్నుదోఁపకుండె
నేమివీనులవిన్న హృదయేశుమధురోక్తి దోఁపక యదిమున్ను దోఁపకుండె.
(కళా ౬-౨౧౪)

ఈగారిడీతంత్రము అమానుషము! పైశాచికముగావచ్చును! ఇట్లనేక విధంబుల రేవగలను జాగ్రత్సుషుప్తులఁ గామవికారముల నాచారమురీతిఁ బ్రకటింపఁజొచ్చినఁ జెలిక త్తెలు వెఱఁగంది మామూలువిచారణలకు ప్రారంభించిరి. ఈచెలికత్తెలవిషయమై నాకొక సందేహము! యజమానురాలియుడుకుఁ బొడఁగనువేళలఁ దమకుఁ గొంత కాఁకయొక్కడాయేమి? వీరి

కష్టము నరయుకవులులేరుగా! వారు ప్రతిక్రియఁజేయుటకై శుద్ధముగ నుపయోగములేని చికిత్సయని ప్రబంధములవలనదెలిసిఁ యుండియు నా మెనుద్యానవనమునకుం దోడ్కొనిపోయిరి' (౨౭౦, ౨౭౧) అని వ్రాసిరి. సదాధ్యానమువలన మఱచుట, ఒకచోటునకుఁ బోవనెంచి వేఱొకచోటికిఁ బోవుట, భ్రమించుట ఇట్టివి గలుగును. ప్రహ్లాదుఁడు అడుగడుగునకు దేహమందు మఱపునొందుచుండెడివాఁడు. రెడ్డిగారింకను నిట్లు వ్రాసిరి.

'సుగాత్రి యేమిచేయును? (ఎంత ప్రయత్నించినను శాలీనుఁడాదరణఁ జూపలేదు.) రాజకుమారిగా నుండినచోఁ జందనాదులఁ బట్టించుకొని చిగురుటాకుఁబాన్పుపై హాయిగా మూర్ఛపోయియుండును! పూజారిబిడ్డ. శాస్త్రప్రకారము శృంగారమనుపథ్యము దప్పకసేవించి ప్రకటింపవలయునన్న నుద్యానవనముండవలెను. శీతలోపచారములకు సేవకు రాండ్రుండవలయును. సరస్సులుండవలయును. మఱియు పచ్చకర్పూరము, పునుగు, జవాది, అరఁటిబొందెలు, చందనము మొదలగుసంబారములులేనిది శాస్త్రోక్తముగాఁ గామము నావాహనచేయనగునా? అట్టి నీటులు ధనికులకేగాని సామాన్యులకుఁ జెల్లదు. ప్రబంధములలోని మోహము మాత్రము నిక్కమైనయెడల, రాజులయిండ్లలోనేగాని యింకెక్కడను రతిమన్మథులు వాసముచేయరని చెప్పవచ్చును! సుగాత్రికీదిగఁదీపులెవ్వియుఁ బట్టలేదు' (౨౨౮, ౨౨౯) అని వ్రాసిరి. కన్నకుమారుఁడు ఘోరముగా మృతినొందినను ఆదుఃఖమును దిగమ్రింగి కూలి వాఁడు కూలికై వచ్చును రాక తప్పదు. రాకున్న వానికి కడుపు (యాత్ర)జరుగదు. మహావైభవోపేతులకో కడవఱకువిరక్తియేగలుగును. ఐశ్వర్యమెచ్చినకొలఁది అవస్థలలో విశేషములుండును. అది లోకస్వభావము. మఱియు రెడ్డిగారిట్లు వ్రాసిరి. 'ఈయమ్మ (మధురలాలసయొక్క) దౌర్భాగ్యపువిరాళిని కలభాషిణియొక్క యుదారచరితంబుతోనుపమించి చూడుఁడు! (౨౭౮) అని వ్రాసిరి. ఉత్తములకుగాని, నీచులకుగాని ఎవరికైనను విషయవాంఛ యుండకతప్పదు. విషయవాంఛయే ప్రబలముగాఁగలనీచులు ఆటంకము గలిగిగాని మఱెందువలనఁగాని అన్యులను వాంఛింపెదరు. ఉదారగుణవంతులు ఓర్చి ప్రేమమూర్తికై హృద

యముధారవోసియుందురు. ఈవ్యత్యాసమునే కవి కలభాషిణీమధురలాలసలందుఁ గనఁబఱచియున్నాఁడు. రెడ్డిగారిట్లు వ్రాసియున్నారు. 'నిశ్చలమైన మోహముగలవారు కాలమునోర్చుటకు శక్తులగుదురు. ప్రబంధస్త్రీపురుషులయొక్క తహతహలు తొట్రుపాటులును తఱుచు చాంచల్యభావులకుఁ జేరినవి. గొప్పవారు మనసులుగలసినఁజాలునని కాయసాయుజ్యముచిరమునఁగాని లభింపకపోయినను ఓర్పుతోనుందురు. అంగసుఖము నభిలషించుతుచ్ఛులకు సంభ్రమముసహజము. దమనుమొదలగు నుదారగుణములుండవు' (౨౧౬, ౨౧౭) అని వ్రాసిరి. అంగసుఖమునభిలషింపని మోహముండునా? ఉండదు. ఉత్తములు ఆశగల్గినపుడు వాంఛింతురు. లేనపుడు వాంఛవిడిచి ప్రేమగలిగియుందురు. బహుశ ఐరోపావారు కాయసుఖము నపేక్షింపని మనసులుగలవారేమొ! కావచ్చును. భార్యాభర్తలు కలియుట వారిలో బహుకష్టముగనుండునేమొ! ఇద్దఱకును పనులు జాస్తికదా! కావుననే విషయవాంఛకై తొట్రుపడక మనసులు కలిపి వారన్యత్ర సంచరించెదరేమొ! నీచులు ఆశగల్గినపుడు వాంఛింతురు. అదికొనసాగనపుడన్యవాంఛ గల్గియుందురు. ఇందులకు నిదర్శనము కలభాషిణియే అంతకన్న ప్రబలనిదర్శనము పాశ్చాత్యదేశములు. ప్రబంధస్త్రీపురుషులయొక్క ఉత్తమగుణమెచ్చటనున్నదో రెడ్డిగారికిఁ దెలియలేదని ఇందువలన స్పష్టమయినది. 'శుద్ధముగా నుపయోగములేని చికిత్సయని ప్రబంధమువలనఁ దెలిసియుండియుఁ జెలికత్తెలు మధురలాలసనుద్యానవనమునకుఁదోడ్కొనిపోయిరి' అని రెడ్డిగారాక్షేపించిరి. రాజకన్యలమోహము నిరర్థకమైనది. అని ముందు కాలముననాక్షేపణలువచ్చుననియే మహారాజులు రాజ్యములను ఉద్యానవనవైభవములను విడిచిరా! రెడ్డిగారాలోచింపవలయును. ఇట్లాక్షేపించిరిగాని ఒక్కవిషయమును వారాలోచింపలేదు. మోహము దుర్భరమగుట, అప్పుడు ఉద్యానవనప్రవేశము. అందు మఱింత భావోద్రేకమగుటఅయి అచిర కాలముననే జవ్వనికి మనోరథసిద్ధి అగుచున్నటుల ప్రబంధములవలన నాచెలికత్తెలు తెలిసికొనిరేమోయని రెడ్డిగారాలోచించ లేదుకదా! యథార్థమేమనఁగా ఆటపాటలలోఁ గొంతకాలక్షేపము జరిగించిన ఉద్రేకము తగ్గునని చెలికత్తెలామెనుద్యానవనమునకుఁ గొనిపోయిరి. ఉద్యాన

వనసందర్శనమున మోహము మఱింతవిజృంభించిన దామెకు. అదిసహజము. ఓదార్చినకొలఁది పిల్లలేడ్చెదరు. ఓదార్చినయెడలఁ దల్లి పిల్లలకై దుఃఖించును. కాని ఆసాధనమే కార్యసాధనమైయొప్పును. కావుననే మధురలాలసను సఖు లుద్యానవనమునకుఁ గొనిపోయిరి. కవి యిట్లువ్రాసియేయున్నాఁడు. 'భావజుబారిఁబడి మిగులబడలిన (మధురలాలస) భావంబును మఱపింపంగావలయును వనవిహారకలనలచేతన్.' (కళా ౬-౨౨౨) అని చెలికత్తెలామె నుద్యానవనమునకుఁ గొనిపోయిరి.

'(జలక్రీడలాడిన మధురలాలసయుఁ జెలికత్తెలును) నవీనవస్త్రాభరణగంధమాల్యంబుల నలంకృత లగుట కీభారమగువస్తుసామగ్రి నెవరు మోచికొని తెచ్చి సిద్ధముగానిడి పోయిరో పత్తాలేదు. (౨౭౧) శైత్యోపచారప్రారంభము.

సీ. విరిదమ్మితావుల వెదచల్లుకొలనిచెంగటఁ గమ్మ పన్నీటికాలువలును
గడునివతాళించు కప్రంపుటరఁటుల యిరవులఁబూవు జప్పరముఁబన్ని
పట్టివ్రేళ్లను దడిగట్టిశ్రీగంధంపు టసలునమెత్తి తదంతరమునఁ
గర్పూరవేదికఁగావించి చల్లని చెంగల్వరేకుల సెజ్జదీర్చి
గీ. చిలుకుతేనియతోడి గొజ్జెంగిపూవుఁ, దలగడయమర్చి యందు నాజెలువనునిచి
జగతిఁగల సర్వశైత్యోపచారవిధులు, సలిపి రందును గడఁగానకలసిరంత.

(కళా. ౬-౨౪౧.)

ఈపద్యములోనివిశేషములఁ దలఁచుకొన్న నాకు గుండియలదరుచున్నవి! అబలలు, పూఁబోండ్లు, కోమలాంగులు అనఁబడుసఖీజనములు, గున్నయేనుఁగులవంటి యిరువదిమంది కూలివాండ్రుచేయుటకన్న నెక్కువపనిని ఇంత త్వరలో నేలాగునఁజేసి ముగించిరి! కార్యమెంతసేపు పట్టెను? అదివఱకు నంగనామణి సొలసియే యుండెనా? లేదా, శాస్త్రప్రకారము మంచిలగ్నము చూచి యీవేళకు నామె మూర్ఛపోవునని యెఱింగి యాక్రియలన్నియు ముందునాఁడే తయారుచేసి యెదురుచూచుచుండిరా? నాకుంజూడ నిట్టిపద్యములు కవులు తొలుతనేవ్రాసిపెట్టి పిమ్మట నదియేకథయైననేమి, యక్కడక్కడఁ దూర్చిపెట్టుదురేమో! (౨౭3,౨౭౪) అనియు వ్రాసిరి. చక్రవర్తుల యిండ్లలోఁ గార్యములునెఱవేఱుట కెంతకావలయును. ఆయనిన అఱువదిమంది సిద్ధముగానుందురు,

అదిగాక మధురలాలస మన్మథావస్థలో నున్నట్లు చెలికత్తెలు మొదటనే తెలిసికొనిరి. కథాభాగమునకు సంబంధించిలేదనియు, భావనాశక్తిమై వ్రాసినది కాదనియుందలచి రెడ్డిగారు వ్రాసిన ఆక్షేపణలలో నిదియొకటి. '(ఉద్యాన విహారము జరుగుచుండఁగా) రాజుగారు తటుక్కునవచ్చిరి. ఇఁక రాకున్న వారి కీకన్నె జ్ఞప్తికి వచ్చు టెట్లు?' (౨౭౧) అనివ్రాసిరి. రాజు అచ్చోటు నకు వచ్చుటకుఁ గలకారణము కవి యిట్లు చూపియున్నాఁడు.

ఉ. వర్ణనపాత్రచిత్రగుణవైభవశోభితుఁ డత్తఱిం గళా
పూర్ణుఁడు డేగవేఁటతమి పూన్పునవచ్చిముదంబునం దద
భ్యర్ణ మహిం జరించు చొకపక్షికిఁబాఱినడేగఁ బిల్చుచుం
దూర్ణతనేఁగె నానిజవధూటియు బోటులు నున్న చోటికిన్. (కళా. ౬-౨౩౫.)

అని కవి కారణము చూపియేయున్నాఁడు.

''వినుకలిచేతమున్ మిగుల వింతలుగాఁగ విశాలిఁగొన్నయ
వ్వనజదళాక్షి యట్లు దనవల్లభురూపముఁ గన్నులారఁగాఁ
గనుఁగొని ... ... (కళా. ౬-౨౩౮)

అనియున్నది. దీనికిఁబూర్వమెన్నఁడును జూచకున్న (మధురలాలస కాతఁడు) గళాపూర్ణుఁడని గుర్తెట్లుగలిగె. మఱియు,

'ఏమి కన్నులఁగన్న హృదయేశురూపంబు దోఁపక యదిమున్నుదోఁపకుండె'

నని పూర్వమే యాపెయుపద్రవముంగూర్చి వ్రాసియుండుటంజూడ కన్నులఁజూడకమున్నే హృదయమునరూపమావిర్భవింపఁగల వింతమానిసియో యీమదాశయుపుత్రి! లేక చిత్రఫలకమేమైన నీవినోదముల కాధారముగా నుండునా! ఊహ్యము' (౨౭౨) అనివ్రాసిరి. కళాపూర్ణునిఁ గలలోఁ గాంచినదని కవి యిట్లు చెప్పియున్నాఁడు.

ఉ. ఓహరిణాక్షినీకు నిఁకనుల్లము దాఁపఁగ నేటికిక్ జగ
న్మోహనమూర్తితోడ నిట మున్నొకనాఁటినిశన్ విలాసస
న్నాహముమీఱ మద్విభుఁడు నాకలలోపలవచ్చి తేర్చెఁగా
మాహావకేళి నద్భుతసుఖైకమయం బదియేమి చెప్పుదున్. (కళా. ౬-౨౭౧)

చెలికత్తెలప్పుడు సంజ్ఞచేసి చెప్పిరనియుఁ దలంపవచ్చును. పైపద్యమును రెడ్డిగారు (౨౭౫ పేజీలో) ఉధాహరించియు ఉషాదేవిచూపినదారిం

ద్రాక్షగొత్తైలని ఆక్షేపించిరి. కొంతపోలికయుండుట దోషముకాదని రెడ్డిగారే చెప్పియుండియు మఱల నాక్షేపించిరి. అదిగాక మధురలాలస కళాపూర్ణుని రూపుచూచి వరించలేదు. రుక్మిణీదేవివలెనే కళాపూర్ణుని సద్గుణములు విని వరించినదని కవి రసవంతముగ వ్రాసి రెడ్డిగారి ఆక్షేపణకు గుఱియైనాఁడు.

చ. మునుకొనికూర్మి నెచ్చెలుల ముచ్చటవేళలఁ దద్గుణౌఘముల్
విని విని విన్నయర్థ మొకవేళను మానని నిత్యభావనం
గనికనికన్నయంతయును గావ్యవినిర్మితిచేతఁ దార్చుచుం
గొనికొని మిక్కిలిం బెనిచెఁ గోమలప్రేమము నామహీశుపైన్. (కళా. ౬-౨౧౯.)

అని కవి వ్రాసియున్నాఁడు.

ఉ. ''......పూవిసనకఱ్ఱలు గొజ్జఁగినీట మాటికిం
దొప్పఁగఁదోఁచి వీచుచుఁ జపుంగవపై నరకాళ్లఁబొంఱులన్
లప్పలుగాఁగఁ జందనమలందుచుఁ గొందలమందిరందఱున్. (కళా. ౬-౨౧౨)

ఏమిసౌకుమార్యము! ఇతరులు దేహమునట్లుతోముచు గుఱ్ఱమును మాలీసుచేసినట్లు చేయుచుండఁగా సంతోషముచే సకిలించుగుణముగలుగ వలయునన్న పాలియగాండ్రయిండ్లలో నవతారమెత్తవలెను! లేకున్న నట్టి గడుసుదనము అరిది. ఈయుపచారములు నపచారములు జరుగుచుండఁగా నందఱు 'గప్‌చుప్' అని యూరకుండిరి. మాటలేదు. అవి ముగిసినదే మకానముద్రఁబగులఁగొట్టి చిలుకలవలెఁ గిలారింపసాఁగిరి. "అయ్యో! అమ్మా! చెప్పవే నీకష్టము ప్రాణసఖితో" నని యొకనంగనాచి ప్రార్థింపఁగా (ఇదివఱకును ఏమియుఁదెలియకయా యిన్ని దోహదములు చేసియుండుట ?) (౨౭౮)

... ... ... ... ... ...

ముదితా చలువలుగిలువలు మదికినసహ్యంబు లతనిమన్ననఁ దక్కన్.

అనుచున్నది. అట్లయినమొదలేయేల వలదనరాదు! చెలికత్తెలు గసియెత్తునట్లు శ్రమపడుచుండఁగా హాయిగాఁ బండుకొని వేఁడుకచూచుట న్యాయమా? (౨౭౫) అని వ్రాసిరి. కాసారంబువెలువడివచ్చిన మధురలాలసకు డేగవేఁటతమివచ్చినట్టి కళాపూర్ణుఁడు కనఁబడెను. అందువలన నామెకు మన్మథావస్థప్రబలముగాఁగ నుస్సుగుస్సురనుచుఁ గనురెప్పలు

దేలవైచి కడుసోలసినది. ఆమూర్ఛావస్థను బోఁగొట్టుటకు చెలులు శైత్యోపచారములు గావించిరి. వానివలన మధురలాలసకుఁ దెలివివచ్చి 'ఇట్టి చలువలతోఁ బ్రయోజనములేదు' అని పలికినది. రాజకుమారి అవస్థనుజూచుచున్న చెలికత్తెలు ఉపచారములుచేసెదరుగాని నాటక కళను సార్థకపఱుప సంభాషణగావించి కాలక్షేపముచేయుదురా? రాజకుమారి మన్మథావస్థనున్నదని గ్రహించి చెలికత్తెలామెనుద్యానవనమునకుఁ దెచ్చినట్లు కవి మొదటనే చెప్పెను. అయినను నీకష్టమును జెప్పవే అనియడుగుట ఓదార్పువంటిది. మనోగతునిఁ దెలుసుకొనుట కది తగిన సమయము.

"జలక్రీడకు నెంతయాలస్యమైనను మధ్యాహ్నము ౧ గంటకు వచ్చియుందురు. ఆవెనుక చలిదుర్భరముగావున. పుష్పాపచయాదిలీలలు, అంగనామణియొక్క వికారములు, సఖిజన రాజకుమారికా ప్రశ్నోత్తర మాలికలు, ఇవినడచుసరికి చంద్రోదయము. పున్నమనాడనుకొన్నను ఆరు ఆరున్నరగంటలకుఁగదా చంద్రుఁడు పొడచూపియుండును ఇంత సేపు ఎదిగినకూఁతురు, భోజనాదులకు రాక, యెక్కడనో ద్రిమ్మరుచున్న, హిందూజాతితల్లులు ఆయుధపాణులై, అనఁగా పొరకను చేటనుదాల్చి, రోయుటకువెన్నాడక యూరకుందురా? అట్లుండిరేని వారు హిందువులా? మనువునోటిలో మన్నువేయుటకుఁ గదా యిట్టిదురాచార వర్ణనము.

ఉ. "కావునఁ జంద్రుఁగిం ద్రుఁ జిలుకం గిలుకంబికముంగికంబునన్
గావుమటంచువేఁడుఁడు న్నాబ్రతుకీ రిపుజాలికిం బ్రియం
బేవివరింప మీకుబలెఁబెంచినవారికి ముద్దుగాక పె
న్నావురుఁబిల్లికిన్ గలుగునామొగమాట యొకింత చిల్కపైన్." (కళా ౬-౨౭౧)

(౨౭౫, ౨౭౬) అనివ్రాసిరి. తొలిజామున చంద్రోదయమైనది. అని గ్రహింపవచ్చును. ఎనిమిది ఎనిమిదిన్నరకు వారు గృహమునకువచ్చిరి. అనితలంపవచ్చును. రాజకుమారితగావుననే అంతవఱ కచ్చటనుండుట కవకాశముగలిగినది. వంట మొదలగునవి వారికుండవుగదా. ఇది బజారులో తుదిబేరమువంటిదని రెడ్డిగారా క్షేపించిరి. రెండుమూడుసంత

లలో షికారులాడి సంబంధమేర్పఱచుకొను పాశ్చాత్యులయొక్క అను భవమువలనఁ జెప్పినమాటయే మో!

"కళాపూర్ణుఁడు మధురలాలసను బెండ్లియాడుటకై యభినవ కౌముదమ్మగారి యనుమతిని దానే కోరుటలేదు. రాయబారులనుబంపు చున్నాఁడు. భార్యాభర్తలకును మధ్యస్థమా? ఏమిా! భార్యకు పురుషునిపడకలో నేగదాపాలు! మనసులో లేదుగదా! అభినవకౌముదికి సరే యనుటదప్ప నింకేస్వాతంత్ర్యమున్నది. వివాహముతటస్థమైనది. ఆశుభ కార్యములో 'పెద్దపూఁబోండ్లు' రాకపోకలుచేసిరట. ఎంతముసలివా రైనను పూఁబోండ్లే! శైలియువ్రాలుచున్నది. పెండ్లియైనది (౨౭౭,౨౭౮) అనివ్రాసిరి. మధురలాలసయందు మోహముఁ గల్గియున్నాఁడు కళా పూర్ణుఁడు. ఈవిషయము పెద్దభార్యయగు అభినవకౌముదితోఁ దాను చెప్పుట బాగుండదనితోఁచి మధ్యవర్తులనుబంపినాఁడు. పునర్వివాహ మునకై మతగురువులధిక్కరించుట, రిజష్టర్లు (పుస్తకవిశేషములు) తగులఁబెట్టుట, హత్యలుచేయుటకంటె నిది సహస్రాంతము మేలుగదా. అభినవకౌముదియు 'సతులకెల్ల సామాన్యధర్మమైన, పతిమనోనుకూలత కును బాయఁదెరువె' (౭౩౩) అని పలికినది. ఆమెకిష్టము లేకుండిన కళా పూర్ణుఁడు వివాహమాడఁడని ఇందువలన స్పష్టమగుచున్నది. హిందూ స్త్రీలకు పడకలోనైనఁ బాలున్నదిగాని పాశ్చాత్యపురుషుల కదియు లేదు. భార్యపడకకువచ్చుటయు వారికికష్టమే. 'పెద్దపూఁబోండ్లు' అనివ్రాయుట శైలిదోషమన్నారు రెడ్డిగారు. 'ప్రాంచద్భూషణ బాహుమూలరుచితోఁ బాలిండ్లుపొంగారపై, యంచుల్ మోవగ' (మను) వరూథినిప్రవరుని కౌఁగిలించినది. వరూథిని పిల్లతల్లియని రెడ్డిగారిచ్చుట నాక్షేపించెదరా!

అసహ్యశృంగారమని రెడ్డిగారిట్లువ్రాసిరి.

"వధూవరు లేకాంతముగోరుచున్నారు. చెలికత్తెలు గొంచెమున వదలరు. కవియన్నో యీసమయమునఁ బ్రాణముఁబోయినను వారిని వదలఁబోఁడు! ప్రథమవిఘ్నము తల్లి, అవసరముగావెళ్లుచుండఁగా కూఁతును నిలఁబెట్టి యామెకు బుద్ధివచ్చునట్లు ఇచ్చిన యుపన్యాసము ఒకగంటదీర్ఘము! అంగనామణికి తాల్మిలేని తమిచేఁగలిగిన తబ్బిబ్బులఁజూచి జరుగఁబోవుతమాషాలందలంచి, చెలికత్తెలు హాస్యముఁ

జేయుటలో విని యోగింపఁబడిన కాలము అరగంట. అలంకారరచనాదు లకుఁ బట్టినకాలము ౨ గంటలు! (౨౭౮) అనివ్రాసిరి కాని రెడ్డిగారు తలఁచినట్లు వధూవరులేకాంతమును గోరుటలేదు. అప్పటికి వైవాహికవిధి పూర్తికాలేదు. గృహప్రవేశము కావలసియున్నది. అప్పుడు కూఁతు నకు అరుణమిచ్చిపంపుచు తల్లి గొన్ని హితవచనములు పలికినది. ఆపై విష యమునుగూర్చి కవి యిట్లు వివరించియున్నాఁడు. 'ఇవ్విధంబున మధుర లాలసా పాణిగ్రహణకల్యాణవైభవంబు నవధరించి కళాపూర్ణుండు గృహప్రవేశ మహోత్సవానంతరంబున దేశాంతరాయాత రాజలోకంబు నస్తోక సత్కారవిశేషంబులం బరితోషంబు నొందించి తత్తద్దేశంబుల కనిపె. (కళా. ౭-౯౬) కవి యిట్లువ్రాసి పిమ్మట 'నవసంగమదినమ'ని వ్రాసి యున్నాఁడు. పాశ్చాత్యులకు వివాహమధ్యముననే ఆతృతగల్గునా! లేక నవసంగమదినములు జరిగిన పిమ్మట వివాహమాడు పాశ్చాత్యస్త్రీలకు తాల్మియుండునా! మధురలాలసను చెలికత్తెలు శృంగారించినది పగలు. వారి నర్మాలాపము లప్పటినుండి సాగుచున్నవి. దివామైథునము పాశ్చాత్య ప్రతిబంధకము కానందున రెడ్డిగా రిట్లాక్షేపించిరో లేక శాలీనునిరసికత వారిమనసు నాకర్షించినదో తెలియదు. మఱియు రెడ్డిగా రిట్లువ్రాసిరి.

"ఇక్కడ కవిప్రయోగించు వైరస్యము తూనిక యగణ్యము. ఎట్లనఁగా, ఒకటి నిష్కారణముగ మధురలాలస 'విభుఁడిఁకవచ్చు నెప్పు డోకో విఘ్నములేమయినఁ ఘటిల్లునో' యని తన కేద్రోహముఁజేయని అభినవకౌముదిమీఁద దోషారోపణకుం దొడఁగుచున్నది. ఈయమ్మ దౌర్భాగ్యపువిరాళిని కలభాషిణియొక్క యుదారచరితంబుతో నుప మించిచూడుఁడు....... రెండు చెలికత్తెలు (మధురలాలసను) దార్చు టకై వచ్చిరి" అనివ్రాసిరి. ఆసమయమున అంగనామణికి (మధురలాలసకు) సిగ్గు గలుగుట చెలికత్తెలు సరసమాడుట వీటివలన 'వినువారి చెవులు వ్రయ్యలగును' అనియు రెడ్డిగా రాక్షేపించిరి. మధురలాలస సవతిపై దోషారోపణచేయుట రసభంగముకాదు. అది స్త్రీసహజమైనది. అని ప్రభావతీప్రద్యుమ్నములో రెడ్డిగారు ప్రభావతినిగూర్చి చేసిన ఆక్షేప ణకు జవాబు నొసంగుసందర్భమున వ్రాసియుంటిని. అదిగాక కలభాషిణి రంభనుమోసగించి నలకూబరుని వశమొనర్చుకొననెంచినది. అందువలన

ను త్తరజన్మమున సవతి ఆపెకుఁగల్గినది. రంభకు తాను సవతిగా నెంచినది గాన నీజన్మమున మొదటనే సవతి యేర్పడినది. కవి ఇట్లు కలభాషిణి యొక్క రెండుజన్మలలోనుండు వ్యత్యాసమును విడఁదీసి చూపియున్నాఁడు. వేశ్యయగు కలభాషిణికి రంభపై నీసుగలిగినది. ఉత్తరజన్మమున నుత్తమవంశసంజాతయై 'సవతివలన విఘ్నముగల్గునా' అని విచారించినదిగాని సవతియం దీర్ష్యనొందలేదు. అనఁగా సవతి (అభినవకౌముది) యొక్క సౌఖ్యవిశేషమున కీర్ష్యవహింపలేదు. ఇచ్చట పోతనామాత్యుని 'కమలాక్షు నర్చించు కరములు కరములు' అనుపద్యమును రెడ్డిగా రుదాహరించి "ఆలలిత చరణములొత్తు కేలు గేలు" అని సూరన్న వ్రాసిన పద్యము 'దురనుగమన'మ'ని ఆక్షేపించిరి. అనిమిత్తప్రసంగమగు దాని విషయమై వేఱె వ్రాయనక్కఱలేదుగదా! 'చెలికత్తెలు తార్చిరని రెడ్డిగారువ్రాసిరి. ఇదికేవలము అన్యాయము. మధురలాలస కానునుసిగ్గు వివాహసంస్కారమునఁ గలిగినది. ఆసిగ్గే మహత్తరమైనది. దాంపత్యమునకు స్థిరత్వము గల్గించునది. సార్థకమైనది. అంతఃకలహములను నశింపఁ జేయుచుండునది. అట్టి సంస్కారము లేనందున పాశ్చాత్యులుచెడుచున్నారు. విడాకులు వారి నిత్యజీవితములు.

"సవతులకొట్లాటకై కళాపూర్ణుఁడు దిగ్విజయమునకు బయలుదేరుట ప్రాచీనధర్మ మేమొ అనియు (ఐరోపావారిని నిందించునప్పుడీన్యాయమును జ్ఞప్తియందుంచుకొన్న నన్యాయము పలుకకుందుమనియు) వారి (సవతుల) అలుకలుతీర్చుటకుఁ గళాపూర్ణుఁడు భార్యయొక్క పాదములమీఁదఁబడి వేఁడుకొనుట బాగులేదనియు వ్రాసి మఱియు నిట్లువ్రాసిరి. అనవసరముగ నీతిప్రసంగముదెచ్చుట అలంకారశాస్త్రమూఢత్వమనియు, అన్నిసంవత్సరములు రాజ్యమేలిన ప్రభువునకు మంత్రి రాజనీతి నుపదేశముచేయుట ముసలివాని కుపనయనముచేయుట వంటిదనియు నాక్షేపించిరి. మధురలాలసా వివాహసందర్భమున సామంతుఁడనియేర్పడిన మగధరాజుతోఁ గళాపూర్ణుఁ డిపుడు సంధిచేసికొనుట చూడఁగా అలంకారశాస్త్ర మర్యాదకైచూచెనేకాని కవి అది అసందర్భమని యెంచలేదనియు, స్వభావుఁడిచ్చిన అమోఘమైన విల్లు నమ్ములునుండఁగా మాగధునిమైత్రి సంపాదింపనెంచుట అసందర్భమనియు రెడ్డిగా

రా క్షేపించిరి. మఱియు, మదాళయుఁ డీవఱకే అందఱినిఁ గెల్చెను. అట్టి మదాళయునిఁ గళాపూర్ణుఁడు గెల్చియే యున్నాఁడు గావున కళాపూర్ణుని దిగ్విజయ మనవసర ప్రయత్నమని బుజువగుచున్నదనియు, ద్యూతము, సూర్యాస్తమయము, చంద్రోదయము, సూర్యోదయవర్ణనము వీటిని వర్ణించుటకు అగత్యములేదనియు, అశ్వయుద్ధమొకచోట, గజయుద్ధమొకచోట ఇట్లు వేఱువేఱుగా యుద్ధములు జరిగినట్లు వర్ణించుటతగదు. అవి యుద్ధస్వభావము కాదనియు, (అశ్వయుద్ధము గజయుద్ధము అన్నిరక ములగు యుద్ధములు అన్నిచోట్ల జరిగినట్లుగా వ్రాయవలెనని రెడ్డిగారి యభిప్రాయము.) భారతకాలమునుండి మొగలాయల నాఁటివఱకుఁ బ్రఖ్యాతికివచ్చిన యుద్ధపద్ధతుల నన్నింటిని ఏకకథలో నేక కాలమున నడచినట్లే వర్ణించుట కాలౌచిత్యమునకు మారణక్రియయనియు వ్రాసి 'ఇందువలన జయలక్ష్మి యేచాంచల్యమును లేక కథానాయకునిఁ జేరియుం డుట యామె తలవ్రాఁతయని స్పష్టమగుచున్నది' అనియు రెడ్డిగారు వ్రాసిరి. (3౦౯—3౧3) మఱియు వారిట్లువ్రాసిరి. 'నారదుఁడు మణి కంధరుఁడు శ్రీకృష్ణుని యాశ్రితులు. మణికంధరుఁడు కళాపూర్ణుఁడుగాఁ బుట్టి దిగ్విజయముఁ జేయుసరికి ద్వారకాపురి సముద్రములో మునిఁగి పోయియుండెను. అనఁగా కళాపూర్ణుఁడు రాజ్యము చేసినది కలిప్రారంభ మున ననుకొందము. ద్వాపరాంతమున నన్నను బాధకము గాదు. అప్పుడు ఫిరంగులు తుపాకులు నెక్కడివి. రెండవది. రుక్మిణీకాంతునికిఁ దరువాత నీరాజువలె సద్గుణులెవ్వరు లేరని కురుకాదిదేశాధీశులు కానుకలు పెట్టి నారఁట: పాండవుల మనుమఁడైన పరీక్షిత్తు సార్వభౌముఁడాయెనని జగత్ప్రసిద్ధమగుకథయుండఁగా, నీకళాపూర్ణుని వానితోఁ బోటీకిం బెట్టుట 'కొండంగనితగరుదాఁకఁ గోరుటగాదే!' ప్రపంచవిఖ్యాతము లగు కథలతో నిరోధించినట్టికల్పనలు అయోగ్యములు. (3౧౫, 3౧౬) (మధురలాలస) పెండ్లియైన యేఁడుననే దిగ్విజయమని యాలోచించినను ద్వారకమునిఁగి చాలకాలమైయుండదు. కళాపూర్ణుఁడు సింహాసన మెక్కిన తరువాత మునిఁగెనా? తత్పూర్వమే మునిఁగెనా? పూర్వమైయుండిన నిరువదేండ్లక్రిందట మునిఁగినయూరింగూర్చి కళాపూర్ణుఁడు విచారణ లకు మొదలిడుట యధికాలస్యప్రసంగము. తరువాతగానుండిన, నెల్ల

రాజులను జయించినవాఁడుగదా, శ్రీకృష్ణబలరాములను, భీమార్జునులను మార్కొనెనా? మఱి తనకుంగురువును దైవము నని కృష్ణుని సేవించి వచ్చెనా? (3౧౮) అనియు వ్రాసిరి. పై ఆక్షేపణలన్నిటికి సమాధానములు. సవతులకయ్యమునకై దిగ్విజయము చేయనెంచిన కళాపూర్ణుఁడు మంత్రాంగమొనరించి ఉచితసమయమని యెఱింగియే బయలుదేరెను. పితృనరకోద్ధరణమునకై ధర్మరాజు రాజసూయము గావింపనెంచి సకల దిక్కులను జయించెను. అది కారణమైనను బహుదూర మందఱితోడ నాలోచించి మఱియు రాజసూయ మాతఁ డొనరించెను. కావున సమయముచితమైయుండినపుడు రాజులకు దిగ్విజయము దోషముకాదు. మంత్రాంగమువచ్చినదిగావున మంత్రి నీతినిగూర్చి కొంతముచ్చటించెను. అన్నేండ్లు రాజ్యమేలినరాజు, అన్నియేండ్లు మంత్రాంగమొనరించిన మంత్రిగూడ కుశలులే. కావున వారిసంభాషణమమోఘము. ఉత్తముఁడు గాన నామంత్రి 'ఏలినవారి కివన్నియు విశదమే' యని నమ్రతమీఱి మర్యాదనెంచి పలికినాఁడు. అందు దోషమేమున్నది? రాజనీతికుశలుఁడగు ధర్మజునకు భీష్ముఁడు రాజనీతి నుపదేశించెనుగదా! స్వభావుం డిచ్చిన అమోఘాస్త్రంబులున్నను కళాపూర్ణుఁడు సంకటపడెను అనునది రసవిహీనముకాదు. పాశుపతాది మహాస్త్రముల నెంతయో క్లేశమొంది సంపాదించిన అర్జునుఁడు భారతయుద్ధములో గొప్పకష్టములను బొందెను. దిగ్విజయ మొనరించిన మదాశయుని జయించినట్టి కళాపూర్ణుఁడు తిరిగి దిగ్విజయమునకు వెడలుట అనవసర మనరాదు. రాజసూయమప్పుడు పాండవులు భూమండలము నంతటిని జయించిరి. అయినను అశ్వమేధ యాగసందర్భమున దిగ్విజయములో వారికిఁ బెక్కుసంకటములు గలిగినవి. సామంతులు స్వతంత్రులు గావచ్చును, లేక వారికి బలసంపద చేకూరవచ్చును. క్రొత్తవీరు లుదయింపవచ్చును. ప్రపంచయుద్ధములో నోడిపోయిన జర్మనీదేశము నేఁడు తిరిగి ప్రబలముకాలేదా. సూరన్నయు నిట్లు చెప్పియున్నాఁడు.

ఆ. సకలదిగ్జయంబుసలిపినయట్టి మ,దాశయుఁని జయించినపుడె సిద్ధ
మెల్లదిశల నీదు కీర్తిప్రకాశసాగుట, యైన నృపులశాంతియస్థిరంబు. (కళా ౭-౨౬౭)

అని వ్రాసియున్నాఁడు. కళాపూర్ణుఁడు దిగ్విజయమునకు బయలువెడలనున్నాఁడు గావున నారాత్రిని ఉదయమును గవి వర్ణించెను. కాలమందున్న శుభమును గవి సూచించెను. దిగ్విజయయుద్ధములలో ననేకస్థలములం దనేకవిధములుగా యుద్ధప్రకారము నడువవచ్చును. ఒక్కొక్కయుద్ధమం దొక్కొకదానికి బ్రాధాన్యము గలుగవచ్చును. అది ఆక్షేపణీయమైనదిగాదు. ద్వారక మునిగిపోయినదనియు నందువలన శ్రీకృష్ణునిఁ జూచుభాగ్యము కలుగలేదనియుఁ గళాపూర్ణుఁడు వాపోయెను. అని కవి వ్రాసియే యున్నాఁడు. ద్వారకామార్గమున వచ్చెను గావున నచ్చోట నాతఁడు ద్వారకానగరప్రాశస్త్యమునుగూర్చి విచారించెను. పరీక్షిత్తు జగత్ప్రసిద్ధసార్వభౌముఁడే. కవి ఆదినే కళాపూర్ణోదయము కల్పితకథ యని చెప్పియున్నాఁడు. కల్పితకథలో యథార్థమునకై దేవులాడువా రెవ్వరు! కల్పితపాత్రుఁడగు కళాపూర్ణునకు పరీక్షిత్తు లొంగిపోయెను. పాత్రకల్పితముగావున పరీక్షిత్తుకీర్తికిఁ గళంకము రానేరదు. అందఱిని కళాపూర్ణుఁడుజయించెనుగావున కళాపూర్ణుని యశస్సునకు లోపములేదు. కవి పరీక్షిత్తు నెత్తుకొనక కావ్యమునకు శోభను గూర్చెను. రెడ్డిగారు దానికి సమ్మతించలేదు.

సుగ్రహుండు ఎన్నెన్నో తపస్సులుచేసి యవస్థలుపడి యాహారము వడసినవాఁడు. పిమ్మట నాహారము ఒకబ్రాహ్మణునియింట నెన్నియోయేండ్లుండినది. తరువాత నాయెఁ గృష్ణార్పితము. ఆవెనుకఁ గృష్ణునిచే మణికంధరునకు లభించినది. వాఁడు గానవిద్య, యాత్ర, తపస్సు ఇత్యాదులలోఁ గడపినవత్సరములు కనీసము ఆఱు. అట్లగుట మణికంధరుని యొద్దఁ జేరినదిమొదలు మధురలాలస రెండవతూరి ధరించువఱకు జరిగిన యేండ్లు సుమారు ఇరువదినాల్గు. ఇఁక సుగ్రహునివయ స్సెంతయుండునో యూహింప నలవిగాదు. అట్టి దీర్ఘాయుష్మంతుఁడగు సుగ్రహుఁడు సత్త్వదాత్ముం డనుపేరం బరగినవాఁడు. మధురలాలసకు మేనమామ! సుగ్రహునింగూర్చిన యాభాసముల కింకను ముగింపుగానము. రూపానుభూతి యతని నెఱింగియుండకపోవుట సిద్ధము! శాపంబుచే మతిమాత్రము గోల్పోయి ఆకారంబుమాఱని యతని నేకస్థలముననుండియు నామెయేల గుర్తింపకపోయె? ధాణీవాసమందమా? కళాపూర్ణునియభ్యంతర మందిర

ములోఁ బ్రవేశింపగలయతఁడు మదాశయుని యంతిపురమునఁ గాలిడ ననర్హుఁడై యుండునా? సదుత్తరములు చింత్యములు. (3౧౬-3౧౭) సుగ్రహునివయసు కృతయుగములెక్కలోఁ జేర్చవలసినదే” (3౧౯) అని వ్రాసిరి. సుగ్రహుఁడు రాజ్యభ్రష్టుఁ డగుసరికి ఆతని కిరువదియేండ్లు. శాపగ్రస్తుఁడై విష్ణుప్రసాదమున సంపాదించిన దివ్యహారము నాతఁడు దేవతాలయంబున మఱువగా బ్రాహ్మణుం డొకఁడు దానిని సుమారు పదిపదిహేనువత్సరంబులు పూజించి కృష్ణార్పణ మొనరించెను. ఇప్పటికి సుగ్రహునివయసు సుమారు 3౫, 3౬ సంవత్సరము లుండవచ్చును. పిమ్మట మణికంధరుఁ డాతేం డ్లాహారంబు ధరించెను. మణికంధరుఁడు చని పోయినపిదప మఱి రెండేండ్లకు మదాశయునకుఁ గలభాషిణి మధురలాలస యనుపేరుతో జన్మించినది. కావున సుగ్రహునివయసు సుమారు ౪3, ౪౪ సంవత్సరములు కావచ్చును. రూపానుభూతి సుగ్రహునిచూడకుండనున్న కాలము సుమా రిరువదియైదుసంవత్సరములుగాఁ గానవచ్చుచున్నది. కావున సుగ్రహుని (సత్త్వదాత్ముని) గుర్తింపలేకపోవచ్చునుగదా!

“కళాపూర్ణుఁడు పుట్టునప్పటికి అభినవకౌముది వయసు ౧౮ యనుకొనుఁడు. (మధురలాలస వివాహసమయమునకు ౧౫, ౧౬ సంవత్సరములు ఈడుగలదిగాఁ గనఁబడుచున్నది గావున నభినవకౌముదివయస్సు 3౪, 3౫ సంవత్సరము లుండును.) ఎట్లు లేదన్నను ముప్పదికిఁ దక్కువ యుండదు. ఇన్నాళ్లు సంసారముచేసినయూపెకును, క్రొత్తపెండ్లికూఁతు నకును రూపయౌవనవర్తన విభ్రమాదుల నేతారతమ్యమైన నుండునట్లు కవి వర్ణించినాఁడా విచారింపుఁడు! నాకుం జూడలేదు” (3౧౯) అని వ్రాసిరి. మధురలాలస తనవిభుండు(సద్యోయౌవనుండగు కళాపూర్ణుఁడు) ‘సురవిలాసినీవల్లభుఁడ’ని పలికినది (కళా ౭, ౧౦౪) కావున నభినవ కౌముదివయసు సదా నొకేరీతినుండునని తలంపవలయును. అందువల్లనే కవి సవతు లిద్దఱకు నెట్టివ్యత్యాసమును గనఁబఱుపలేదు. అభినవకౌముది సురవిలాసిని గావునఁ గళాపూర్ణునికన్నఁ బెద్దది అనుదోష మామెపట్ల వర్తించదు.

“ద్వ్యర్థి కావ్యములకెల్ల శిరోమణియనం దగుదానిని ఘటించిన వాఁడయ్యు కళాపూర్ణోదయప్రభావతీప్రద్యుమ్నములలో ప్రబంధ

కవులవలె శ్లేష నంతగా వాడకుండుటకతన నది శక్తిలేమిచే విసర్జింపఁ బడినదిగాదు. మఱి రక్తిలేమిచే నని యనుమానించుట సహేతుకము" (౮౩) అని వ్రాసిరి. ఈయనుమానము సహేతుకము కానేరదు. శ్లేష నన్ని కావ్యములందును సూరన్న వాడియున్నాఁడు. పూర్వగ్రంథము లందలి భావములను గొన్ని ఉత్తరగ్రంథములందు వాడియున్నాఁడు. ఇది దోషమే యని రెడ్డిగారు వ్రాసి 'భావనాశక్తి వ్రాసెననుట కింకను సందేహమేల?' (౯౩) అని వ్రాసిరి. కవి ఒకేవిషయమును దెల్పునపుడు ఒక్కొక్కగ్రంథమం దొక్కొక్కరీతిని వ్రాసియున్నాఁడు. శైలివిష యమై కవి రెండుకావ్యములందు వ్రాసినపద్యము లిందుకుదాహరణము. ఇట్లు వ్రాయుటచే "రెండవకృతి రచించులోపలఁ గవి కొంతమట్టునకు శైలింగూర్చిన యభిప్రాయము మార్చినాఁడనియుఁ జెప్పుట కవకాశ మయ్యెడి" (౯౬) అని రెడ్డిగారు వ్రాసిరి. ఇదియు సమంజసము గానే రదుకదా. వెనుకటికావ్యములో వ్రాసినది ఉత్తరకావ్యములో తిరిగి వ్రాయుట కూడదన్నారు రెడ్డిగారు. వేఱొకవిధమున వ్రాసినకవి అభి ప్రాయము మార్చుకొన్నాఁడన్నారు. రాఘవపాండవీయమందుఁ, గళా పూర్ణోదయమందు సూరన్నకు రక్తిలేమి గలిగినదని రెడ్డిగారియభిప్రాయ మేమొ.

"(రతివర్ణనగావించుచుఁ గవి) తటుక్కున వైష్ణవరాద్ధాంతముతో భక్తిరసముఁ గొంత దింపి గ్రంథసమాప్తి యొనర్తుమని, లక్ష్మీనారాయణ సంవాద మనెడుగతిమోక్షములేని ఘట్టమొకటి తెచ్చివేసికొనినాఁడు" (౩౨౧) అని వ్రాసిరి. మంగళాంతముగాఁ జేయనెంచి లక్ష్మీనారాయణసం వాదము వ్రాసి కవి ప్రబంధమును (గళాపూర్ణోదయమును) ముగించెను.

---

# కవితత్త్వవిచారవిమర్శనము.

---

## శ్రీయుత కట్టమంచి రామలింగారెడ్డిగారి పుస్తకవిమర్శనము.

---

### కథాలక్షణము.

ఏదివ్రాసినను అది కథకు గాఢముగా సంబంధించియుండవలెనని కొన్నివిషయములను రెడ్డిగా రిట్లువ్రాసిరి. (రెడ్డిగారు తలఁచినది. కవిభావము గాకపోయినను) [1]కళాపూర్ణోదయములోని శైలినిఁగూర్చిన పద్యము కథకు సంబంధించియున్నదిగావున శ్రేష్ఠమన్నారు. (౯౧) [2]ప్రభావతీప్రద్యుమ్నములోనిపద్యము కథకుసంబంధించనందున నంతప్రశస్తము కాదన్నారు. (౯౪)(పాత్రలమూలమునఁ జెప్పించినందునఁ గొంతసమంజసమని వారియుద్దేశ్యమా!) [3]ఇట్లే 'నలకూబర! విడువిడురా' అని రంభ

---

౧. మణికంధరునిఁ గలభాషిణి ప్రేమించియుండిననే పైపద్యము కథతో సంబంధించును. కాని కలభాషిణి అప్పుడు నలకూబరాయత్తచిత్తయై యుండెను.

౨. నిమిత్తము కల్పించుకొని కవి వ్రాసెనని రెడ్డిగారియభిప్రాయము.

3. మణికంధరునితో సంభోగసుఖ మనుభవించుచున్నయథార్థరంభ 'నలకూబర, విడువిడురా' అని పలికినది. అన్యనాథునిఁ బేర్కొనుట మణికంధరునికోపమునకుఁ గారణమయినది. మణికంధరుఁడు నలకూబరరూపముం దాల్పఁడేని ముందుకథ సాగదు. ఇరువురు రంభలు, నిరువురు నలకూబరులు, నుండుట యావశ్యకము. రంభ 'నలకూబరా' యని కనులుమూసికొనుట యింకను గామతృప్తిపడయని మణికంధరునికి నలకూబరవేషముం దాల్చుటకు నమోఘమైన హేతువు! కావున నీవైరస్యము దండుగ ప్రణయకలహముగాదు. మఱి కథాభివృద్ధికి నావశ్యకము. (౯౮-౯౪) ప్రభావతీప్రద్యుమ్నములో నాయికానాయకులకుఁ గోపముఁ దెచ్చిపెట్టవలయునని యుద్దేశించి కవి యీకళాపూర్ణోదయము సంగతివంటిదానినే చేర్చియున్నాఁడు (౯౩) ప్రభావతమ్మగారికి వచ్చినపాలయలుక వర్ణనకై దిగుమతి కాఁబడినదే కాని కథాసాంగత్య మేమాత్ర

పలికినది కథ కభ్యుదయము గలిగించునదిగావున ప్రశస్తమన్నారు. (౯౩) ప్రభావతీప్రద్యుమ్నములోనిది 'దక్షిణరతీ' అని ప్రద్యుమ్నుఁడుపలికినది కథకు సంబంధించి లేనందున ననిమిత్తప్రసంగమన్నారు. (౯౪) ప్రథమాగమాదులు మదాశయు పురోహితు నోడించుటకై వచ్చి ఉపాయముమై రాజును సందర్శించి [1]శ్లేషగా పలికినది కథతో నన్వయించి యున్నది (అనఁగా యాగముచేయ నెంచినరాజు నందుకై పురోహితులు పురిఁగొల్పినందునఁ గథతో సంబంధించియున్నది.) గావున ప్రశస్తమన్నారు. (౯౯) ఇంకను నీలాటిపద్యములు వినఁగోరెదను. అని మదా

మును దానికిలేదు. ప్రభావతి రాజకన్య. వయసున నెంతో చిన్నది. రతీదేవి పురుషుని కన్న పెద్దమ్మగదా! కాఁబట్టి కోమలాంగియైన ప్రభావతితో ముచ్చటించునపుడు ఈజ్యేష్ఠాదేవిని దలఁచుకోవలసిన విధియేమి? (౯౪) అని రెడ్డిగారు వ్రాసియున్నారు. కవి కళాపూర్ణోదయములో స్త్రీనోటఁ బల్కించినది ప్రభావతీప్రద్యుమ్నములోఁ బురుషునినోటఁ బల్కించినాఁడు. స్త్రీస్వభావమునుగూర్చి పెద్దన్న మనుచరిత్రలో నొకపద్యము వ్రాయఁగా వసుచరిత్రకారుఁడు పురుషులనుగూర్చి ఒకపద్యము వ్రాసియున్నాఁడు. మనుచరిత్రములోని పద్యము,

ఉ. ఒక్కొకవేళఁ బద్మముఖు లొల్లమి సేయుదు రొక్కవేళఁ బె
  న్మక్కువ నాదరింతురు క్షణక్షణముల్ జవరాండ్రచిత్తముల్
  పక్కన వేసఱం జన దుపాయములం దగునిచ్చకంబులం
  జిక్కఁగఁ జేసి డాసి సతిచిత్తముఁబట్టి సుఖింపఁగాఁదగున్. (౩-౬౯)

పురుషులనుగూర్చి వసుచరిత్రకారుఁడు వ్రాసినపద్యము.

శా. మాయాశీలురు చంచలాత్ములనుకంపాశూన్యు లాత్మైకకా
  ర్యాయత్తు ల్సమయానుకూలహృదయవ్యాపారగోపాయనో
  పాయజ్ఞు ల్మగవార లాపయి మహీపాలు ర్మహావైభవ
  శ్రీయోగాంధులు సెప్పనేల మగవారిన్ నమ్మగావచ్చునే. (౪-౯౦)

సూరన్న స్త్రీపురుషులనుగూర్చి తానే తనరెండుకావ్యములలో వ్రాసియున్నాఁడని ఆనందించుటకుమాఱుగా కథాసాంగత్యములేదని విమర్శించుట తగినపనికాదు.

౧. ఇచ్చట సూరన్న అపూర్వమైనవి రెండుపద్యములు వ్రాసియున్నాఁడు. మొదటిది పదవిభాగవ్యత్యాసమువలన సంస్కృతపరముగను, నాంధ్రపరముగనుగూడ నన్వయించును. (కళా. ౬-౧౬౧) రెండవది చివరనుండి చదివిన సంస్కృతమును మొదటినుండి చదివినఁ దెనుఁగునగును. (కళా. ౬-౧౮౨)

శయునిచేఁ బలికించినది కథాసందర్భములేని అనిమిత్తప్రసంగమన్నారు. (౯౯) భద్రునిచరిత్రగూడ వజ్రనాభుని పురిఁజొచ్చునుపాయమునకు సూచకముగావున సమంజసమన్నారు. (౧౦౨) ఇట్లే వజ్రనాభునివద్ద నున్న ప్రద్యుమ్నుఁడు శ్లేషగాఁబలికినవి ప్రభావతికిఁ దన్నుఁగూర్చి తెల్పునట్టి సాంకేతికముగా నున్నందున సమంజసమన్నారు (౧౦౨) మాట మాటకును గథ పెరుగునట్లుచేయుమాహాత్మ్యమున సూరన నిస్తులుఁడు అని వ్రాసిరి (౧౮౮) ప్రభావతీప్రద్యుమ్నములో నిరర్థకాంగములు మెండుగ లేవన్నారు. (౧౩౨) కథాంగములేక భావముందాల్చి యొక శరీరముగా నేర్పడియున్నఁ గళకు ప్రాశస్త్యమనియు నట్లుగాకుండుట విచ్ఛేత హేతువనియు వ్రాసిరి. (౧౮౦) ఇట్లు లేకుండుటచేతనే కళాపూర్ణోదయము షష్ఠాశ్వాసము ౧౮౯ పద్యము మొదలు కావ్యాంతమువఱకు గలభాగము ప్రతిభలేని పాడుకొంపలన్నారు (అనఁగా శిశువుగానున్న మధురలాలస అనేకాద్భుతవిషయములు చెప్పి ముగించి యింటికిఁదేఁబడినది. మొదలుకొని కళాపూర్ణోదయము బాగులేదన్నారు.) దీనివిషయమై రెడ్డిగారిట్లు వ్రాసిరి. "ఈగ్రంథ మంతటితో సమాప్తిజేసియున్న సమ్మాన్యతరమైయుండును ఏడవ, ఎనిమిదవయాశ్వాసములలో భావనాశక్తి, ప్రతిభ మొదలగు కవిత్వమూలశక్తులు బలహీనములు తుదకు మధురలాలసాపరిణయాదులు వర్ణింపఁబడకున్నను తత్పూర్వకథచే నూహ్యములుకావున వానిని బొందించియుంట పునరుక్తిఁబోనిది. ప్రధానాఖ్యానముతో నైక్యము వీని కత్యల్పము. అట్లుండియు నీనిరర్థకప్రస్తావనకుఁ గవియేల ప్రవర్తించినాఁడనుట చింతనీయము (౧౭౯-౧౮౦) (మధురలాలస ఉద్యానవనమునకువచ్చినవి) మొదలు కవి గతానుగతికముగా వ్రాయుచున్నాఁడేగాని, స్వబుద్ధి పొంతఁబోవునట్లు గానము. భావములు నవ్యములుగావు. రుచికరములుఁగావు పాట ప్రాఁత, మాట రోఁత (౨౭౧) అని వ్రాసిరి. (కథను గలుపుటకై కవి మణిహారవృత్తాంతముం గూర్చియున్నాఁడు)......* ఈరీతి కల్పన మహోత్తరమైనదయ్యు నిష్క-

---

* కళాపూర్ణోదయమునంతటిని కవి మణిహారముచే నలంకరించియున్నాఁడు. అపూర్వమైనమణిహారమును గూర్చియున్నాఁడు. ఎట్టివక్రములను బొందక నాయికానాయకుల హృదయస్థలంబున శోభిల్లినది.

శంకంబుగాదు. (౧౮౦, ౧౮౧) కథకెల్ల సూత్రమువలె నుండు నీహార మిన్నివక్రముల కాస్పదమగుట చింతావహము. ౧౮౩) అని వ్రాసిరి. కథతో గాఢాన్వయముగలవి. కొలఁదిగా సంబంధించినవి, సంబంధము లేనివికూడ కవులు వ్రాయుదురు. అట్లు వ్రాయుట దోషము కానేరదు. రసవంతముగ నున్నవా లేవా యనియే విచారింపవలయును.

కథాలక్షణమునుగూర్చి రెడ్డిగా రిట్లు వ్రాసిరి. "కథను వివరించు పద్ధతులు రెండు. విషయముల జరిగినట్లు కాలక్రమానుసారముగాఁ జెప్పుట, కాలక్రమమునువదలి స్వారస్యమగు నేసందర్భముననైన ప్రారంభించి పిదప వెనుక ముందఱగా కథనుబెంచి పూర్తిచేయుటయు ఇందునకు దృష్టాంతములు. భారతరామాయణములు కాలక్రమానుసారముగా వ్రాయఁబడినవి. ఈయితిహాసములలో వీరుల వంశావళులు, వారిజన్మము, వయసు, పెరుగఁబెరుగ సంభవించిన కష్టనష్టములు, ఇత్యాదులు కాలోపగతంబైన వరుసమేరకుఁ జూపఁబడియుండుట సర్వజనవిదితము ప్రభావతీ ప్రద్యుమ్నముం గమనింపుఁడు. కాలముంబట్టి కథ నేర్పఱిచియున్నఁ దొలుత వజ్రనాభుని వృత్తాంతము, వానితపోమహిమ, నాకలోకదండయాత్ర, మహేంద్రపరాజయము, ఇవి వర్ణింపఁబడియుండును. కవి యిట నవలంబించినమార్గము వేఱు. 'ఇంద్రుఁడు శ్రీకృష్ణదర్శనార్థమై విజయం చేసి'యని ప్రారంభించి, కార్యమేమని యాతఁడడుగుడు, తాను దత్పూర్వ కథ కొంతమట్టుకు విన్నవించినట్లు కారణములు వెల్లడిచేయుటకునైన చర్చలచేఁ గథయొక్కయాదిని దీసికొనివచ్చినాఁడు" (౧౬౮-౧౬౯) అని వ్రాసిరి. రామాయణములో లోకకంటకుఁ డగు రావణునివృత్తాంతము, వాని తపోమహిమ, దండయాత్ర, లోకబాధలు క్రమముగఁజెప్పి పిమ్మట వానరుల యుత్పత్తి ఆటుపిమ్మట శ్రీరామజననము ఇట్లుగా వ్రాయఁబడియున్నయెడల రెడ్డిగారుతలంచినట్లు కాలక్రమమగును. శ్రీరాముని జననము, బాల్యము, వివాహము ఇట్లుగా జెప్పఁబడియున్నను పై కారణము వలన రామాయణము రెడ్డిగారు తలఁచినట్లు కాలక్రమము కానేరదు. దశరథశాపము, రావణశాపము, అయోధ్యాకాండ యుద్ధకాండలలోఁ జెప్పఁబడియున్నవిగాని కాలక్రమముగాఁ జెప్పఁబడలేదు.

"కృతినాయకునితల్లి గర్భముధరించినది. పదినెలలకు సుతోదయము. పిమ్మటఁ బెరిగినాఁడు. చదువుసాములు నేర్చినాఁడు." ఇట్లని వ్రాసితిమేని రసము రెండువిధములఁ జెడును. (౧) శ్రద్ధకు హేతువు నాయకునియొక్క గొప్పతనము. గొప్పతనమనఁగా, గుణములచేతనో, తనపడిన పాట్లచేతనో, తానుసాధించిన మహోద్దండకార్యములచేతనో మనమనసులఁ దనయొద్దికిలాగికొనుగుణము. కావున నట్టి ముఖ్యాంశము లను, వానితో గాఢమగు చెలిమిఁజెందిన విషయములనుమాత్రము ప్రచు రించిన రసము సాంద్రముగనుండును. లేనియెడల శ్రద్ధగలుగక రసము నీరసించును. (౨) (పుట్టె, పెరిగె ఇట్లువ్రాసినకథ వరుసగాఁజెప్పుకొని వెళ్లు చుండినందున ముందురాఁబోవు విషయమునకై ఉద్రేకము గలుగదు.) ప్రస్తుతవిషయముతోఁ దృప్తిఁజెందియుందుము. తరువాతివృత్తాంతములు తామై నిదానముగ వచ్చువఱకు నుద్రేకములేక వేచియుందుము. రావ ణుఁడు సీతనెత్తికొనిపోవువఱకుఁ గథ కొంచెము కొంచెముగా విడిచి విడిచి చదివినను ఆయాసముదోఁపదు. అటుపిమ్మట 'అయ్యో! సీతగతి యేమాయెనో? (ఆమెను రావణుఁడు చెఱిచెనా? రామలక్ష్మణులు రక్షింపఁగల్గిరా? ఆమె జీవించియుండెనా?) ఇత్యాది బహుభంగుల హృదయమల్లలనాడి యాపెజీవితము తుదముట్టువఱకు నన్నివివరముల నెఱుంగ నలజడిగొనును. (అనఁగాఁ గష్టములుగడచి పట్టాభిషేకము జరిగిన పిమ్మటఁగూడ కార్యము ముగింపునకువచ్చినను, సీత మనసెటులుండెను? శ్రీరాముఁడు మనసులో నూరటఁబొందెనా? ఇత్యాదిశంకలు మనకుద యించుటకు ఉత్తరరామాయణ మైరావణచరిత్రాదులే సాక్ష్యములు)" (౧౬౭-౧౬౮) అనివ్రాసిరి. శ్రీరాముని (కథానాయకుని) గుణములెన్ని యున్నవో ఆగుణగణమంతయు రామాయణములో మొట్టమొదటనే వర్ణింపఁబడియున్నది. అట్టిమహానుభావుఁడగు శ్రీరాముఁడు శ్రీమహా విష్ణువేయనియు లోకకంటకుఁడగు రావణుని దునుమ నవతారమెత్తె ననియు నాదికాండయగు బాలకాండయందె శ్రీరామజననాత్పూర్వ మందే వెల్లడిచేయఁబడియున్నది. అదిగాక భారతరామాయణములలోఁ గథాభాగమంతయు సంక్షేపముగా మొదటనేవ్రాయఁబడియున్నది ఇట్లు వ్రాయఁబడియున్నదని రెడ్డిగారే ౧౭3 పేజీలో వ్రాసియున్నారు.

మొదటనే కథ స్పష్టపఱుపఁబడినందున 'సీతగతియేమగును. అని మందుఁడు గూడ శంకింపఁడు. అదిగాక శ్రీరాముఁడు కార్యసాధకుఁడు అని ప్రతి వారిమనసులందు (కథాభాగము తెలిసినను దెలియకున్నను గూడ) నాటునటుల రామాయణము వ్రాయఁబడియున్నది. అందువలన సీతగతి యేమగును. అని ఆత్రుతగఁ జదువు వారుండరు. సీతారాములపట్టాభి షేకానంతరము వారి సౌఖ్యపరంపరలను దత్పూర్వ కథావిశేషములనే తలంచెదరుగాని సీతయెటులున్నది. శ్రీరాముఁడు సహించెనా అను భావము ఎవ్వరికినిఁ గలుగదు. అగ్నిప్రవేశాదులవలన నట్టిశంక కవకాశమే లేదు. ఆనాఁటిపరిభవము వారికి నశించెనా అని తలఁచి ఉత్తరరామాయ ణము నెవ్వరును చదువరు. అదికారణముగ నుత్తరరామాయణాదులు బయలుదేరలేదు. కథాభాగము తెలిసియున్నను మనసు నాకర్షించునదిగా రామాయణాదులువ్రాయఁబడియున్నవి. అట్లగుట కందున్నఅపూర్వమైన విషయములు కారణముగాని కేవల కథాభాగముమాత్రమే కాదు.

"రామాయణమునందు కథాసంయోగము అఖండము. ముఖ్యాం శములనుండి దృష్టిని పెడత్రోవకుఁ దీసికొనుపోవుసంగతు లంతగాలేవు. భారతమున నుపశాఖలు మెండు. కొన్ని శాఖలునుగావు, ఏసంబంధమును లేనివగుట. కావున నప్పుడప్పుడు దారిఁదప్పి పరిభ్రమించువారమై పిమ్మటఁ గష్టపడి కథారాజమార్గమునకు వచ్చులోపల తత్పూర్వము పఠించిన భాగములు మఱపునకువచ్చుటయు సహజము. మఱపునకురాకున్నను వానిచే హృదయములో దీపించిన భావములఉడుకు తక్కువయగును. రచనలో రామాయణముమేలు. భావనాశక్తింగొని పరిగణించిన భారత మునకు గౌరవమధికము" (౧౭౨) అని వ్రాసిరి. రెడ్డిగారు కథావిస్తా రమే ప్రధానమని తలంచుటచేఁ గలిగిన అసందర్భమిది. భగవద్గీత విష్ణు సహస్రనామములు ఇత్యాద్యనేకాపూర్వవిశేషములన్నియుఁ బనికి మాలిన ప్రసంగములుగా రెడ్డిగారికిఁ దోఁచినది వారెట్లు తలంచిననేమి? అధ్యాత్మవిషయము, ధర్మాధర్మములు, నీతి, రాజనీతి మొదలగువానిం గూర్చి ప్రసంగవశమున బోధించినట్టి అపూర్వగ్రంథము భారతము. భగవద్గీత, విదురనీతి, భీష్మాదులధర్మోపదేశములు ప్రపంచమునకు మిక్కిలి

మేలుగూర్చునవియై యున్నవి. మనోహరములైనవి. భారతమున కలంకారములువంటివి. భారతమునుగూర్చి నన్నయభట్టు ఇట్లువ్రాసియున్నాఁడు.-

సీ. ధర్మతత్త్వజ్ఞులు ధర్మశాస్త్రంబని యధ్యాత్మవిదులు వేదాంతమనియు
నీతివిచక్షణుల్ నీతిశాస్త్రంబని కవివృషభులు మహాకావ్యమనియు
లాక్షణికులు సర్వలక్షణసంగ్రహంబనియును నైతిహాసికు లితిహాసమనియుఁ
బరమపౌరాణికుల్ బహుపురాణసముచ్చయంబని మహిఁగొనియాడుచుండ

ఆ. వివిధవేదతత్త్వవేది వేదవ్యాసుఁ, డాదిముని పరాశరాత్మజుండు
విష్ణుసన్నిభుండు విశ్వజనీనమై, పరఁగుచుండఁజేసె భారతంబు. (భా. ఆ. ౩౦.)

ఇట్టివగు అనేకాపూర్వవిశేషములతో నిండియున్నది భారతము. అయినను భారతము సమగ్రముగ రెడ్డిగారికి రుచింపలేదు. కథకు గాఢముగా సంబంధించనిభాగము లుండకూడదని మఱియు రెడ్డిగారిట్లు వ్రాసిరి.

"ముఖ్యాంశములను, వానితో గాఢమగు చెలిమిఁజెందిన విషయములనుమాత్రము ప్రచురించిన రసము సాంద్రముగ నుండును. లేనియెడల బానెఁడునీళ్లలోవైచిన గచ్చకాయంత బెల్లమువలె నది హీనమగును" (౧౬౭) అంగీకారములేని వర్ణనలు ప్రత్యేకముగ నెంతయద్భుతములుగానున్నను నింద్యములే. కథయను నిండుటాకృతిని దీర్పఁజాలని కవి యంగములవంటి వర్ణనములఁ దీర్పనేర్చుననుట పిచ్చికూఁత. కావున విమర్శనముఁజేయుటలో కథ, పాత్రములు, ప్రకృతివిశేషములు, వర్ణనములు ఇవన్నియుఁ బరస్పరమైత్రికలిగి విఱుపులులేని యేకాకృతిగానున్నవా యనువిచారణ ప్రధానతమమని నామనవి. కథయొక్కగమనమునకు విరోధమైన దీర్ఘవర్ణనముంజేయుట రసవిహీనభావమున కొకగుఱుతు. భారతరామాయణహరివంశాదులలో నీలోపము లేశమాత్రముఁ గానము. ఇపు డిటవివరింపఁబడిన న్యాయము గోప్యము గాదు. చదువరులెల్ల నెఱిఁగినదే" (౩౮, ౩౯) అని వ్రాసిరి. కాని భారతములోఁ గథావేశమును మఱపుచెందించుభాగములు విశేషముగనున్నవని వారు వ్రాసియున్నారుకదా. అయినను వారిట్లు వ్రాసివేసిరి. భారతమునుగూర్చి రెడ్డిగా రింతతో విరమించలేదు. ఇంకను వారిట్లు వ్రాసిరి.

"సంస్కృతమున నానాజనులు నానావిధములఁదూర్చియున్న వెట్టి వెట్టివేదాంతములు ధర్మాధర్మములు మొదలగునసంబద్ధచర్చలతో నిండి చూచువారికి దిక్కులు తెలియనట్లు విపులముగఁ బెరిగి చీఁకుపొదవలె నుండు గ్రంథము భారతము (౨, 3) ఇప్పుడు వ్యాప్తిలోనుండుభారతము దాని కాదికవియైనవ్యాసుఁడు వ్రాసినదిగాదు. (ఇప్పటి భారతము 'జయ' యనుపేరిటి చిన్నవీరకావ్యముయొక్క పరిణామము. 'జయనామకంబునను రాజితభంగి జగత్త్రయంబునఁ బూజితకీర్తియై నెగడు' (స్వర్గారా) వ్యాసప్రోక్తము గొంతభాగముమాత్రము. గ్రంథము సుప్రసిద్ధమగుడు జైనులు, వైష్ణవులు, బౌద్ధులు, స్మార్తులు, వీరశైవులు, పౌరాణికులు మొదలగు తెగలవారందఱుఁ దమతమసిద్ధాంతముల నందులోఁ జొనిపి యాయితిహాసమును బాడుచేసిరిగాని, మూలకవియొక్క భావగాంభీర్యము గణనాతీతమగుటంజేసి యదియింకను బొత్తిగఁ బూఁడియింకి, నిర్మూలముగాకున్న యది. (౧౭౦) ఆరణ్యశాంతిత్రయములు ముక్కాలు మువ్వీసము కృత్రిమపర్వములు. తక్కినవానిలో నాదికవివ్రాసినఫక్కినే విశుద్ధముగ నీకాలమువఱకు వచ్చిన వెవ్వియును లేవు, గాని సహాసరికి శుభ్రములని యంగీకరింపఁబడఁజాలినవియ. కావ్యశోభనాపాదించు రెండు దుర్విపత్తులందుండుట రసికుల పాపఫలము! ఎవ్వియన. దుర్యోధనుఁడు పాండవుల నడవికిఁ దోలుటయొకటి. పండ్రెండేండ్లుగూడ నజ్ఞాతవాసమే విధించియుండినఁ బాండవులబ్రతు కెట్లయినఁగానిండు, మనకు వైరస్యములేని కావ్యశ్రవణానందముగల బ్రదుకు దప్పియుండదు పాండవులయరణ్యప్రవేశముచే మనకైన ప్రాప్తి యేమనిదెల్పుదు? దానికన్న నెన్నియోమడుంగులు క్లేశకరమగు వర్ణాశ్రమాదిధర్మములం గూర్చిన మతివిహీన దీర్ఘప్రసంగప్రవేశము. అరణ్యరోదనమఁట! దానికంటె దిక్కులేనిది కావ్యములలో వేదాంతరోదన! ఆధర్మరాజు శుద్ధముగవదరుఁబోతు! ఋషులను జూచినదే దండముఁబెట్టి దూరముగాఁ దననీడయైన వారికి సోఁకనట్లు తొలఁగిపోవుచుండిన నెంతపుణ్యముగా నుండును! కాలక్షేపార్థము అడిగినప్రశ్నలే యడుగుచు, నుత్తరము లెంతవిరుద్ధములుగనున్నను గంగిరెద్దురీతిఁదలయూఁచుచు నాయన సల్లాపములు సలిపె! మనకవి ప్రలాపములు! రెండవవిపత్తు ఏదియందురో ఆ

భీష్ముఁడు పెద్దమనుష్యునిరీతి గుటుక్కుమని చచ్చి జన్మసాఫల్యమునొందక కొన్ని నెలలు క్రిందఁబడియునికి! మనగ్రహచారముగానున్న భారతవీరుల నెల్ల నుత్తముఁడని పొగడ్తఁగన్నయాతఁడు పరస్పరాసంగతవిచారముల నెల్ల మననెత్తినిఁ గట్టియుండునా ? ఋషిసందర్శనము, భీష్మోపదేశము అను నీరెండుతరుణములు సాకులుగఁజేసికొని యీహిందూదేశములో నెన్ని వాదములు, వేదములు, మతములు, తత్త్వములుబయలువెడలెనో వానినన్నింటిని సులభముగ లోకులలోఁ బ్రసరింపఁజేయుకొఱకై యీ యుత్తమోత్తమకావ్యములో నిమిడ్చి దానిని కంటకపాషాణవన్యసత్త్వ భయంకరమైన మహారణ్యముఁగా నొనర్చిరి." (౧౭౦—౧౭౨) అని వ్రాసిరి. అపూర్వములైన వేదాంతధర్మశాస్త్రాదిప్రశంసలన్నియు రెడ్డిగా రసందర్భచర్చలన్నారు. ప్రశ్నలకవి సదుత్తరములుగావనియు, అడిగినవే అడుగఁబడినవనియు వ్రాసిరి. ధర్మరాజు వదరుఁబోతు గంగిరెద్దుఅన్నారు. భీష్ముడుచెప్పినవి పరస్పరాసంగతవిచారణలన్నారు. అందుచేత భారతము పాడయినది అని రెడ్డిగారు వ్రాసిరి. కథకుసంబంధించని భాగములన్నియు రసాభాసములని తలంచిరిగావున రెడ్డిగారి కివన్నియు అసందర్భములై పోయినవి. జైనాదులను భారతమాకర్షించిన దనఁగా నిట్టిఅపూర్వబోధన లుండుటవల్లనే అని స్పష్టమగుచున్నది. భారతము ప్రజలలో మిక్కిలిగా వ్యాపించియుండుట ఇట్టి యపూర్వబోధనలవల్లనే యని తెలియవలసి యుండఁగా రెడ్డిగా రన్యథా తలంచిరి. అనేకాపూర్వవిషయము లున్నవి గావుననే భారతము పంచమవేదమై ప్రసిద్ధినొందినది భారతములోఁబ్రతి చోటనుగూడ వర్ణాశ్రమాదులనుగూర్చియు, వేదాంతధర్మ నీతిశాస్త్ర ములఁగూర్చియుఁ బ్రసంగములు గలవు. రెడ్డిగారు కృత్రిమపర్వములని వ్రాసిన ఆరణ్యశాంతిత్రయములలోనే కాకుండ నన్నిచోట్ల నిట్టిప్రసంగ ములు గలవు. రామాయణములోఁగూడ నిట్టిప్రసంగములు గలవు. కథా ప్రవాహమే ముఖ్యమైనది. అనువిషయమును రామాయణభారతము లందేకాదు, ఏగ్రంథమందును రెడ్డిగారు సాధింపలేరు. భారతరామాయ ణములు రెండును రచనయందు భావనాశక్తియందుఁగూడ నద్వితీయ ములు. వాటిలోనున్న ధర్మశాస్త్రాదిప్రశంస లనవసరదీర్ఘప్రసంగములు

అని . రెడ్డిగారు వ్రాసినవి కేవల మసందర్భమైయున్నది. కథాభాగమే ప్రధాన మన్నందుకు రెడ్డిగా రింకను నిట్లు వ్రాసిరి.

"తెనుఁగున భగవద్గీతా ద్యసంగతప్రకరణములను సంగ్రహముగ వ్రాసి చదువరులకు నమందానందము నిచ్చునట్లు పరివర్తించినకవిత్రయము వారి రసజ్ఞతను అర్హతకొలఁదిఁ బొగడ నెవరితరము! ఇంకను సంకో చింపలేదేయని విచారముఁబూనదగుఁగాని యింతచేసిరిగదాయని దూ షింపఁజూచుట బుద్ధిపొరపాటు (3) పనికిమాలిన యలంకారములు వారి (భారతకవుల) కవిత్వమున నపరిమితములుగావు తుదకు వర్ణనములకుం బూనునపుడుసైతము కథయొక్క వేగమునకు భంగముగలిగింపనంత మిత ముగఁజేయుదురేకాని కథ మఱపునకువచ్చునంత దీర్ఘముగ నెప్పుడును సాగఁబెట్టరు. అనఁగా నిక్కమైనకవిత వీరియందునెలకొన్నదని నావిన్న పము. (౨౧, ౨౨) కథ కంటికిఁ గనఁబడనంతటికృశత్వము నొందియుం డుట ప్రబంధములలోనికొఱతలలో నొకటియని మునుపే చెప్పఁబడియెఁ గదా (౧౬) కవిత్రయమువారిచిక్కుల (అనవసరప్రసంగముల) విడఁదీసి విడిచి యాంధ్రభారతము మాతృకకంటె రసవత్తరముగనొనర్చిరి కాని, జనాపవాదశంకంజేసియేమో, వారు పూర్తిగా సవరింపలేదు" (౧౭౨) అని వ్రాసిరి. కథాసంయోగమే ప్రధానమనితలంచిన రెడ్డిగా రెన్నియో అసందర్భములు వ్రాయవలసివచ్చినది. భగవద్గీతాదులు అసంగతప్రకర ణములన్నారు.కథావేగమునరికట్టు అలంకారములురసవిహీనములన్నారు. కథ కంటికిఁగనఁబడనందున ప్రబంధములు పాడనిరి. కథామహిమయే కావ్యమహిమయన్నారు. అందులోను గాలక్రమమునువిసర్జించి (౧౬౬) కార్యక్రమమున వర్ధిల్లఁజేయునదియే ఉత్తమమార్గమన్నారు. అట్టివాఁ డాంధ్రమున నొక్కసూరనయే అన్నారు. (౧౭3) కాలక్రమములో నుద్వేగముతోఁ జదువుద మనుకుతూహల ముండదనియు, ముందేమి వచ్చునో చూతమని మనసు తహతహఁగొనదనియు(౧౬౭)వ్రాసి సూరన ఇందుఁ జూపినప్రతిభనుగూర్చి రెడ్డిగా రిట్లు ప్రశంసించిరి.

"కార్యక్రమమునఁ గథను వర్ధిల్లఁజేసినవారు ఆంధ్రప్రాచీనకవు లలో నాకుఁదెలిసినసూరన్నదప్ప నింకెవరును లేరు. బహుశః ఈమార్గ సంచారమునకు మొదలిడినవాఁ డితఁడేయేమో! (౧౭3) కార్యకారణ

సమ్మేళనముచే నేకీభూతముగా వ్రాయఁబడిన గ్రంథములలోఁ గళాపూర్ణోదయము ప్రథమము........కాలక్రమముంబట్టి చూచిన నీకథకు నాదిమభాగము పంచమాశ్వాసములోని సరస్వతీచతుర్ముఖులలీలాకేళి. అనఁగా సామాన్యకవులు వ్రాసియుండినఁ బంచమాశ్వాసము ప్రథమాశ్వాసమైయుండును. చూచితిరా! ఈకవియొక్కకూర్పులోఁ గథాప్రారంభమునకుఁ గావ్యప్రారంభమునకు నెంతదవ్వో? ఇట్లు దూరస్థములయ్యు నల్లికచెదరక జిగిబిగిగానున్నందున నియ్యవి గాఢాశ్లేషముం గాంచియున్నవి. కథ పూర్తిగాఁ దెలియుటకు నైదాశ్వాసములు చదివితీరవలయు. ఇఁక కథనెఱుంగవలెనన్న కుతూహలమన్నదో ప్రథమాశ్వాసములోనేయంకురితము! రంభా నలకూబరులవలనఁ గడపట వినంబడిన వాక్యంబు 'ఏమయ్యె నలకళాపూర్ణుసుద్ది, కడమ చెపుమన్న రంభ యప్పుడ తెలుపనె నీకు మఱిచెప్పరాకుంట నీకథయును, నీకు నాతోడు సుమ్మబ్బ నీకుమనియె' (కళా. ౧-౮౬) అనువారిసంభాషణ ఔత్సుక్యముఁ బ్రేరేచు విధములు చూడుఁడు. రంభ తనప్రియునికినైనఁ జెప్పరానికథయెట్టిది? ఏకారణముచేత నామె మౌనధారిణియాయె? ననుమొదలగు ప్రశ్నలు తమంతటనావిర్భవించి, సమాధానము తెలియువఱకుఁ గథనుండి మనలఁ గన్నెత్తనీకచేయును. కావ్యములలోని యేకీభావమనఁబడుగుణంబదియ. అనఁగా నొకపట్టున, నొకగుక్కగా సర్వముఁ గ్రోలమేనిఁ దనివినీయమి. భాగభాగముగాఁ జదువఁబోయినఁ దృప్తిలేదు. ఏలన, సమాప్తివఱకు నేభాగమునఖండముగాఁ దెలియఁబడమిచే. (ఆకళాపూర్ణుఁడెవరు? వెనుక నెంతవఱకు నాతనిఁగూర్చి రంభచెప్పెను. ఏది చెప్పరానివిషయము) అని పలికిన కలభాషిణిపలుకు లాయమ వేగాదు. మనవియును. మందుకొఱవి నెగఁద్రోసినట్లు నారదుండు 'ఇదంతయునపూర్వంబు నాకునుం జెప్పరాదు' అని యానతిచ్చుతఱికి మనయుద్రేక మాఁపరానిదయ్యెడు! అట్లు చెప్పరానందుకు నారదుఁ డిట్లు పలికెను. 'ఆ (కళాపూర్ణు) కథలిఁకఁజెప్పినట్టివారును వినినట్టివారును ధాత్రియందుఁ బుత్రపౌత్రప్రపౌత్రాది బహుసంతతియుఁ దనర్చుచుఁ జిరకాలంబు ప్రచురసంపదభివృద్ధి శోభిత శుభసౌఖ్యములఁగాంతురనుమాట యున్నదిగావున నేను నీకది చెప్పిన దీనికొఱకు నవనిఁ బుట్టంగవలయునోయని వెఱచెదఁ బ్రాణవల్లభ! యవి

తావకాంగ సంగసౌఖ్యమునఁ జేర్చునాకునిష్టంబులగు నే (కళా ౧-౨౦౧) నేను వినినట్టి పిమ్మట నిట్టిమాటపుట్టినది. అని రంభ నలకూబరునితోఁ జెప్పినది అనినారదుఁడుపల్కెను. ఈమాటలతో మనయొక్క యుత్కంఠ గొంతునను మీఁదుగాఁ బోవును! ఉత్కంఠకుఁ దోడు అద్భుతమును వచ్చిచేరును. ఎట్లన, కేవలనిరర్థక వ్యాఖ్యానమైన ఫలశ్రుతిఁగూడఁ గథలో ముఖ్యాంగముగఁ జేర్చినాఁడేయను విస్మయమొక్కటి! మఱి, యీఫలములు దేవతలకశుభములగుగావున వినవలయు ననుసంభ్రమ మింకను నుద్గాఢమగును. అయిన నీచరిత్ర మేరీతి భూలోకములో వ్యాపింపఁగలదని యాశ్చర్యపడమా? దేవలోకములోఁ బుట్టినదానిని (ఈకథను) దేవతలు దెల్పనపుడు మనకుఁ దెలియుటెట్లు? కథయేమో తెలిసియేయున్నది. లేకున్న నీకావ్యమెక్కడిది? నారదుఁడును, 'తనకట్టి భయముగలదుగావున చెప్ప'ననియెను. అయినను భూమి నిది విశ్రుత మగునని పలికెను. అతనివాక్యమమోఘము! అట్లగుట నెవ్వరికి నపాయంబునాపాదింపని యేమంత్రముచేఁ గవి యాక్రియసమర్థించునోయని యబ్బురపాటును దొట్రుపాటును జదువరులకుఁ దలమున్కలౌఁగదా! మనలనేకాగ్రావధానులం బరవశచిత్తులంజేయుటకంటె శిల్పసౌభాగ్య మెయ్యది? కల్పనయనఁగా నిట్లుండునదే కల్పన. ఊపిరియాడకుండు నంత యుద్వేగముంగల్గించునది. ఆధారవిషయమును గార్యముచేరోయఁబడిన కారణముగాఁ జూపుటయేగాదు. మీఁదియుదాహరణములంజూచిన నంగప్రాయములను చిల్లరవిషయములంగూడఁ గాలసరణిగ నీకవి వర్ణన సేయఁడని తెలియుచున్నది. రంభానలకూబరులాడుకొనుచున్న కళాపూర్ణగాథలు అటుతరువాతనడిచిన కలభాషిణీ నారదప్రసంగమునందేలు చున్నవి. దీనింబూర్చిన నిదర్శనము లీగ్రంథములో లెక్కకుమీఱి యున్నవి. (ఇచ్చట రెడ్డిగారు కళాపూర్ణోదయములోని నారదతుంబుర మాత్సర్యకథనుదాహరించిరి)" (౧౭౪—౧౭౮) అని వ్రాసిరి. కావ్యములలోఁ గథావిస్తారముమాత్రమే ప్రధానమగునెడల మొదటిమాఱు చదివినపుడు రెడ్డిగారుతలఁచినటుల నాతురత గల్గును. కథ తెలిసిపోవును గావున రెండవమాఱుచదివినపు డాతురత గలుగదుకదా. కథలోనుండు ఆతురతను జెడఁగొట్టుటకు రెడ్డిగారు కళాపూర్ణోదయము పుస్తకము

మొదటనే కథాభాగమును వ్రాసి ఆంధ్రుల కావ్యముల కావకాశమును గూడ పాడొనర్చిరే మో! కథాభాగము మాత్రమే కాకుండ అనేకాద్భుత విషయములు కావ్యములోనున్న యెడల యెన్నిమార్లు చదివినను రసము వెల్లివిరియుచుండును. అప్పుడు కథాభాగమును రసవంతమైయుండును. కథయే ప్రధానముగాఁ గల్గినవలలు (పుస్తకవిశేషములు) ఇందువల్లనే పునఃపఠనయోగ్యములై యుండకుండనున్నవి. కథాభాగముమాత్రమే ప్రధానముగనెంచి పింగళి సూరన్న కళాపూర్ణోదయము వ్రాయలేదు. 'ఈకవికులోత్తంసుని (సూరన్నయొక్క) కృతులఁ బలుమాఱు పఠించి కృతార్థులగుదురుగాక!' (3-23) అని వ్రాసి రెడ్డిగారు తమవిమర్శనపుస్తకమును ముగించిరి. వారు తలంచినట్లుగా రెండవమాఱు కథలో నాతురత యుండునా? ఎందుకుఁ బలుమాఱు చదువవలయును. అనుదానికి రెడ్డిగారేమిసమాధాన మొసంగెదరు? అందున్నకథోద్రేకమే కాక మీఁరి మెఱయురసప్రసంగము పునఃపఠనయోగ్యతను గల్గించునని రెడ్డిగా రంగీకరింపక తప్పదు. రసవత్తరమగు భాగములను వర్ణనాదులఁ జేర్చి కావ్యమునుబోషించుట నిజమైనకళ. అట్టి గ్రంథ మెన్నిమార్లు చదివినను తృప్తియుండదు. అదికారణమువల్లనే భారతరామాయణము లెన్నిమార్లు పఠించినను మిక్కిలి మిక్కిలిగా రసము వెల్లివిరియుచుండును. ఒక్క ఆగ్రంథములే యని అక్కఱలేదు. పూర్వకవులు వ్రాసిన ఏగ్రంథమైనను రసము వెల్లివిరియుచుండును భారతమే అసంగతప్రసంగములచేఁ బాడైనదన్నారు రెడ్డిగారు. భారతకవులు ఇంకను సంక్షేపింప లేదేయని విచారించిరి. అట్టిస్థితిలో మూలానుసరణముగ వ్రాయుచున్న కవిసార్వభౌముల భారతము రెడ్డిగారికి రుచించునా? వారిభారతాంధ్రీకరణము నిరర్థకక్లేశమని (3, 4 పేజీలలో) రెడ్డిగారు వ్రాసియున్నారు. మఱియు భారతాది కవులను, ప్రబంధకవులను విమర్శించుచు కథస్వకపోలకల్పితమైయున్నగాని నిక్కమైనకవితాశక్తి బయలువెడలదని రెడ్డిగా రిట్లు వ్రాసిరి.

'నన్నయాదులు సందర్భానుగుణములగు వర్ణనలందక్క నితర విధముల నూతనకల్పనలకుం దొడంగక సంస్కృతముననుండు కథాదిక విషయములం దెనింగించుటలోఁ దమశక్తిని ముఖ్యముగ వినియోగించిరి; అనఁగా నీకవులు మొత్తముమీఁద భాషాంతరీకరణకర్తలే కాని యపూర్వ

సృష్టిక్రియానిపుణులుగారు (౨) ఆ కాలమువారు రచనలకన్నిటికి ప్రబంధములు శ్రేష్ఠములనియు, ప్రాచీనకవుల కావ్యములకన్న ప్రశస్తములనియు నెంచినట్టు లనుమానమయ్యెడి. * ప్రబంధము స్వకపోలకల్పితముగానున్న నదియొక దోషమట ! శుద్ధముగఁ బూర్వవృత్తముగానున్న నదియు సరిపడదట ! కథ ప్రాచీనముగాను వర్ణనలు నవీనముగాను నున్న సానవెట్టిన జాతిరత్నములవలె నిగనిగలాడునని రామరాజభూషణుని యభిప్రాయము. ఈసిద్ధాంతమ యనివార్యమని యెంచితిమేని, కళాపూర్ణోదయము కేవల కవికల్పితమైన కథ గావునఁ బ్రబంధములలో చేరనిదగును. ఈబహిష్కారము కష్టముఁగాదు ! నష్టముగాదు ! మఱిగొప్పతనమున కొక కారణమనియుఁ జెప్పవచ్చును.' (౬౪) అని వ్రాసిరి. ప్రాచీనకవుల కావ్యములకన్నఁ బ్రబంధములు శ్రేష్ఠములని ప్రబంధకారులుగాని ఎవ్వరుగాని తలంచలేదు అట్లు తలంచినవారు రెడ్డిగారొక్కరే! యావద్భారతదేశకవులందఱును రామరాజభూషణునియభిప్రాయానుసారముగా నాద్యసత్కథలు తీసుకొని రచించినవారే. రామరాజభూషణునిభావము రెడ్డిగారికవగాహనకాలేదు. స్వకపోలకల్పితకథ వ్రాయనందున భారతకవులందుఁ బ్రబంధకవులందుఁ గూడ నిక్కువమైనకవితాశక్తి బయలుదేరుట కవకాశములేకపోయినదని వ్రాసి రెడ్డిగారు ప్రబంధముల కథాసారము నిట్లు ఆక్షేపణపూర్వకముగ వ్రాసిరి.

'సామాన్యకవులతోఁ బోల్చిచూచిన సూరన్నకళాకౌశల మింకను వైశద్యముతో వెలుఁగును. మనప్రబంధములు తఱుచు కథానాయకుఁడగురాజు అనునొక్కపాత్రముతోఁ బ్రారబ్ధములు. ఆయననుగూర్చిన యప్రస్తుతవర్ణనము ముగియుటమఁ బట్టునది యొకగంట. పిమ్మట నర్మసచివుఁడో యెవఁడోయొకఁడు వచ్చుట, అటుతర్వాత వేఁటవెడలుదురేమొ. అక్కడనొక సఖీజనపరివేష్టితయగు కోమలాంగిని జూచి రాజును

---

*ఉ. కేవలకల్పనాకథలు కృత్రిమరత్నము లాద్యసత్కథల్
వావిరిఁబుట్టురత్నము లవారితసత్కవికల్పనావిశే
షావహపూర్వవృత్తములు సానలఁదీఱిన జాతిరత్నముల్
గావున నట్టిమిశ్రకథగా నొవరింపుము నేర్పు పెంపునన్. (వసు)

విదూషకుఁడును (నర్మసచివులు విదూషకులుగనుండుటయు విదూషకులు నర్మసచివులుగనుండుటయు హిందూరాజధర్మమగదా!) రెండుగంటలొకరితో నొకరు శ్లేషలు, అతిశయోక్తులు, ఉత్ప్రేక్షలుఁ జెల్పునప్పటికి నిది దయ్యాలతో నిండినకావ్యమని దూరముగఁ బాఱవైతుము! కళాపూర్ణోదయముతో నుపమింపఁదగినది, మూలము స్కంధము సామాన్యములయ్యు, వివిధగతుల దెసలవ్యాపింప శాఖోపశాఖలుగలిగి కనుల పండువుగ నుండుమహావృక్షము. సామాన్యప్రబంధములు, కొలుకులు. ఒకదానివెంట నింకొకటి యతికించుటచే నేర్పడిన గొలుసులువంటివి. ఐక్యము వీనిలో లేదు. ఎన్నికొలుకులైనఁ జేర్పవచ్చును. ఎన్నియైనఁ దీసివేయవచ్చును. వైపుల్యము దక్క నింకెద్దానికిని లాభనష్టములుండవు. ఆకృతిమాఱదు. వృక్షములు మొదలగు సజీవములవలెనుండు కావ్యముల నేయంగమునైన ఛేదించుటకుఁగాదు. నూతనాంగములఁ జేర్చుటకుం గాదు ఎట్లుచేసినను పరిణామభేదమేగాదు, ఆకారమును వికృతమగును. ఐక్యమను కథాలక్షణమును బరీక్షించుపద్ధతియేదనఁగా, ఉన్నభాగములఁ దీసివేయవచ్చునా క్రొత్తవియేవైనఁ జేర్పవచ్చునా యని విమర్శించుట. ఈకార్యములుపొసఁగనివైన నైక్యము స్ఫుటము, సాధ్యములైన నైక్యభావమపక్వము (౧౯౦, ౧౯౧) ఇదేభావము ప్రబంధములకథాసారమని కొంతమార్పుతో ౭౭-౭౮ పేజీలలో రెడ్డిగారు వ్రాసియున్నారు. మఱియు నిట్లువ్రాసిరి. 'ప్రబంధవర్ణనలు తావుమార్చవచ్చును. ప్రథమాశ్వాసములోనిది ద్వితీయమునకుఁ బరివర్తించినను లోపముగాఁ దోఁపదు. మఱిబొత్తిగాఁదీసివేసినను, ఇక్కడ నేదియోయుండవలయు నను సంకోచము గల్గదు. అప్రస్తుతములనుటకు నీకారణములు చాలవా? (౨౮౪) ప్రబంధములలో కథ ముఖ్యముగాదు. మఱి వర్ణనలకు నవకాశమబ్బుటకై తెచ్చిపెట్టుకొన్న నెపము. అనఁగా వర్ణనలు కథాసాంగత్యములేనివనుట. సందర్భశుద్ధిలేనివనుటకు పర్యాయవచనము' (౭౪) అని వ్రాసిరి. ఇందువలనఁ గథనువిడిచి ఒక్కఅడుగుకూడ ముందుపెట్టకూడదని రెడ్డిగారుస్పష్టపఱచిరి. కథయేలేని గ్రంథములుగలవే వాటివిషయమై రెడ్డిగారేమందురోకదా! విశ్వగుణాదర్శములోఁ గథ[illegible]లేదు. [illegible] గ్రము రసవత్తరముగనుండును. గంగవంశానుచరిత[illegible]

కావ్యమందు ఆనాఁటికున్న కళింగరాజ్యములు, ఆరాజులవంశములు, పుణ్యక్షేత్రములు వింతయంశములు వర్ణింపఁబడియున్నవనియు అది కావ్యముగాను, చరిత్రాధారముగానుగూడ ముఖ్యమైనగ్రంథమైయున్నదనియు, లీలావతీ విద్యార్ణవులసంభాషణరూపముగా నాకావ్యము వ్రాయఁబడియున్నదనియుఁ గళింగదేశచరిత్రలో (33౨ పేజీ) వ్రాయఁబడియున్నది. కథ ప్రధానముకాని అనేకములగు కావ్యములున్నవి. అవన్నియు రెడ్డిగారసందర్భములందురేమొ. వేదము, భారతరామాయణములు, పురాణములు, ప్రాచీనకావ్యములు అవియివియననేల భారతదేశములోఁబుట్టిన ప్రతికావ్యముగూడ కథనునిమిత్తముగఁదీసికొని అధ్యాత్మవిషయమునో, ధర్మమునో, నీతినో బోధించునవియైయున్నవి. సందర్భము గలిగించుకొని కవులీవిషయములను వ్రాసియున్నారు. కథాభాగమే ప్రధానమగుకావ్య మేదియుఁగూడ ఒక్కఆంధ్రదేశములోనే కాదు. యావద్భారతదేశమందుఁగూడ లేదు. రసవత్తరములగు చక్కనివర్ణనలఁగావించి కావ్యమును రసవంతమొనరించుట రసవత్తరమనుభావము రెడ్డిగారికెందులకుఁ గలుగలేదోకదా! మఱియు కల్పనాకథను వ్రాయుటచే సూరన్నకు మంచిఅవకాశము గలిగినదని రెడ్డిగా రిట్లు వ్రాసిరి.

'సూరనార్యున కీయుద్యమముచేఁ గలిగిన మేలుగిడు లెవ్వియన: అపూర్వకథాసంవిధానమునకుం బూనుటచే నుపజ్ఞకు భావనాశక్తికిని మంచిప్రవేశము దొరకినది. ప్రాచీనకవు లితరులకథల భాషాంతరీకరించినవారగుటను, ప్రబంధకవు 'లాద్యసత్కథ'లైకొని కైసేఁతలకుందొడంగుటచేతను, ఆయిరుదెఱఁగుల కృతికర్తలయందును మాతృకలులేని యెన్నికలును భావనాశక్తియువ్యాపించుటకుఁ దరుణము కఱవాయెను. కళాపూర్ణోదయము సామాన్యప్రబంధములకంటె నెక్కువరసవంతముగ నుండుట కిదియొకకారణము. మఱి భారతమంత సరసముగానిదగుటకు మూలమేమనఁగా సర్వలక్షణములును బలాత్కారమునన్తైనఁదెచ్చి రాసివేయవలయునని కవి (మొదటనే అనఁగా కావ్యారంభముననే) సంకేతముచేసికొన్నవాఁడగుటచే కథ సహజముగఁ బక్వమునకురాక యచ్చటచ్చట నూఁదరవేయఁబడియుండుట (౮౫, ౮౬) కథయు ప్రకృతియందలి వస్తువులవలెఁ దనంతటఁ దనయందలిసత్త్వముంబట్టి పుట్టి పెరుగుగుణము

గలది. దానినిసాజముగ పెరుగనిచ్చి, యప్పుడప్పుడు సవరించుచు సంస్కరించుచు దోహదముచేయుచువచ్చినమేలా? మొదటనుండియే యీ యీారసములు తప్పకయిచ్చెదు దానిని గల్పించెదనుఅని సంకల్పించుకొని పిమ్మట దానియుత్పత్తిఁజేయఁజూచుటమేలా? యోజింపుఁడు (౮౮, ౮౯) అని వ్రాసిరి. రెడ్డిగారియూహానుబట్టి కవి కల్పితకథనే వ్రాయవలసియున్నది. అట్లు వ్రాయుచు ఆకథయెట్లుసాగిన నట్లు వ్రాయవలసియున్నది అంతే కాని తనయిష్టమువచ్చినట్లు కవి వ్రాయఁగూడదనిరి. అట్లు సాగనిచ్చి సంస్కరించిన యెడలఁ గావ్యము శోభించునని రెడ్డిగారియభిప్రాయము. దీనిచేఁ బుణ్యకథలు, చరిత్రములు, జరిగినసంగతులేవిగాని వ్రాయుట నిక్కువమైనకవిత కాదని వారు తేల్చిరికదా. వీటన్నిటియందు యథేచ్ఛాసంచారమున కవకాశముండదుకదా. రెడ్డిగారింతతో విరమించలేదు. మఱియు నిట్లు వ్రాసిరి.

'సీత, ద్రౌపది, సావిత్రి, దమయంతి, శూర్పణఖ మొదలగుస్త్రీలు కవికల్పనమునకుఁ జేరినవారయ్యును మనకుఁ జరిత్రములలోని స్త్రీల కంటెను మఱియు మనము నిత్యమును జూచుచు వాదాడుచునున్న యిరుగుపొరుగుభాగ్యశాలినులకన్నను నెన్నియోమడుంగులు సత్త్వముం దాల్చినవారై స్ఫురించుచున్నారుగదా? చూడంబోయినఁ బాండవులు, దుర్యోధనాదులు, రామభరతులు మొదలగు మనస్సృష్టిమానవులు మిథ్యలా? మనమె మిథ్యలా? ఈతీరునఁ గృత్రిమములసయితము మూర్తీభవింపఁజేయువారే మహాకవులు (౮, ౯) శిల్పములు రచించుటలో స్వప్రతిభప్రకారము పోవలయునేగాని యలంకారశాస్త్రజ్ఞులు, ప్రాచీనకవులు వీరిననుకరించుచు ప్రతికల్పనలంజేయఁజూచుట పొసఁగ రానిమతమని మున్నే చెప్పఁబడియుంట ఏలకో మనకవు లీనాటికిని రుక్మిణీపరిణయాలు సుభద్రాపరిణయములు వ్రాయుచుండుట. పాపము పెండ్లాడి పెండ్లాడి వారలలసిసొలసి విసుగెత్తియున్నారు. వారికి (పించర్) విశ్రాంతిప్రతిపాదింపకున్న నెంతయు ఘోరము (౮౩) కొన్నియెడలఁ బ్రకృతికిమీఱినవర్ణనములంజొనిపినను వికారము దోఁపకుండుటయేకాదు, అస్వాభావికమనియు సామాన్యముగ నెవరికిఁ దట్టవు? ఉదాహరణము. హితోపదేశము (ఇందు జంతువులు మనుష్యభాషణముల

మాట్లాడినట్లుగలదు) (౮౯) (మఱియునీ) హితోపదేశమునకు నెన్ని యో. మడుంగులు మిన్నయనందగు బృహత్కథ (వేదము వేంకటరాయశాస్త్రి గారిది) యుండలేదా? భారతభాగవతరామాయణాదులలో మృగపక్షి వితానములు దేవమనుష్యభావములం దాల్చినవిగావా? (రామాయణములోనిది మితిమీరినదని కొందఱభిప్రాయము) మఱియు, అస్త్రములు, కామరూపధారణము, భూతభేతాళవశీకరణము, ఇత్యాదిమహేంద్ర జాలములు పుంఖానుపుంఖముగ గ్రంథములనేకాదు తరతరములుగ తల్లిబిడ్డలుచెప్పుకొనెడు ఊఁకుదుకథలందును గానంబడియెడి (౯౦) నీతి చంద్రికను (అందును జిన్నయసూరిగారిది) చదువునపుడు అదేదోయొక లోకమైనట్టును, అందు పావురములు కాకులును గాట్లాడుటమాని మాట్లాడుట సామాన్యమయినవిషయమైనట్లును మనకుఁదోఁచుననుటకు ప్రత్యక్షానుభవమే తార్కాణ. ఇట్లే పదితలలరావణుఁడు, మూఁడుతలల త్రిశిరుఁడు, ఖరుఁడు, మహిషుఁడు, జాంబవంతుఁడు, హనుమానుఁడు, వేయికన్నులయింద్రుఁడు మొదలగు పురాణపురుషులును, విపరీతములు సైతము సత్యములను భ్రమఁగల్పించునాధారము లెవ్వియనఁగా:—(౧) ఇప్పటిదేశకాలములకు సంబంధములేనంతదవ్వులైన యుగములలోనో లోకములలోనో అట్టికథలు నడిచినట్లుచెప్పుట. అట్లుచేసిన మనకుం బ్రసిద్ధములగుహేతువులంబట్టి సత్యాసత్యనిర్ణయముం జేయఁబూనము. (౨) ఇట్టిప్రకృత్యతీతముల వర్ణించుచో నున్నట్టుండి యాధునికములు సామాన్యములునైన సంగతులనువేయఁగూడదు. వేసిన జాలమునకు భంగము. ఆమాయను స్థిరముగఁ బోషించునట్టివర్తమానములఁ బొందించుచు నేకధోరణినేయేగుటయుత్తమము. కళారచనలో గమనింపవలసిన విషయమేమన, రసాభాస మేమాత్రము గలుగనంతపొందికయున్నదా లేదాయనుట. విషయము ప్రకృత్యతీతమైననేమి, ప్రకృత్యధీనమైననేమి? విషయముకన్న రీతి శిల్పములంబ్రధానము (౯౨, ౯౩) ఈకాలమునబిడ్డలెట్లో పూర్వకాలమునఁ బెద్దలునట్లే. అనఁగా ప్రకృతిజ్ఞానమంతగాలేనివారనుట. ఇదియెగదా ప్రాచీనగ్రంథగాథాపురాణములలో మనసమ్మికకు నందలియద్భుతములు విస్తారముగఁజెప్పఁబడియుండుటకు మూలము! ఆ పురాణకవులకు నవి యస్వాభావికములుగఁ దోఁచియుండవుగాఁబోలు!

వారు ఘనమైననమ్మకము విశ్వాసమునుంచి వ్రాసిరి. కావుననే మనకును నవిశ్వాసము అంతగాఁ బుట్టకుండుట ఇప్పటివా రారీతివ్రాయఁజూచిరేని యసాధ్యమనిచెప్పఁగాదుగాని యెంతోశిల్పనైపుణ్యములేనిది యవి కృత్రిమములుగఁదోఁచుఁగాని నిక్కములట్లు భ్రమగొల్పఁజాలవు. కావున నాటకములలోను గావ్యములలోను నాగాస్త్రము గారుడాస్త్రమును బ్రయోగింపకుండుటయు మొత్తముమీఁద సుగుణము. అట్లుగాదని వాని నావాహనముఁజేయువారు వానితో నాగ్నేయాస్త్రమునురప్పించి గ్రంథమంతయు నాహుతిగానిచ్చినయెడ లోకమున కెంతేనుపకారము చేసినవారగుదురు' (%3,%8) అని వ్రాసిరి. స్వప్రతిభఁజూపుటకుఁ గవి స్వకల్పితకథనే వ్రాయవలయుననియు, పూర్వసంబంధమును విడనాడి నూతనకథనుసృష్టించివ్రాయుట నిజమైన కవితాలక్షణమనియు వ్రాసి సంస్కృత రామాయణభారతపురాణాదులన్నియు యథార్థములుగావనియుఁ గవి కల్పనకుంజేరినవనియు రెడ్డిగారు తేల్చివేసిరి. పూర్వకవులు అపూర్వసృష్టిక్రియానిపుణులని సాధింపఁబోయి రెడ్డిగారు భారతాదులన్నియుఁ గల్పితమని తేల్చివేసిరి. ఇదిగాక మనపూర్వులు ప్రకృతిజ్ఞానములేనివారన్నారు. అపూర్వసృష్టిక్రియానిపుణత్వము సాధించుటకై భారతాదులన్నియుఁ గవికల్పితమని తేల్చుచు మఱియొకరసాభాసమును రెడ్డిగారు వ్యక్తము చేసుకొనిరి. కాళిదాసు భవభూతి మొదలగు సుప్రసిద్ధమహాకవులందఱును ఆద్యసత్కథలను వ్రాసినవారగుట అపూర్వసృష్టిక్రియానిపుణత్వము గలవారు కారనియు నిక్కువమైనకవిత వారియందు లేదనియుఁ దేల్చిరికదా. ఇట్టిఅసందర్భము వారివ్రాఁతలో స్పష్టమగుచున్నదని వారు గ్రహించిరో లేదోకదా! కవిత్వతత్త్వములో రెడ్డిగారు సమస్తమును విస్మరించినట్లు కనఁబడుచున్నది. చరిత్రవిమర్శకులు రామాయణభారతాదులు కొంత యథార్థములని చెప్పుచు అవినడచినకాల మంతప్రాచీనము గాదనియు ఇంకను దగ్గరయనియు వ్రాయుచున్నారు. రెడ్డిగారో అతి ప్రాచీనయుగములకు అనఁగా నేకాలముతో సంబంధము లేనికాలమునకుఁ ద్రోసివేసిరి. అనఁగా నవి కల్పితములనియు అందులోనిపాత్రలు కల్పితములనియు రెడ్డిగారు తేల్చి వ్రాసిరి

# కవిత్వతత్త్వవిచారవిమర్శనము.

---

## శ్రీయుత కట్టమంచి రామలింగారెడ్డిగారి పుస్తకవిమర్శనము.

---

### ప్రబంధములు - అలంకారములు

స్వకపోలకల్పితకథలు వ్రాయనందున స్వశక్తి (నిక్కమైన కవిత్వము) మనకవులందు బ్రకాశింపలేదని రెడ్డిగారు వ్రాసిరికదా. స్వబుద్ధి నుపయోగింపకపోవుట యను దోషముమాత్రమేకాక అలంకారశాస్త్రముల ననుసరించుటవలన మఱియుఁ బాడయినదని వ్రాసిరి. అందువలనఁ గృషిలేనివ్యాపారమైనదని వ్రాసిరి. ప్రబంధములనుగూర్చి వారిట్లు వ్రాసిరి.

'(ప్రబంధములలోఁ) గథముఖ్యముగాకపోవుట మాత్రముగాదు. ఒకేయంత్రశాలలోఁ జేయఁబడినసరకులవలె నీకథలన్నియు నించుమించు ఏకస్వరూపముందాల్చినయవి. అనఁగా చర్వితచర్వణమునకుం జేరినయవి. (అందువలనఁ బ్రబంధములకథలన్నియు నించుమించు నొకేవిధమున నున్నవి.) (౬౫, ౬౬) పాత్రములన్నియు నొక్కతీరుం దాల్చినబొమ్మలు. అలంకారశాస్త్రప్రకారము చెక్కఁబడినవి. ఆయాకావ్యములలోనిపాత్రములు నిర్జీవముల యట్టుండుటతోఁబోయిన నెంతోపుణ్యము! అన్ని కావ్యములయందలిపాత్రలును ఒండొంటిననుకరించునట్టి ప్రతిబింబములు. పేరుఊరుమాత్రము మార్చియుందురు. ఇంకనీమాత్రముఁ జేయక వ్రాయఁగడంగనగునా? స్వభావము, చరిత్రము, నడవడి, తీరు మొదలగు లక్ష్యగుణములన్నియు నెరవలిసొత్తులు' (౬౮) అని వ్రాసిరి. ప్రబంధకవులు కథను నిమిత్తముగఁ జేసికొని అనేకాద్భుతవర్ణనలచేఁ 'బ్రంధముల కందముఁగూర్చియున్నారు. అట్టిప్రజ్ఞ లేనందుననే రసము లేనికథలు (నవలలు) పుంఖానుపుంఖముగా నేఁడు బయలుదేరుచున్నవి. కథాసరళి ఈ నవలలన్నిటియం దొకేమాదిరిగనుండును. చిల్లరమార్పులు కొద్దిగానుండి

నను బ్రథానవిషయములో నొకేరీతినుండును. రసమన్నదిలేని ఈనవలలు అథోగతినున్నవి కదా. అట్లు గాకుండ నిలిచియుండిన ప్రబంధముల యొక్క ప్రతిభ ఆవర్ణనలందేయున్నది. కథామార్గ మెుకేవిధముననున్నను ఏప్రబంధము చదివినను గూడ రసముట్టిపడుచుండుట కీవర్ణనలేకదా కారణము. ప్రబంధములలో నిట్టి స్వారస్యముగలదని రెడ్డిగారుగూడ సమ్మతించియున్నారు. వారిట్లు వ్రాసిరి.

‘ఉపజ్ఞ మనకు ఘటిల్లదేని యది యొకగొప్పలోపమని చింతించుట మనప్రకృతి. రామరాజభూషణుఁడు కథాకల్పనలయందు ఉపజ్ఞలేకుండిన నెంతో మేలని యాదేశించెను గదా! ఇది యస్వాభావికమైన తలపోఁత. వర్ణనలయం దుపజ్ఞ వ్యాప్తికివచ్చిన గృతికి సానవెట్టినట్లని యాతఁడు నెలవిచ్చి, యాపద్ధతికి నిదర్శనము నేర్పఱుచుటకో యనఁ దనరచించిన వసుచరిత్రములో నత్యద్భుతములు ననన్యసాధ్యములు నైనవర్ణనలు బహుచమత్కారముగఁ జేసియున్నాఁడు. ఈమహాకవిచందమునఁ గొన్నిరకములవర్ణనములు చేయువారెవరును లేరు. ఈవర్ణనలయందు దోషములు లేకపోలేదు. అందు ముఖ్యములు: అవి కథావేగమునకునడ్డులు. కథయే లేదు, కథావేగమెక్కడిదియని యాక్షేపించితిరేని నాకుసమ్మతమే. ప్రత్యేకముగఁజూచిన మనోహరములైనను గథాంగములతో పొందికలేనివి. భావనాశక్తిచే నప్రయత్నము ననర్గళమునుగావచ్చిన స్వచ్ఛందధారలు గావు. మఱి సామ్యశక్తిచే బలాత్కారముగఁ దేఁబడిన యుపమోత్ప్రేక్షలు. సామ్యమంటిమి. వసుచరిత్రములోని సామ్యములు వస్తుస్వభావములంబట్టి తటస్థించినవియుంగావు. మఱి నామాదిభాషాశక్తిచేఁ గృతములైనయవి. శ్లేషచే నుత్పత్తికివచ్చు నలంకారములవలె గొడ్డువాఱిన నీరసభావములు వేఱొండులేవని వక్కాణింప నుద్యుక్తుఁడనైనందులకు మీా క్షమాపణము వేఁడెదను.' (౭౮, ౭౯) అని వ్రాసిరి. కథతో సంబంధము లేదుగావున నట్టివర్ణనములు నీరసములని తలంచుట అవివేకము. ప్రబంధకవులు కథాభాగము చక్కఁగా నడువవలసినచోట నట్లుగా నడిపియున్నారు. వర్ణనలు పెంచివ్రాయవలసినచోట నట్లు పెంచి వ్రాసియున్నారు. ఆయథార్థమునుగుర్తింపక రెడ్డిగారు నిస్సారమైన ఆక్షేపము గావించిరి. వసుచరిత్రములోని శుక్తిమతీకోలాహల (నదీపర్వత)భాగము

అద్భుతమైనది. సామ్యములను సొగసుగాఁ జూపుట కవితానైపుణ్యము. భాషాశక్తిఁజూపుటగూడఁ గవిత్వనైపుణ్యమే. భాషయు, అలంకారరచన కవిత్వమునకు దోహదములు. అలంకారములనుగూర్చి రెడ్డిగా రిట్లు వ్రాసిరి.

'ఒకానొకవిద్వాంసుఁడు గొప్పగ్రంథమున కొకదానికి విమర్శన ప్రాయమైన పీఠిక వ్రాయుచు నాగ్రంథమును బ్రశంసించుటకై యిందుఁ బదునెనిమిదివిధములయిన వర్ణనము లున్నవియని దృష్టాంతములతోఁ జూపియున్నాఁడు. ఇది దోషము గాదుగాని పొరపాటునకు వీలిచ్చెడు పద్ధతి. ఎట్లన, విడివిడివర్ణనములఁజేయుటలో సామర్థ్యముంజూపెనేని యామాత్రమే కవియొక్క ఘనతకుఁ జాలునని భ్రమింతురా? చూడఁబోయినఁ బదునెనిమిదివర్ణనలుండిన నెవరికిఁ బ్రీతి; లేకున్న నెవరికి నష్టము! వర్ణనములకన్న ముఖ్యమైనవిషయ మేదనఁగా, కావ్యమునందలి యంగాంగములకుంగల కలయిక. పొత్తుపొసగనివర్ణనలు రసమునకుం బ్రతికూలములు. సంగీత మెపుడును హృద్యము. పాటపాడువాఁడు, మృదంగము వాఁడు, పిడేలువాఁడుగలసినట్లువర్తించిననా దానిసొంపు, అట్లుగాక ప్రతివాఁడును ఇష్టమువచ్చినట్లు దనయావచ్ఛక్తి నక్కడనే విని యోగింప ప్రయత్నించిననా? తనంతట ప్రత్యేకము వాయింపఁబడునప్పు డెంత యో మనోహరముగనుండు మద్దెలమెట్టు సందర్భశుద్ధిని మీఱి వెలయింపఁబడినచోఁ జెడ్డరోఁతగనుండుననుట కేమి సందేహము! అట్లే పురపుష్పలావి కలవర్ణనములు వ్యష్టిని జూచిన నెంతబాగుగ నున్న నేమి? సమష్టితో సంబంధము లేనికూఁతగానున్న నవి దుష్టములే. స్త్రీపురుషులయాకార సౌందర్యములు నిట్టులే. అంగములన్నియు వేలువేలుగా శస్త్రవైద్య శాలలోబలె విభజింపఁబడియుండినచో వానిని గన్నెత్తిచూడ సుకుమారమానసులకునౌనా? మఱి చెలువంపుఁదనమునకు జీవనమైన లక్షణము అంగములసాంగత్యము. లోకములోనుండు వర్ణనీయాంశముల నన్నింటిని నొకచోటఁ బ్రోగుచేసియుంచిన నది సర్వవికారముల కాస్పదమైనకుప్పయగును! సీతమ్మకు ముక్కుసొగసు, రుక్మిణమ్మకు కన్నులుసొగసు, కావున నీయమ్మముక్కును ఆయమ్మ కన్నులనుదీసి బ్రహ్మదేవుఁడు వేఱొక పెద్దమ్మను సృజించెను! కావున నీముూఁడవయమ్మ సీతారుక్మిణులకన్న

రెండింతలు సొగసుకత్తెయని వ్రాయువారికి శిల్పముయొక్క తెలుంగను వాసన యేమాత్రమైనఁ దెలియునని వచింపనౌనా? సీతమ్మముక్కు సొగసన్న నర్థమేమి? సీతమ్మయొక్క ముఖము మొదలగు నవయవములతోఁ జేరికకల్గియుండుటచే, ననఁగా నాస్త్రీయొక్క యాకారముంబట్టి యది చక్కనిదనుటగాని, యాముక్కును గోసికొనిపోయి యింకొకచో నుంచి నను నదేరీతిసొగసుగా నుండుననియర్థముగాదు. కావున నంగీకారములేని వర్ణనలు ప్రత్యేకముగ నెంతయద్భుతములుగా నున్నను నింద్యములే (36-38) (ప్రభావతియొక్క) నాభియనునది గంభీరమైన చెలువఁట! నూగారు మన్మథుని చిమ్మనఁగ్రోవియఁట! పయ్యెద యనువలలో బయటఁ బోయి విహరించివత్తమని కుచకుంభములు పక్షులరీతిఁ గొట్టుకొనుచున్న వఁట! బొడ్డునొకసొగసు! అదిపొన్నవిరి! ఆయమ్మ యూరువులు ఏనుఁగు తొండములకంటె నెక్కువ! అన్నింటికైనను మీాఱిన తుచ్ఛసామ్యముం జూడుఁడు. జంఘలు శాలిగర్భములు. వజ్రాలకాంతినీళ్లు. అందెలు మళ్లు మీాఁగాళ్లుకచ్ఛపములు! బురద యేమో కవి చూపలేదు! ఒకవేళ నీవర్ణనమే కాఁబోలు! ఇట్టి బలాత్కారోపములకుం బూనినచో గాడిదె, గుఱ్ఱము, కోతి, కొంగ, మొదలగు ప్రపంచములోని యేవస్తువుతోనైన స్త్రీలఁబోల్చి వర్ణింపవచ్చుఁగదా! సరేకాని నాకొక సందేహము. ఇంతవిశదముగ భాగభాగమును బెదవులచప్పరించుచు శుచిముఖి వర్ణించెఁ గదా. దానికీయంగోపాంగదర్శన మెట్లబ్బెను? పూర్వము కన్యామణులు కోకలువిప్పి తాండవమాడుచుంటగలదా! లేక యందఱికిని వస్త్రములను మానమును వ్యర్థముచేయు దివ్యదృష్టియుండెనా?' (౧౨౦) అని వ్రాసిరి. పాటవానిపాట ననుసరించి ఫిడేలు మృదంగము వాయింపఁబడును. పాట పాడువాఁడు తనపాటనునిలిపి ఫిడేలువానికి మృదంగమువానికి నవకాశ మిచ్చును. అందు వారు ప్రజ్ఞను సంపూర్ణముగఁ జూపుదురు. ఏకకాలమున ముగ్గురుకలిసి పనిచూపుదురు. వారు ప్రత్యేకప్రత్యేకముగ నైపుణ్యము గనఁబఱచుచున్నప్పుడు శ్రోతలుపాట లేదేయనిగాని, మృదంగము లేదేయనిగాని, ఫిడేలు లేదేయనిగాని విచారింపరు పాటనువిడిచి ఇట్లు వాయింపవచ్చునా యని తలఁచువారు అరసికులనిపించుకొనరా! అట్లు తలంచువారుందురాయని గూడ నిప్పట్టున విచారింపవలయునుగదా!

ప్రత్యేకనైపుణ్య ప్రదర్శనసమయమందు దేనికది మిగిలి హృద్యమైయుండునుగదా. అట్లే కవి భాషలోను, అలంకారరచనలోను నైపుణ్యము గనుపఱుపవలయునుగదా. అట్లుగాక కథమాత్రము చెప్పుకొనిపోవుట కవిత్వ మనిపించుకొనునా? పుష్పలావికలవర్ణనలు మొదలగునవి మనోహరములై కావ్యమునకు సొబగుగూర్చునవియైయున్నవి. కావుననే అట్టివి కావ్యశోభయన్నారు మనవారు. మఱియు రెడ్డిగారు వ్రాసినట్లు అంగాంగములసాంగత్యవర్ణనము ప్రధానమైనదే. కాని అంగముల ప్రత్యేకవర్ణనముగూడ మనోహరమైనదేయని యెఱుంగవలయును. కవు లీరెంటినిం గూడ వ్రాసి అందముగూర్చియున్నారు. ఎట్లు వ్రాసినను వర్ణనీయాంశము గోచరించును. కావున కావ్యములలో రెండువిధములగు వర్ణనలు గూడ స్వారస్యములే. మఱియు లోకములోనున్న వర్ణనీయములన్నిటి నొకచోగలట్టు వర్ణించుటయు స్వారస్యమైనదే. సీతమ్మకు ముక్కు అందమైనది అనఁగా నర్థమేమి? జనసామాన్యము ముక్కులుకన్న నాముక్కందముగానున్నదని కదా. అనఁగా నితర శరీరభాగములు సామాన్యముగనున్నను ముక్కు అందముగ నున్నదన్నమాట. అట్లుగనే రుక్మిణమ్మ కన్నులసొగసుగూడ. అట్టి అందములన్నియు నీస్త్రీయందున్నవి యనఁగానేమి? ఈస్త్రీ అవయవములన్నియు మంచి అందముగా నున్నవనుభావమేర్పడును గదా. వేములవాడ భీమకవి శ్రీరాముని ధనుర్విద్యాప్రభావముంగూర్చి ఇట్లు వ్రాసియున్నాఁడు.

చ. హరుఁడధికుండు వింటికిఁ బురాంతకుకంటెఁ గిరీటి మేటి శం
కరపురుహూతనందనులకంటెను రాముఁడు నేర్చు నిందుశే
ఖరకపికేతుభార్గవులకంటెఁ గుమారుఁడు మీరు నంబికా
వరనరజామదగ్నిశితివాహుల కెక్కుడు రాఘవుం డిలన్.

అనేకలోకములలోనున్న వర్ణనీయాంశముల నొకచోఁ జేర్చినాఁడు భీమకవి. వరుస తప్పలేదు. అధికుఁడు, ఎక్కుడు మొదలగు నయిదుపదములు సాభిప్రాయములు. ఈపద్యమురత్నముకదా. అంగోపాంగవర్ణనము జేయుట అసందర్భమన్నారు రెడ్డిగారు. ప్రభావతీవర్ణనము తుచ్ఛమన్నారు. ప్రభావతి మిగుల నందకత్తెయని తెల్పుట కవియుద్దేశ్యము. రామాయణమందు సీతాదేవి శ్రీరామునిలక్షణమును జెప్పుమని ఆంజనేయుని నడుగఁగా నాతఁడు శ్రీరాముని సకలాంగములను ఒక్కటికూడ విడువకుండ వర్ణించి

చెప్పినట్లు గలదు. ఆశ్లోకములనుజూచిన విమర్శకులకు ఎంత అసహ్యము గలుగునో కదా! ఈవర్ణనలందు నాయికానాయకుల సౌందర్యగరిమ యట్టిదియని మాత్రమే గ్రహింపవలయును. అట్లుకాదన్న వారున్న నుండవచ్చును. లోకమే లోకము. కాళిదాసు ఇట్లు వ్రాసెను.

శ్లో. క్షామక్షామకపోలమాననమురః కాఠిన్యముక్తస్తనం
మధ్యః క్లాంతతరః ప్రకామవినతావంసౌ ఛవిః పాండురా,
శోచ్యా చ ప్రియదర్శనా చ మదనక్లిష్టేయమాలక్ష్యతే
పత్రాణామివ శోషణేన మరుతా స్పృష్టా లతా మాధవీ.

దుష్యంతుఁడు శకుంతలయొక్క స్తనకాఠిన్యముతగ్గుట నెట్లుచూడఁగల్గెను అని ప్రశ్నింపవచ్చునా? మన్మథావస్థయం దిట్లుండును అనియే యిచ్చట గ్రహింపవలయునుగదా. అలంకారములు కవితకు ఖండితముగా నుండ వలసిన లక్షణముకాదని రెడ్డిగారిట్లు వ్రాసిరి.

"శబ్దాలంకారము లంతగా ముఖ్యముగావనుట యందఱు నొప్పు కొందురు. అలంకారములలో ప్రధానమైనవి యుపమోత్ప్రేక్షాదులు. వీనికి మూలభూతమైన ధర్మమేదనగా ప్రకృతవస్తువునకు మఱేదో యొక వస్తువునకును నామరూపస్వభావాదులంబట్టి సామ్యము గల్పించెడుశక్తి. పోలికలను స్థాపించుట సొగసైన కార్యమేయైనను గవితకు ఖండితముగా నుండవలసిన లక్షణముకాదు. (౧౬) సాదృశ్యములలోఁ గొన్ని సహజ ములును అనివార్యములును. అవి తమంతటన యేప్రయాసమునులేక వచ్చినయెడఁ గథాసందర్భముతోఁ గలసిమెలసియుండును. (కావున సరి పోనివి బలాత్కరించి తేరాదు. (౧౭) కొన్ని సర్వవిధముల సరిపోలఁ జాలనో గోవిందా! యనుచున్నను దీర్ఘాలోచనములుచేసి కష్టపడి శ్లేషా దికుయుక్తిపాశములచే నీడ్చితెచ్చి తొందఱమెయిఁ జొన్పించినట్లుండును. ఇట్టివి సంపూర్ణముగ విసర్జించిన నెంతయోబాగు (౧౭-౧౮) సామ్యము వర్ణనకు నుపకరణము. ప్రధానంబుగాదు. సామ్యములుండిననేమి యుండ కున్ననేమి? సొగసైనవస్తువును జూచినవెంటనే తనంతటన సంతోషముద యించును. ఈరీతినే సమస్తవస్తువుల యనుభవములయందును స్వత స్సిద్ధములైన సుఖక్లేశాదిభావములున్నవి. వస్తువులు, వృత్తములు, చర్యలు ఇత్యాదిప్రకృతులకును మానవమనఃప్రకృతికిని స్వచ్ఛందముగనుండు

భావవిషయమైన రీతులనువర్ణించుట కవితయొక్క ప్రథమగణ్యోద్దేశము. ఈకార్యమునకు, సాదృశ్యనిరూపణాద్యలంకారములు సులభముగఁ దోడ్పడిన వలదనరాదుగాని, యిట్టియలంకారములు లేకున్న వర్ణనము తుదముట్టనేరదని భ్రమించి, వానిని కుయుక్తియనుత్రాటిచే బంధించి ప్రబంధమను చెఱలోనుంచుట యెంతయుఁ బశ్చాత్తాపకరమైననేరము. కమలముతోఁ బోల్పకున్న సీతాదేవిముఖము చూచువారికి సుఖమియ్యదా? చిన్నతనముఁబూనునా? అట్లగుట నాదేవిముఖమునే నేరుగ వర్ణించినంజాలదా? మఱియుఁ గమలముతోఁ బోల్చుటంజేసి సీతాదేవి ముఖ మానందదాయియాయెనని భ్రమించు వెఱ్ఱు లెవ్వరైన నున్నవారి కొక ప్రశ్న. ఏమన, ఇఁక దేనితోఁ బోల్పఁడినందున కమలము హర్షము నొసంగునది యాయెను? ప్రతిపదార్థమునకు నొకయుపమాన ముండితీర వలయునన్న కట్టకడపటి యుపమానమున కాధార మేమి? కావున నెట్లును ఏదోయొకవస్తువు తనంత, ఇతరమాధ్యస్థ్యము లేక, తనకనుగుణమైన భావమును బుట్టఁజేయును గదా? అట్లగుట మొదటివస్తువునకే యాగౌరవమునేల ప్రతిష్ఠింపరాదు (౧౮,౧౯) నిక్కమైన యుపజ్ఞ లేమిచేఁ బరులో పెద్దలో చెప్పినట్లు వ్రాయఁజూచు నలఁతికవులు, అలంకారశాస్త్రములలో నాయికానాయకులకు జాతుల నేర్పఱచి గుణమ్ముల నిర్ణయించి యుండుట బాగుగఁ బఠించియున్నవారు గాన నదియ యొక వేదమనుకొని, ప్రమాణమను పిచ్చిపట్టి, యందుఁ బేర్కొనఁబడిన ధీరోదాత్తప్రభృతులలోఁ దమకు వలయువారిని స్వీకరించుకొని యెల్లదెఱఁగులం బ్రాచీనోపదిష్టమార్గంబుననే వర్ణించి యెదుటనిలుపుటయ కృతకృత్యతగ భావించిరి బింబములకుఁ బ్రతిబింబముల నుత్పాదించుట కవిచేయవలసినపని గాడు. మఱి ఫోటోగ్రాఫరుది. తనమనస్సునకుఁదగినట్లు తనకన్నులకుగోచరించునట్లును వ్రాయవలయునే కాని యింకెవరికో తోఁచినట్లు దావ్రాయఁ జూచుట మూఢమతము. అట్లు చేసినఁ బద్యములు సిద్ధించినను గవిత పక్వస్థితికి రాఁజాలదు. (౨౬-౨౭) ప్రాచీనులు వ్రాసినట్లును అలంకారశాస్త్రములాదేశించినట్లును విరచింపఁ బ్రయత్నించుట తెలివితక్కువపని. (౩౧) కథావిషయమున నుపజ్ఞయావశ్యకముగాదని గురువు (వసుచరిత్రకారుఁడు) చెప్పె. అతనిశిష్యులనందగు తరువాతి ప్రబంధకవులెల్లరు వర్ణనలంగూడ

నుపజ్ఞపని లేదనియేమో, వసుచరిత్రలోనియూహాలన యనుసరించువారై పిల్లవసుచరిత్రముల ననేకములం బ్రకటించి, యాకార్యములందు రోఁత హెచ్చించి గురువునకుంగూడ లఘుత్వ మాదేశమగునట్లుచేసి కవిత్వము భావసంబంధములేని పదసంబంధిగా నొనర్చి పాడునకుందెచ్చిరి" (౭౪) అని రెడ్డిగారు వ్రాసిరి. కావ్యశోభనుఁ గలిగించుధర్మముల కలంకార ములనిపేరు. అవి ఉక్తివైచిత్ర్యమూలములు. కవుల ఉక్తివైచిత్ర్యము నకు విరామములేదు గావున నలంకారములకుఁగూడఁ బరిమితిలేదు. అలం కారములు ఋగ్వేదమందు, ఉపనిషత్తులందు, పురాణములందుఁగూడ గలవు. క్రీస్తుశకప్రారంభమందు భరతఖండములో నత్యుదారరచనలతోఁ గూడిన గద్యపద్యకావ్యములు నిర్మింపఁబడినవని ప్రాచీనచరిత్రాంశశోధ కులు వ్రాసియున్నారు. క్రీస్తుశకము రెండవశతకములో వ్రాయఁబడిన గిర్నర్ శాసనములలో నొకదానియందు దీర్ఘసమాసభూయిష్ఠము, నను ప్రాసయమకాది శబ్దాలంకారశోభితము నుపమారూపకాద్యర్థాలంకార ప్రచురము నగు నొకగద్య కలదని తెలియుచున్నది భట్టికావ్యములో అనేకశబ్దాలంకారములుగలవు. ౧౦, ౧౧, ౧౨, ౧౩ సర్గలు ప్రత్యేక ముగా నలంకారశాస్త్రమున కుదాహరణముగా వ్రాయఁబడినవి. క్రీస్తు శకమునకు ముందువెనుక శతాబ్దములయం దలంకారశాస్త్రమను నొక శాస్త్రము నేర్పాటుచేయుటకుఁ దగినంతకావ్యసామగ్రి వృద్ధినొందినది. కావ్యలక్షణము వానినియమములు, వానివిధులు, అలంకారములలక్ష ణము వానినియమములు, మొదలగువానిని బరిష్కరించి వ్రాయుట క్రీస్తుశకప్రారంభమందు మొదలయినది. నూతనకావ్యరచన, అట్టికావ్య మునకు లక్షణమునుఁజెప్పు సూత్రములు, ఏకకాలమందే జంటగా బయలు దేరినవి. సుబంధుఁడు వాసవదత్తలో శ్లేష, విరోధాభాసము, ఉత్ప్రేక్ష మొదలగు నలంకారములను వ్రాసెను. 'ప్రత్యక్షరశ్లేషమయప్రబంధ విన్యాసవైదగ్ధ్యనిధిర్నిబంధమ్' అను శ్లోకమం దీసుబంధుఁడు శ్లేషయందతి ప్రాగల్భ్యముగలవాఁడనని చెప్పుకొనుచున్నాఁడు. ఇతఁడు సత్కావ్య లక్షణమిదియని తనగ్రంథములో నిట్లు చెప్పెను. 'సత్కవి కావ్యబన్ధ ఇవానా బద్ధ తు హి నిపాతః, దీర్ఘోచ్ఛ్వాసరచనాకులం సుశ్లేషవక్త్రఘటనాపటు సత్కావ్యవిరచనమివ' (పాదపూరణార్థమయి వాడుకచేయఁబడు తు హి

మొదలగు నిపాతులు లేనిది, ఉచ్ఛ్వాసము లనఁబడు గ్రంథవిచ్ఛేద ములుగలది, శ్లేషతోఁగూడిన వక్రమను వృత్తివిశేషముగలది) సత్కావ్య మని చెప్పెను. మొదట నలంకారముల కుచితస్థానపరికల్పనముఁజేసి పూర్ణమగు కావ్యలక్షణసిద్ధాంతమును నిష్కృష్టముగా వ్రాసినవాఁ డానందవర్ధనుఁడు. కావ్యమునకు వ్యంగ్యమాత్మయనియు ధైర్యశౌర్యా దులు మనుష్యునికి మనోధర్మములయినట్లు, ప్రసాదము, మాధుర్యము, ఓజస్సు మొదలగు గుణములు కావ్యాత్మయగు వ్యంగమునకు ధర్మము లనియుఁ గటకమకుటాద్యలంకారములు మనుష్యుని శరీరశోభ నతిశ యింపఁజేసినట్లలంకారములు కావ్యశోభావృద్ధిహేతువులనియు నానంద వర్ధనుఁడు ధ్వన్యాలోకమను గ్రంథమందుఁ బ్రతిపాదించెను. (తమర్థ మవలంబంతే యేంగినంతే గుణాస్మృృతాః, అంగాశ్రితాస్త్వలంకారా మంతవ్యాః కటకాదివత్. ధ్వన్యాలో 11-7-పే 78) ఈ పై అంశ ములు శ్రీమేడేపల్లి వేంకటరమణాచార్యులుగారు (విజయనగరము) వ్రాసిన అలంకారశాస్త్రచరిత్రము' అను పుస్తకమందు విపులముగ చర్చించఁబడియున్నవి. అలంకారశాస్త్రరచనలో నాంధ్రులు ప్రముఖులై కూడ విలసిల్లిరి. ఉపమ రూపకము భాషాభివృద్ధికి ముఖ్యకారణమని బహుగ్రంథకర్తయగు కారలైల్ వ్రాసియున్నాఁడు. బుద్ధిని వికసింపఁ జేయునవి అలంకారములు. అలంకారములేనిది కావ్యము శోభించదు. మహమ్మదీయ పరాభూతకాలమువారగు ప్రబంధకవులు కుక్షింభరులై పాండిత్యబలముమాత్రము గలిగి స్వబుద్ధి నుపయోగింపక అలంకార శాస్త్రానుకారులై కవితను బాడొనర్చిరి. అని రెడ్డిగారు వ్రాసిరి. కాని వారినిజమగు అభిప్రాయము అలంకారశాస్త్రానుసరణమువలన, శాస్త్రాను సరణమువలన భారతదేశమంతయుఁ బాడయినదనియే. వారిట్లు వ్రాసిరి. 'హిందూదేశములోనికవులు స్వబుద్ధినుపయోగింపక శాస్త్రములు, ప్రాచీన గ్రంథకర్తలు పోయినదారినే గొఱ్ఱెలమందవలెఁ బోయినవారు' (౧౬౨) అని వ్రాసిరి. శాస్త్రముల ననుసరించుటే అసందర్భమనువారికిఁ బ్రాచీన కావ్యములను అలంకారశాస్త్రములను ననుసరించుట అసందర్భముగ గనఁ బడదా. శాస్త్రముల ననుసరించివ్రాసిన ప్రాచీనకావ్యములు, అలంకార శాస్త్రములుగూడ వారికి నసందర్భములే. ప్రబంధకవులేకాక భారతదేశ

మందలి కవులందఱు ప్రాచీనకవులు గూడ నసందర్భముగ కావ్యములు వ్రాసిరని రెడ్డిగారియభిప్రాయము. రెడ్డిగారే యననేల. సంఘసంస్కారులము అను గర్వముగలవారందఱికి నిది నైజమైయున్నది. ఒకదాని నింకొకదానితోఁబోల్చు టెందులకు అని రెడ్డిగారు వ్రాసిరి. స్త్రీముఖములన్నియు నందముగా నుండవు. కురూపులు, సాధారణులు, అందగత్తెలు ఇట్లుండెదరు. అందగత్తెల ముఖములు కమలములను జంద్రునిఁబోలి యుండును. కమలములన్నియు ననఁగా భూతభవిష్యద్వర్తమానకాలమందలి కమలములన్నియు నందముగలిగి వికసించునవియైయున్నవి. అట్లే చంద్రుఁడన్నికాలముల వారికి నందముగఁ గనఁబడుచు ప్రమోదకారకుఁడై యొప్పియున్నాఁడు. లోకప్రసిద్ధమైన అట్టివానితో సరిపోల్చి చెప్పుట కవి ముఖ్యముగాఁ జేయవలయును. ధీరోదాత్తప్రభృతులను అలంకారశాస్త్రములు చెప్పినవి. అందువలన నాయికానాయకుల స్వభావములు వ్యక్తములగుచున్నవి. అలంకారశాస్త్రములు చదివిన మానవప్రకృతి యెట్టిదో ఎవరెవ రెట్టివారో ఎట్లుందురో అవన్నియు నవగాహనమగును. బుద్ధివికసించి పరిపక్వమొందును. బుద్ధిమంతులగు మానవస్వభావమును గుర్తెఱిఁగిన మన ప్రాచీనులు చక్కఁగ విమర్శించి నిర్ణయించి అలంకారశాస్త్రములను వ్రాసియున్నారు. రెడ్డిగా రీవిషయమును గొంచమైన విమర్శించి చూచినట్లు కనఁబడదు. భ్రమప్రమాదములకు లోనగు అస్మదాదుల మనసులు, కన్నులే ప్రధానములుగావు. శాస్త్రములను బెద్దలవ్రాతలనెఱిఁగి వ్రాయుమోయి అనిబోధించుచున్నవి అలంకారశాస్త్రములు. ప్రాచీనకవులందు దోషములు గలవని రెడ్డిగారు దలఁచినపుడు వసుచరిత్రకుఁ బిమ్మటఁ బుట్టిన ప్రబంధకవులను దూషించుటలో నాశ్చర్యమేమున్నది.

సొగసుగ వనములగుండా దారిచేసికొని పాఱు నదిని స్త్రీకిం బోల్చుట సర్వదేశములలోను బ్రబలిన యలంకారమగుట నైజమన వచ్చును. ఇట్లు చేయుటలోను నసాధువగుక్రియ యొకటున్నది. ఏదన నదియందలి ప్రత్యవయవమునకును స్త్రీయవయవ మొండుసరిపోలినదని గాని, యట్లె స్త్రీయంగాయంగములకుఁ దోడుపోయిన భాగములు నది యందున్నవనిగాని చూపుట. ప్రత్యవయవసమన్వయము చిత్రపుటూహ

రసాన్వితముకాదు. మొత్తపుటర్థముగా సహజోపములు, ధ్వని మొద లగు వానిచేఁ గూర్పఁబడు సంబంధము మంచిది. ప్రత్యంగక్రమమునకుం బోయినఁ గుయుక్తులుదప్పవు. ఆకారము సమిష్టి నేభావము నుప్పతిల్లఁ జేయునో, దాని నారసి, ప్రముఖములైన సాదృశ్యములున్న వానిని సూచించి విరమించుటబాగు. దీనిచేఁ జదువరులకును లాభము. ఎట్లన కవిచూపించిన పోఁబడింబట్టి యింకను గొన్ని సామ్యములను మనమే యేర్పఱచుకొనుటకు నవకాశముండుటచే బుద్ధికిఁ బనులును దానఁ బోఱి వయుఁగలుగును. ప్రతిపదటీకగా బాకీనేమాత్రములేక యంతయు విశద పఱచిన మన మనఃపరిశ్రమకు వీలుండదు. కానఁ గొంతనడికి మాంద్యము విసుగును జనించును. పూర్ణోపమలకన్న లుప్తోపమలు రసవత్తరములు. భావానుకూల్యములు (౨౩౩, ౨౩౪) అని వ్రాసిరి. నదిని సమిష్టిగా స్త్రీకిం బోల్పవచ్చును. ప్రత్యవయవసమన్వయమును జేయవచ్చును. అది కవియొక్క ఘనతలోనుండును. కవి సమర్థుఁడుగా నపు డెట్లు వ్రాసినను బాగుండదు. గొప్పకవులు ఆయాసందర్భముల కనుకూలించు వర్ణనము నంతయుఁ బరిపూర్ణముగఁజేయుదురు. రసికులకం దనేకవిశేషములు దట్టు చుండును. కావుననే భారతరామాయణములు, పురాణములు ఘనతఁ జెందియున్నవి. ప్రాచీనకావ్యములందు నిట్టి విశేషమున్నది. నేఁటికాల మున నుద్భవించు కవితలలోమాత్ర మట్టిది అరుదగుచున్నది. భాషా జ్ఞానము తక్కువైన కొలది భావశూన్యమైన వ్రాతలుద్భవించుచుండును. మనఃపరిశ్రమకు వీలుగలిగించునది ఉత్తమకావ్యము. విద్వాంసులగు వారు విద్వజ్జనపరిశ్రమనెఱుంగుదురు. అట్టిశక్తిలేని అల్పకావ్యము లనే కములు పుట్టినవెంటనే గిట్టుచున్నవి.

"ప్రాచీనులలోఁ గొందఱుకవులు (అందును ముఖ్యముగా బమ్మెర పోతనామాత్యుఁడు) ఇంకొకవిధమైన యపభ్రంశము నాశ్రయించినట్లు తోఁచెడిని. ఏదన, వనవర్ణనము మొదలగునవి చేయునపుడు పదాడంబ రమునకై నిఘంటువులలోని చెట్లపేర్లన్నియుఁ బ్రయోగించుట......
......ఊరకవృక్షనామములఁ జేర్కొన్న నేమియందము? ఆచెట్లయొక్క గుణము, ఆకారము మొదలగు విశేషముల నెఱుకపఱచు విశేషణములఁ జేర్పకున్న నమరమునకుఁ గవివర్ణనమునకును భేదముండునా? అరఁటి

చెట్టు అని చెప్పినమాత్రాన వినువారి కది యిట్టిదని యేర్పడదు. మనసు ముందఱ ప్రతిమవలె వస్తువ గన్పట్టవలయునన్న సామాన్యగుణముం జేర్కొనినం గాదు. విశేషాంశములం జూపవలయు. నిదర్శనము. మనుష్యుఁడు అన్నమాత్రాన మనకు నేరూపమును గోచరింపదు. విశేషణములం జేర్చుచుంబోయిన ప్రతిమయుం దీఱుచువచ్చును. ఎట్లన, చింపిరి బట్టలవాఁడు తల విరియంబోసికొనియున్నాఁడు. పంగనామాలు, ఎడమ చేతిలో గరుడస్తంభము, కుడిచేతిలో గంట. అనునప్పటికి దాసరివాఁడు ప్రత్యక్షమునకువచ్చును. దాసరివారిని బరిశీలించినవాఁడు ఇంకను విశేషణములంబూన్చిన, నేదోయొక దాసరిగాక నిష్కృష్టమగు నొకరీతికిం జేరినవాఁడు ముందుకువచ్చిఘోషించును. అట్లే యరఁటిచెట్టుగూర్చియు. అరఁటిచెట్టన్నమాత్రాన నేయరఁటిచెట్టో! కాండము గుండ్రముగాబలసి యున్నది. సూర్యకిరణములుసోఁకి లోనదూరక యిటు దిరిగిపోవునంత స్నిగ్ధము. వెడలుపైన యాకులున్నవి. ఘనమైన యొంబముచే వంగినతల గలది. ఈరీతిం జిల్లరచిల్లరసంగతులు గలుపుచువచ్చితిమేని యాకారము రంగులుదీఱి యేదేనొక విగ్రహముగ మనసున ప్రతిఫలించును. ఇట్లుగాక పేరుల జాపితాయెదుటనుంచిన, మనమేమి వర్తకులమా దానియెడ నాదరముంచుటకు ? (౨౩౫, ౨౩౬) సమష్టిగావ్రాయుట నిఘంటుకారుల పని. వ్యక్తి నొకదానిహృదయమున సాక్షాత్కరింపఁజేయుట కవియొక్క ముఖ్యోద్యమములలో నొండు. ఇది చేయంజాలనివాఁడు పండితుఁడు గావచ్చునేగాని కవిగానేరఁడు తనమనసులో నేదేనొక యాకృతిని చక్కఁగనేర్పఱచి పదములమూలముగ దానిని రసికులకు వ్యక్తపఱిచిన నదియ కవిత్వము. నదినివర్ణించిన నన్నినదులకుం జెందిన తీరునఁజేయుట కళగాదు. మఱియేదే నొక్కతెలుంగునది దోఁపవలయు. అట్లే సరస్సులు మొదలగు ప్రకృతిమూర్తులంగూర్చియు (౨౩౭) పాత్రములవర్ణించునపుడును ఈతత్త్వము నేమాత్రము మఱవరాదు.........కవులు వర్ణించిన ప్రకృతులు పాత్రములు నుత్కృష్టములాయని శోధించుట కొకయుపాయమున్నది. ఏదన, ఆవర్ణనలఁజదువుటచే చిత్రకారుఁడు విస్పష్టమును అనన్యమునైన ప్రతిమనువ్రాయఁగలఁడా యని వితర్కించుట. బమ్మెరపోతనామాత్యుని వనములు సరస్సులునన్నియు గురిగింజ

లట్లు ఏకరూపములు. ఏకరూపములనుటయుఁ దప్పు. ఏకనామములన్న నింకను సత్యము! ఏలన నిఘంటువులలోని పేర్లన్నవిగాని, యన్యోన్య వస్తువులకుఁ గాలాదుల ననుసరించిన చర్యలెవ్వియు నారోపింపఁబడ నందున నవి దృష్టములు గావు. (౨౩౭, ౨౩౮) పాత్రములఁ బరిపూర్ణ ములఁగా వర్ణించుట యెంతతప్పో వనాదులనైతము సర్వలక్షణసంపన్న ములుగా వర్ణించుట యంతతప్పు. పోతనయొక్క చెట్లన్నియుఁ బుట్టి పెరుగుతా వీజగతి నొక్కచే! ఎద్దియన. నిఘంటువు! భూసారాదితారత మ్యములచేత నొకజాతికి వృద్ధికరమగునేల యింకొకదానికి క్షయ కరము. మఱియు ఒకనేలలో పెరుగువృక్షములు నైతము సరిగా నాయికానాయకులు వచ్చునదిచూచి యన్నియుఁ బుష్పఫలభరితములు గావు. వనములు, తోఁటలు మొదలగునవి చూచినవారందఱకు నిది తెల్లంబ. కవులకుఁగాదు. పాపము! వారేమిచూచిరి? నిఘంటువులం దప్ప (౨౩౭) ప్రబంధకవులలో పాత్రవర్ణనమునఁ గనంబడుదోషము లన్నియు ప్రకృతివర్ణనమునసున్నవి. దేనినిగాని తాము భావించినట్టియో, చూచినట్టియో వ్యక్తిగావర్ణింపరు. సర్వసామాన్యగుణంబులఁ బేర్కొని యాకృతిని నిర్ణయింపఁజాలని యంత సమష్టిగా వ్రాయుదురు. ఇది ఉన్నది యున్నట్టు, కన్నది కన్నట్టుఁగాక చదివినది చదివినట్టుగా వ్రాయుటచేఁ గలిగినయుత్పాతము" (౨౩౮) అని వ్రాసిరి. అరఁటిచెట్టునుగూర్చి రెడ్డి గారంతగావర్ణించి యింకను విశేషములఁజేర్పవలెనన్నారు. ఇట్లే వర్ణించు నెడల వనవర్ణనమునకే ఒకగ్రంథము వ్రాయవలసివచ్చును గదా. వనము మనోజ్ఞమైనది లేదా గంభీరమైనది అని సూచించుటయే కవి గావింప వలసినది. చెట్లు ఎట్టివో నిదానముగఁబరికించువారు వర్తకులేకాని కవులు గారు. వనము లతివిస్తీర్ణములుగ నుండినందున నందనేకవిధంబులగు శీతోష్ణస్థితులు గల్గును కావున పలువిధములగు వృక్షము లం దుద్భవిం చును. అట్టి గంభీరమైన మనోజ్ఞమైన యడవిలో నాయికానాయకులు ప్రవేశించిరి. అని కవులు వ్రాయుదురు. అంతియకాని వారువచ్చిన మార్గములోనే చెట్లన్నియు నుండనక్కఱలేదు కదా. అట్లే కొన్నివృక్ష ములు ఫలించినఁజాలును. అందువలన సమూహముగా వనమంతయు రమ ణీయమై గానవచ్చును. నాయికానాయకులు ప్రవేశింపని భాగములను

గూడ కవి వర్ణింపవలయును. ఆతురతనొందిగాని, సంతోషముగలవారై గాని ఎట్టిఅవస్థలో ప్రవేశించినను నాయికానాయకులు పరికించని అనేక విశేషము లుండుండునుగదా. కవి వానిని విడిచివేయక వ్రాయవలసియున్నది వనాదివర్ణనలు గావించుటలో నితర వనాదులకంటె భిన్న రూపము పాఠకులకు ద్యోతకమగునట్లు కవి నిర్దేశింపవలెనని రెడ్డిగారు వ్రాసిరి. వనములుగాని, నదీ ప్రదేశములుగాని పర్వతప్రదేశములుగాని దేనినివర్ణించినను చూచువారికందఱకు నేసామాన్యలక్షణములుగను పడునో అవివర్ణించుట ముఖ్యము. పాత్రవర్ణనమందుఁగూడ నది ఉత్తమమా, మధ్యమమా, అధమమా, ఎట్టి నడవడికలది యనువిషయము వర్ణించుట ముఖ్యము. ఇతరముకన్న భిన్నమైనదిగా సృష్టించుట ప్రధానము కాదు. అందు ప్రయోజనమంతగా లేదు వనములు, నదులు, పర్వతములు వీట్లయొక్క ప్రత్యేకతను జూపిచెప్పుట భూగోళశాస్త్రజ్ఞులది. మఱియు రాజకీయోద్యోగులది. అవి వారికర్మము. గోదావరి అతివెడలుపైనది, గంగానది వేసవికాలమందుఁగూడ చక్కఁగఁ బ్రవహించును. అని ఇట్లు విశేషములు వర్ణించిన వర్ణింపవచ్చును అట్లు వ్రాయకపోవుట కవియందు దోషముమాత్రము కానేరదు. పాత్రముల పరిపూర్ణముగా సృష్టించుట తప్పు అని రెడ్డిగారు వ్రాసిరి. అట్లు సృష్టించుట తప్పుకానేరదు. ఉత్తమాదర్శమును ప్రదర్శించుట కవివిధి. ప్రపంచమురీతిని వ్రాయుట యనునది కానేరదు. కావునఁ బరిపూర్ణముగఁ బాత్రముల సృష్టించుటకుఁ గవిబ్రహ్మలకు సంపూర్ణమైన హక్కుగలదు. ప్రపంచములో నట్టివారుందురా అని ప్రశ్నించుట తగదు. ఆపాత్ర ప్రజలకేమి తెలుపుచున్నదనియే తెలియవలసియున్నది. మన కావ్యములన్నియు నదే దృష్టితో వ్రాయఁబడినవి. శాస్త్రవిహితమార్గమున నుత్తమాదిలక్షణముల వర్ణించి మనవారు పాత్రపోషణగావించియున్నారు. ఉత్తమాదర్శము ప్రధానమైనవి గావుననే మనకావ్యాదులు విషాదాంతములుగావు. ప్రపంచములో విషాదాంతములు పెక్కులుండవచ్చును. అందుదారభావము లుండవచ్చును. కవిచూపవలసిన దదికాదు. మనుజుఁడెట్లు మంగళమునొందును అనునదే కావ్యలక్ష్యము. దానిని చక్కఁగ సమర్థించి వ్రాయుట కవివిధి. చిత్రకారుఁడు వ్రాయలేని వర్ణనలను కవులు వ్రాయఁ

గలవు. ఇందుకు నిదర్శనము. ఈనిదర్శనము సామాన్యమైనది. కవుల సృష్టిలో దీనినిమించిన వనేకములు గలవు

సీ. శేషపుచ్ఛచ్ఛాయఁ జెలువారు బిసములు తన్మగ్నసురదంతిదంతములుగ
నిండార వికసిన పుండరీకశ్రేణి యామినీరమణరేఖాళిగాఁగఁ
బ్రతిబింబితోపాంతబహులపాదపములు గర్భస్థశైలసంఘములుగాఁగ
నేకదేశంబున నిందీవరంబులు కాలకూటమయూఖఖండములుగ
గీ. బాలశైవాలవల్లరీజాలకంబు, బాడబానలభవధూమపంక్తిగాఁగ
వారిరాశియుఁబోలె గంభీరమైన, ఘనతటాకంబు గాంచె నజ్జనవిభుండు.
(శృంగా. నైష ౧-౯౮)

దీనిని చిత్రకారుఁడు స్వచ్ఛముగఁ జిత్రింపఁజాలఁడు. కవి (శ్రీనాథుని) వర్ణనమో అత్యద్భుతమైనది. తటాకసామాన్యవిషయములదీసికొని రసవంతముగ సృష్టించినాఁడు. లోకులుభావించుదాని కతీతమైనది కవి వ్రాయఁగలఁడు. పూర్వులు చదివినది చదివినట్లువ్రాసిరి. అని రెడ్డిగారాక్షేపించిరి. వారు శాస్త్రాదులలోఁ జదివినది చదివినట్లువ్రాసిరి. జ్ఞానలవదుర్విదగ్ధులగు ఇప్పటివారు చదివినది చదివినట్లుగాఁగాని, ఉన్నది ఉన్నట్టుగాఁగాని, కన్నవి కన్నట్టుగాఁగాని వ్రాయలేకుండుట వింత కాదు. శృంగారకావ్యములలో నుత్తమాదర్శమేమియని రెడ్డిగారు శంకింతురా!

"సీత! పరమపావనమూర్తి! శ్రీరాముని భార్య. దౌష్ట్యమున నామెను బలాత్కరించికొనిపోయినవాఁడు సర్వలోకాధీశుఁడగు రావణుఁడు. రాక్షసవంశసంహారకారణమైన దీయాగడము. ఇట్టి జగత్ప్రధానసందర్భంబులఁ బ్రకృతియు మనుష్యమాత్రులరీతిని సుఖదుఃఖాదివికారములందాల్చినట్లుత్ప్రేక్షించుట సమంజసముగాని, చీమకు దోమకు వాసియైన నాయికానాయకుల పాటులంగూర్చి లక్షించునదిగా వర్ణించుట గాంభీర్యమునకుఁ గొఱంత. వస్తువుల కొలందులగణింపక వర్ణించిన నగుఁ బాట్లగును. ప్రబంధములలోని ముఖ్యదోషములలో నీవివేచన విహీనవర్ణనమొక్కటి. ఏకుగ్రామముఁగాని, యెట్టి నికృష్టరాజులంగాని, వీరకావ్యముల ధోరణిగా వర్ణింతురు. పట్టణప్రాసాదములు మిన్నుముట్టునఁట! ధర్మహర్మ్యముల గవాక్షములలో చంద్రుఁడు దూఱిపోవునఁట! ఇఁక రాజుగారో యాపురికిఁదగినవారు! పంచపాండవులు, దాశరథులు

అందఱనుగ్రహించి బ్రహ్మపోతఁబోయగా నవతారమెత్తిన పురుషస్వరూపులు! కానిండు! ఈబలపరాక్రమములకుఁదగిన శౌర్యప్రారంభముల నొడఁగూర్చినఁగదా యాగుణములు సార్థకములగుట. అట్టి కథాకల్పనాశక్తియే సున్న! మహాకవుల యూహలలోఁ గొన్ని దొంగిలించి కొన్ని విడిచిపెట్టుటలో లాభములేదు. కైకొన్న నన్నియుఁగొనవలయు, లేదా పూర్ణముగావదలి తన నైజముకొలఁదివ్రాయవలెను. లేనిచో పరస్పరాసంగతి బాధచే సందర్భశుద్ధిచెడును" (౨౮౮, ౨౮౯) అనివ్రాసిరి. శకుంతల దుష్యంతునొద్దకుపోవునపుడు ఆశ్రమము, ఆశ్రమమృగములు, పక్షులు, లతలు దీనావస్థనుండినటుల కాళిదా సిట్లు వర్ణించెను.

శ్లో. ఉద్గళితదర్భకబళా మృగాః పరిత్యక్తనర్తనా మయూరాః,
అపసృతపాండుపత్రా ముంచన్త్యశ్రూణీవ లతాః. (శా. ౪. ౧౨)

ఆ. కుశకబళము జారుచుకొనె నీమృగంబులు, నృత్త ముజ్జగించె నెమలిగములు
బాష్పవృష్టి గురిసెను బంధురంబుగ లతల్, పండుటాకు లూడ్చువ్యాజమునను.
(వే. వెం.)

వర్ణన యనఁగా నందుఁ గొంత యథార్థముకానిది కలదనియే యర్థము. పిల్లలమాటలలోఁగూడ నీవర్ణనలుండును. అది లోకస్వభావము. అతిశయోక్తి స్వభావములు కవులుగదా. పాండవులు దాశరథులకన్న ఘనులు వేఱొకరుండరు. వారిచరిత్రములమించిన చరిత్రలు మఱిగలుగవు. వారికన్న నుత్కృష్టులు లేరనునది జగమెఱింగిన సత్యము. కావున వారికన్న గొప్పవాఁడు అని వర్ణించినది సత్యమని తలంచువారుండరు. అదియు జగమెఱిఁగినదే. వారికన్న గొప్పవాఁడు అని వర్ణించినను వారికన్న ఘనకార్యములుగావించెను అని కథను గల్పింపకపోవుట అసమంజసముగానేరదు. మఱియు శ్రీరామాదులఘనతనే ఆవర్ణనలు మఱెంత వ్యక్తముచేయును. అదిగాక ప్రబంధములలోని కథలు ప్రాచీనగాథలు. కల్పనాకథలుగావు. భారతరామాయణాదులే కవికల్పనలకుజేరినవని తెల్పిన రెడ్డిగారు అంతకన్న కల్పనాకథలు పుట్టవలెనని వ్రాయుటలో నాశ్చర్యమేమిగలదు.

"అలంకారరచన యాలోచనాశక్తికిఁజేరినంత భావనాశక్తికిఁజేరినదిగాదు. మనకవులు తఱుచుపండితులు. (శ్రీనాథునిలోగూడ పాండిత్య

మునకు సమమైన కవితాశక్తిలేదని ౮ పేజీలో రెడ్డిగారు వ్రాసిరి) ఇంటిలోనే కూర్చుండి నిఘంటువుల గంతపాఠము సేయువారు. వీరికి కార్యోత్సాహము భావప్రాబల్యము రెండును క్షీణములు కావుననే భావనాశక్తిమట్టు. ఒకవిధమైన యాలోచనాశక్తి యెక్కువకాన రేపగలును ఆలోచించి యాలోచించి దిక్కు గతిమోక్షము లేని యూహాలగల్పించుచు నదియే కవిత్వమని విఱ్ఱవీగసాగిరి. యుక్తులు కుయుక్తులు గవితాశక్తియగునా! కానేరదు. కవిత్రయము వారిలో నిట్టి విరుపులు లేవని చెప్పగాదుగాని ప్రబంధకవులయందుబలె పిచ్చిముదిరియుండలేదనుట సర్వజనవిదితము. ఒకవేళ మనదేశభాషలలో నలంకారములకు స్వచ్ఛందమైన ప్రవృత్తి యాంగ్లేయభాషలకన్న నెక్కువయేమొ! భాషాశాస్త్రవేత్తలు గొందఱు మనలో గుణవాచకములు వలసినంత లేకుండుటచే విషయవైశద్యప్రాప్తికై యలంకారములతో నిండినశైలి నారాధింపవలసినవారమైతిమని సిద్ధాంతముచేసియున్నారు. ఇదియు సహేతుకమైన వివరణమే యని తోచెడిని" (౨౧) అని వ్రాసిరి. అలంకారములను నిందించుటయేగాక ప్రబంధకవులందు భారతకవులందు లోపములుగలవని వ్రాసిరి. అంతతోఁగాక దేశభాషలందు సంస్కృతమందు లోపముగలదని సూచించిరి. ఆంగ్లేయభాషలకు ఘనతజూపిరి. మనరాజుల కాలముకన్న నేఁడు బాగున్నది అని వ్రాసినవా రిట్లు వ్రాయుటలో వింతయేమిగలదు అలంకారరచనలోనున్న ఘనత, మనవారెంతగా దానిని వృద్ధినొందించియున్నారో రెడ్డిగారి కక్కఱలేకపోయినది. పైఁగా వారికి వాటినిఁజూచిన విసుగు.

"రాజాశ్రయమున బ్రతుకుపాటుగోరువారు వారి యిష్టానుసారము వ్రాయక యేమిచేయుదురు ? ఇక రాజులన్ననో పరిపాలనకార్యమునఁదగిలి కాలంబుగడపువారు. సొంతమగుబుద్ధితో విమర్శింపఁజాలినంత పండితులగుట యరిది కావున నట్టివా రాచారముంబట్టి గుణదోషనిర్ణయముంజేయుట నైజము" (౬౦) అని రెడ్డిగారు వ్రాసిరి. కవులు స్వబుద్ధిప్రకారము కావ్యము వ్రాయలేదని వ్రాసిరికదా. స్వబుద్ధియే పరమావధియగు నేటికవులనేకులు పనికిమాలిన కావ్యములను వ్రాయుట విదితమైయున్నది. మఱియు పూర్వపురాజులు ఇప్పటి రాజులవంటివారు కారు

శాస్త్రాదులను నమ్మియుండిరి. (ఇప్పటి రాజులందఱు అని యభిప్రాయము కాదు.) కావున వారు శాస్త్రానుసారమైన కావ్యములను వ్రాయించిరి. పూర్వపురాజులనేకులు కావ్యములను, అలంకారగ్రంథములను వ్రాసి యున్నారు. అనేకులు గొప్పపండితులై కీర్తిగడించియున్నారు. అట్టి వారికి విమర్శనజ్ఞానము లేదని వ్రాయుటకన్న ఘోర మింకొకటి కాన రాదు. పూర్వపురాజులను గవులనేగాక పూర్వుల నందఱేని రెడ్డిగారిట్లు చులకనఁగావించిరి. "ఈకాలమున బిడ్డలెట్లో పూర్వకాలమునఁ బెద్దలు నట్లే. అనఁగా ప్రకృతిజ్ఞాన మంతగాలేనివారు" (౫౩) అని వ్రాసిరి. మన పూర్వులందు రెడ్డిగారికెంత గౌరవముగలదో అది ఇందువలన వ్యక్త మగుచున్నది కదా. ప్రబంధములను అలంకారశాస్త్రములను బలువిధ ములఁ దూలనాడిన రెడ్డిగారు అల్లసానిపెద్దన్న బిరుదునుగూర్చి యిట్లా క్షేపించిరి.

"ప్రబంధము లేమో నూతనమైన మహాసృష్టియని మనపూర్వులు భ్రాంతిఁగొన్నట్లున్నది. కృష్ణదేవరాయలు మనుచరిత్రకారుని 'ఆంధ్ర కవితాపితామహు'డను బిరుదంబుతోఁ బూజించెను. అనఁగా కవిత్వమును సృష్టికిఁదెచ్చినవాఁడని ధ్వని! అల్లసానిపెద్దనకుం బూర్వ మొక కవిబ్రహ్మ యుండెఁగాని వానిని మనవారు మఱచిరో, స్థానభ్రష్టునిఁజేసిరో, లేక యొక్కొకమన్వంతరమున కొక బ్రహ్మయేర్పడుట మంచివిభాగమని యెంచిరో!నాకుంజూడ ప్రబంధములును భారతాదులఁ గొంతవఱకుఁబోలి యున్నవిగాని పరమాపూర్వములుగావు"(౬౭)అని ఆక్షేపించిరి. భాషాం తరీకరణయుగము,ప్రబంధయుగము అను విభాగము ప్రకారము తటస్థిం చిన దీచిక్కు. నన్నయాదులకుఁ దరువాతివాఁడగు తిక్కన (కవిబ్రహ్మ) ఆంధ్రకవిత్వమును సృష్టించిన వాఁడెట్లుకాఁడో అట్లే శృంగారనైషధా దులలో నున్నరీతిగా వ్రాసిన పెద్దనయుఁ బ్రబంధసృష్టికర్త కాఁడు. నలు గురికిఁ గళాప్రపూర్ణబిరుదములు మఱి కొందఱకు మహామహోపా ధ్యాయబిరుదములు మఱి పదిమందికి మఱికొన్ని బిరుదములు. ఇట్లు ప్రతియేఁడును ఇచ్చుచున్న నేఁటికాలపుబిరుదములకన్నఁ బెద్దన్నబిరు దము సార్థకముకదా.

ఉత్కంఠఁగొనియుండియు (ప్రభావతి) శాస్త్రప్రకారము చంద్రోపాలంభన మొనర్చి పిదప దక్షిణానిలునిఁబట్టినది. అటుతర్వాత నతని కొకింతవిరామదానం బొసంగి, మన్మథునిపై కిదూఁకి, యాయలసటచేత శాస్త్రక్రమముగఁ, బ్రాణములు కంఠగతములుగాఁగా(అనఁగా అలంకార శాస్త్రములోఁ జెప్పఁబడినరీతిని కవి వ్రాసెనుగాని అట్లు సహజముగా జరుగదు అని రెడ్డిగారి యుద్దేశ్యము.) 'ఇదే చచ్చెదనుజూడు' మని 'తెప్పలు దేలవైచుచు' క్రిందఁబడిన నొప్పిగదా యని 'పూలపాన్పున వ్రాలఁబోవుటయు'. పూర్తిగా వ్రాలలేదు! ఈతమాషానంతయు ప్రచ్ఛన్నరూపముతో డ్రామారీతిగాఁజూచుచుండిన ప్రద్యుమ్నుఁడు ప్రత్యక్షమై పట్టుకొనఁగా, అమ్మకు నెక్కడలేని సిగ్గువచ్చినది పాపము! ప్రభావతి యెంత మంచిది! తనబాధలు దనకుండఁగా నలంకారశాస్త్రమున కే బాధయు రాఁగూడదని పరోపకారవృత్తిమై, ప్రతిదూషణమును, ప్రతి దశను దప్పక యాదరించి చూపినదిగదా! వరుఁడును ఎంత ధీరోదాత్తుఁడు! ఆనాట్యము లన్నియు ముగియువఱకుఁ దమినిబిగఁబట్టిన యోర్పుఁకాడు! అయ్యో! దరిద్రమా! అనివార్యమైన మోహమును గోఁతివలె నాడింపఁజూచుట శృంగారమా! వికారమా! ఇంతటితోఁ బోయెనా? ప్రభావతిముప్పదిపద్యములరోదనముశ్వాసముబిగఁబట్టి, పూజారులు మంత్రములనేకరువువెట్టినట్టు త్వరగాఁజేయుచుండఁగా 'ఏమమ్మా' యనియైన నడిగినఁ గాలయాపనము గదా యని యుచితమౌనముందాల్చిన శుచిముఖి రాగవల్లరులు, వధూవరులు పడుకటింటికిం బోయినవెనుక వెన్నాడి మధ్యస్థలములకుం జొచ్చుట మనవంటివారికి అోఁత యనిపించును (౧౨౭, ౧౨౯) (కళాపూర్ణోదయములోని) షష్ఠాశ్వాసమధ్య భాగమునకుఁ దరువాతి భాగములు తుచ్ఛప్రబంధరీతిని వ్రాయఁబడిన భావవిహీనఘట్టములు గావున వానిని ప్రత్యేకముగ విమర్శించుటొప్పు. తత్పూర్వభాగములలోఁ బ్రతిభ, భావము, కృతినిర్మాణచాతుర్యము నివన్నియుఁ బుష్కలముగఁ బ్రకాశించునట్లు రచించిన యీమహాకవి నీరసవర్ణనములకుం దిగుటకుఁ గారణములు కాలదోషములును, నలంకారశాస్త్రములయెడ వినయవినమ్రుఁడై సకలలక్షణసంపన్నముగా వ్రాయఁ బూనిన దౌర్భాగ్యపుఁ బ్రతిజ్ఞయును. మహాకావ్యమని శాస్త్రకారులచేఁ

జేర్కొనఁబడినదాని నుత్పాదింపఁబోయి కవిత్వమున కుత్పాత మాపాదించెననుట స్పష్టము. ప్రథమభాగమున కాలదోషము లంతగాలేవు. అనఁగా ప్రబంధములతీరు తక్కువయనుట. మఱి సర్వలక్షణసంపన్నతచేఁ గలిగినదోషములు పెక్కులున్నవి. (౧౮౩, ౧౮౪) (ప్రబంధములలోని మన్మథోద్రేకములు శైత్యోపచారములు అమానుషములు) ప్రబంధములలోని శృంగారము ఉత్తమమైనది గాదు. ఈనాయికానాయకులు తాపోద్దీపిత దేహులుగాని బాధితమానసులుగారు. (౨౭౬) (మధురలాలసను) బట్టిన బాధలన్నియుఁ బురుషవృషభునిఁ(గళాపూర్ణునిఁ)గూడ బట్టినవి. అతఁడు నర్మసచివు నొక్కని సంపాదించి గుసగుసలాడెడిని. కాఁబోవు నిల్లాలి యంగాంగముల వినువారికి నోరూరఁగవర్ణించుట మొదలగు దుస్సహాతంత్రము లెన్నియోఁగలవు (౨౭౭)(మధురలాలస మిక్కిలి విరహావేదన నొందియుండఁగాఁ గళాపూర్ణుఁడు) గవాక్షమూలమునఁ జూచి యుత్కంఠయాఁపలేకపోవుట. దానికిగుర్తుగా నింకను గాలము వ్యయమగునట్లు, ఆపె తన్నుఁగూర్చిచేసినమాడ్కి, యాపె యంగములను మిక్కిలి విమర్శతోవర్ణించి ఋణవిముక్తుఁడగుట! నీరసములైన యుపమలు ఉత్ప్రేక్షలు భార్యపై దీపింపఁజేయుట........(ప్రతిఅంగమును రాజు వర్ణించుట) రాజుగారి దూరదృష్టిబలము. అంగనామణిచీర యేమాయెనో! ఆపెగిర్కిలుకొట్టుచుండెఁ గాఁబోలు! లేకున్న నన్నిభాగములు గనుపడునా? ఈయుపమ లెందునకుఁ బనికిరావనియు, రోఁతలనియు వేఱుగఁ జెప్పవలయునా? వీనికిం గారకము భావనాశక్తిగాదు. మఱి సామ్యశక్తి. అందులోనుగుయుక్తి కాముకుఁడట! తాళలేనివాఁడట! ఆలోచనాశక్తిచేఁగాని తట్టనట్టి పదునెనిమిది పద్యములం గొణగెనఁట! రసాభాసమన నిదియేగదా! (౨౮౦, ౨౮౧) కళాపూర్ణోదయములోని మీఁదివృత్తాంతములయందుఁ గల్పనలేదు. కథలేదు. ఒకవిషయమునకు నొకవిషయముగా నిష్కారణముమై నంటించి పుస్తకముఁ బొడుగుఁ జేయుట కవియుద్దేశమేమో! ఆసర్వలక్షణ సంపన్నతా ప్రతిజ్ఞయొక్క దుష్ప్రకృతి యిటుఁ దేటతెల్లంబు. (౩౦౯) కళాపూర్ణుఁ డారీతిని వివిధ యుద్ధంబులఁ దన కేకీడుచేయనిరాజులను భార్యకైపూనిన వైరముచే నోర్చి జయశీలుఁడై పురము ప్రవేశింపఁగా, పౌరస్త్రీలు అతనిఁజూచుటకై

వినోదకరములగు వేషములతో వచ్చుచున్నారు. నేఁ జెప్పనేల? సాధ్యమైనంతవఱకు మీరే కన్నులవిప్పి చూడుఁడు.

ఉ. క్షోణితలేంద్రుఁ జూడ నొకకొమ్మ వడిం బఱతెంచి యుల్లస
ద్వేణిభరంబుతో మొగపుతీఁగె వలగ్నమునం దమర్చి యొ
డ్డాణము తీఁగెగానిడి మెడన్ వలగొన్నది చాల కడ్డమై
పాణులనుండఁగొను మఱి బాగుగఁ గానుకపెట్టు కైపడిన్. (కళా. ౮-౧౩౭)

ఉ. గుబ్బెత యొర్తు వచ్చె నృపకుంజరుఁ జూడ రతార్తనీవిఁదా
గొబ్బునఁ గట్టుచున్ బయఁటకొంగది మాన్పగఁబోలెఁ గాళ్లపై
బ్రబ్బికొనన్ గుచోద్ధతభరంబునకుం బయికాఁపువోలెఁ ద
బ్బిబ్బుగఁ జేతికిన్ దొరికి పెన్మిటి వస్త్ర మురోవృతంబుగన్. (౮-౧౪౦)

ఏమిది? ఉన్నట్టుండి రాజు సగమురాత్రిలో వచ్చెనా?

తే. ఇత్తెఱంగునఁ బౌరులకెల్ల నేత్ర, పర్వమొనరించు రూపవైభవముతోడఁ
గ్రముక కంఠోత్తర మహాపురప్రవేశ, మాచరించి............ (౮-౧౪౩)

ఇదేమి యన్యాయము! పౌరులకెల్లనఁట! స్త్రీలకే గదా రాజులు ముఖ్యముగ దర్శనమిచ్చుట? ఇట్టి యపచారములును శృంగారములా? (౩౧౭, ౩౧౮) రాజుగారు పురమున నూరేగునపుడు పౌరస్త్రీలందఱుఁ గామాతురమై వానింజూడ పరిపరివికారవేషములతో వచ్చిరని ప్రబంధముల వర్ణింపఁబడియుండుట. ఈకవులయూహ యేమనఁగా రాజు! ఇంక వానింగలయఁగోరక తరుణు లెట్లోర్తురు! మనము రెండణాల దక్షిణ నాశించి యేతారతమ్యముల నెంచక ధనికులను దొంగభక్తి నాశ్రయించుచున్నాముగదా! స్త్రీలును, మనకన్న నెట్లు శ్రేష్ఠులు! నికృష్టజన్మలే గావున వారిలో నిట్టిపిచ్చి యెక్కువ! యని కాఁబోలు. (౧౫౬) అని రెడ్డిగారు వ్రాసిరి. చంద్రోపలంభనాదులు కావ్యశోభలై యున్నవి. అనవరతభావనామహిమవలన నుత్కంఠగలుగును. ఇతరమందు మనసు లగ్నముకాదు. సదా నాయికానాయక సంస్మరణమువలన మరణావస్థ గూడ సంభవించునని చెప్పఁబడినది. అతిసుకుమారులుగావున చక్రవర్తి కన్యలకు శైత్యోపచారములు గావించుట యసహజముగానేరదు. కవులు దానిని వర్ణించివ్రాసెదరు. పురస్త్రీలు రాజును నానావేషములతోఁ జూడ

వచ్చుట యనునది, కాఁబోవు భార్యయొక్క యంగములను నర్మసచివు నితోఁ బ్రసంగించుట యనునది కావ్యశోభ. అది యథార్థమని తలంపఁ గూడదు. రాజుయొక్క వైభవము, గుణసంపదయే యందుఁ బ్రధానమైన విషయము. పౌరస్త్రీలుచూడవచ్చుట పురప్రవేశశోభలలో నొకటికావున కవులు దానినివర్ణించెదరు. కానున్నభార్యనుగూర్చి నర్మసచివునితోఁ బ్రసంగించుటలో నాస్త్రీ కన్యయైయున్నదనియో, యుత్తమవంశసంజాత యనియో ఫలితార్థముతేలును అనఁగా నక్రమమునకు నుత్తముల మనసు పోదు. అనునది అందుఁ దేలుచుండును. నాయికానాయకులు ఒకరినొకరు దీర్ఘముగావర్ణించుట, మర్మాంగములవర్ణించుట యనునది అనవరతభావన వలనఁ గలిగినది. ఒకరికొకరు బట్టలుతీసి దర్శనమిచ్చిరాయని ప్రశ్నించుట యవివేకము. భావనగావున దానికి కాలనిబంధనయుండదు కదా. స్వభావ వర్ణనలోను, ప్రకృతివర్ణనలోను నన్నివిషయములలోను మనకవులసాటి యగువారు భూమండలమునలేరు. చంద్రోపాలంభనాదులు, ప్రత్యంగ వర్ణనము, పౌరస్త్రీ రాజసందర్శనము నివన్నియు మహాకవులు వ్రాసియే యున్నారు. కుమారసంభవములో పార్వతీదేవిని వర్ణించుచు పిక్కలను, దొడలను, గటిప్రదేశమును, నూగారును, వళిత్రయమును వర్ణించి కుచ ములఁగూర్చి కాళిదాసు ఇట్లు వర్ణించెను.

శ్లో. అన్యోన్యముత్పీడయదుత్పలాక్ష్యాః స్తనద్వయం పాండు తథా ప్రవృద్ధం,
మధ్యే యథాశ్యామముఖస్య తస్య మృణాళసూత్రాన్తరమప్యలభ్యమ్. (౧-౪౦)

(అన్యోన్యము రాపాడుచున్న పార్వతీదేవి స్తనద్వంద్వము మధ్యను మృణాలసూత్రమైన దూరుట కెడములేనంత దగ్గరగా పెఱిగినవి.)

ఇందు శ్యామముఖస్య యనఁగా నల్లనిచనుమొనలని యర్థము పార్వతీదేవిసౌందర్య మిట్టిది. ఆమె పతివ్రతయనునదే ప్రధానముగ గ్రహింపవలసిన విషయముగదా. మఱియు కాళిదాసు రఘువంశమం దిట్లు వ్రాసియున్నాఁడు.

శ్లో. జాలాంతరప్రేషితదృష్టిరన్యా ప్రస్థానభిన్నాం న బబంధ నీవీం,
నాభిప్రవిష్టాభరణప్రభేణ హస్తేన తస్థావవలంబ్య వాసః.

(మఱియొక స్త్రీ రాజును గవాక్షవివరమునుండి చూచినదై తొందరమైవచ్చినందున విడిపోయిన నీవిని ముడివేయనే లేదు. నాభిప్రదేశమందు ప్రవిష్టమైన యాభరణ కాంతిగలచేతితో నావిడినట్టివస్త్రమును బట్టుకొనియే యుండెను. ఇట్లుగా రాజునుజూచుటకు వచ్చెను.)

కావ్యము ప్రకృతి నతిక్రమించియుండునని తెలియనివారికి ఇట్టివన్నియు నసందర్భములుగఁదోఁచును. రసికులు సంతసించెదరు. ఇట్టివర్ణనలు భాగవతాదిగ్రంథములందుఁ గూడగలవు. అలంకారశాస్త్రముల ననుసరించుట సామ్యశక్తిగాని భావనాశక్తికాదని రెడ్డిగారు వ్రాసిరి. భావనాశక్తింగూర్చి రెడ్డిగా రిట్లు వ్రాసిరి.

---

# కవిత్వతత్త్వవిచారవిమర్శనము.

## శ్రీయుత కట్టమంచి రామలింగారెడ్డిగారి పుస్తకవిమర్శనము.

### భావనాశక్తి

భావనాశక్తియనఁగా విషయముల మనసులోఁ బ్రతిబింబించునట్లు చేయుసామర్థ్యము. ఒక్క ప్రతిబింబించుట యననేల! ప్రత్యక్షముగ నవతారమెత్తునట్లుచేయుట. సీత, ద్రౌపది, సావిత్రి, దమయంతి, శూర్పణఖ మొదలగు స్త్రీలు కవికల్పనమునకుఁ జేరినవారయ్యును మనకుఁ జరిత్రములలోని స్త్రీలకంటెను మఱియు మనము నిత్యమునుజూచుచు వాదాడుచునున్న యిరుగుపొరుగు భాగ్యశాలినులకన్నను నెన్నియో మడుంగులు సత్వముం దాల్చినవారై స్ఫురించుచున్నారు గదా! చూడం బోయినఁ బాండవులు, దుర్యోధనాదులు, రామ భరతులు మొదలగు మనస్సృష్టిమానవులు మిథ్యలా? మనమే మిథ్యలా? ఈతీరునఁ గృత్రిమముల సయితము మూర్తీభవింపఁజేయువారే మహాకవులు అట్టివారు వ్యాకరణమునకు భంగముగలిగించిన నేమి? వచనమున వ్రాసిననేమి? వారి కేకొదువయు రాఁబోదు. వ్యాకరణము యతిప్రాసములు అన్నియుఁ దప్పకకుదిరినను భావనాశక్తిలేనియెడల నట్టి పాండిత్యము జీవములేని యాకారముబలె జడంబుగఁ గాన్పించును. ప్రతిమలువ్రాయుటలో బహు సమర్థుఁడైన యొకశిల్పివర్యునియెడకు చిల్లరశిల్పియొకఁడుపోయి తనలిఖించిన చిత్రపటముంజూపి, దీనియందేమైన దోషములున్న వా? యనిప్రార్థింపుడు నాతం డిట్లనియె. 'అయ్యా! గీఁతలు వర్ణములు మొదలగు గుణములన్నియుఁ జక్కఁగ గుదిరియున్నవి కాని, యీసుందరవిగ్రహమునకుఁ బ్రాణములే యున్నట్టుగానమే!' అదివిని 'యేరీతిని దిద్దిన దీనికిఁ జైతన్యమబ్బును దెలుపవే మహాత్మా!' యని యాపిద్యార్థి దీనుఁడయి వేఁడుఁడు, 'అయ్యా! నీచింతఁదీర్ప నావలనఁగాదు. నీయడిగిన వరంబు సాజమైన

భావనాశక్తిచే లభ్యము. ఇట్టిట్లు చిత్రించుటచే ఘనుఁడవగుదువని చెప్పి చేయించుటలో ఫలము లేదు. వానివాని మనోబలము కొలఁదిఁ బరిపూర్ణత్వము సిద్ధించునే కాని యలంకారశాస్త్రముల ననుసరించుట నిష్ప్రయోజనము!' అని యాకళాకోవిదుఁడు వాక్రుచ్చెను. జన్మముచేతన కవి గావలయుఁ గాని పఠనము అభ్యాసము నివి యుండినమాత్రము చాలదు. తోడంబుట్టిన చాతుర్యముండినచో నివి సహాయభూతములై వృద్ధిని వికాసమును గల్పింపవచ్చును. స్వాధీనంబగు మనోగాంభీర్య మలవడి యుండ దేని కృషిఁ జేయుట విత్తునాటక యెరువువఱిచినట్లు కొన్ని పురుగులుమాత్రము సృష్టికివచ్చునేమో?

ఈతత్వమునకుఁ బ్రమాణమైనవాఁడు వేమన (ఇతఁడు పండితుఁడు కాఁడు. పాండిత్యసంపాదనయం దంతభక్తిగలవాఁడు కాఁడు) కుటిలమతాచారములు, మూఢభక్తి, వేషధారితనము మొదలగు వానిని దూలనాడుటయం దీతం డద్వితీయుఁడు. గొప్పరహస్యముల బోధించినవాడైనను తనకుంగల నైజమగుబుద్ధినే కాని, పలుపలు దెఱంగుల విపరీత వ్యాఖ్యానములకుం బాలగుశాస్త్రముల నాశ్రయింపలేదు. అనేకులు సిద్ధాంతముల కాధారములు ప్రాచీనసూత్రములని నమ్మి వానిని వల్లించుటకై జ్ఞాపకశక్తిని వృద్ధిచేయుచు మనశ్శక్తిని గోలుపోయెదరు...... నిదర్శనములంజూపుటలో నితఁ డద్వితీయుఁడు. మఱి యవి యెవ్వియు గూఢములు కావు. స్పష్టములు. శ్లేషచే స్థాపింపఁబడిన సామ్యములట్లు దిక్కునర్థమును లేనివి గావు. వైశద్యము అనుగుణ మితనియందు ప్రబలము. మనము ప్రతిదినమందును జూచుచు నింతేకదాయని యాదరము నవధానమునుంచకపోవు విషయములనే యీతఁడు గ్రహించి భావనాశక్తిచేఁ గాంతి, రూపము, ప్రాణము నావహింపఁజేసి యెదుటనిలుపఁగా, నపుడు గుర్తుదెలియక పూర్వము మనచే గర్హింపఁబడినవయ్యును, నివి యేవో యమానుషవిగ్రహములని విస్మయముజెంది గౌరవింతుము. (౮-౮) అని రెడ్డిగారు వ్రాసిరి. సీతారాములు, ద్రౌపదీపాండవులు మొదలగు పురాణపురుషులు కవికల్పనకుం జేరినవారని రెడ్డిగారు వ్రాసిరి. ఇట్లు వ్రాసినఁగాని భావనాశక్తికి ప్రాధాన్యముకలుగదు కాఁబోలు. ప్రాచీనసూత్రములు సిద్ధాంతముల కాధారము కాదన్నారు.

వాటినివల్లించిన మనశ్శక్తి నశించునన్నారు. పురాణపురుషులు కల్పితులని వ్రాసినవారికి ప్రాచీనసూత్రాదులన్నియు సిద్ధాంతములు గాకపోవుటలో వింతయేమిగలదు! ప్రాచీనకావ్యములు, అలంకారశాస్త్రములు చదివిన జ్ఞానమభివృద్ధియగును. శాస్త్రాదులవలన బుద్ధివికసించును. కవితాశక్తి కది దోహదము. కవిత్వము సహజముగనే పుట్టవలయును. పాండిత్యము తోడైన మిక్కిలి రాణించును. ఇందులకు నిదర్శనము. ప్రాచీననవీన కవిత్వములే యైయున్నవి. (నవీనకవిత్వమంతయు నని అభిప్రాయముకాదు.) 'ప్రమాదో ధీమతామపి' అనునట్లు ఛందోవ్యాకరణాదులకు నభిప్రాయములకు లోపములుండవలెనుగాని శుద్ధముగ నసందర్భములు వ్రాయుట భాషకును గవిత్వమునకును గళంకమాపాదించుటయే యగును. శిల్పముల వ్రాయుటలోఁ గొన్ని నిబంధన లుండును. ఇతర శిల్పములంగాంచి యనుభవము వృద్ధిచేసుకొనుచుండుట యుండును. అందుపైని శిల్పి స్వశక్తిచూపుచుండును. అట్లుగనే కవిత్వమునకుఁగల నిబంధనల ననుసరించుచుఁ బ్రాచీనకవిత్వములయందున్నవి అనుభవమునకుఁ దెచ్చికొనుచు కవి స్వశక్తిచూపించును. మానవజీవితమెట్లు సంఘనిబంధనము, రాజశాసనముల మూలమున రాణించునో యట్లే కవిత్వము గూడ భాషాదుల వలన శోభించును. ఎవరిష్టము వారిది అను కాలములో నడ్డదిడ్డమైన కవిత్వములు వెలయుటలో నాశ్చర్యములేదు. వేమనయు రెడ్డిగారు తలంచినట్లు స్వేచ్ఛమై వ్రాయలేదు రెడ్డిగారి కసందర్భములని తోఁచిన వెన్నియో యాతఁడు మంచివనియు, సంఘశ్రేయోదాయకమైనవనియు లిఖించియున్నాఁడు.

"మనుష్యుల మనంబులలో నిరంతరసంయోగముం దాల్చిన ప్రకృతులు మూఁడుగలవు. ౧. ఆలోచనములు. (కార్యకారణములంగూర్చి విచారణచేయుట, వస్తుస్వరూపము నిర్ణయించుట యిత్యాదులు) ౨. భావములు. అనఁగా మనోవికారములు. ఉదా; కామక్రోధాదులు, ప్రేమ, పశ్చాత్తాపము, దయ, దాక్షిణ్యము. మొదలగు చిత్తసంచారములు. 3. సంకల్పములు. అనఁగా నేదైన నొకదానింగోరి, దానిని సాధింపవలయునని ప్రతిజ్ఞబూనుట. ఈమూఁడుశక్తులలో భావనాశక్తి నధికంబుగ విజృంభింపఁజేయునవి భావములు. కొయ్యలరీతినో, మహాత్ముల

చందంబుననో, నిర్వికారస్థితినుండువారు పద్దెములు వ్రాయనేర్తురుగాని, కవులగుట యసంభవము. ఏవృత్తాంతమునైనఁజూచునట్లు వర్ణింపవలయు నన్న దానియొక్క స్థితిగతులను, నందలిపాత్రముల సుఖదుఃఖములను, రోమరోమమునకును దానే మనఃపూర్వకముగ ననుభవించినందప్ప, తద్రూపముగ నభినయింప నెవరికిని దరముగాదు. చిత్తచాంచల్యము గూడదనువారు ఇట్టియనుభవములకు మనసిచ్చి సమ్మతింపరుగావున వారి యందు శాస్త్రజ్ఞానమొకవేళ ప్రకాశమునకు వచ్చిన రావచ్చునుగాని, శిల్పకళ లేమాత్రమును మొలకెత్తనేరవు. ఈవిషయము పామరులు సైతము గొంతకుఁగొంత యెఱిఁగినదే. కావుననే కాళిదాసు తిక్కన్న మొదలగు మహాకవులెల్లరు రసికులనియు స్త్రీలోలురనియు వారు గాథలుకట్టియుండుట!" (౧౧) అనివ్రాసిరి. కవియైనవాఁడు తానే సకల మును మనఃపూర్వకముగ ననుభవించి వ్రాయవలెనన్నారు. అంతియెకాని ప్రాచీనులువ్రాసినట్లును నలంకారశాస్త్రము లాదేశించినట్లును విరచింపఁ బ్రయత్నించుట తెలివితక్కువపని (3౧) అనియు రెడ్డిగారు వ్రాసిరి. కారణము నిట్లుచూపిరి.

"ఒకకవివ్రాసిన విధమున నింకొకఁడు వ్రాయఁజాలమి ప్రకృతిసిద్ధ మైన యర్గళము. ఇందునకుఁ గారణములు. (౧) మనసులు వేఱగుటంజేసి భావాదులును వేఱు. వివిధభంగుల స్ఫురణముగలవారు ఒకేతీరున నభిన యింపఁజూచుట పరిహాసమునకు హేతువు. (౨) భావము భాష యివి పరస్పరసాంగత్యముం దాల్చియున్నవి. ఇంచుక నిదానించి చూడుఁడు. ఏవిధమైన పదములచేరికయు లేని యాలోచనలఁజేయుట సాధ్యమౌనా? ఏదీ? భాషాసాహాయ్య మేమాత్రముఁ గైకొనక కొంతసేపు దేనిని గూర్చియైన యోజింపుఁడు? ఈగారడీవిద్య మనుష్యులకుమించినది తల పుండిన భాషయునుండవలయుట నిజము. అయినను భాషయుండినఁ దలం పుండితీరవలయునా యను నొకప్రశ్నయు విచార్యము. భావము లఖండ ముగ లేకయుండినను పదాడంబరముఁ బ్రబలముగాఁ జూపవచ్చునను టకు మనప్రబంధకవులే సాతులుకాని, యట్టిపదములు నిరర్థకములుగాన హృదయాకర్షకములుగావు. రుచినీయవు. భావపుష్టి లేని పదపుష్టికి బడాయి శైలియనిపేరు. పసిపిల్లలేగాని ధీరులెవరును దీని నొకయెత్తుగఁ బాటిం

పరు" (3అ.) అని వ్రాసిరి. కవిత్వమునకు భావము భాష రెండును ప్రధానములే. మఱియుఁ గార్యకారణములంగూర్చి విచారణచేసి వస్తుస్వరూపమును నిర్ణయించినఁగాని కవిత్వముబాగుండదు. కావునఁ గవి ముఖ్యముగ దీనినిఁ జర్చించుకొనవలసియున్నది. మనసులు వేఱుగా వచ్చును, భావములు వేఱుగావచ్చును. కాని జనసామాన్యమున కేది సమానభావమైయుండునో అది గ్రహించి దానినిఁ గవి వ్రాయవలసియున్నది. అందుకు వస్తుస్వరూపములను ముఖ్యముగ నాతఁడు గమనింపవలసియున్నది. విషయ మిట్లుండఁగా వస్తుస్వరూపమును నిర్ణయించుట ముఖ్యముకాదని రెడ్డిగారిట్లు వ్రాసిరి.

"వస్తువులనిజస్థితి నిర్దేశించుట శాస్త్రముల యాప్సితము. (పూర్వశాస్త్రములని రెడ్డిగారియభిప్రాయము కాదేమొ!) కళలయొక్క కాంక్ష యదిగాదు. ఎట్లన, కళలలోఁ బ్రధానమైన పురుషార్థము రసము. రసము భావమునకు సంబంధించినది. భావములపరమైన దృష్టితో గణించి వర్ణించుటయే కళయందు శ్లాఘనీయమైనపద్ధతి. భావముతోఁ జూచుటకును భావములేక చూచుటకును నెంతో భేదము. ఉదాహరణము. సుందరియగు నారీమణిని జూచి యువ్విళ్లూరువానికి నామెసొగసు నిమిషనిమిషమునను వృద్ధిఁబొందునట్లు దోఁచుచుండును. వీనికిని ఆవేశము వృద్ధిఁ బొందుట తప్పదు. 'రాజు మెచ్చినదే రంభ' అనఁగా ననురాగముండెనేని ఎవరిమీఁద నాయనురాగము వ్యాపించునో వారు, తదితరుల కెంత కురూపులుగఁగానవచ్చినను,వానికి మనోహరమూర్తులుగఁ గానుపింతురు. అట్లగుట యెంతయుమేలు. ప్రతివాఁడును మోహము కొలఁది సర్వోత్కృష్టురాలనిభ్రమించి యెవతెనో యొకస్త్రీని వశ్యముచేసికొనఁజూచుట యీన్యాయముయొక్క మాహాత్మ్యమే. ఈధర్మము మనుష్యప్రకృతిని బాలించుచుండదేని, నిర్భావముగానే పక్షపాతములేక యెల్లరు నేస్త్రీని నుత్తమురాలని నిర్ణయింతురో దానినే యందఱువలచి సుందోపసుందుల ట్లధోగతిఁజెందియుందురేమో! భావములయొక్కదృష్టికిని ఆలోచనాశక్తియొక్కదృష్టికిని ముఖ్యమైనభేద మేమనఁగా, యోజనాశక్తింబట్టి నిరూపించితిమేని సత్యమొక్కటియే. అనఁగా సిద్ధాంతీకరింపఁబడిన తత్త్వము సర్వజనులచే సరియని యొప్పుకొనఁబడియే తీరవలయును.

దృష్టాంతము గణితశాస్త్రము ఏడును పదితోఁగుణించిన డెబ్బదియగు ననుట నిర్వివాదము. ఎవఁడైనను నాకీమాట రుచింపదనియనినచో వానిని బిచ్చివాఁడందుము. కాని గోచరములయెడ భిన్నభావములున్న నది ప్రకృతివిరుద్ధమని యెవరుఁజెప్పరు. కావుననే 'లోకో భిన్నరుచి'యను సామెత. ఎట్టిసౌందర్యవతియైన నేమి? లోకములోనివారెల్ల నామె యందే బద్ధమోహులుగావలెను. అట్లుచేయనివారిని బిచ్చియాసుపత్రికిఁ బంపకతప్పదు" అని సిద్ధాంతముఁజేయఁ బిచ్చివాఁడుదక్క నింకెవఁడైనఁ గడంగునా? కావున శాస్త్రములలో నేకకంఠముగ నెల్లరును ఇది సత్యము తక్కినవి మిథ్యలు, అని స్థిరీకరించినట్లు కళలలోఁ జేయఁజూచిన రసా భాసము నిత్యము. ఒకేవస్తువు మానవులప్రకృతులంబట్టి యనేకభావ ముల కాస్పదముగావచ్చును. మఱియు భావములంబట్టి కొంతవఱకును రూపమేర్పడునుగాన ననేకమాయలం దాల్చినదియు నగును నానారూప ములం జెందియుండుట యొక్కభగవంతునకే చెల్లినభాగ్యముగాదు. అతనిసంతతివారముగాన మనకును నందు భాగము గలదు. భారతము లోని దుర్యోధనునింగూర్చి విచారింపుఁడు. ధృతరాష్ట్రుఁడు, అనుజులు, సచివులైన కర్ణాదులు, ప్రజలు, పాండవులు మొదలగు వివిధపక్షముల వారిలో నొక్కొక్కరి కొక్కొక్కయవతారముగ నాతఁడు దోఁచ లేదా. ఒకరికిఁదోఁచినట్లు వేఱొకరికిఁదోఁచెనా? ఒకరికనులతో నింకొకరు చూచుటెట్లు? చూడఁబోయిన వస్తువొకటేయైనను మూర్తులనేకము లనుట కతఁడును సాక్షిభూతుఁడే. ఇంతేకాదు. తాను గొప్పగానున్నపు డశ్వత్థామకు దుర్యోధనునిపై గౌరవముండెనేమి? గోగ్రహణసమయ మున నతనిని ధిక్కరించినట్టి సాహసుఁడు. అట్లుండియు, నా రాజరాజునకు కష్టములు ప్రాప్తించినది మొదలు ఆతనియెడ సేవాధర్మము నిర్వర్తింప వలయునను శ్రద్ధయేకాదు. నిజమైనభక్తియుఁ బ్రీతియు పుష్కలముగఁ దాల్చినవాఁడాయెను. తుదకు నమ్మహనీయుఁడు తొడలువిఱిగి పడియున్న పుడు, అతనిపాటునకు నెరియు మనమ్ముతో నాగురుపుత్త్రుఁడు విలాపిం చెను. (పాండవులధర్మముగఁ దనతండ్రినిఁజంపిరని పరితపించెను. దుర్వార పరాక్రముఁడగు రాజరాజు అధర్మవృత్తిఁ జంపఁబడెనని విచారించెను. అట్లు చంపుటవలనఁ బాండవులకీర్తి మాయుననియు, ధర్మజుఁడు సదా

అంతర్మదదుష్టుఁడనియుఁ బలికి ప్రభునికష్టముమాన్పని తన్నుఁగూర్చి యశ్వత్థామ నిందించుకొనెను) కావున వస్తువులనేకుల కనేకరీతులఁ దోఁచుననుమాయ యొకటిమాత్రమే కాదు. ఒక్కనికే కాలదేశవర్తమానంబులంబట్టి యనేకవిధములఁ దోఁచుటయును స్వభావప్రభావమే. ఇక్కడ ఒక్కఁడంటిమి. వాఁడుమాత్రము వికారరహితుఁడా? కాఁడు. మఱి మాఱుచుండువాఁడే కావున భావంబులు ప్రసిద్ధిగనుండు నీలోకములో నానావతారసిద్ధియు విశ్వరూపప్రదర్శనశక్తియు సర్వవస్తువులకు సామాన్యములు సహజములునైన లక్షణములు ఆలోచనశక్తిచే నుత్పాదితములైన శాస్త్రములయొక్కయు భావబంధురములైన శిల్పములయొక్కయు దృష్టులు వేఱు. గోచరించుపదార్థముల తీరులును వేఱు. కావుననే శిల్పములు రచించుటలో స్వప్రతిభప్రకారము పోవలయునే గాని అలంకారశాస్త్రజ్ఞులు, ప్రాచీనకవులు వీరిని ననుకరించుచు ప్రతికల్పనలం జేయఁజూచుట పొసఁగ రానిమతమని ముున్నే చెప్పఁబడియుంట ఏలకో మనకవు లీనాఁటికిని రుక్మిణీపరిణయాలు సుభద్రాపరిణయము వ్రాయుచుండుట'' (౩౯-౮౩) అని రెడ్డిగారు వ్రాసిరి. శాస్త్రములలో నిజస్థితి నిర్దేశింపఁబడును. దానినిఁ బోషించునదిగఁ గవిత్వముండవలయును. తానువరించిన స్త్రీకన్న సర్వోత్కృష్టురాలగుస్త్రీ మఱి లేదని యెవరును భ్రమింపరు. స్త్రీగణములో నొక స్త్రీనిమాత్రము వరించుట లోకనిబంధనము. అది లేనందునఁ బాశ్చాత్యదేశములు పాడగుచున్నవి. కారణము వివాహము సంస్కారము కాకుండుటయే అందువలన నిక్కంపుఁబ్రేమ సన్నగిల్లి సంబంధములు క్షణభంగురము లగుచున్నవి. మోహముగలుగుటకు సౌందర్యమే కారణము కాదు. మోహముగల్గినది గావున నాస్త్రీనిఁ బ్రేమించెను అనునది శాస్త్రము కాదా. దుర్యోధనుఁడు ధృతరాష్ట్రునకు, అనుజులకు,సచివులైన కర్ణాదులకుఁ బ్రజలకుఁ బాండవులకు నొక్కొక్కరి కొక్కొక్కయవతారముగఁ దోఁచుట యెందువలన. పుత్రవాత్సల్యము, భ్రాతృగౌరవము, సేవాధర్మము, ప్రభుభక్తి, వంశగౌరవము మొదలగునవి వారివారియం దున్నవి గావున వారివారికాతఁ డట్లుదోఁచెను. అనునది శాస్త్రము తెలుపదా? శాస్త్రములకును భావములకును సంబంధము లేదని రెడ్డిగారిభావమేమొ. శాస్త్రమనఁగా వారియుద్దేశ మేమైయుం

డునోకదా! లోకసంబంధ మందుండదని వారియుద్దేశ్యమా? ఎవరెవరెట్టి స్వభావము గల్గినవారు. స్వభావములెట్టివి యనునవి భారతమందుఁ జూపఁబడినవి. ఉత్తమవంశసంజాతులకుఁ బుత్రదౌష్ట్యముచేఁ గలిగినమనో వ్యథ, పుత్రవాత్సల్యము ఎట్లుండునో అది గాంధారియందుఁ జూపఁబడి నది. ఉత్తమవంశసంజాతుఁడును దుర్మార్గుఁడునగు ధృతరాష్ట్రునందు వంశ గౌరవము, పుత్రవాత్సల్యము కడకు దుర్మార్గప్రవర్తనము చూపఁబడినది. సాంగత్యదోషమునఁ జెడుట కర్ణాదులందు, సత్సాంగత్యమున వృద్ధి నొందుట (జరాసంధసుతుఁడు) సహదేవాదులందుఁ జూపఁబడినది. ఇట్టి వెన్నో విషయములు భారతమందుఁ జూపఁబడినవి. ఇదంతయు శాస్త్రాను గుణ్యమగురచనయే. తండ్రింగూర్చి యాక్షేపము గల్గినపుడు, దుర్యోధ నుఁడు చెడిపోవుననితలఁచి యది తనకు సమయమగునపుడు అశ్వత్థామ దుర్యోధనుని ధిక్కరించెను. మఱియుఁ బోషణకర్తయగుటను (ఆశరీర మతని యన్నము దిని వృద్ధినొందినదగుటను) సేవాధర్మమును నిర్వర్తింపఁ గష్టసమయములోనున్న దుర్యోధనునినోదార్చి సహాయముగావించెను. దుర్యోధనుని ఒకప్పుడు ధిక్కరించెను అనునది యాతనియందు గౌరవ లోపమని తలంపరాదు. అశ్వత్థామ సదా దుర్యోధనునియందు గౌర వముగల్గినవాఁడే. శాస్త్రమునెఱిఁగిననే మనుష్యస్వభావము తెలియును. లేనియెడలఁ, బ్రతివాఁడును నితరప్రపంచమునకు భిన్నుఁడు, భిన్న ప్రకృతిగల్గినవాఁడని రెడ్డిగారు వ్రాసిరికదా, ఒకరిమనసు నొకరెఱుఁగు టెట్లు? మఱియొక్కవిషయమును రెడ్డిగారిట్లు వ్రాసిరి.

'మిశ్రచరిత్రములుగాని పాత్రములు ప్రకృతివిరుద్ధములు. పాత్ర ములంగూర్చి యీావఱకు స్థాపింపఁబడిన పద్ధతులు రెండు. (౧) అవి నిర్జీ వములట్లు బిఱ్ఱబిగిసి యుండఁగూడదు. (౨) మఱి తీఁగెలవలె నల్లునవిగా నున్న నింపును సత్యమును వహించినవగును అనుట ఇట విన్యసింపఁ దగినవిశేష మింకొండు గలదు. ఏదన, పాత్రముల చరిత్రములు శుద్ధ ముగ మంచివిగానో శుద్ధముగఁ జెడ్డవిగానో యుండునట్లు దీర్చుట శిల్ప దోషములలో నొకటి. ఏలోపమును లేని స్త్రీపురుషులుండరు. మఱి కేవ లము దుష్టులైనమానవులును గంటికిఁగానరారు. మనుష్యప్రవృత్తి మిశ్ర మైనది. ఖూనీచేసినవాఁడు సైతము పగసాధించుటయను వీరకర్మమున

కుద్యోగించువాఁడేకదా! దొంగలు పరులసొత్తును గ్రహించినను తమ భార్యలయు బిడ్డలయుఁ బోషణార్థమే కదా. ఇంతే కాదు. వెలుతురు చాయయు నెట్లు నెడతెగనిసంయోగముం దాల్చియున్నవో, యట్లే మంచిగుణములకును, దమనీడలో యనుమాడ్కి నవియే యాధార ముగఁ బ్రభవించెడు చెడుగుణములు సదాసహచరములై యుండును. ధైర్యము మంచిది. అయిన నభిమన్యునివలె నత్యంతసాహసోదగ్రులైన యెడ వ్యర్థమైన ప్రాణనష్టికి మూలమగును. ఇఁక నెదిరిని దమ్మునునెఱింగి సమయముపొంచి మీఁదఁబడుద మనువాఁడు జయముగొన్నవాఁడైనను అంతకడిందిమగఁడుగఁ దోఁపఁడు. నీతియనునది శకునికైతవముయొక్క యపరావతారము. నీతివిరహితమైనవిజృంభణము ఆశ్చర్యకరమైనను, ఆనందకరమవునో కాదో. మఱియు సుగుణములే కొన్నియెడలఁ బరస్పర విరుద్ధములగుటయు సంభవించెడు. అపుడేదే నొకన్యాయమును నిరాక రించుట విధిలేని యకృత్యము. దృష్టాంతము కర్ణపర్వమునఁ గృష్ణుఁడు చెప్పిన 'కౌశికోపాఖ్యానము'. సత్యము ధర్మమే అయినను దొంగలువచ్చి నీసొత్తెక్కడనని యడిగిన నిజము చెప్పవలయునా? శత్రువులు వచ్చి నీ యింటఁజొచ్చినవాఁ డెక్కడనున్నాఁడు చూపుమా వానిగొంతు గోయ వలయును. అని మర్యాదగాఁ బ్రార్థించిరేని, నిజముచెప్పిన భూతదయ నశించును. కనికరము నుద్ధరించిన నన్ృతదోషము ఘటిల్లును అట్లగుటఁ గేవలము నిరంజనుఁడుగా నుండవలయునన్న నసాధ్యము. నిరంజనత, నిర్వికారత, నిష్కళంకత ఇత్యాద్యభావములు మానవప్రకృతికిం జేరినవి కావు. మననడతలు మిశ్రములు. ఈన్యాయమునకు ననుకూలమైనరీతిని పాత్రముల చరిత్రములంజేర్చి విస్తరించుటలో భారతమునకు నీడు జోడైనగ్రంథము లెవ్వియునులేవు. సామాన్యకవుల పాత్రములు నిర్వి కారములుగ నుండుటయేకాదు. సంశ్లిష్టములునుగావు. అవి యేకరస ప్రధానములుగాని నానాభావాభ్యుదయములకు నాకరములుగావు' (౩౮-౩౯) అని వ్రాసిరి. సుగుణవంతులు, దుర్గుణులు, సుగుణదుర్గుణమిశ్ర గుణముగల్గినవారు ప్రపంచమున నున్నారుగాని అందఱు మిశ్రగుణము గల్గినవారే కారు సుగుణవంతులలో హెచ్చుసుగుణములు గలవారు తక్కువ సుగుణములుగలవారు ఇట్లుగా ప్రపంచమున్నదిగాని మిశ్ర

మమే ప్రపంచనైజము కాదు. ఇట్టి పాత్రములుగల్గి భారతము శోభించు చున్నదన్న సంగతి రెడ్డిగారికిఁ దెలియదు. కూనీచేయుట వీరకృత్యము కానేరదు. వీరకృత్యమగునపు డది కూనీకానేరదు. దొంగతనము చేసిన నది సక్రమమైన కుటుంబపోషణము కానేరదు (కుటుంబపోషణము నకై దొంగతనముచేయువారు అరుదు.) అది మంచిక్రింద రానేరదు. అభిమన్యునిది వ్యర్థమైన ప్రాణనష్టము కాదు. ప్రాణమర్పించి తండ్రుల ఖ్యాతిని నిలఁబెట్టినాఁడాతఁడు. అట్లే ఘటోత్కచుఁడు ప్రాణమర్పించి పాండవఖ్యాతిని నిలఁబెట్టినాఁడు. తగినపట్టుల వారు ప్రాణములనర్పించిరి. అట్టి ఉత్తమశూరుని యుద్ధమరణము వ్యర్థప్రాణనష్టముగా రెడ్డిగారికిఁ దోఁచినది. సమయముఁజూచి జయముగొనుట కడిందిమగంటిమికి లోపము కానేరదు. రాజసూయమునకై పూనినపాండవులు ముందుగా జరాసంధుని మాయోపాయమున నిర్జించిరి అందువలనఁ బాండవప్రతాపము నకుఁ గళంకముగలిగినదా? ధర్మములు రెంటికిఁ బరస్పరవిరోధముగల్గినపుడందేది సత్పురుషాచరణీయమైనది అని భారతమందు విచారింపఁబడినది గాని మిశ్రప్రకృతి కుపమానముగ నేదియు వ్రాయఁబడలేదు. అందు గుణవంతుల గుణోత్కర్షయే వెల్లడియగును గాని మిశ్రప్రకృతియని యర్థము రానేరదు. భారత మేపాత్ర నెటులఁ బోషింపవలెనో యటులఁ బోషించినదిగాని మిశ్రమముచేయ లేదు. మిశ్రమము ప్రధానమనితలఁచి రెడ్డిగారిట్లు వ్రాయవలసివచ్చినని. ఇంతతో వారు విరమించలేదు. మఱియు నిట్లు వ్రాసిరి.

‘మిశ్రరసములుగాఁ గావ్యములఁ దీర్చుట మంచిది. వట్టిశృంగారమును మాత్రమ వర్ణించుట యారసమునకు వైరస్యముఁగలిగించుట. మనుష్యప్రకృతి యెట్టిదనఁగా నేమార్పునుజెందక యేకరీతినియుండువస్తువులయందు అవధానము చాలకాలము నిలుపఁజాలనియది! అవధానమును సుఖమును సమన్వితములు. ఎయ్యది తృప్తికరమో దానియందు మనసుంచుట సులభము. సహజమును. క్లేశకరములమీఁద బలవంతపెట్టినను మనసు నిలుకడఁగాంచదు భోజనపువేళ మితముగ నేయివేసికొనిన రుచి. అదిదప్ప వేఱేమియు లేకున్నను, మఱియమితముగ నయ్యది స్వీకరింపఁబడినను దానియందు రోయింపు జనించును. ఆరోఁతతోడ మనసును

ఇతరపదార్థము లేమేనున్నవా యని కోపముతో నలుదెసలను భార్యను పరికించును. ఐరోపాలోనికవులు ఈతత్త్వము నతిక్రమింపక వ్రాసిరి. (ఇచట నైరోపాలోనికవులఁగూర్చి చెప్పఁబడినస్తుతియంతయు భారతాదులరచించిన మనపూర్వులయందును జెల్లును. చెల్లనివారెవరనంగా దేశీయకాలపు హిందూకవులగు ప్రబంధకారులు.) అనఁగా కావ్యముల నేకక్రమముగఁబోనీక రసముల మిశ్రముచేసి యన్నింటియందు నభిరుచి స్థిరముగ నెలకొనునట్లొనర్చిరి. మనశృంగారకావ్యములు ఏకరసప్రధానములగుట నీరసములు. వెగటు, రోఁత, ఇత్యాది జుగుప్సారసములకు నాకరములు. నీతికిఁ గవితకుఁ బ్రత్యక్షసంబంధము లేదు ఇట్లనుటచే నిటీవలి మనశృంగారకావ్యములు నీతిబాహ్యములు, చెడ్డవి యని రేఁగుట కారంభించిన పరమపారిశుద్ధ్యధురంధరులలోఁ జేరినవాఁడనని యెన్నఁబోకుఁడీ! కావ్యము శిల్పము, నీతి శాస్త్రముఁగాదు. ధర్మశాస్త్రముఁగాదు. శిల్పముయొక్క యుత్కర్షనికర్షముల నేర్పఱుపవలయునన్న దాని రచనా సంవిధానములఁబట్టి నిరూపింపనగునేగాని, భగవద్గీతలయంత పారిశుభ్ర్య మిందులో లేదు. రామానుజభాష్యమువలె ముక్తిదాయకము గాదు అనివాపోవుట నిర్నిమిత్తప్రలాపము. తుదకు గోప్యములఁ బచ్చిగా వర్ణించినను నీతిశాస్త్రముంబట్టి ఖండించుట తెలివితక్కువ. మఱి రసభంగమా కాదా యనుటయే శిల్పవిమర్శనముయొక్క ఒక్కపరీక్ష. తక్కిన పరీక్షలిట యధికప్రసంగములు. ఆభాసములు. నాకుంజూడ ప్రబంధముల యందు నునకుఁ బ్రీతిలేమికిఁ గారణము వానియందు నీతిలేమిగాదు. మఱి రససంపోషకములగు స్థితిగతులకు వెలియై, రసికులకెల్ల నవి వైరస్యము మెండుగఁగల్పించుట. శిల్పముయొక్క ముఖ్యోద్దేశము మనసును హరించుట. ఈవశీకరణశక్తి యుండినయెడ నీతిలేకున్న నేకొదవయు లేదు. అదిలేనిచో నుపనిషత్తుల నుడకఁబెట్టి ధృతియంతయుఁదీసి యందునించినను నేఫలమును లేదు. కావున మనభాషకు నీతిముదురునట్లు చికిత్స, దోహదము, ప్రాయశ్చిత్తముఁ జేయవలయునను పరమపారిశుద్ధ్యధురంధరుల కొకదండము వెట్టి దూరముగఁ బొమ్మనుటయే కర్తవ్యము. ఇష్టము లేకున్న నీగ్రంథముల వారుచదువనేల? ఎవరును బతిమాలుకో లేదుగదా! ఇంట్లో గొళ్లెమువేసి పాపములఁజొరనీక భద్రముగానుండినను సరే. మఱియిర్లో

ద్ధరణక్రియకై పోలీసువారి శరణుఁజొచ్చిననుసరే! మనత్రోవ మనది.' (౧౧౬-౧౧౭) అని రెడ్డిగారు వ్రాసిరి. ప్రబంధకవులు శృంగారము ప్రధానముగాఁదీసికొని ప్రబంధములు వ్రాసిరి అందితరరసములు లేవనితలంచుట పొరపాటు. అనేకరసములు గల్గినకావ్యములు రసవంతములే. ఏకరస ప్రధానమైనవియు రసవంతములే యనుటకు మనసంస్కృతకవులుగూడ సాక్షులే. పాఠకులమనసును లగ్నమొనరించుఁగవితాశక్తిగల్గిన మనకవులకుసాటికవులు వేఱొకరు గలరా ? నీతికినిఁ గవితకును ప్రత్యక్షసంబంధములేదన్నారు రెడ్డిగారు. నీతివిరుద్ధమైనవి ధర్మవిరుద్ధమైనవి ఆంధ్రకవులు సంస్కృతకవులుగూడ రచించియున్నారు. కాని వారికావ్యములు ధర్మనీతివిరుద్ధములుగావు. తగినపట్టున వాటిని వ్రాసి రసపోషణ మొనరించియున్నారు. అది తెలియక నీతిబాహ్యముగఁ గావ్యములురచించుట మాత్రము గొప్పపొరపాటు. ఒకఁడు మఱియొకనిభార్యకై ప్రయత్నించినాఁడు. అందుకై అనేకావస్థలనొందెను. తనకోర్కె నామెకు నివేదించెను. ఎట్లకేలకొక్కమాఱు వీనికోర్కె నాస్త్రీ నెఱవేర్చెనని కవి వ్రాసినయెడల ఇందున్న దోషము. పెండ్లికానప్పటినుండియు వాఁ డాస్త్రీని నాశించెను గావున వానియందు దోషములేదు. కరుణగల్గివానికిఁ బ్రాణభిక్ష పెట్టినది గావున నాస్త్రీయందును దోషములేదు, రసపోషణగలదు అని తలంచుట పొరపాటుగదా. ఇట్టిదుష్ట విషయములే రసపోషణమని రెడ్డిగా రిట్లు వ్రాసిరి.

"(ప్రబంధములందు) శృంగారమనఁబడు నొక్కరసముమాత్రము దట్టముగఁగాఁజుచుండును. (ఇది నిజముగా శృంగారమనుట నిర్వివాదముగామి యిఁకముందు సూచింపఁబడును.) (౮౭) భావనాశక్తిలేనికవు లనేకులు శృంగారవర్ణనలు చేసియున్నారుగాని యవి రెండువిధములదుష్టములు. ఒకటి, వారిశృంగారమనునది తుచ్ఛసుఖవిషయాసక్తియైన శరీరతాపముగాని మనోరాగముగాదు. రెండవది, శృంగారమును నాయికానాయకుల చిత్తప్రకృతులననుసరించి యనేకరీతులనుండునని మనవారికిఁ దెలియదు గాఁబోలు! జావళీశృంగారముఁదప్ప నింకేరీతియు వారెఱుంగరు. అందఱిశృంగారము నొకరుచిగలిగినదే. నానాభంగులఁగాక, యేకరీతిగా నెల్లెడలనుండుటచ్చే రోఁతగలుగకమానునెట్లు? అసలు వాస్తవమైన

శృంగారముగాదు. మఱి దానినే యమితరాశిగా ముందుదెచ్చిపెట్టి ప్రతి దినమునుఆరగింపఁజేయుచుండిన నెట్టి మోటుపందికైన వెగటురాదా! కళా పూర్ణోదయమున నైదునకుఁ దక్కువగానివిధముల శృంగారమువర్ణింపఁ బడియున్నది అందుజావళీలకుఁజేరినదియొకటిమాత్రమ.(మధురలాలసాశృం గారము.) అయ్యది యప్రశస్తమనఁదగినభాగములో నుండుటచే దానిప్ర స్తావన యిటఁ జేయను. తక్కినవానిలో నొకదానివలె నొకటి యుండదు. అన్నియు రమణీయముల. కామముఅనునది జాతి. సామాన్యప్రబంధ కవులకుఁ దెలియకున్నను దానియం దుపజాతులు లెక్కకుమిాఱియున్నవి. స్త్రీపురుషులలో ప్రతివారును వలచువిధములు వేఱు. ఆచారమురీతిఁజేయ బడు తిలకవస్త్రాది రచనలోసయితము తమకు సొగసులనితోఁచెడుభంగుల చిత్తమేర్పడున ట్లుపచరింతురుగాదె! ఇంటిపెద్దలు, ఇరుగుపొరుగువారుఁ జూచి పదిమాటలాడుటకు నాస్పదములైన బహిరంగపు వర్తనలయందే వ్యక్తి సర్వవ్యాపిగానుండఁగా, మనసులో నుద్భవిల్లురాగములలో ప్రత్యేకభావములు చందములునుండక యచ్చుగొట్టినరీతి నందఱు నేక రీతింజరింతురా? సంపూర్ణమగునను వర్తనము తలపాగఁజుట్టుటలోనే లేదఁట! ఇఁక మనసును గన్నుపోవుజాడలలోనుండునా? శృంగారము శాస్త్రప్రకారముగాఁ దీర్పఁబడు విగ్రహముగాదని యెఱుంగని మనవారి విలక్షణత నేమనవచ్చును? సామాన్యముగఁ జైతన్యములలోనే యేక క్రమము అప్రకృతము. మానవులలో నదిచెల్లునా? సాధ్యమా? ఇఁక మనుష్యభావములనెల్ల నుత్కృష్టతరమగుమోహమున కట్టిజడ సంప్ర దాయము శక్యమా ? యోగ్యమా?

శృంగారభావములును నోరులేనికొడుకులుఁగూతులంబలె శాస్త్రోప దిష్టక్రమములమేరమిాఱక యాచారములననుష్ఠించి సర్వసామాన్యముగ నుండునని భ్రమించి, ఈసామాన్యస్వరూపము నలంకారశాస్త్రములు కని పెట్టి వెల్లడిచేసినట్లు మఱియొక్క భ్రాంతిం జెంది, యవిచెప్పినట్ల తెఱుచు మనకవులు వ్రాసియున్నారు. కామమునకుఁ గారణ మొక్కటిగాదు. మఱి పెక్కులు. పోవుమార్గములు, తొల్పుడుపభావములు, చూపుచిన్నెలును ప్రతివారియందును నవీనములు. అనన్యములు. ఫలములునట్టివే. ప్రేమచే విషముఁబెట్టువారులేరా ? తనకుండక్కకపోయిన నొరులనుం జెందఁగూడ

దని హృదయప్రియులను గొందఱు మృత్యువువాతఁ ద్రోయుదురు! కొందఱు ప్రాణములనైన నర్పించి వారికి మేలుచేయఁజూతురు. బలాత్కరింప నెంచువారునున్నారు. పరస్పరప్రీతి లేనికూటమి హేయమని రోయువారుంగలరు. భయము, శోకము మొదలగువానిచే వికలితస్వాంతలై యుండు, స్త్రీలమూర్తులు గొందఱకు నాఁపరానిమోహాతిరేకముఁ గలిగించును! శాస్త్రదృష్టితోఁగాక దేవుఁడిచ్చిన సొంతపుఁగన్నులతోఁ జూచువారికి నిట్టివిశేషములు సులభముగఁ గోచరింపఁగలవు. సూరన ప్రతిభావంతుఁడు. కనుక సంపూర్ణముగఁ బాండిత్యబద్ధుఁడు గాఁజాలఁడు. స్వశక్తియే గురువుగ నూతనమార్గములం ద్రొక్కి యాతఁడు ప్రకటించిన యసాధారణశృంగారములకు ముఖ్యనిదర్శనము లీక్రిందివి. (తన్నువలవని యభినవకౌముదికై జగత్ప్రళయమునకుఁబూనినట్టి) శల్యాసురవిషయము. (శాలీనుఁడు గృహమందు భార్యనాదరింపలేదు. తోఁటలో దివామైథునమునే అపేక్షించెను. అట్టి) సుగాత్రీశాలీనులవృత్తాంతము, సరస్వతీచతుర్ముఖవిలాసము (మణికంధరునినుండి మనసుఁద్రిప్పుకొని) నలకూబరసంగమాభిలాషనొందిన) కలభాషిణీచరిత్రము" (౨౧౧—౨౧౪) అని వ్రాసిరి. ఇందువలన రెడ్డిగారు శృంగారవిషయము నెట్లుతలంచిరో స్పష్టమగుచున్నది. నీతికిని గవితకును బ్రత్యక్షసంబంధము లేదు. అని తలంచినందునఁ గలిగినయసందర్భమిది. మఱియు నీతిసంబంధము ప్రత్యక్షముగ లేదన్న రెడ్డిగారు, సూరనవర్ణించిన ఉత్తమశృంగారము అప్రస్తుతమనియు, జావిళీలకుఁ జేరినదనియు వ్రాసిరికదా. నీతిననుసరింపనిభాగములను గూడ మనవారు చూపియున్నారు. అందుఁ గథాభాగము ప్రధానముగానేరదు. సత్యముకానేరదు పుష్పలావికలు, పౌరస్త్రీ రాజసందర్శనము మొదలైనవి. ఇవి నీతిబాహ్యములుగాఁ గానవచ్చుచున్నను యథార్థముకానందున నీతివిరుద్ధములుగావు అవి యథార్థములని యెట్టివాఁడునుగూడ తలఁపఁడు. అవి కావ్యమునకు శోభగలిగించును. అలంకారశాస్త్రములలో ననేకవిధశృంగారములు, నాయకులు, నాయికలుగలరు. ఆశృంగారములయొక్క, నాయికానాయకులయొక్కయు లక్షణములందుఁ జూపఁబడియున్నవి ఏశృంగారవర్ణనము లోకకళ్యాణమైనదో దానికిఁ బ్రాధాన్యముండవలెనని యలంకారశాస్త్రములు తెలుపుచున్నవి. సామాన్య

లక్షణములను (ధర్మములను) నపూర్వముగ వర్ణించుటయే నిజమైనకవిత్వ మహిమ. వాటిని నలంకారశాస్త్రములు చూపియున్నవి. వాటినిఁజదివి కవి యపూర్వమైన కావ్యమును సృష్టింపఁగలఁడు. అంతియకాని లోక విలక్షణమైనదిగ వర్ణించుట ఉత్తమకావ్యలక్షణము కానేరదు. మనుజుల రీతులన్నియుఁ బరస్పరభిన్నములుగావున సుప్రసిద్ధములైన పాత్రము లన్నియు ననితరతుల్యముగా నుండవలెనని రెడ్డిగారిట్లు వ్రాసిరి.

"సుప్రసిద్ధములైన పాత్రములన్నియు ననితరతుల్యములు. మఱియు ననితరతుల్యములే సుప్రసిద్ధములు. ఉదా. ద్రౌపది,సీత,సావిత్రి, శకుంతల, మండోదరి, శూర్పణఖ మొదలగువారు ఎల్లరచిత్తములలోను జక్కఁగాఁ దమతమగుణములచేఁ బ్రకాశమానలుగనున్నారు వీరిలో మంచివారునైతము భిన్నమూర్తులే కాని, ప్రత్యేకపఱుచుటకు సాధ్యము గాని యొకేయచ్చునఁగొట్టినట్టి బొమ్మలుగారు. ఇఁకఁ బ్రబంధస్త్రీలన్ననో యట్లుగాదు. అందఱకు నొకటేమూర్తి. వెవ్వేఱగుర్తింప నలవిగానట్టిది. ఆకారములు, గుణములు, చీరలు; నగలు అన్నియును నలంకారశాస్త్ర మను నొకేయంగడిలో నెరవుతేఁబడినవస్తువులు. పేర్లుమాత్రము వేఱు. చర్యలేమో యొక్కటే. అవియు నంత శ్రేష్ఠములుగావు వ్యక్తిత్వము సున్న." (౨౮, ౨౯) అని వ్రాసిరి. ప్రబంధస్త్రీలందఱు సంస్కృతములో పూర్వము వ్రాయఁబడిన పురాణాదులనుండి గ్రహింపఁబడినవారే. కావున రెడ్డిగారిట్లాక్షేపించుట వారిమతరీత్యాగూడ నసమంజసమైయున్నది సాముద్రికాదిలక్షణములు, పాతివ్రత్యాదిసుగుణములు, అందుకుఁదగిన వేషభాషలు ఉత్తమస్త్రీలయం దొకేరీతినుండును. అందు విశేషముండును గాని పద్ధతిమాత్ర మొక్కటే అట్లుండుటయే శ్రేష్ఠము.ఆనియమము నతి క్రమించినందుననే నేఁటిప్రపంచ మనేకావస్థలనొందుచున్నది. వికారభావ ములు మంచివిగఁ దోఁచుచున్నవి. ఒకేమాదిరినున్న వ్యక్తిత్వము సున్న యగునా. అదిగాక ప్రబంధస్త్రీలచరిత్రములు వేఱువేఱుగానున్నవి. చర్యలును వేఱువేఱుగానున్నవి. వరూథిని, గిరిక, సత్యభామ, సుభద్ర, మధురలాలస, అభినవకౌముది, ప్రభావతి మొదలగు ప్రబంధస్త్రీలు, ఒక రినిఁబోలియొకరున్నారా, వీరిచర్య లొకేమాదిరిగ నెక్కడనున్నవి. కాని వీరిపద్ధతులు, గుణములు, చర్యలు అన్నియు నాదర్శములో నొకేరీతి

నున్నవి. కవిత్వమహిమనెఱిఁగినకవి యిట్లే వ్రాయును. దీనినెఱుఁగనివా రేమన్నను గవికి లోపములేదుకదా. రెడ్డిగారింకను నీవిషయముంగూర్చి యిట్లు వ్రాసిరి.

"పాత్రములు ప్రత్యేకాకృతులుగ నుండవలయుననుటయు, నయ్యవి బిఱుసువాఱినట్లుండక సమయోచితములగు మార్పులం జెందునవిగ నుండవలయుననుటయుఁ బరస్పరమిత్రములైన న్యాయములు. ఎట్లన, ఈరెంటికిని హేతుభూతమును దావలమునునయినది జీవము జీవకోటులం బరీక్షించిచూడుఁడు. మూఁడుగుణములు తెల్లముగఁ గానగు. (౧) అవిజాతులుగ నేర్పడును. (౨) కాని ప్రతిప్రాణియు నితర ప్రాణుల నుండి వేఱుగ గుర్తింపఁదగినంతవ్యక్తిని దాల్చియుండును. (3) వికారము, అనఁగా మార్పులంజెందుట. ఇది యన్నిజీవరాసులయు స్వభావము. నిర్వికారముగా నుండవలయునన్న అాయిగావలసినదే! అదియునుంగాదు గాఁబోలు! ఏలన, ఆధునిక ప్రకృతిశాస్త్రజ్ఞులు లోహములు మొదలగు జడంబులుసైతము జీవులట్ల స్వాభావికముగ వికారమునొందునని నిరూపించియున్నారు. కావునఁ బరమనిర్వికారస్థితిఁ దాల్పవలయునన్న రంభలు లేనిలోకముఁగనిపెట్టి యందు ఋషీశ్వరులగుటఁదప్ప వేఱొండపాయము లేని యుపాయము వెదకినను దొరకదు. (౪) ఈవికారములును వ్యక్తిభేదములమాడ్కి. అనఁగా వస్తువుయొక్క ప్రకృతికిమీఱిపోవు. మఱి యెట్లు వ్యక్తి జాతిచేపరిమితమో యట్లే వికృతులును బ్రకృతులచేఁ బరిమితములు. హృదయప్రమోదమే యుద్దేశ్యముగాఁగల శిల్పకళలయందువికృతులు ప్రధానతమములు. వికృతులులేనిపాత్రములు జడసమానములు. ఇదితెలియనివారు ఎవరినైననొకని ప్రారంభమున ధీరోదాత్తుఁడుగానుండునట్లు వర్ణించిరయేని మఱి వాఁడు చచ్చువఱకు నాధీరోదాత్తత్వమునందే వానినిపడవైచిపెట్టి పుణ్యముగట్టిగొందురు. వీరియొక్కపాత్రములు గ్రుక్కుమిక్కనక యిటునటుఁజూడక ముక్కునకుసూటిగా నేగుచుండును. అనఁగా యినుపయంత్రములకుం జేరినవిగాని మనస్సునకలిగి, యది కారణముగ చాంచల్యముగల చేతనములుగావు. పాత్రముల సహజవికృతుల నుద్ధరించుటయందు భారతమునుమించిన గ్రంథ మీప్రపంచమునం దెక్కడను లేదు! మానవస్వభావ మీగ్రంథరాజమున నెంత

చక్కఁగ నెంత గంభీరముగ నెత్తిచూపఁబడినదో యది తలంపునకు రావచ్చునేమోగాని నాల్కకువచ్చుట దుర్లభము. చిత్రవిచిత్రభంగులు గలిగి, భావార్ద్రములై, స్వాభావికములై, మెఱుంగువెట్టఁబడిన భారత పాత్రములంగూర్చి వ్యాఖ్యానముఁ జేయవలయు నన్నచో నిటనుండి పింగళిసూరన్నను వెడలఁగొట్టవలసినదే. ఈయుపన్యాసమునకు నాయకుఁడుగాన నది మర్యాదకాదు. ఈగుణములంబట్టిచూచిన రామాయణాదులు భారతమునకంటె నెంతోతక్కువయనుట నిస్సంశయము. ఇఁక సామాన్యప్రబంధములన్ననో వానియందలి స్త్రీపురుషు లెండినకట్టెలవలె నున్నారు. వంగలేరు, పెరుగలేరు. కాఁబట్టి ప్రాప్తులురెండు: విఱుపఁబడుట! ప్రోయినిడఁబడుట. (౭౯-౩౧) పాత్రముల చరిత్రములను విస్తరించుటలో వర్ణనీయమైనపద్ధతి యేదనఁగా స్త్రీపురుషులు గుణానుగుణమైన నడవడిగలవారయ్యును బ్రపంచాచారములయందుబలె కావ్యములందును గాలదేశవర్తమానములవలన నొక్కొక్కయెడ విరుద్ధమైన వర్తనముగలవారుగానున్నట్లును ప్రదర్శించుట. సర్వకాలములయందును సర్వావస్థలయందును ఏకరీతిగా వర్తించువారుండుట యరుదు. మొత్తము మీఁదఁజూడ యెంతక్రమముగా నున్నట్లు దోఁచినను సూక్ష్మముగఁ బరీక్షించి చూచినయెడల వంకర లేమాత్రమును లేకుండవు.

... ... ... ... ... ...

మనసులువేఱు. సంపూర్ణముగసరిపోలునవి దుర్ఘటములు. కావుననేవిషయముంగూర్చి చర్చించినను సరే యొకనికిఁదోఁచుభావము లితరుల భావములతోఁ గొంతవరకు సదృశములై యున్నను గొంతవరకు భిన్నములుగను నుండుననుట ప్రకృతిలక్షణము. ప్రకృతిశాస్త్రములయందు సామాన్యగుణంబులకు గౌరవమెక్కువ. ఏలయన వస్తుజ్ఞానమే యందు ముఖ్యము. అట్లుగాక మనోరంజకమే ప్రధానముగాఁగల కవితాదిశిల్పములందు భిన్నగుణములకు గౌరవమెక్కువ చూడుఁడు. ఒకస్త్రీని జూచి మోహించినవాఁడు ఆమెకు స్త్రీజాతియంతటితోడనుగల సామాన్యమైన గుణములచే నాకర్షింపఁబడియా మోహించును? అట్లయిన నీయమ్మయే కావలయునని పట్టుఁబట్టుటయేల? ఎవతె చిక్కినను సంతోషమనియుండరాదా? మోహమునకుం గారణము సామాన్యగుణంబులతోఁగలసియు

మీఁఁది మెఱయు ననన్యసాధారణములైన లావణ్యము, వచోమాధుర్యము, నడకలసొగసు ఇత్యాదులగు సౌందర్యములు. జాతియనునది యస్తి భారమువంటిదనుకొనుఁడు. కనులను మనసులను మఱల్చునది యది గాదు. దానిమీఁద జక్కఁగఁ దీర్చఁబడియుండు స్వరూప మనుభవనము. ఈసంగతి నెఱుంగనివారె 'పాడిందే పాడరా పాచిపండ్లదాసరీ' యన్నట్లు ఏదోయొక కొన్ని తరగతుల పాత్రములను వర్ణనములను బిఱికిపట్టుతోఁ బట్టి వానిసంఖ్యలకు గుణకారము నేకూర్చిన నలంకారము నేకూఱునని యాంధ్రకవిత్వమును భావములేని పదాటోపము ప్రకటించి పాడునేసిరి." (౨౬-౨౮) అని వ్రాసిరి. పాత్రముల చరిత్రలను విస్తరించుటలో ధర్మ నీతివర్తనములఁ జూపి అందువలనఁ బాఠకుల కట్టిప్రవర్తన మలవడు నట్లుగాఁ జేయుట కవికృత్యము. కావుననే శృంగారకావ్యములు వ్రాసిన కవులుఁగూడ నుత్తమనాయికానాయకులను బరిగ్రహించి వారిపవిత్ర ప్రేమ, శాశ్వతదాంపత్యము మొదలగు ధర్మనీతిపురస్సరములగు విషయ ములను వ్రాసియున్నారు. లోకములో నొకరిమనసు వేఱొకరిమనసు వలెనుండదు. అందఱును భిన్నభిన్నములైన మనస్సులుగల్గినవారే. కాని జనులందఱు నిట్లు నడువవలెను, అట్లు నడువనియెడల శిక్షాపాత్రులగు దురని శాసనాదు లున్నవికదా. అట్లే యుత్తమాదిగుణములను గవి పోషించుచు గ్రంథమువ్రాసి ప్రజోపయోగ మొనరింపవలయును. మనో రంజకమే కాదు కవిత్వమందుఁ బ్రధానము. దుర్మార్గుఁడుగాని సన్మార్గుఁడు గాని యెట్టివారునుగూడ నుత్తమ గుణములువినుటయం దాత్రుత, సంతోషముగల్గియుందురు. వంచకుఁడు తాను లోకమును వంచింప నెంచునుగాని తన్ను వంచించువాఁ డుండకూడదని తలంచును. లోకమునకు దుర్మార్గము గావించువాఁడు తన కెవఁడును దుర్మార్గము గావింపరాదని తలంచును. డబ్బుపుచ్చుకొని చంపఁబోయినవాఁడు దగాచేసినయెడలఁ జంపనెంచినవాఁడు నమ్మికద్రోహమునకై విచా రించును. కావున నుత్తమగుణముల కుండువిలువ లోకములో మఱి దేనికిని లేదు. అనునది అందఱి మనసులలోఁ జేరియుండు ఏకాభి ప్రాయము. కావునఁ గావ్యమునకుఁ బ్రధానమైనది ఉత్తమాదర్శము.

స్త్రీలను బురుషులు మోహించుటలో నుత్తమాదిభావములున్నవి. వాటినిఁ దగువిధమున వ్యక్తపఱచుటయే కవివిధి. ప్రాచీనకావ్యములలోను దదాధారముగ నుద్భవిల్లిన యలంకారశాస్త్రములలో నున్నయేర్పాట్లను నవగాహనమొనరించుకొని కవి చక్కనికావ్యమును సృష్టింపవలసియున్నది. లోకానుభవము, కావ్యానుభవము గల్గినకవి యుత్కృష్టముగ రాణించును. పండితుఁడు లోకానుభవము సంపాదించినదానికిని, సాధారణుఁడు సంపాదించినదానికిని వ్యత్యాసము గలదు. పండితుఁడు, లోకజ్ఞానియునగు కవీశ్వరుఁడు దనకావ్యమం దుత్తమాదర్శములను వ్రాయకుండనుండ లేఁడు. కావ్యమునకు విలువఁగోరినవాఁడు సదా రమ్యములైన యుత్తమమైనవిషయములను దనకావ్యమందు వ్రాయును. భారతమం దీవిషయములన్నియుఁ గలవు. ఉత్తమాదిపాత్రలను, ధీరోదాత్తప్రభృతులను స్వీకరించియే యున్నది. ప్రపంచస్వరూపమును, మనుష్యస్వభావమును మనవారు చక్కఁగవిమర్శించి తెలిసికొనియున్నారు. బాగుపడుమార్గములు శాస్త్రములందు నిరూపింపఁబడియున్నవి. ధర్మమునకు జయమనియు, నుత్తమునకు శ్రేయమనియు మొదలగునవి మనశాస్త్రములు నిర్ణయించినవి. కావుననే నుత్తమనాయికానాయకులను గథాప్రధానపాత్రలుగా గ్రహించుటయు, సుఖాంతములుగావించుటయు మన యాచారమైయున్నది. ఏయెండ కాగొడుగుఁ బట్టుపాత్రములకుఁ బ్రాధాన్యమిచ్చిన గావ్యములు స్వీకారయోగ్యములు గావని మనవారెంచిరి. భారతమందు ఉత్తమపాత్రలు గలవు. ఎంతటికష్టములు సంప్రాప్తించినను జలింపని వాపాత్రలు. మిశ్రమమైనవి యధమమైనవియు నగుపాత్రలు గలవు. ఇట్లనేకవిధములగు పాత్రలు భారతమందుఁ గలవు. ఈ విషయము తెలిసియో తెలియకనో రెడ్డిగా రిట్లు వ్రాసిరి.

"వీరయుగములస్వాతంత్ర్య మఖండము. మూఢభక్తి ప్రాబల్యమునకురాని భారతకాలములో ధర్మముల యన్యోన్యవైరముంగూర్చిన శోధన లుండెననుటకు దృష్టాంతములు గలవు. అన్నమాటప్రకారము తమ్ములు నడువవలసినవారైనను భీమార్జునులు ధర్మజుంగినిసి తూలనాడ లేదా? సత్యము, భూతదయ ఈరెంటికిని బొత్తుగలుగనిచోట్ల, భూతదయయే శ్రేష్ఠతరమని కృష్ణునియుపదేశము. పతులకు లొంగి వినయ

విధేయతలమై నడువవలసిన విధిగలదయ్యు ద్రౌపది సమయముల ధర్మ రాజాదిపురుషులఁ గఠినాక్షరంబుగాఁ జిన్నఁబుచ్చి పలికి క్షత్త్రియధర్మోద్ధరణంబుగావించి యసదృశకీర్తి వైభవోపేతయై వెలింగెఁగదా! ఈమెను కటినాళ్ల చప్పిఁడి పతివ్రతామణు లామెనుమీఱి వెలయువారా? చవిసారములేని పాత్రములకు దారిచూపినది రామాయణము. భరతుఁడు మొదలగువారు నిర్వికల్పులు. భారతవీరులు సవికల్పులు, మనుష్యులు దారుయంత్రములుగారు. 'సంతతక్షముండు సంతతతేజుండునగుట పాపమందురనఘమతులు' అని 'తాఁబట్టినకుందేటికి మూఁడేకాళ్లు' అని వాదించు మూర్ఖమానసులఁ దీసివైచినది ద్రౌపది. ఆమె దివ్యచారిత్రమే యానీతికి నుత్తమనిదర్శనము. పౌరుషముగలవారు విమర్శము, కారణశక్తి, నిశ్చయహేతువాదము, వీనింజూచి జడియరు. దైన్యముంగుడుచు శుష్కసత్త్వులకు నన్యశాసితములగు నాచారాదులు ప్రధానములు. స్వాతంత్ర్యములేనివారగుటచే స్వేచ్ఛాయోజనప్రాగల్భ్యము వారికి నలభ్యము. ఇఁకవిమర్శనము కారణానుకారప్రచారము, ఇవి యెక్కడివి? (౧౬౧, ౧౬౨) ధర్మముల పరస్పరప్రాతికూల్యము ఐరోపియనులు విమర్శించినట్లు మనవారు చేయలేదు. కారణము, మూఢభక్తిపరాయణులు గావున. యోజించి యనుష్ఠించిన గుణదోషములు గాన్పించును. యోజన లేకచేయువారికి సందేహమెక్కడిది, సత్యాసత్యవిమర్శమెక్కడిది? తాటాకులో వృద్ధప్రచారములో ప్రమాణములు. మనసుగాదు. కావునఁ గావ్యములోని కన్యకలకెట్లో, సిద్ధాంతులకు నారీతినే మనస్సునది యడుగంటిన ప్రకృతి." (౧౬౦, ౧౬౧) అని రెడ్డిగారు వ్రాసిరి. మూఢభక్తి ప్రాబల్యమునకు రానికాలము భారతకాలమన్నారు రెడ్డిగారు. అనఁగా వ్యాసులవారికాలములో ధర్మముల యన్యోన్యవైరముంగూర్చిన శోధనలుండెనని రెడ్డిగారి యభిప్రాయము. రామాయణపాత్రలు (భరతాదులు) నిర్వికల్పులని యొకదోషమునుజూపిరి. అనఁగా వాల్మీకి పాత్రములను జక్కఁగ సృష్టించలేదని రెడ్డిగారియభిప్రాయము. రామానుజులు రాములవారిని గినిసి తూలనాడలేదు గావున వారు మనుష్యులుగారని రెడ్డిగారి యభిప్రాయముగాఁబోలును. రామాయణకాలము అనఁగా వాల్మీకికాలము వీరయుగముగాదని రెడ్డిగారి యమూల్యాభిప్రాయము

లలో నొకటిగాఁబోలును. భారతరామాయణములు గవికల్పనముకుం జేరినవని రెడ్డిగారు వ్రాసినందునఁ గవులకాలమే వాటికాలమని భావింప వలయునుగదా. ధర్మముల అన్యోన్యవైరముంగూర్చిన పరిశోధనలనఁగా రెడ్డిగారి కర్థముకాలేదు. కావున భారతరామాయణములలోనివి గొన్ని చూపుచున్నాను. ౧ ఆయుధాగారమున (ద్రౌపదీ ధర్మరాజులున్న చోట) నాయుధములుండిపోయినవి. బ్రాహ్మణకార్యము నాచరింపవలయునా, సమయపరిపాలనఁ గావింపవలయునా అని యర్జునుఁ డాలోచించెను. ౨ శల్యుఁడు పాండవులను జేరుట ధర్మమా కౌరవులను జేరుట ధర్మమా. 3 వాలినిఁ జంపుట ధర్మమా మానుట ధర్మమా. ౪ విభీషణుఁడు శ్రీరామునిఁ జేరుట ధర్మమా రావణునియొద్దనుండుట ధర్మమా. ౫ *అనేకవిధములసాయపడిన సుగ్రీవ విభీషణుల నయోధ్యకాహ్వానింప

* రాముఁడు పుష్పకవిమానము నెక్కి, సిగ్గుపడుచుండు యశోవతియగు సీతాదేవిని తొడమీఁదఁ గూర్చుండబెట్టుకొని, తన ధనసుధరించియుండు తమ్ముఁడగు లక్ష్మణునితోడఁ గూర్చుండి "నాతండ్రికి రాజధానియగు అయోధ్యకు నేను బోయెదను. అనుజ్ఞ యీయవలయునని మిమ్మందఱిని అడుగుచున్నాను" అని వానరులతోడను విభీషణునితోడను బలికెను. రాముఁడు భరద్వాజాశ్రమమునకుఁ బోయినపుడు హనుమంతునితో నిట్లు పలికెను. "ఆంజనేయా, నా క్షేమమును భరతునకుఁ దెల్పుము. నా రాకను విని నావిషయమై భరతుని ముఖప్రసాదము, ఇంగితము ఎటులున్నవో దాని తెలిసికొనవలయును. రాముఁడు శత్రువులను జయించి ఉత్తమమగు యశస్సునుబడసి తనకోరికను బూర్తిచేసికొని గొప్పబలముగల మిత్రులతోడ వచ్చుచున్నాఁడు అని తెలిపి

శ్లో. జ్ఞేయాశ్చ సర్వే వృత్తాంతా భరతస్యేంగితాని చ,
తత్త్వేన ముఖవర్ణేన దృష్ట్యా వ్యాభాషణేన చ. ౧౨౮-౧౩౫
సర్వకామసమృద్ధం హి హస్త్యశ్వరథసంకులం,
పితృపైతామహం రాజ్యం కస్య నావర్తయేన్మనః. ౧౪౫
సంగత్యా భరతశ్శ్రీమాన్ రాజ్యార్థీ చేత్స్వయం భవేత్,
ప్రశాస్తు వసుధాం కృత్స్నామఖిలాం రఘునందనః. ౧౫౫
తస్య బుద్ధిం చ విజ్ఞాయ వ్యవసాయం చ వానర,
యావన్న దూరం యాతాస్స్మః క్షిప్రమాగంతుమర్హసి. ౧౬౫

నిదే రాముఁడు వెడలిపోయెదనని పలుకుట ధర్మమా వారి నాహ్వానిం చుట ధర్మమా. ఓ *శరభంగుఁడు దేహత్యాగ మొనర్చుట ధర్మమా దేహ ధారియైయుండుట ధర్మమా. ఇట్టివే అనేకవిషయములు భారతరామాయ ణములలోఁగలవు.అంతియేకాని అన్నదమ్ములు,భార్యాభర్తలు దూషించు కొనుట కానేరదు. ధర్మరాజునం దెట్టి యధర్మముఁగూడనున్నట్లు వేద

(భరతుని వృత్తాంతమును, అతనిముఖము దృష్టి మాటలచే అతనిభావమును దెలిసికొని రావలయును. సకలవిధములగు భోగ్యపదార్థములతో నిండినదియు, యేనుఁగులు గుఱ్ఱములు రథములతో నిండినదియుఁ గులపరంపరగ వచ్చినదియునగు యీరాజ్యము ఎవని మనసును ఆకర్షించకుండును. శ్రీమంతుఁడును రఘువులకు సంతోషమును గల్గించువాఁడును నగు భరతుఁడు రాజ్యములో చిరపరిచయముచే తానే రాజ్యములో ప్రీతిఁగలిగియుండి నట్లైతే, భూమినినంతయు అతఁడే పరిపాలించవచ్చును. నేను అతనితోఁ జేరినపుడు రాజ్యమును అంగీకరించును. అనువిషయమును, సర్వదా అంగీకరించఁడు అనువిషయమును, వానరుఁడా! తెలిసికొని, యిచటినుండి నేను అయోధ్యను సమీపించుటకు ముందుగనే నీవు రావలయును.) అని రాముఁ డాజ్ఞాపించెను. పట్టాభిషేకమే తనకు నిశ్చయములేన పుడు రాముఁడు వానరులను, విభీషణుని నెట్లాహ్వానింపఁగలఁడు. అందుచేత వారినాహ్వా నింపలేదు. సుగ్రీవాదివానరులను ద్రోవలోనున్న కిష్కింధలో డిగఁబెట్టి రాముఁ డయోధ్య చేరవలసియున్నను, అట్లు దిగఁబెట్టెదనని పలుకుటవలన విభీషణుఁడు లంకయందుండిపోవలసివచ్చును. అందుచే రాముఁ డెవరిని ఆహ్వానించుటలేదు. భరతుఁడు ధర్మాత్ముఁడనియుఁ దనకు పట్టాభిషేకము జరుగుననియు రామునకు నమ్మకము గూడఁ గలదు. తానెవరిని ఆహ్వానింపకపోఁగా వానరులు, విభీషణుఁడు నిట్లు పలికిరి. "అయోధ్యకు రావలయునని మేము గోరుచున్నాము. నీవు మమ్ముఁ బిలుచుకొనిపోవలయును.

శ్లో. దృష్ట్వా త్వామభిషేకార్ద్రం కౌసల్యామభివాద్య చ,
అచిరేణాగమిష్యామస్స్వాన్ గృహాన్ నృపతేస్సుత. 6-125. 204

(పట్టాభిషేకముచేసికొనిన నిన్నుఁ జూచి కౌసల్యాదేవిపాదములకు నమస్కరించి శీఘ్రముగ మానెలవులకు రాజపుత్రుఁడా, మేము పోయెదము) అని పలికిరి. వారంతటవారు వచ్చెదమనిరి గావున రాముఁడు వారినందఱను గొనిపోయెను. పట్టాభిషేకము జరిగిన పారు చూచెదరు. లేనిచో వారినెలవులకు వారు మరలెదరు అని రాముఁడు తలంచెను.

* అతివృద్ధుఁడగుటచే నిత్యకర్మనొనర్చుటకు నశక్తుఁడైనందున శరభంగుఁడు శ్రీరాముని యెదుట దేహత్యాగ మొనరించెను.

వ్యాసుఁడెచ్చటను వ్రాయలేదు. ఎచ్చటను నాతనిశీలమును ధర్మవిరుద్ధము గావింపలేదు. భీమాదులుగూడ ధర్మవ్యతిరిక్తవ్యాపారము గలవారుగా వ్యాసుఁడెచ్చటను వ్రాయలేదు. ద్రౌపదిగూడ ధర్మవ్యతిరిక్తముగా సంచరించిన ట్లెచ్చటను వ్రాయలేదు. సత్యముకన్న భూతదయ శ్రేష్ఠమని కృష్ణుఁడు నిర్ధారణచేసెనని రెడ్డిగారువ్రాసిరి. అదిసరియే అదేవిధమున నిచ్చట పాండవులఁగూర్చి నాలోచింపఁదగదు. తమ్ములు తూలనాడుట ధర్మమైనయెడల ధర్మరాజువ్యాపారము అధర్మమని తేలును. ధర్మరాజాదులను ద్రౌపది గఠినాక్షరంబులఁ జిన్నఁబుచ్చుట ధర్మమైనయెడల ధర్మరాజాదులవ్యాపారము అధర్మముగావలెను. కావున ధర్మముల యన్యోన్యవైరమున కది యుదాహరణముగాదు. అన్నమాటప్రకారము తమ్ములునడచుటధర్మమా, తూలనాడుటధర్మమా. ద్రౌపది పతులకులోఁగి వినయవిధేయతగా నడచుట ధర్మమా, కఠినాక్షరంబులఁ జిన్నబుచ్చిపలుకుట ధర్మమా యనునది యిచ్చట ధర్మముల యన్యోన్యవైరముంగూర్చిన శోధనగానేరదు. ఎందువలన ననఁగా ధర్మరాజు అధర్మముగాఁ బ్రవర్తించెను, పాండవు లధర్మముగాఁ బ్రవర్తించిరి అనునది ఏసందర్భమునఁగూడ తేలలేదుగావున. ధర్మరాజుయొక్కయుఁ బాండవులయొక్కయు ధర్మనిష్ఠయే యందువలన అభివ్యక్తమగుచువచ్చినది. తమ్ములుగాని, ద్రౌపదిగాని అప్పట్లఁ బ్రవర్తించిన విధమువలనఁ (దూలనాడుటవలన) వారియొక్క (తమ్ములయొక్కయు, ద్రౌపదియొక్కయు) ధర్మ ముత్కృష్టమైనది అని తేలలేదు. కావున నది ధర్మములయన్యోన్యవైరముంగూర్చిన పరిశోధనగానేరదు. అయిన తమ్ములును, ద్రౌపదియు నట్లుతూలనాడుట దురహంకార మనిపించుకొనునా, యధర్మమా యనఁగా నట్లుకానేరదు. ధర్మజునియొక్కగాని, పాండవులయొక్కగాని, ద్రౌపదియొక్కగాని యితరులయొక్కగాని కష్టములకు మనసులు కలంగుటయే కారణమైయున్నది. తగినసమయములలోఁ గష్టము లాప్తజనులతోఁ జెప్పుకొనుట ధర్మవిరుద్ధముగానేరదు. తమకుఁ దోఁచినహితవు నుపదేశించుట ధర్మవ్యతిరిక్తముగాదు. కార్యగౌరవమును బురస్కరించుకొని ఒక్కొక్కప్పుడు గఠినాక్షరంబులు పలుకఁబడును. అది ధర్మలోపమని శంకింపరాదు.

శ్లో. రామమానయ సూతేతి యదస్యభిహితోఽనఘా,
కిమిదం కారణం యేన మమాజ్ఞా ప్రతిహన్యతే. (రా. అయో. ౧౫-౨౬౪.)

(దశరథుఁ డిట్లు పలికెను. సుమంత్రుఁడా! శ్రీరామునిఁ బిలుచుకొని రావలయునని చెప్పితిని. నాయాజ్ఞను నతిక్రమించుటకుఁ గారణమేమి.)

ఇది కార్యమందున్న యాత్రుతనే సూచించును. సుమంత్రుఁ డొక ప్పుడును దశరథునాజ్ఞ నతిక్రమించినవాఁడు కాఁడు. ఆవిషయము దశరథునకుఁ దెలియును. అతిక్రమించఁడనియుఁ దెలియును. అయినను గఠినాక్షరములుగా నిట్లుపలికెనుగదా. కావున నిట్టివి ధర్మలోపముగా నేరవు. ధర్మములవైరమున కివి యుదాహరణములు గావు. ఉత్తమపాత్రలు ధర్మముతప్పి ప్రవర్తించిన ట్లెచ్చటగూడ వ్రాయఁబడవు. పాండవులును, బాంచాలియుఁగూడ ధర్మమార్గము నెప్పుడును విడువలేదు అనునదే భారతమం దన్నిచోట్లఁ బోషింపఁబడియున్నది వారిది సాత్త్వికాహంకారముగాని వ్యర్థప్రకోపముగాదని తెలియవలసియున్నది. స్వాంతముగా ధర్మాధర్మనిర్ణయము గావించుకొనవలసివచ్చినట్టి పట్టులందు వారందఱును ధర్మమార్గమునుబోషించిరేగాని విడువలేదు. ఎంతటివిషమావస్థసంప్రాప్తమైనను ధర్మముతప్పి వారు నడువలేదు. ధర్మరాజు జూదములోఁ దమ్ముల నోడినప్పుడు పాండవులు ధర్మమువిడిచి ప్రవర్తింపలేదు. పాండవులందఱును నెవరిశీలమును వారు సంరక్షించుకొనిరి. (అనఁగా ఎవరిధర్మములను వారు కాపాడుకొనిరి.) మఱొక్క యుదాహరణము.

శ్లో. తిష్ఠేతి రాజా చుక్రోశ యాహి యాహీతి రాఘవః,
సుమంత్రస్య బభూవాత్మా చక్రయోరివ చాంతరా.
నాశ్రౌషమితి రాజాన ముపలబ్ధోఽపి వక్ష్యసి,
చిరం దుఃఖస్య పాపిష్ఠమితి రామస్తమబ్రవీత్. (రా. అయో. ౪౦-౪౬, ౪౭)

(దశరథుఁడు సారథిని రథము నిలుపునిలుపు అనియేడ్చి యఱచి చెప్పెను రాముఁడు పొమ్ముపొమ్ము అనిచెప్పెను. అప్పుడు సారథియగు సుమంత్రునిమనసు రథముయొక్క ముందువెనుక చక్రములమధ్య చిక్కుకొనిన పురుషునివలె సంకటపడెను. నామాట యెందుకు వినలేదని రాజు అడిగినను నాకు వినరాలేదని చెప్పవచ్చును. ఇప్పుడు అనుభవించుదుఃఖ

మును బహుకాలము నైచుటకు సాధ్యముకాదు అని శ్రీరాముఁడు సుమంత్రునితోఁ బలికెను.)

ఇట్లు చెప్పిన శ్రీరాముఁడు పితృవాక్యమును పాలింపలేదనిగాని అనృతమాడఁ దలఁచెననిగాని సుమంత్రుఁడు ప్రభువాక్యమును మన్నింపలేదనిగాని శంకింపవచ్చునా. శ్రీరాముని శీలమునకుఁగాని, సుమంత్రుని శీలమునకుఁగాని యెట్టిలోపము నిందువలన రానేరదుగదా. కైకేయి దశరథుని మెప్పించి వరములువడసి కుమారునకు రాజ్యముసంపాదించెను. దశరథుఁడును సత్యవాక్పరిపాలనమునకై సమ్మతించి వరములొసంగెను. కావున భరతున కయోధ్యారాజ్యము న్యాయముగనే లభించినది. అయినను తననిమిత్తము లోకారాధ్యుఁడును, పెద్దకుమారుఁడును నగు శ్రీరామునకుఁ గల్గినకష్టమునకై భరతుఁడు మిగులఁ జింతించెను. ప్రేమపాత్రుఁడైనఅన్న యడవుల నిడుమలగుడుచుచుండఁగా, సమస్తభోగములు పరిత్యజించి బ్రహ్మచర్యదీక్షాపరతంత్రుఁడై లక్ష్మణుఁడన్నను సేవింప నతని వెంటఁ బోయియుండఁగాఁ, దానెట్లుగా రాజ్యసుఖ మపేక్షింపఁగలఁడు. కావుననే వశిష్ఠాదులగుపూజ్యులు సెప్పినను వినక భరతుఁడు వారిని గర్హించెను. వశిష్ఠాదుల యుపదేశములోను ధర్మలోపములేదు, భరతుఁడు నిందించుటలోను ధర్మలోపములేదు. ధర్మములపరస్పరప్రాతికూల్యము సంభవించినప్పుడందేది యుత్కృష్టధర్మమో దానినాచరించుట ఉత్తమమగులక్షణము. మఱియు సామాన్యధర్మములు సంప్రాప్తమైనపుడు ఎవరిధర్మమును వారు గాపాడుకొనుట యుత్తమలక్షణము. భారతరామాయణములం దీవిశేషము లుండబట్టియే పరమపూజ్యములై యొప్పియున్నవి. ధర్మమునకు నీతికి విరోధము తటస్థించినపుడు ధర్మమునకుఁ బ్రాముఖ్యము వీటియందుఁ గలదు. రావణవధానంతర మయోధ్యకుఁ దిరిగివచ్చుచున్న శ్రీరాముఁడు 'ఆకారమునుబరికించియు మఱియన్నివిధములఁ బ్రయత్నించియు భరతుని యాంతరంగిక మెఱింగి రాజ్యాభిలాష గల్గినదేమో కని పెట్టిరమ్మ'ని హనుమంతునిఁ బంపెను. భరతుని ధర్మనిష్ఠ యెంతటిదో యిందువలన స్పష్టమగుచున్నది. ఇటువంటిపాత్రలన్నియుఁ జవిసారము లేనివని రెడ్డిగారు వ్రాసిరి. కాలమహిమ. అధర్మమార్గముననున్న కౌరవులు హితముపదేశింపఁబడినవారైనను వినక చెడిపోయిరి. ఇష్టములేకుండి

నను పెద్దలయుపదేశముగావున రాజసూయయాగమొనరించి ధర్మరాజు ఖ్యాతిఁబడసెను. ధర్మాత్ములకు ధర్మములుతోడగునని భారతమందు నిరూపింపఁబడినది. అనిష్టములు ఇష్టసిద్ధిగామాఱునని చూపఁబడియున్నది. అశ్వత్థామ యనుపేరుగలకుంజరము పాండవావసరమునఁ జనిపోవుట పాండవులయదృష్టము. ధర్మజుని ధర్మమున కదితోడుపడినది. దుర్యోధనునిఁ దొడలు విఱుగఁగొట్టెదనని భీముఁడు ప్రతినఁబూనెను. గదాయుద్ధమున నది యధర్మమైనను ధర్మరూపముగఁ బరిణమించినది. ఊర్వశియొసంగినశాపము అర్జునునిశీలమును బ్రకాశింపఁజేసినది. అదిగాక అజ్ఞాతవాససమయమునఁ దలదాఁచుకొనుటకు వీలుగల్గించినది. ఎట్టియిబ్బందియుఁగలిగింపకఁ గడచిపోయినది. అధర్ములకిట్లుగాఁ గలిసిరావనికూడ భారతమందుఁ జెప్పఁబడినది. దుర్యోధనుని బలసంపదయెట్టిది. స్వచ్ఛందమరణము గలవాఁడు భీష్ముఁడు, అస్త్రముండునంతవఱకు నభేద్యుఁడు ద్రోణుఁడు, మరణములేనివాఁడు అశ్వత్థామ, బహ్వస్త్రసంపదగలవాఁడు కర్ణుఁడు, మఱియు వంచనమెయి సంపాదించిన శల్యబలముగలదు. అయినను దుర్యోధనునిపట్ల నిరర్థకమైనది. దుష్టచతుష్టయములోనివాఁడైన కర్ణుఁడు దుర్యోధనబలహేతుకమైన సహజకుండలముల నింద్రునకు దానమిాయవలసివచ్చినది. ధర్మాత్ములగుపాండవులకు మహాభారతయుద్ధమందేగాక తగినపట్టులనెల్ల జయము గలుగుచునే వచ్చినది. మఱియొకవిశేషము. భీష్ముఁడు మిగుల గొప్పవాఁడుగావున నాతనిశీలము పాడుగావింపఁబడలేదు. పగఁబూనిన అంబ భీష్మునిఁజంపనెంచి శిఖండిగాఁబుట్టినను భీష్మపరాక్రమమునకుఁ గళంకమురాలేదు. పగఁబూనిన ద్రుపదుఁడు ద్రోణవధార్థము దృష్టద్యుమ్నునిఁబడసెను. అయినను ద్రోణపరాక్రమమునకుఁ గళంకమురాలేదు. ఇవన్నియు ధర్మమును నీతినివిడనాడకూడదని వెల్లడిచేయుచున్నవి. ఉత్తమాదర్శములేని, ధర్మనీతివర్తనములకు విరోధమైన కవిత్వము నిస్సారమైనది. ధర్మములపరస్పరప్రాతికూల్యమునుగూర్చి మనవారు తెలిసికొనినట్లు ప్రపంచములో నెవరును దెలిసికొనలేదు. పాత్రలమూలమున ధర్మాధర్మోత్కృష్టధర్మములను భారతాదిగ్రంథములు విమర్శించినవి. కవిప్రవేశపెట్టినపాత్ర లోకములో ననేకులయొక్క నడవడిని నిరూపించునదిగ నుండవలయును. లోకస్వభావమును వెల్లడిచేయుటయు,

లోకము బాగుపడురీతిని నిరూపించుటయుఁ గవి కావ్యమందు సాధింప వలసియున్నది. దీనినిఁ బాత్రములమూలమున వ్యక్తపఱుపవలయును. ధర్మములను బోధింపవలయును. అంతియకాని యొకమనిషినిఁబోలి యొకఁ డుండఁడుగావున లోకవిలక్షణమైన పాత్రములను గవి ప్రవేశపెట్ట వలయుననునది యాలోచనములేనిమాట. రామాయణ భారతకాల ములకుఁ బూర్వమే వేదవిజ్ఞాన మీదేశమందుఁ గలదు. అందువలనఁ దత్త్వమును జక్కఁగఁ దెలిసినవారై మనవారు విలసిల్లిరి. అదంతయు మూఢభక్తియని మనవారే పరిహసించురోజులువచ్చినవి. లేకున్న భారత పాత్రలు, పురాణపురుషులు గవికల్పిత పాత్రలని వ్రాయవచ్చునా. అలంకారశాస్త్రములు, పూర్వకావ్యములు, మనదేశమం దేవిబయల్వెడలినను నవన్నియు ధర్మము, నీతి మొదలగుసద్గుణములకుఁ బ్రాముఖ్యమిచ్చి యున్నవి. కారణము, ఏపనిఁగావించినను దమకొఱకుఁగాక భగవత్ప్రీతి కొఱకుఁజేయుట మనసదాచారము. అట్లుచేయుట మానవులవిహితకృత్య మని మనవారు తెలిసికొనినారు. అదివిడిచి మనము భ్రష్టుల మగు చున్నాము. ఇందుకై విచారింపక రెడ్డిగా రెంతటిరసాభాసమును వ్రాసిరి. "బ్రిటిష్‌గవర్నమెంటువారు మనకు మనసారనిచ్చిన విద్యాప్రభావము చేత నిప్పుడు పరచింత నంతగా నుంచుకొనక యైహికముల సాధించు నుద్యోగములను బునరాచరణమునకుఁ దెచ్చికొనుచున్నాము" (౧౪, ౧౫) అని వ్రాసిరి. ఎప్పుడును భారతదేశమునకు దరిద్రదశ రాలేదు. ఈనాఁడువచ్చినది. ఉద్యోగాన్వేషణమే మనకుఁ బరమావధియైయున్నది. తలిదండ్రులు మనఃపూర్వకముగ విశేషధనవ్యయముఁగావించి పిల్లలకుఁ బ్రస్తుతవిద్య నభ్యసింపఁజేయుచున్నారు. ఈవిద్యాప్రభావమున విద్యార్థులు మనసుకువచ్చినట్లు పాడగుచున్నారు. పూర్వపుటైశ్వర్యములు దొలంగుటయం దిదియొకతరగతియని నిర్ధారణచేయుచున్న దీవిద్యాప్రభావము. దీనివలనఁ గలకాలముద్యోగాన్వేషణమే. ఐహికచింతయే. ఐహిక చింతయే తీర దెన్నటికిని. పరచింతగల్గుటకు వేళయే లేకుండచేయుచున్నది. ఉద్యోగములభింపనపు డిది నిష్ఫల మగుచున్నది. పర్యవసాన మేమనఁగా దాస్యశృంఖలానిబద్ధ మీవిద్యాప్రభావమని లోకము గ్రహించినది. మనఅధోగతికి మనవారేగాక ప్రపంచమంతయు నేఁడు వాపోవుచున్నది

కదా. అట్టిస్థితిలో మనవారిందుకై విచారింపకపోవుటగాక పైఁగా సంతో షించుటఁ జూడఁగా మనదురదృష్టదినము లింకను మనల విడువలేదని స్పష్ట మగుచున్నది! ఇందెవరిని నిందించి యేమి ప్రయోజనము. ఇందు బ్రిటిష్‌గవర్నమెంటు చేసినదేమున్నది! వీరయుగములస్వాతంత్ర్య మఖండమని రెడ్డిగారు వ్రాసిరికదా. అప్పటివారికవిత్వము బాగుండెనని రెడ్డిగారిట్లు వ్రాసిరి.

"భాషాచరిత్రమును దేశచరిత్రమును నిత్యసంయోగములు. ఆంధ్రదేశము వీర్యశౌర్యాదిగుణంబులచే విరాజిల్లుకాలంబున నన్నెచోడుఁడు, నన్నయ, తిక్కన మొదలగు కవిగ్రామణులు ప్రాబల్యమునకు వచ్చిరి. కావునన వారి వ్రాఁతలలో రసము లమేయముగ మెఱయు చుండుటయేగాదు; ఉత్సాహమనుగుణంబును వెల్లివిరియుచుండుటయు. మహమ్మదీయులచే నోడింపఁబడి యుక్కుతక్కువరై కుక్షింభరులమై యున్నకాలంబులోఁ బుట్టిపెరిగిన ప్రబంధకవులలో పాండిత్యబలము విశేషముగ నున్నను పందతనమొక్కటి యెక్కువగ నున్నదేకాని, ధైర్యముతోఁ దలయెత్తికొని మనుష్యులలో మనుష్యుఁడుగఁ దిరుగుటకుఁ దగినయుత్సాహ మంతగాఁ గాన్పింపదు. శ్రీకృష్ణదేవ రాయలకాలములో పౌరుష మొకింత యుద్దీపించె. కాని యయ్యది మెఱుఁగుదీఁగవలె నొక్కనిమిషమాత్ర మాంధ్రప్రపంచమును ధగద్ధగితముఁజేసి యంతర్ధానమైనందున యథారీతిని మఱల గాఢమగు చీఁకటి యాక్రమించినది."(౧౪)అని రెడ్డిగారు వ్రాసిరి. మహమ్మదీయ పరాభూతమైనకాలములో ఆంధ్రదేశమందు శృంగారప్రబంధములు బయలుదేరినవి. హిందీ, మరాటీ, బంగాళీ మొదలగుదేశములందు భక్తిప్రధానగ్రంథములు బయల్వెడలినవని చరిత్రకారులు వ్రాసి హిందూమతోచ్ఛేదముఁ గావించునాకాలములోనే హిందూమత మనేకవిధములుగ వృద్ధినొందిన దని వ్రాసిరి. ఆకాలపు మనపూర్వులు కుక్షింభరు లన్నారు రెడ్డిగారు. తినుటకుఁగలదు గావున వారు తిన్నారు. తిని కూర్చున్నారుగావునఁ బంద తనము వచ్చినదన్నారు రెడ్డిగారు. నేఁడో కుక్షింభరత్వమునకుఁ గూడ మనము నోఁచికొనలేదుకదా. ఉద్యోగములుదొరకక, దుర్భరదరిద్రబాధ పడలేక మనవారనేకులు నేఁడు బలవన్మరణమునకుఁ బాలగుచున్నారు

తినుటకుఁ గల్గినవారు శృంగార భక్తికావ్యములు వ్రాసిరి. పాశ్చాత్యులు తిండికై మనదేశమునకు వచ్చిరిగదా. తిండికై ప్రాకులాడు మనము అట్టి కావ్యములనే శోకాంతములనే భూషణముగఁ గైకొనుచున్నాము. మహమ్మదీయకాలములోని మనపూర్వులు పాండిత్యము, కవితాశక్తి గల్గియుండిరిగావున నౌచిత్యము, రసము వెల్లివిరియుగ్రంథములు వ్రాసిరి. ఇప్పటివారో రెండునులేనివారు. రావణుఁడు శ్రీరామునికన్న నుత్తముఁడు అని ఒకరువ్రాసిరి. రావణుఁడు సీతయందున్న మోహముచేభార్యాపుత్రాదులనుగూడ విడుచుకొనెను. గావున వానిది నిక్కంపుఁబ్రణయము, శ్రీరామునిది యనుమానగ్రస్తమగు ప్రేమ. కావున నిక్కంపుఁబ్రేమ గల్గినట్టి రావణుని ప్రణయము నంగీకరింపక నిరాకరించినందులకు సీత మిగుల విచారించి శ్రీరాముని నిందించి రావణునిఁ జితిలోఁబడెనని ఒకరు వ్రాసిరి. ఇట్టి వ్రాఁతలు వేనకువేలుగా నేఁడు బయలుదేరుచున్నవి. ఇట్టివ్రాఁతలఁ గాంచి మనముందుసంతతివారు మనలఁగూర్చి ఎంతవాపోవుదురో కదా. లేక మనము తీసినగోతిలోఁ గూరుకొనిపోయి వారును వ్యక్తిత్వము గోలుపోయెదరేమో కదా. అయ్యో! కాలమా! విషయ మిట్లుండఁగా రెడ్డిగా రిట్లు వ్రాసిరి.

"మనయొక్కరాజుల దినములలో సైత మలవడనంతవిన్యాసము నేఁడు ఆంధ్రమును జెందియుండుటకు, బ్రిటిష్‌వారి పరిపాలనమాహాత్మ్యమును, దానిచే మనయందు ప్రభవిల్లినవృద్ధి నతిశయముగఁ జెందుద మనునుత్సాహమును ముఖ్యకారణములు." (౭౯) అని వ్రాసిరి. వృద్ధి నొందుఁదలంపు మనరాజులదినములలో నాకాలమువారికి లేదేమో! కార్యోత్సాహమున్న భావనాశక్తి విజృంభించునని రెడ్డిగారిసిద్ధాంతము గావున మనకిప్పు డట్టికార్యోత్సాహ మున్నదని రెడ్డిగారు సాహసించి వ్రాసిరి. ఇది యథార్థ మని చరిత్రజ్ఞానమున్నవాఁ డెవఁడును నమ్మఁడు. ఈవిషయమై రెడ్డిగా రిట్లు వివరముగ వ్రాసిరి.

"భావనాశక్తికి కార్యోత్సాహమునకు నుండుసామ్యము:— ఘనములైన రాజ్యకార్యములం దాసక్తి కొని ప్రవేశించినవారు గద్యపద్యాది నిర్మాణశిల్పమునకుందొడంగువారైనచో వారు సులభముగను ద్వరితముగను దత్కళాప్రవీణులౌట నైసర్గికము. కార్యగంభీరుల రచన

యందు సారము, వీర్యము, ఉద్వేగము, చులుకుఁదనము ఇత్యాది నానా పదంబులచేఁ జెప్పఁబడు సుగుణ మొకండు అఖండముగ నుండును. కావున నట్టివారికృతులు కేవలపండితుల గ్రంథములవలె రుచిలేనివిగను, చప్పిడిగను, మొద్దు పాఱినవిగను ఉండవు." అని విద్యాధురంధరులైన 'మార్లీ' ప్రభువుగారు సుమారు ౨౫ సంవత్సరముల క్రిందనే వ్రాసిరి. దీనికి రాజకార్యవిచక్షణుఁడైన మనతిక్కన్నయే నిర్వికల్పుండైనసాక్షి. కాళిదాసుఁడును గార్యోత్సాహపరులలో మిన్నయైనవాఁడని యతనింగూర్చిన కథలచే నూహింపవచ్చును. మఱియు దేశచరిత్రములఁబట్టి చూచినచో యుద్ధాదివీరకృత్యంబులకుం జనులు గడంగు కాలంబులలో మాత్రము కవిత్వమును విజృంభించుచుండె ననుట నిర్వివాదముగ నెఱుఁగనగు నిందులకు హేతువును విశదమ. అట్టికాలములో నెట్టిజడులును ఋషులును గొంతకుఁగొంతయైన దేశభక్తియు శత్రుసంహాననసంరంభంబును దాల్పక మానరు. ఇఁక సామాన్యమైనవారన్ననో హృదయములు వగులునట్లు వీర్యాదిభావములం దాల్చుట ప్రకృతివిరోధంబుగాదు.

... ... ... ... ...

లెక్కకుమీఱిన మనోవికారములను దలఁచుకొన్ననే మనకు నేమోయగునట్టు లుండునుగదా! ఇఁక వారికిని వారికాలమువారికిని గలుగు నుద్రేకమును వర్ణింపనవునా? ఉద్రేకమేకదా కవితాశక్తికి ప్రాణాధారమైన కారణము" (౧౨, ౧౩) అని వ్రాసిరి. రాజకార్యములందాసక్తి గొని ప్రవేశించినవారి కవితయందుఁ గార్యోత్సాహపరులగుటను భావనాశక్తియుండునని వ్రాసి రెడ్డిగా రిందుకునిదర్శనముగఁ దిక్కనసోమయాజి నుదాహరించిరి. కాని ఘనమైన రాజకార్యాసక్తత కవిత్వరసము గ్రహింపనీయదనియుఁ, బాడుచేయుననియు రెడ్డిగా రిట్లు వ్రాసిరి.

"రాజాశ్రయమున బ్రతుకుపాటుగోరువారు వారిఇష్టానుసారము వ్రాయక యేమిచేయుదురు? ఇఁక రాజులన్ననో పరిపాలనకార్యమునఁ దగిలి కాలంబు గడపువారు. సొంతమగుబుద్ధితో విమర్శింపఁజాలినంత పండితులగుట యరిది. కావున నట్టివా రాచారముంబట్టి గుణదోషనిర్ణయముంజేయుట నైజము" (౬౦) అని వ్రాసిరి. పరిపాలనఁ గావించురాజులు సమర్థులుగారని రెడ్డిగారికిఁ దోఁచినదికదా. ఇది విచిత్ర

మైన వ్రాత. బ్రాహ్మణులను రాజులను జూచిన రెడ్డిగారికి పడదేమొ! వాల్మీకి కార్యోత్సాహవంతుఁడుగాఁడని తలఁచి రెడ్డిగారు రామాయణ మందు భావనాశక్తి తక్కువయన్నారేమొ! అందుచేతనే గాఁబోలు చవిసారములేని భరతాదిపాత్రల నాతఁడు సృష్టించినాఁడని వ్రాసిరి. విమర్శననిపుణత్వమును గనఁబఱచుటకో లేక పాశ్చాత్యవాసనాబలమోగాని రామాయణములోను భారతములోను లోపములున్నవని యిట్లుగా రెడ్డిగారు వ్రాసిరి.

"రామాయణమునందు కథాసంయోగము అఖండము. ముఖ్యాంశములనుండి దృష్టిని పెడత్రోవకుఁ దీసికొనుపోవుసంగతు లంతగా లేవు. భారతమున నుపశాఖలు మెండు. కొన్ని శాఖలునుగావు, ఏసంబంధమును లేనివగుట. కావున నప్పుడప్పుడు దారిఁదప్పి పరిభ్రమించువారమై పిమ్మటఁ గష్టపడి కథారాజమార్గమునకు వచ్చులోపల తత్పూర్వము పఠించినభాగములు మఱపునకువచ్చుటయు సహజము. మఱపులకు రాకున్నను వానిచే హృదయములో దీపించిన భావములదుడుకు తక్కువయగును. రచనలో రామాయణము మేలు. భావనాశక్తింగొని పరిగణించిన భారతమునకు గౌరవ మధికము. ఒక్కయధికమన్నం జాలదు. హస్తిమశకాంతరమన్నను సత్యమునకు నగౌరవమురాదు" (౧౭౨) అని వ్రాసిరి. రామాయణభారతములందే లోపములెంచిన రెడ్డిగారు భారతీయకవు లందఱియందు లోపములెంచుటలో విశేషమేమున్నది! మన కవులు స్వతంత్రబుద్ధిగాఁ గావ్యములు వ్రాయలేదనియు, నందువలన మనకు దేశచరిత్రము తెలియరాలేదనియు రెడ్డిగా రాక్షేపించిరి. అట్టివారు ప్రబంధకవులను నిందించిరి అంటే ఆశ్చర్య మేమున్నది. యుద్ధాది వీరకృత్యంబులకు జనులు గడంగుకాలంబులలో మాత్రము కవిత్వము విజృంభించుచుండె ననిరి. స్వతంత్రత కవిత్వవిజృంభణమున కుండనక్కఱ లేదని రెడ్డిగారి యుదారాతిశయమేమొ! ఈయభిప్రాయముతోడనే 'మనయొక్కరాజుల దినములలోనైత మలవడనంతవిన్యాసము నేఁడు ఆంధ్రమును జెందియున్నద' ని వ్రాసిరేమొ! ఇప్పు డుత్సాహముగాని, యుద్ధాదివీరకృత్యములుగాని యేవియు నాస్తియనియే చెప్పవచ్చును. దేశీయసంస్థలు విజృంభింపలేవుకదా. ఇతరదేశములలో జరుగుచున్న

యుద్ధాదివీరకృత్యము లోకకారణముగ చూపించునంతటి యవివేకు లుండరని తలంచెదను. మనకు వృత్తులు లేవు. తిండి లేదు. బీదజనుల మైనాము. ఏదిఆధారముచేసికొని ఇప్పటికాలము స్వతంత్రకాలముకన్న మేలని రెడ్డిగారువ్రాసిరో తెలియదు. పూర్వులను, పూర్వకావ్యములను, శాస్త్రములను నిందించుటయను వికారమైనభావము (సంఘసంస్కారు లది ఘనకార్యమని తలఁచుచుండుట) మాత్రము విజృంభించియున్నది. రెడ్డిగారు ప్రబంధకవులలోనివాఁడగు సూరన్నకు భావనాశక్తిగలదని వ్రాసిరి. అదియుఁ గళాపూర్ణోదయమందేగాని ప్రభావతీప్రద్యుమ్న మందు వ్రాలినదనిరి. రెడ్డిగారు వ్రాసినప్రకారము రాజులనాశ్రయించి బ్రతుకుకాలములోనే నననఁగా స్వేచ్ఛలేనికాలములోనే సూరన్నకు భావ నాశక్తి గల్గియున్నది. స్వేచ్ఛకుఁగడంగినకాలములో వ్రాలిపోయినది. ఇట్లగుటకుఁ గారణ మిట్లు వారు వ్రాసిరి.

"(కళాపూర్ణోదయముకన్న ప్రభావతీ ప్రద్యుమ్నమందు) శైలి యింకను మంచిపాకమునఁ బడియున్నది. లోకోక్తులు మొదలగు నలంకా రము లెక్కువయగుటయకాదు, రమ్యములును అన్వయసౌలభ్యము నధికము. కాని భావనాశక్తి యెంతయుఁదక్కువ. బహుశః కవి వయసు ముదిరినవాఁడైనందున రాగములు కృశించియుండును. రాగాదుల విజృం భణములేనిది భావనాశక్తి యడరనేర్చునా? (౮౨, ౯౩) భావనాశక్తి స్వచ్ఛందప్రచారములలో నొకటి. (౮౨) భావనాశక్తి కారణశక్తియొక్క సేవనమునకు నిల్చినమహత్తుగాదు. మఱి స్వైరిణి. గుఱ్ఱముల నడిపినట్లు గతి వేగముగుసించి త్రిప్పి కొంతకుఁగొంత వశ్యముచేసికొన నగుఁగాని, యపరిమితముగా దానిస్వేచ్ఛావిహారమును నివారించితిమేని అది చెడును. (౮౫)" అని వ్రాసిరి. వయసుముదిరిన రాగములునశించు ననియు నందు వలన భావనాశక్తి వ్రాలినదనియు వ్రాసిరి. కథ సాగినట్లు పోనిచ్చిననే కవిత బాగుండునని వ్రాసిరి. కొంతకుఁగొంత వశ్యము చేసుకొనవలెనని వ్రాసిరి. పూర్తిగ వశ్యముచేసుకొనినగాని యుత్తమాదిభావములు స్ఫుట ములుగానేరవు. మఱియు మనవారు రాజకీయవిషయములేకాక యన్ని వ్యాపారములుగూడ వయసుమళ్లినవారు, సంపదగలిగినవారు. వంశ క్రమాగతులు, పండితులు, సదాచారసంపత్తి గల్గినవారు ఉండిన

చక్కఁగ నెఱవేఱుననియు సౌఖ్యావహ మగుననియుఁ జెప్పియున్నారు. వారి కనుభవము విశేషముగనుండునని మనవారు వ్రాసియున్నారు. అనుభవజ్ఞులగు పెద్దలవలన యథార్థము వ్యక్తమగునన్నారు మనవారు. నవనాగరికులకు మనపూర్వులు జ్ఞానహీనులనియుఁ, దాము ఘనులనియు నొకగర్వము గలదు. రెడ్డిగారుకూడ నిట్లు వ్రాసియున్నారు. "ఈకాలమున బిడ్డలెట్లో పూర్వకాలమున బెద్దలు నట్లే. అనఁగా ప్రకృతి జ్ఞానమంతగా లేనివారనుట" అని వ్రాసిరి. కవిత్వమునకు భావము ప్రధానమైనదని రెడ్డిగా రిట్లు వ్రాసిరి.

"వస్తువు దనంతట నెన్నిగుణములఁదాల్చినదో యెవరునెఱుఁగరు. లెక్కకువచ్చునవి గోచరములుమాత్రమే అగోచరము లుండినను నుండవచ్చును. మఱియు గోచరములన్నియు వస్తువును జూచినపుడెల్ల మనకు స్ఫురించుటలేదు. ఏలయని యడిగితిరేని, ఏభావము మనస్సున నుచ్చస్థానము నధిష్ఠించియుండునో యాభావమునకు సమ్మతములు, రుచికరములు, చింత్యములు నైనగుణములుమాత్రము మిక్కిలి ప్రకాశమానములుగ నగపడును. తక్కినవి మునుపు గ్రమ్మినట్లు వెనుకఁబడినవో యను గతి, దూరస్థములైనవా యనుమాడ్కిని స్ఫుటములుగా నుండవు. మఱి మాఁగువాఱినయవిగానో, ఆసమయమున నేమాత్ర మెఱుకకు రానివిగానో యుండును. కారణమేమన అప్పుడు వానిపై దృష్టినిలుపుట యగత్యముఁగాదు. సహజమునుగాదు. దృష్టి వేనిపైఁబాఱునో యవి ముందువచ్చి సమీపమున నిలిచినట్లు విశదములుగ నుండును. పరిసరములనుండునవి యస్పష్టములు. దూరముగ నుండునవి యప్పటికి నగోచరములు. ఆభావముపోయి వేఱొకభావము మనస్సునాక్రమించెనేని మునుపు తేజోవంతములుగా నుండినభాగము లంతర్థానమై, యప్పుడు గ్రహణముసోఁకినట్లు మఱుఁగుపడి యుండినభాగములు ప్రజ్వలితమైన యుదయముం దాల్చినవి యగును. ఇందులకు వేఱుదృష్టాంతము లేల ? చూడుఁడు. కోపముగానున్నప్పు డెదుటివాని దుర్గుణములమీఁదనే యవధానము స్థిరముగా వ్రాలును. శాంతముగనున్నవేళ వానిసుగుణదుర్గుణముల రెంటిని గమనించి యాలోచనతో మంచివాఁడా చెడ్డవాఁడా యని నిర్ణయింతుము. (ఆలోచనాశక్తికి శాంతము మొత్తముమీఁదసహాయ

కారి. భావములు గొంతవఱకు విరుద్ధములు. శమదమాదిసత్త్వగుణములు పట్టువడినయెడల కైవల్యప్రాప్తి యెట్లోగాని కవితాప్రాప్తి నిందుసున్న. రాజసతామసగుణములు కవితయనుమందాకినీ మనోహరప్రవాహమునకు జన్మస్థానములైన మహోన్నతభావములు) మహానందకాలములో నేర మొనర్చినవానిం జూచినను ఏమోపాపము కడుపాత్రమై దొంగిలించి నాఁడు. ఇదియు నొకప్రమాదమా? యని పరుషములకు సరళము లాదేశమగునట్లు చేయుదుము" (౪౪-౪౬) అని వ్రాసిరి. ఉత్తమా దర్శము లేనికవిత్వము పరలోకముమాట యటుండనిచ్చినను నిహము నకుఁగూడ నుపయోగపడదు. శాంతము లేకుండిన (విషయనిర్ణయము చక్కఁగ లేకుండిన) కార్యము చెడును. రాజసతామసగుణములు కవిత్వము నకు ఉత్తమత్వము చేకూర్చుట దుర్ఘటము. సత్వగుణముండిననే (నుచి తానుచితములు, సుశీలదుశ్శీలములు మొదలగునవి చర్చించుటవలన) నుత్తమభావములు కవిత్వమం దిమిడియుండును. రెడ్డిగారు ఐరోపా వారినిగూర్చి యిట్లు వ్రాసిరి.

"ఐరోపాలోని జనులు రాజసగుణశోభితులు. మన పాలిటి భాగ్యము తామసమో, దానితోఁబుట్టువగు సత్త్వమో యేదోయొక జడత్వబీజము!" (౭౮) అని వ్రాసిరి. సత్వగుణమే లేనియెడల నానా భావాభ్యుదయమైన కావ్యమం దుత్తములగూర్చి వ్రాయఁగలుగు టెట్లు? క్షణభంగురములు, భ్రాంతి, ప్రమాదములకు లోనగు నొకానొకని వ్యక్తిగతాభిప్రాయమును బురస్కరించుకొని వ్రాయఁబడిన కావ్యముల కున్ను, అనేకులయభిప్రాయము ననుసరించి వ్రాయఁబడిన కావ్యము లకున్ను హస్తిమశకాంతరము గలదు. మన కావ్యములు ఇహపరశ్రేయ స్సాధకము లగుట కిది ముఖ్యకారణము. కవిత్వమనఁగా జ్ఞానమును వృద్ధి చేయునది అనుభావము లేనివారికి సత్కావ్యలక్షణ మెట్లవగాహన మగును.

"భావములు తీవ్రముగఁ జెలరేగునపుడు వానియుద్భవోద్రే కములకు హేతువులగు వస్తువులందప్ప నితరములయెడ దృష్టిపాఱుట యసంభవము. మనసు చెలరేగినపుడు ఆలోచనకుఁ బూనుట యౌచిత్య భంగమునకు ముఖ్యకారణము. కావుననే మనవారు కోపము వచ్చి

నపుడు ౧, ౨, 3 ఎంచుమని చెప్పుదురు. చూడుఁడు. భీమసేనుఁడు దుర్యోధనుని జూచినాఁడుపో! అపుడు, సింహము మదేభముపైఁ జెలఁగినట్లు, డేఁగ పావురముమీఁద వ్రాలినమాడ్కి, ఇంద్రుఁడు వృత్రాసురుని మార్కొనువిధమున, బల్లి చీఁకటీఁగపైఁ గవిసినకరణిని, ఇత్యాద్యుపమలు భీమసేనునికిఁ దట్టునా? 'క్రోధం బప్రతికారమై హృదయముం గుందించు' నవసరమున నిట్టిదూరపుటాలోచనలకుఁ దావెక్కడిది? ఒకవేళ అరమైలుదూరమునఁ జెట్టుచాటునఁ బొంచిచూచెడు కవులకైనఁ దోఁచునా? తోఁపదని నానమ్మిక. ఏలన, భీమసేనునిజూచి వణఁకుచుందురుగాన! కావున కథాంశము సాక్షాత్తుగ సమీపమున నడచినట్లు భావనాశక్తిబలంబుచే స్ఫురించెనేని దూరపుసంబంధముగల బలాత్కృతాలంకారములకుఁ దావుండదు" (౧౬, ౧౭) అని వ్రాసిరి. భీమసేనునిఁజూచి కవి వణఁకుట కాతఁడు దుర్యోధనుఁడు కాఁడు. మఱి భీమవైరియుఁగాఁడు. భీమసంరంభమునుగూర్చి వ్రాయుగవి తనమనసులో భీమదుర్యోధనుల వ్యాపారములు రెంటిని నవగాహన మొనరించుకొని వ్రాయవలయును గదా. భీమసంరంభ మెట్టిది, దుర్యోధనుని వ్యాపార మెట్టిది, ఆసమయ మెట్లున్నది, అని వితర్కించి వ్రాయునట్టికవి భీముఁ డుత్తముఁడుగాన నాతని సాత్వికాహంకార మెట్టిదో, భీముఁ డటుల మీఁదవచ్చుటకుఁ దగినసమయ మగునో కాదో, ధర్మమున కొప్పియున్నదో లేదో యాలోచింపవలయును. సంరంభ మెట్లు విజృంభించినది అని యాలోచింపవలయును. దుర్యోధనునివ్యాపార మెట్లున్నది అని యాలోచింపవలయును. ఇట్లు సాత్వికరాజసతామసస్వభావములను విమర్శించి కవి వ్రాయవలసియున్నది. అంతేకాని ముక్కుకుసూటిగాఁ బోవునది కవిత్వము గానేరదు. ఇంతియకాదు. భీమసంరంభమునుగూర్చి యుత్తము లేమనుకొనుచున్నారో, శూరు లేమనుకొనుచున్నారో, దుర్యోధనపక్షపాతు లేమనుకొనుచున్నారో అనికూడఁ గవి వితర్కించి వ్రాయవలెను. అట్లు వ్రాసిననే కవిత్వముశోభించును. హనుమంతుఁడు సముద్రముదాఁటుచుండునపు డనేకవిధములుగా హనుమంతుని, నాతనిచర్యలను, నాకారములను గవివర్ణించియున్నాఁడు. ఉత్తములెట్లు సంతోషించిరో, భూతము లెట్లున్నవో, వానరు లెట్లు ముదమందిరో వ్రాసియున్నాఁడు. కవి యొకఁ

డందుఁ బ్రవేశించియుండునుగాన వానివిహితకృత్యముగూడఁ గొంతవఱ కందుండకతప్పదు. అంతేకాని చప్పున గెంతుచున్న హనుమంతునకు మైనాకుఁ డంతటివిషయమును జెప్పుట కవకాశమబ్బెనా ? భరతుఁ డంత సేపు అన్నిదూరపు సంబంధముగల యొట్లువేసుకొని శ్రీరాముని నయో ధ్యకురమ్మని ప్రార్థించెనా? భరతునిగూర్చి శ్రీరాముఁ డన్నివిధముల రాజ కీయపురస్సరములగు గుశలప్రశ్న లడిగెనా ? సురసావ్యాపారమునకుఁ దగినంతసావకాశ ముండునా ? కవి అంతగాఁ బెంచివ్రాయవచ్చునా ? ఇట్లాలోచించుటయే నిజముగా భావశూన్యమైనవ్యాపార మనక తప్పదు. కావ్యమును రసవత్తరము గావించుటలో నలంకారములను మించినసామగ్రి వేఱొకటిలేదు. కథతోఁబాటు అనేకవిషయము లందు వలన వ్యక్తమగుచుఁ బాఠకునిఁ దన్మయత నొందించును. కావునఁ గవి చక్కఁగ నాలోచించి వ్రాయవలసియున్నది. అట్లైన రస ముట్టిపడు చుండును. భావనాశక్తింగూర్చి కడపట రెడ్డిగా రిట్లు వ్రాసిరి.

“భావనాశక్తి యనేకమాయలంబన్ను లీలావినోదిని. ఈమా యల కన్నింటికి సామాన్యలక్షణ మొక్కటియే. ఏరసము నుత్పాదింపఁ జూచునో దానిని కవియే మనఃపూర్ణముగఁ దాల్చినఁగాని చదువరుల యందు అభిమతమగు చిత్తవిభ్రమము గలుగనేరదు. భావము లనంత ములునగాధములుగాఁ బ్రభవిల్లినఁ గవియు నమోఘుఁడగును”(౫౮,౫౯) “భావనాశక్తి నధికంబుగ విజృంభింపఁజేయునవి భావములు. కోయ్యల రీతినో, మహర్షులచందంబుననో, నిర్వికారస్థితి నుండువారు పద్యములు వ్రాయనేర్తురుగాని,కవులగుట యసంభవము. ఏవృత్తాంతమునైనఁ జూచు నట్లువర్ణింపవలయునన్న దానియొక్కస్థితిగతులను,నందలిపాత్రముల సుఖ దుఃఖములను, రోమరోమమునకును దానే మనఃపూర్వకముగ ననుభవించి నందప్పు, తద్రూపముగ నభినయింప నెవరికిని దరముగాదు. చిత్తచాంచ ల్యమునుగూడదనువారు ఇట్టియనుభవములకు మనసిచ్చి సమ్మతింపరు గావున వారియందు శాస్త్రజ్ఞాన మొకవేళఁ బ్రకాశమునకువచ్చిన రావచ్చును గాని, శిల్పకళ లేమాత్రమును మొలకెత్తనేరవు. ఈవిషయము పామ రులునైతము గొంతకుఁగొంత యెఱిఁగినదే. కావుననే కాళిదాసు తిక్కన్న మొదలగు మహాకవులెల్లరు రసికులనియు స్త్రీలోలురనియు వారు

గాథలుకట్టియుండుట. ఇంతేకాదు. భావములు కోరికలు రసములును మనసులో వెల్లివిరిసెనేని, జనులు మూఁగలట్లు పందలమాడ్కి మూలఁబడి, నిశ్చేష్టితులై యచలతత్త్వనుం బూనియుండుట యరిది. అట్టివారు అనేకవిధములైన యుద్యమములకుంబూని కార్యనిపుణులగుదురు. కావున భావనాశక్తి, సంఘటనోత్సాహము ఇవి పరస్పర మిత్రములనుట విమర్శనశాస్త్రమునందలి యాదిమతత్త్వము" (౧౧) అని వ్రాసిరి. సమస్తవిషయములను మనఃపూర్వకముగఁ గవి తానే యెట్లనుభవించి వ్రాయఁగలఁడు? ముష్టివాని పాత్రవిషయమై వ్రాయవలసివచ్చిన కవి తానది యనుభవింపగలఁడా? ఇట్లే భార్యాశోకము, పుత్రశోకము, మహారాజుభోగము,ఉత్తమునిశాంతత,నీచునియహంభావము, అన్యపురుషరతి, స్త్రీరతిసుఖము నెట్లు తానే కవియనుభవించి వ్రాయఁగలఁడు. సర్వలక్షణసమేతముగా నేదియునుండదనియు,మిశ్రస్వభావమే లోకస్వభావమనియు రెడ్డిగారు వ్రాసిరే. ఇందఱి యనుభవములను మనఃపూర్వకముగ రోమరోమమునకు ననుభవించుటకుఁ గవి సర్వలక్షణసమేతుఁడు కానక్కఱలేదా? అట్లగుట మనుష్యప్రకృతిలోనివాఁడగుఁ గవికి సాధ్యమగునా? కవిమాత్రము మనుష్యస్వభావమున కతీతుఁడై యెట్లుండును? పాత్రములకుఁ గూడనప్పుడు కవికినిఁ గూడదుకదా. ఒకరిమనసు వేఱొకరిమనసునకు భిన్నమైయుండును గావునఁ బాత్రములు ప్రత్యేకాకృతిగలిగియుండవలెనన్నారు రెడ్డిగారు. పరస్పరము భిన్నులైన జనులయొక్క మనస్సులను గవిమాత్ర మెట్లు గ్రహింపఁగలఁడు? అనేకవిధములైన యుద్యమములకుం బూని కార్యనిపుణులైనవారు సంఘటనోత్సాహముగలిగి యనేకుల కష్టసుఖములఁజూచి గ్రహింతురుగాని యనుభవమునకుఁ దెచ్చికొను టెట్లు? చూచిగ్రహించుట తానే యనుభవించి గ్రహించిన ట్లుండునా? కవి తా ననుభవించి చిత్తచాంచల్యము నొందవలెనన్నారు రెడ్డిగారు. చిత్తచాంచల్యము గలవారికి యుక్తాయుక్తవిచక్షణత నశించును. మోహావంతునకు, హంతకునకు యుక్తాయుక్తవిచక్షణత యుండునా? కవి తా ననుభవించుట యనునది కుదురదు. మఱి చూచియే గ్రహింపవలెను. చూచి గ్రహించుటకుఁ జిత్తచాంచల్య మన

వసరము. తాను నిర్వికారస్థితినుండియే గ్రహింపఁగలఁడు. చూచి గ్రహించుట నిర్వికారస్థితివచ్చుటకే గాని చిత్తచాంచల్యముఁ బొందుటకుఁ గానేరదు. యజ్ఞముగావించి సోమయాజియై భారత మాంధ్రముగావించిన కవిబ్రహ్మనుగూర్చి రెడ్డిగా రిచ్చుట వ్రాయఁగూడనిమాటలు వ్రాసిరికదా! కాళిదా సిట్లు వ్రాసియున్నాఁడు.

"హలాశకుంతలే అనభ్యన్తరేఖల్వావాం మదనగతస్య వృత్తాంతస్య కింతు యాదృశీతిహాసనిబంధేషు కామయమానానా మవస్థా శ్రూయతే తాదృశీం తే ప్రేక్ష్యే కథయ" (శా. 3.)

(సఖి శకుంతలా, మాకు మదనవృత్తాంతరహస్యములు తెలియవుగదా; అయినను నైతిహాసనిబంధనములయందు వలవంతం గూరువారి యవస్థ నెట్టిదానినిగా విందుమో నీయవస్థయు నట్టిదిగా నా కగపడుచున్నది. చెప్పుము.)

ఆకస్మికముగ సంప్రాప్తమైన నాభరణములను శకుంతల కలంకరించు నవసరమున సతి (అనసూయ).—

"అయే అనుపభుక్తభూషణోఽయం జనః చిత్ర కర్మపరిచయేనాంగేషు త ఆభరణవినియోగం కుర్వః" (శా. 4.)

(మేమింతవఱకు భూషణముల నుపయోగించి యెఱుఁగము. అయినను జిత్తరువ్రాఁత యలవాటునుబట్టి నీయంగకములం దాభరణవినియోగము చేదుము.)

శకుంతల నత్తవారింటికిఁ బంపుసందర్భమునఁ గాశ్యపుఁడు.—

"వత్సే త్వమిదానీమనుశాసనీయాసి వనౌకసోఽపి సన్తో లౌకికజ్ఞా వయం" (శా. 4.)

(అమ్మా, నీకు మంచిబుద్ధులు చెప్పవలయును. వినుము, మేము వనవాసులమయ్యు లోకవృత్తముఁగూడ నెఱుంగుదుము.)

అని వ్రాసియున్నాఁడు. సర్వజ్ఞులయ్యు తత్త్వవేత్త లచల తత్త్వమును వీడరు. అట్లే కవులుకూడ. యుద్ధమందు నిర్దయుఁడై యనేకుల చిత్రవధగావించునట్టి వీరుఁడు దుష్టాత్ముఁడని చెప్పవచ్చునా. ఆవీరుఁడు స్వభావముచే ప్రాణిహింసకు సమ్మతింపని దయాస్వభావము గల్గి ప్రకాశింపఁడా. అట్టివెన్ని యుదాహరణములు గలవు. సువిచారము

లేని చిత్తచాంచల్యము నాశ్రయించి వ్రాయువారు లోకమునకుఁ జిత్తచాంచల్యమునే గల్గింతురేమో! కాక మతేమగును? పాత్రల స్వభావ స్వరూపముల నెఱుంగుట కవికి ముఖ్యమైనవిషయము. అందులకు లోకజ్ఞాన మవసరము. అంతకన్నఁ బ్రాచీనకవులరచనలు, అలంకార శాస్త్రములు ముఖ్యములు. అందువలన మనుష్యస్వభావము విమర్శగాఁ దెలియును. ప్రాచీనకావ్యము లనేక కాలములయొక్క స్థితిగతులను దెలియఁబఱచును. అనునదియైన గ్రహింపకుండుటఁ జూడ రెడ్డిగారికి మన కవులందున్న యసహిష్ణుత వెల్లడియగుచున్నది. భావనాశక్తింగూర్చి ఇట్లు వ్రాసినరెడ్డిగారు భావనాశక్తినాటకకౌశలంబుతో ననుసంధించియుండును అని యిట్లు వ్రాసిరి.

---

# కవిత్వతత్త్వవిచారవిమర్శనము.

## శ్రీయుత కట్టమంచి రామలింగారెడ్డిగారి పుస్తకవిమర్శనము.

### నాటకలక్షణము.

"కేవల కల్పితములైనవానింగూడ సాక్షాత్కారముం దాల్చిన చేతనములం జేయంజూచునది కావున భావనాశక్తి నాటకకౌశలంబుతో ననుసంధించి యుండును. అనఁగా నాటకరచనాశక్తి యున్నంగాని కావ్యములు సైతము యథార్థములుగఁ గన్పింపవు. విరాటోద్యోగపర్వంబులం జదివి చూచినవారికి తిక్కన్నయెడ నీకళాకౌశలం బెంత పరిపూర్ణముగ నుండెననుట నావంటివాఁడు చెప్పవలసిన పనియేమి? సంజయుఁడు, ధృతరాష్ట్రుఁడు, ధర్మరాజు, ద్రౌపది, కృష్ణుఁడు, దుర్యోధనుఁడు, కర్ణుఁడు మొదలగువారు మన యెదుటనే మాటాడుచుండ్కినుండుట పండితపామరవిదితము. పాత్రలనడవడికిని, వారిచేష్టలకును మాటలకునుగల సమ్మేళన మెంతదృఢము! భారతములోని యేపద్యమైనం జదివినయెడ, శైలింబట్టియే యది యెవరిదైనదియుఁ జెప్పవచ్చునని యొకానొకరియభిప్రాయము (౯, ౧౦) (కావున) ప్రతిభయు, భావనాశక్తియు, సందర్భశుద్ధియు, పాత్రోచిత పద్యరచనయు (౮౧) నుండవలెనని రెడ్డిగారు వ్రాసిరి. సందర్భశుద్ధిలేకుండిన భావనాశక్తియున్నను, నాటకసరణి యున్నను లాభములేదు. కావున సందర్భశుద్ధికై లోకజ్ఞానము, శాస్త్రజ్ఞానము, పూర్వకావ్యజ్ఞానము అత్యావశ్యకమని వేఱె వ్రాయ నవసరము లేదు.

రామాభ్యుదయము, హరిశ్చంద్రోపాఖ్యానములనుండి రెండు పద్యముల నుదాహరించి వారిట్లాక్షేపించిరి.

"రామాభ్యుదయములో రామవనవాసఘట్టమున దశరథుఁడు నానార్థరత్నమాలను ఎదుటనుంచికొని పుటలఁ ద్రిప్పుచు నేర్చినాఁడో యనునట్లు దరిద్రముపట్టిన శ్లేషాలంకారములు పెట్ట"

సీ. కానకకన్నసంతానంబు గావునఁ గానకకన్నసంతానమయ్యో

... ... ... ... ...

ఇత్యాదిరీతులఁ బ్రలాపించినట్లు వ్రాసియున్నాఁడు. మఱియు శంకరకవికృత హారిశ్చంద్రోపాఖ్యానమున లోహితాస్యుని మరణము గూర్చి యేడ్చుచుఁ జంద్రమతి, రాజర్షిపత్ని గావుననేమో, కుమారు నికింబలె తనకును నూపిరాడకుండఁ బ్రాణాయామముఁజేయుచు, నీదీర్ఘ సమాసమును గూర్చి పద్యముచెప్పినది చూడుఁడు.

మ. అకటా ! చేరెఁడునేలకుందగఁడె సప్తాంభోధివేష్టి భవ
త్సకలద్వీపకలాప భూపమకుటాంచత్పద్మరాగోజ్వల
ప్రకటానర్గళ నిర్గళత్కిరణ శుంభత్పాదుఁడైనట్టి రా
జకుమారుండు.................. (ఆ ౫-౮౬)

"ఈతీరుననే యెల్లరామాయణములును వ్రాయఁబడియున్నచో నాగ్రంథములయొద్దకి మనుష్యులననేల, తుదకుఁ జెదలు సయితము పోదనుట స్పష్టము. కాఁబట్టి విషయముచే రసము తప్పక కలుగుననుట తప్పు. కథ బాగుగనుండినం జాలునా? తగినరీతిని వ్రాయంబడియున్నం గాని కాదు. ఈదేశములో నొక్కయాంధ్రులకుఁ దప్పఁ దక్కిన యంద ఱకును రామాయణమందుఁగల యభిరుచి భారతమున లేదు. మన కన్ననో భారతము ప్రాణము. ఈవ్యత్యాసమునకుఁ గారణమేమి? ఆంధ్రంబున భారత రామాయణాదులకుఁ గలశైలి తారతమ్యమే. శోక రసము వర్ణించునపుడును రామభద్రునకు శ్లేషలు సాంస్కృతిక దీర్ఘ సమాసములును వీడరాని చీడలాయెఁగా" (౨౩, ౨౪) అని వ్రాసిరి. శోకరసము వర్ణించునపుడు శ్లేషలు, సాంస్కృతిక దీర్ఘసమాసములు వ్రాయుట వీడరానిచీడలని ఆక్షేపించి ఉదాహరణముగా 'కానకకన్న సంతానంబు' అనుపద్యమును, అకటా! 'చేరెఁడునేలకుందగఁడె' అనుపద్య మును వ్రాసియున్నారు. ఇంకను నీవిషయమును స్పష్టముచేయుటకు ఇట్లు వ్రాసియున్నారు.

"ప్రబంధములలో నాటకకౌశలము మృగ్యము. పాత్రోచితమైన భాష శ్లేషబంధురములైన కావ్యములలో మందునకైన దొరకునే? చెలి కత్తె నోరుదెఱచిన నేమి కన్యామణి నోరుదెఱచిన నేమి? బయటఁబడు

నది శ్లేషయే" శ్లేషను, అందును అభంగశ్లేషను, ఘటింపవలయునన్న సాంస్కృతికశైలి యుండియేతీరవలయును. ఏరసము నేభావమును వెల యింపఁబూనినను దీర్ఘసమాసములతోఁ జేయుటవిధి. ఏకసమాసమైన వృత్తముల నేడ్చునప్పుడును బ్రయోగించు కోమలాంగులఁ దలఁచు కొన్నచో వారి శ్వాసకోశము లెంతఘనములని యాశ్చర్యమయ్యెడిని!" (౭౮) అని వ్రాసిరి. మనుష్యప్రకృతి అనేక విధములనియు, అందొకొక్కరి కొకొక్కదానియం దభిరుచియనియు రెడ్డిగారు వ్రాసియున్నారు. అట్లుగనే కొందఱకు శ్లేష, కొందఱకు దీర్ఘసమాసములు, కొందఱకు సులభపదములు, కొందఱకుఁ గఠినపదములు, కొందఱకు సంస్కృతము,కొందఱకుఁ దెనుఁగు, కొందఱకు సంస్కృతాంధ్రసమ్మేళనము.ఇట్లుగా నొకొక్క రొకొక్కరీతికి సంతోషించెదరని వారేల తలంపరాదు? బమ్మెర పోతనామాత్యుఁడు భాగవతమం దిట్లు వ్రాసియున్నాఁడు.

క. కొందఱకుఁ దెనుఁగు గుణమగుఁ, గొందఱకును సంస్కృతంబు గుణమగు రెండుం
గొందఱకు గుణములగునే, నందఱ మెప్పింతుఁగృతుల నయ్యైయెడలన్. ౧-౨౦

అని వ్రాసెను. పోతనామాత్యుఁడుద్దేశపూర్వకముగ బదప్రయోగము గావించియున్నాఁడు కదా. ప్రతివిషయమును సహజరూపముననే వ్రాయవలయుననియుఁ, బాత్రలు లోకస్వభావసిద్ధముగా నుండవలెననియుఁ బదప్రయోగము మాటాడుకొన్నట్లుగా నుండవలెననియు నంతయు స్వభావసిద్ధముగా నుండవలెననియు నిప్పటి వారిలో ననేకుల కిట్టిఅభిప్రాయమే కలదు. ఇందువిషయమై రెడ్డిగారిట్లు వ్రాసియున్నారు.

"నేరుగా కవియే కథలో మాటాడుట కథయందు మనకుండ వలయు నవధానమునకును దానిచేఁ గలుగు మైమఱపునకును విచ్ఛేద హేతువు. కావునఁ గవిబోధనలు సైతము పాత్రములమూలమునఁ బ్రచురించుట నాటకసందర్భమునకుఁ బోషకము. కావ్యమనునది జగత్తు రీతి నుండవలయును ఎట్లన, జగంబు మన యెదురనున్నది. దానిమీఁద దృష్టిచెదరకుండుటకో యన జగత్కర్త యదృశ్యభావుఁడయియున్నాఁడు. కావ్యమును జదివి యానందించుచుఁ గవిని మఱచితిమేని, యది కృతఘ్నతయేమోగాని, యదియే కవియొక్కకృతార్థతకు గుఱుతు. మఱియు, పాత్రలమఱుఁగుననుండి వారిచేఁ జెప్పించినఁ దనకు గర్వము, ఆత్మస్తుతి

మొదలగు నేరములు మోపఁబడవు. (౮౯, ౯౦) (పింగళిసూరన్న) కథా ప్రారంభముననే యెంతవడిగా నెన్ని పాత్రములం బ్రవేశింపఁజేసినాఁడో తలపోసి యానందాశ్చర్యముల భరింపుఁడు (౧౮౭) ఆదినే యీరీతి నైదుగురనెదుట నిల్పుటయు గాదు. మాటమాటకును గథ పెరుగునట్లు చేయు మాహాత్మ్యమున సూరన నిస్తులుఁడు. (౧౮౮) పింగళిసూరన్న కృతులలో పాత్రములు సాధారణముగ దీర్ఘచర్చలఁజేయరు. కవి బహు చమత్కారముగ మాటమీఁద మాటవచ్చి విషయము విశదమగునట్లు సంభాషణ లేర్పఱుచును. నాటకకౌశలమని పేర్కొనఁబడిన ప్రతిభలో నిదియొకకళ. ఈశక్తిలో నితఁడు తిక్కనతో సమానుఁడన్నను బైమాట గాదు......ఇంత సమర్థుఁడయ్యును అంగవర్ణనాశృంగారమునకుం బూనె నేని యాశక్తిఁ గోలుపోయినవాఁడౌట యెంతయుఁ జింతనీయము. (ప్రభావతీప్రద్యుమ్నములోని) శుచిముఖియొక్క యుపన్యాసము ముప్పదిపద్యములకన్న నెక్కువ. ఇంతసేపును బ్రద్యుమ్నుఁడు నోరు చచ్చిన జీవంబువలె నిలుచుండుటఁజూడ, అతనికే కాదు, మనకుఁ గూడ నలసట! పాత్రములను ముందునిల్పిన పిమ్మట నెల్లరు నప్పుడప్పు డేమైనఁ జేయుచున్ననే వినోదము. ఒకరు నోరు బ్రద్దలగునట్లు మాటాడుచు తక్కినవారు కొయ్యబొమ్మలరీతిని, పల్లెటూరివాండ్రవలెను, నోరుదెరచి కొని తెప్పవేయక నిలువఁబడియుండిన ప్రకృతికి రసమునకు రెండిఁటికిని కీడు. సామాన్యులగుకవులలో నీదోషములుండిన విచారము లేదుగాని, మహాకవియు సంభాషణరచనలలో దక్షుఁడునైన సూరనార్యుఁ డీలోప మునవ్రాలుట మనసుగుందించు చెడుగు." (౧౨౦-౧౨౧) అని వ్రాసిరి. కావ్యము వేఱు, నాటకము వేఱు అని తెలియవలసియున్నది. కావ్యనాట కముల రెంటియందును గొన్నిచోట్ల సహజస్వభావమును మీఱివ్రాసిన బాగుండును. కొన్నిచోట్ల సహజవర్ణనము బాగుండును. అట్లు రెండు విధములుగా మేళవింపఁబడిన గ్రంథమే చక్కఁగ వికసించును. అంతియె కాని స్వభావసిద్ధముగా మాత్రమే యుండవలయుననునది కుదురనేరదు. స్వభావసిద్ధముగా (సహజస్వరూపమునఁ) బ్రదర్శింపవలసిన దృశ్యకావ్యము లందుఁగూడ(నాటకాదులందుఁగూడ)స్వభావాతిక్రాంతవిషయము లుండక తీరదు. స్వభావసిద్ధముగా (సహజస్వరూపమున) సమస్తము వ్రాయుట

కను బ్రదర్శించుటకును బహుప్రయత్నములు జరుగుచున్నవి. నాటకము సహజముగా నుండవలయునని నేడనేకులు దలంచుచున్నారు. నాటకరంగమందు వీలు లేనివి సినీమారంగమందు స్వాభావసిద్ధముగాఁ జూపుటకు వీలు కలిగినది గాన స్వభావాతిక్రాంతవిషయము లుండనేరాదని నేడనేకులు దలంచుచున్నారు. ఇందుకై ప్రపంచము నేడు విశేషపరిశ్రమ మొనరించుచున్నది. ఏదే నొకసీను వెనుకఁదగిలించి రంగము ప్రదర్శించుట అస్వాభావికము గావున రంగానుగుణ్యమైన సీనులు (యవనిక), సంఘటన లుండవలయును. దుస్తులు నాటకములోనిపాత్రల అంతరములను, స్వభావములను అభివ్యక్తము చేయునట్లుగా నుండవలయును. మఱియు లావు, సన్నము, పొడుగు, పొట్టిగాకుండ ఆదుస్తు లమరియుండవలెను. ఆయా దేశకాలపాత్రములకు సంబంధించిన వేషభాషలను విమర్శించి అట్టి వేషభాషలను నటుఁడు ప్రదర్శింపవలయును. (భాషవిషయమై ఇంకను దగినంత పట్టుదల రాలేదు. సహజత్వ మనునపుడదియు నవసరమేకదా. భాషాసహజత్వము విషయమై ఆయాకాలములను, బరిస్థితులను, భాషయొక్క స్థితిగతులను విమర్శించవలసియున్నది. ఆయాకాలములం దెవ రెవరెట్లుగా కాయుచుండినది మాటాడుచుండినది విమర్శించవలయును. అది ప్రస్తుతకాలమువారి కెట్లవగాహనమగునో అది విమర్శించవలయును. ప్రస్తుతకాలమువారికి అవగాహనకానపుడది వ్యర్థమగును గదా. అప్పుడుగాని భాష స్వభావమునఁ బడదు.) కన్నులు, ముఖము, కాళ్లు, చేతులు మొదలగు నవయవంబులవిషయమై నటుఁడు అతిజాగ్రతగనుండి పాత్రానుగుణమైన వ్యాపారము నేమాత్రము నతిక్రమింపరాదు. స్త్రీలు స్త్రీపాత్రలను, బురుషులు పురుషపాత్రలను బాలురు బాలపాత్రలను, బాలికలు బాలికలపాత్రలను ధరించవలయును. (వృద్ధునిపాత్ర యౌవనుఁడు ధరించుట నొప్పుకొనుచున్నారు. కాని వృద్ధుఁడు యౌవనపాత్రను ధరించుట కొప్పుకొనలేదు.) పాత్రధారి తన్ను మఱచి పాత్రయే తానుగా లీనమై నటించవలయును. ప్రేక్షకులను మఱచినట్లు నటించవలెను. పూర్తిగ మఱువరాదని కొందఱిమతము. తనలోఁదాను మాటాడుట పిచ్చివాని చేష్ట గావునను, ప్రేక్షకులకు వినఁబడినది. ప్రక్కనున్న నటకునకుఁ గూడ

వినఁబడునుగావున స్వగతములు, జనాంతికము లుండరాదు. పాత్రల మూలమున నీతిగాని ఏవిషయమైనను అభివ్యక్తముకావలయును. అంతియకాని ఉపదేశములాగున పాత్రలచేఁ జెప్పించుట సమంజసము కాదు. పద్యము లుండరాదు. (పద్యములున్నను వచనమురీతి నుండ వలయునని కొందఱిమతము.) పాట లుండరాదు. (పాటలు తగుమాత్ర ముండవలయునని కొందఱిమతము "బ్యాక్ గ్రౌండు మ్యూజిక్" (పాత్రలతో సంబంధముకానిది ఆయాపట్టులకు సరిపోయియుండునది అగు వాద్యవిశేషము) విషయమై యెట్టి నిర్ణయమురాలేదు. సంగీతము తగు మాత్ర ముండవలయునని కొందఱిమతము. స్వాభావసిద్ధముగాఁ బ్రతి విషయ ముండవలయును గాన *సాంఘికములనే ప్రదర్శింపవలయును అని చెప్పుచున్నారు స్వాభావసిద్ధముగాఁ బ్రదర్శించుటకుఁ గడుఁ బ్రయత్నించుచున్నారు. ప్రపంచమంతటికి నవగాహనము కావలయునని తలఁచి అట్లుగాఁ బ్రదర్శించుటకు విశేషముగఁ బ్రయత్నించుచున్నారు. (ఈ ప్రయత్నమువలన ననుకరణములు గల్గుచున్నవి. వాటినిఁ దొలఁగింపఁ బ్రయత్నించుచున్నారు. భాష కొంత ఇబ్బందియగుచున్నది. దానిని వీలునుబట్టి తగ్గించి ప్రదర్శనమూలమున వ్యక్తముఁజేయఁ దలంచు చున్నారు.)

ప్రస్తుతముః తటస్థించిన స్థితివలన వెనుకటి వృత్తాంత మేదైన జ్ఞాప కముగలుగునట్టి పట్టులందు సినీమాలలో ఆనటకుని మఱుగుపఱచి అజ్ఞాప కమువచ్చిన వ్యాపారమును జూపించుచుందురు. లేదా ఆనటకుని శిరస్సు మాత్రము పెద్దదిగాఁజేసి అదొక్కటిమాత్రము కనఁబడునట్లుచేసి

* సాంఘికమనునది ఆయాదేశములకుఁగూడ సహజము కానేరదు. దేశములో ననేకభేదము లుండునుగదా. కావున సాంఘికమనఁగా దేశములో నొకనిబంధనము గలిగినట్టి ఒకేకాలమునకు సంబంధించిన విషయము అని నిర్వచింపవలసియున్నది. అట్లయినను గూడ సహజత్వము సిద్ధించనేరదు. ప్రతిప్రాణియుం నితరప్రాణులనుండి కొంతవఱకు భిన్నుఁడైయుండును. కావునఁ గొంతవఱకు అసహజత్వ మంగీకరింపక తప్పదు. నాటకము సహజము కానేరదు. దీని నెఱుంగనందున నిప్పటివారి ప్రయత్నము లన్నియుం వ్యర్థములగుచున్నవి. అందువలనఁ గళోపాసన అన్యమార్గమును బట్టుచున్నది.

ఆశిరస్సులో నీదృశ్యమునంతయుఁ జూపింతురు. అనఁగా వాఁడు మనస్సులో నిట్లు తలంచుచుండెను అని దానిభావము. ఆజ్ఞాపకదృశ్యమును జూపుటకు ముందు వెనుకలందు నటుఁడు తనలో మాటాడకూడదు. అట్లు మాటాడుట పిచ్చివానికూఁత యగును. కావున బుఱ్ఱవంచిగాని, గ్రుడ్లుమిటారించిగాని, మందహాసమొనరించిగాని నటుఁ డుండవలసి వచ్చును. ప్రక్కనటునితోఁ జెప్పుటవచ్చిన, దృశ్యమును జూప నక్కఱ లేకుండ నంతయు మాటలతోనే చెప్పివేయవచ్చునుగదా. దృశ్యమును జూపుటలో సహజత్వము గలదనినచో ఆనటుఁడు శరీరము నుపసంహరించుకొనుటయో చిన్నవాఁడుగాఁ దయారుకావడమో, ప్రక్కకొదిగి యుండుటయో, లేక శరీరమంతయు బుఱ్ఱలోఁ బెట్టుకొని కేవలము బుఱ్ఱతోఁ జూచుటయో, లేక మాయమగుటయో చేయకతప్పదు. నటుఁడిట్టియవస్థకుఁ బాల్పడుట అసందర్భము. మఱియు అస్వాభావికము. నటకుని అగౌరవపఱచినట్లె యగును. ఈదృశ్యమగుచున్నంతవఱకు ఆపాత్ర జీవచ్ఛవమువలె నుండకతప్పదు. (అక్షరపంక్తులుచూపి కథజరుపుట అసందర్భమగునుగదా) మఱియు నీపాత్రలు ఉన్నపాటున నంతరించుటయు లేక నడువకనే గిఱ్ఱుమని మఱుఁగుపడుటయుఁ దటస్థించును. ఒకేస్థితిలో వివిధపాత్రలస్థితిగతు లెట్లున్నవి. ఈమొదలగు స్థలములందు ఇట్టి విపరీత దృశ్యములు పలుమాఱు చూపింపఁబడును ఇదెంత యసందర్భము. పాత్రలు నడువకనే ఈవిపరీతమైనమార్పు లెట్లు గల్గుచున్నవి. ఇచ్చట మఱొక్క అసందర్భము. ప్రకృతిదృశ్యములను జూపుటకో మఱెందులకైనను బూని పాత్రములను మఱుఁగుపఱచి అట్టివానినిఁ జూపుచుందురు. ఎన్నిమైళ్లదృశ్యములు గనఁబడుచున్నను మఱుఁగుపడి ఒకేస్థలమందున్న పాత్రయొక్కమాటలు, లేక పాట ఒకేమాదిరిగ హెచ్చుతగ్గులు (గంభీరహీనస్వరములు) గాక వినఁబడుచుండును. పాత్రయొక్క పాటకాక వెనుక వాద్యమైనను ఇన్నిమైళ్లదూరము ఒకేమాదిరిగ వినఁబడునట్టి, సందర్భము చాలని, నిక్కమగునెడల విశేషప్రయాసలకుఁగాని సాధ్యముగాని సంగీతము వినిపింపఁజేయుట అసందర్భమేకదా. పాత్రయొక్కపాటయే యగునెడల అసందర్భముమాట అటుండనిచ్చినను ప్రేక్షకుల కంటఁబడకుండ మఱుఁగుననుండి పాడుకొనవలసిన దరిద్రదశ ఆనటున కెందుకుఁ గల్గునో

ఊహించుటకు రాదుకదా. సగముపాటలోను, బద్యములోను, మాటల లోను బాత్రలు మఱుఁగగుచుండును. ఒకపాత్ర సంభాషించుచున్నప్పుడు మఱియొకపాత్రయే దృష్టిపథముననుండును. భాషించుచున్న పాత్ర మఱుఁగుపడును. భావిస్థితినిసూచించునట్టి విశేషమును గనఁబఱచుటకుఁ గాను పాత్రలను మఱుఁగుపఱచుచుందురు. పైవి అసందర్భములనితలంచి మానివేసినను గష్టతరములైన మఱికొన్ని చిక్కులు గలుగును.

దోషియనుకొనినవానిని ఉరికంబమున నిలఁబెట్టి వధించునిమిత్త మొకఁడు కత్తినెత్తుటను జూపి, ఈరంగమును ఇట్లుగానిలిపి, పిమ్మట నావధింపఁబడనున్న వాఁడు దోషికాఁడనియు, వాఁడవశ్యము పూజనీయుఁ డనియు వెల్లడియగుట, వానిని సంరక్షించు ప్రయత్నములు జరుగుట చూపించెదరు. ఈమధ్య వ్యాపారమంతయు వాఁడు కత్తినెత్తి నిలఁబడిన పిమ్మటనే జరిగియుండదుకదా. కావున నటుపిమ్మటఁ జూపుట అస్వాభావి కము. ఈకాలహారణమునకుఁ (గత్తినెత్తినవాఁ డట్లే నిలఁబడియుండుటకు) అర్థమేమి? ఇదిగాక భిన్న భిన్నస్థలములందు జరుగుచుండునట్టి వ్యాపార ములను గొంతకొంతగాఁ బదేపదే చూపించుచుండుటగలదు. అదంతయు అస్వాభావికమేయగునుగదా? ఒకరంగము ముగింపు అయినపిమ్మట రెండవ రంగములో మొదటిరంగములో వచ్చిన నటులు రాక మఱికొందరు వచ్చెదరు. వారితో ఆరంగము ప్రదర్శింపఁబడి అటుపిమ్మట వచ్చినట్టి రంగములందు మొదటిరంగమందు నటించిన నటుల దరువాయిసంగతి ప్రసంగింపఁబడును. ఇది అస్వాభావికము. మధ్యరంగము ప్రదర్శింపఁబడు నంతసేపు మొదటిరంగములోని నటులవృత్తాంత మేమైనటుల? ఊరక వారు కూర్చొనిరా? కావున నీకాలహారణమునకుఁ దగుకారణమును జూపించునట్టి నాటకములనే తయారుచేయవలెను. కావునఁ బ్రతిరంగము ఎట్టి ఆతురతగాని, ఇతరరంగములతో సంబంధమున్నట్లుగాఁగాని ముగింపు కారాదు. ఏయంకమున కాయంకమే ముగింపునొందినట్లుండు నాటకమే తయారు గావింపవలయును గదా. ఒకేకాలములో ననేకకార్యములు జరుగవలసి యున్నట్టివిషయములు నాటకప్రదర్శనమునకుఁ బ్రతికూల మని తేలుచున్నదికదా. పైనిబంధనలన్నియు ననుసరించి నాటకము ప్రద

ర్శించుట కుదురదు. ఒకవేళఁ బ్రయత్నించి అట్టివే ఏకాంకాదులను బ్రదర్శింపవచ్చునన్నను మఱికొన్ని చిక్కులు గలుగును.

ప్రాణనాథా, సఖీ, మిత్రమా, మంత్రివర్యా అని సంబోధించి పిలుచుట అస్వాభావికము. నైజసంభాషణయప్పు డిట్లుపిలుచుటయుండదు గదా. పేరుపెట్టి సంబోధించుటయు అస్వాభావికమే యగును. ఒకవేళ నివియు గమనించి నాటకప్రదర్శన మొనరింపఁ బ్రయత్నించినను మఱి కొన్ని చిక్కులు సంభవించును.

శ్రీకృష్ణుఁడు కాళియమడుఁగులోఁ బడిపోయెనని వినిన యశోద దుఃఖమును సూచించు పాటపాడినను అస్వాభావికమే యగుచున్నది. ఆత్రుతగాని దిగ్గనలేచి మడుఁగుదగ్గఱకుఁ బరుగిడుటగాని మూర్ఛనొందుటగాని చూపవలసియున్న నీసందర్భమున సంగీతము నుపయోగించుట అస్వాభావికమే యగుచున్నది.

ఉ. ఆసభ కేకవస్త్రయగునట్టి నను గొనివచ్చి నొంచుదు
శ్శాసనుఁ జూచుచుం బతులసంభ్రములై తగఁ జేష్ట లేక నా
యాసలు మాని చిత్రములయాకృతి నున్నయెడన్ ముకుంద ని
శ్వాసముతోడ నిన్ గొలువవచ్చె మనం బదియుం దలంపవే. భార. ఉ. 3 ౧౧౧

ఇందు పతులు అని ద్రౌపదిపలుకుట అస్వాభావికము. అది వాడుక పదముకాదు. మావారు అనియో లేక అట్టియర్థము స్ఫురించులాగున మాటాడుటయో లేక భావప్రకటనఁ గావించుటయో చేయవలయును గాని ఇట్లుపలుకుట సమంజసముకాదు. కృష్ణాయని అసలు పేరుపెట్టిపిలుచుటయే అస్వాభావికము. అందులో మాఱుపేరు 'ముకుంద' అని సంబోధించుట మఱియు అస్వాభావికము. 'నిన్' అని 'అదియున్' అని యిట్లు పొల్లుఅక్షరముల నుపయోగించి పలుకుటయు అస్వాభావికమే యగును గదా.

ఉ. మ్రుచ్చిరసేల యేఁగలుగ ముద్దియ నాకు వృకోదరుండు వి
వ్వచ్చుఁడుం దోడుగాఁగ జనవంద్యుఁడు ధర్మసుతుండుపంప నీ
మెచ్చుగ శత్రుసంక్షయము మేకొనిచేసెదఁ గాక వేఱొకం
డచ్చుపడంగ నేర్చునె దురాత్ములు గౌరవు లుర్వియిత్తురే. భార. ఉ. 3 ౧౨౦

పరులభార్యను 'ముద్దియ' అని సంబోధించుట అస్వాభావికము. భీముఁడు అనిపలుకుటలేదు సరికదా వృకోదరుఁడు అని ప్రయోగించుట గూడ మాని వృకోదరుండు అని వచించుట గేవలము అస్వాభావికము. అట్లే శాంతనవాంతకుండు మొదలైన అపూర్వపదప్రయోగములు అస్వాభావికములే యగుచున్నవి.

చ. అలికులవేణి నవ్వులకు నాడినమాటల కింత సీమదిం
గలఁగఁగ నేల వేఁటలను గయ్యములన్ రతులందు నొవ్వఁగాఁ
బలికినమాట లెగ్గులని పట్టుదురే భవదీయచిత్తముం
దెలియఁగఁగోరియేఁబలికితిన్ మదిలో నిటు గుందనేటికిన్. భాగ. ఉత్త. ౧౦ ౭౬౩

'అలికులవేణి' అని భార్య నెవరైన సంబోధించెదరా. కావున నస్వాభావికము.

ఉ. శ్రీయుతమూర్తి యోపురుషసింహమ సింహముపాలిసొమ్ము గో
మాయువు గోరుచందమున మత్తుఁడు చైద్యుఁడు నీపదాంబుజ
ధ్యాయిని యైననన్ను వడిఁదాఁగొనిపోయెద నంచు నున్న వాఁ
డాయధమాధముం డెఱుఁగఁ డద్భుతమైన భవత్ప్రతాపమున్.

భాగ. పూర్వ. ౧౦ ౧౭౦౮

సంబంధము రహితముకాలేదు. కృష్ణుఁడో మిగులఁ బ్రసిద్ధినొందిన వాఁడు. విశేషించి రుక్మిణి భర్తగా వరించుచున్నది బ్రాహ్మణముఖమున సందేశ మంపుచున్నది. అట్టిస్థితిలో ఏకవచనములో 'నీవు' అని పలుకునా కావున నస్వాభావికము.

మ. బకకిమ్మీరహిడింబసూదనుఁడు దృప్యత్కీచకప్రాణఘా
తకుఁడు న్నాగథగంధసింధురభిదాదుర్వారనిర్ఘాతుఁడున్
బ్రకటస్ఫారగదోగ్రదీర్ఘభుజుఁడు న్నాతమ్ముఁడు
న్నీదునాయకుఁడో దుర్జయుఁ డర్జునాగ్రజుఁడు కట్టా! యస్తమించెన్ గదా.

(వ. సు) వేణీసం. ౬ ౧౭

అయ్యో! నాతమ్ముఁడా యని యేడ్చునుగాని, అర్జునునకు అన్న యని ద్రౌపదికి(తనభార్యకు) మగఁడని ఇట్లుగా నిన్ని రకములుగా నేడ్చునా. కావున అస్వాభావికము.

సీ. కుప్పించియెగసినఁ గుండలంబులకాంతి గగనభాగంబెల్లఁ గప్పికొనఁగ
నుఱికిన నోర్వక యుదరంబులోనున్న జగములవ్రేఁగున జగతి గదలఁ

జక్రంబుఁ జేపట్టి చనుదెంచు రయమునఁ బైనున్నపచ్చని పటముజాఱ
నమ్మితి నాలావు నగుఁబాటుసేయకు మన్నింపుమని క్రీడి మరలఁ దిగువఁ

గీ. గరికి లంఘించు సింహంబు కరణి మెఱసి, నేఁడు భీష్ముని జంపుదు నిన్నుఁగాతు
విడువు మర్జున యనుచు మద్విశిఖవృష్టిఁ, దెరలి చనుదెంచు దేవుండు దిక్కు నాకు.

భాగ. ౧ ౨౨౨

కుండలములకాంతి గగనభాగమెల్లఁ గప్పికొనుట, జగముల వ్రేఁగున జగతిగదలుట, పైనున్న పటము జాఱుట మొదలగునవి అంగవిక్షేపములవలనఁ బటాదిదృశ్యములవలన (సీనరీలవలనఁ) జూపవలయును గాని ఊరక మాటలతోఁ జెప్పివైచుట నాటకమునకు విరోధమైనపద్ధతి. అదిగాక కృష్ణుఁ డతివేగముగాఁ జక్రముపట్టుకొని మీఁదకువచ్చెను. అట్టిస్థితిలో నింత పెద్దపద్యము రాగవరుసగాఁ జదివి సమాప్తిచేయువఱకుఁ గృష్ణపాత్రధారుఁడు దుమదుమలాడుచు నుండవలసివచ్చును. ఇట్టిస్థలములందుఁ బద్యముచదివినను, సావకాశమైన మాటలు పలికినను అసహజమగుచున్నది. అప్పుడేమిచేయుటకు వీలులేని కృష్ణపాత్ర ఎంత అస్వాభావికముగనుండును? అట్లే ఒకనటుఁడు భావప్రకటనఁజేయు సమయమందే మఱికొందఱునటులు వారివారి చిత్తవృత్తులను బ్రకటింపవలసివచ్చుచుండును. అట్టిచోట్ల ప్రధాననటుని వారినుండి ప్రేక్షకుల దృష్టి చెదరుటవలన అస్వాభావికము కాక తప్పదు కదా. అందఱు నటులును వారివారి నటనలనుజేయవలయును. అట్లుచేయకుండుటయు అస్వాభావికమే. చేసినను లోపమే, చేయకుండినను లోపమే గలుగును. టాకీలలో భావప్రకటనఁజేయుచు పద్యమో, పాటయో పాడుచుండు నటకుని మఱుఁగుపఱచి అన్యనటుల లక్షణాదులను గనఁబఱచుచుండు నపు డిది అందఱికి స్పష్టముగా గోచరించుచునేయున్నది. అన్యనటు లట్టి సమయములందు మొద్దులవలెనుండుటయు అస్వాభావికమే యగును. అన్నిటికన్నఁ బాటలోని పల్లవి మఱియు నస్వాభావికమైనది. పదేపదే పల్లవి పాడుచుందురు. అది అన్వయము లేకయుండుననియుఁ గేవలశ్రవణానందదాయకమేయనియు నందఱికి విశదమేకదా. కావుననే హిందీ టాకీలు మొదలగువానిలో సంగీతమునకుఁ బ్రాధాన్యమీయలేదు. కథకు సంబంధము లేనిస్థలములందు లేక అంతగాఁ బ్రయోజనము లేని స్థలములందు సంగీతము నుపయోగించుచున్నారు. మనవారును ఆపద్ధతినే

అవలంభించుచున్నారు. పద్యములుగూడ నుచితస్థానములందే యుండ వలయుననియు నాపద్యములైనను వచనరూపముననే యుండవలయు ననియుఁ గొద్దిమంది చెప్పుచున్నారు. ఇదిగూడ అసందర్భమనియుఁ గేవల వచనముననే నాటకముండవలయుననియుఁ జెప్పుచున్నారు. వచనము గూడ కొన్నిచోట్ల పనికిరాదనియుఁ, బ్రత్యక్షముగా నేతద్విషయమును బ్రదర్శించుటయే నాటకలక్షణమనియుఁ దలంచి గ్రుద్దుకొనుట, చంపుట, చచ్చుట, ఏడ్చుట మొదలగునవి గావించుచున్నారు.

పైని వ్రాసినవి అనుసరించుచున్నవి, అనుసరింపవలసినవి, అను సరింప సాధ్యముకానివగు విషయములన్నియుఁ బ్రయత్నించి కృత కృత్యులగుదుము అని తలంచుట వెఱ్ఱియూహయే యగును. ఒకవేళఁ బ్రయత్నించిన రసవిహీనమైన నాటకములు బయలుదేఱి అందువలనఁ బ్రేక్షకులకు విసుగు, రోఁత జనింపక తప్పదు.

స్త్రీలు నాటకరంగమునఁ బ్రవేశింపవచ్చునా అని ప్రశ్నవచ్చి నపుడు స్త్రీలు స్త్రీపాత్రలను, బురుషులు పురుషపాత్రలను ధరించిన సహజముగనుండి నాటకము రాణించుననియు, సహజమైన సిగ్గు నటీనట కుల కలవడును గాన నౌచిత్యశోభితమగుననియు నందువలన నాటకము రసవత్తరముగ నుండుననియు వచించియున్నారు. స్త్రీలు నాటకరంగ మునఁ బ్రవేశించిరి. సహజమైన సిగ్గునశించి ఆలింగనములు, చుంబన ములు రంగమందు సాగిపోవుచున్నవి. ఇప్పుడు వేఱొకవాదము బయలు దేరినది. అల్పుని అంగస్పర్శకు సమ్మతింపరు గావున ఉత్తమభావములు ప్రదర్శింపఁబడునని చెప్పుచున్నారు. కళోపాసనయను పేరుపెట్టి ఎట్టి నీచపుఁబనినైనను ధనమునకాశించిగాని, పేరు ప్రతిష్ఠగలుగునని గాని స్త్రీలాచరించుచున్నారు. శీలము సంరక్షించుకొనుట కీకళోపాసకురాం డ్రకు వీలుండదు. శరీరమును దాఁచుకొనువారి నెవరును బిలువరుగదా. అట్టివారు శోభించరు. వారికిఁ బలుకుబడిరాదు. కావున సినీమాలలో నెంతటి నీతిమాలినవి ప్రదర్శించుటకు స్త్రీలు ఒడంబడుచున్నారో అది ప్రపంచమెఱిఁగిన సత్యమైయున్నది. సంఘము నుద్ధరించుటకు సాంఘిక ములే ప్రదర్శింపఁబడవలెనని యనుచున్నారు కాని ఇదెంతయేని నసందర్భ మగుచున్నది. స్త్రీమోహమునఁ జెడుచున్నారు అనికాని, మద్యపాన

ష్యునఁ జెడుచున్నారు అనికాని బోధించుటకుఁ బ్రదర్శింపఁబడిన సాంఘిక దృశ్యములలోఁ జెడిపోవుటకు హేతువులైన స్త్రీమోహము, మద్యపానమే ప్రధానముగాఁ జూపింపఁబడుచున్నవి. అనఁగా వాటినిఁ బ్రోత్సహించుటకే అవి పర్యవసానమగుచున్నవి. కులటయొక్క వేషమును బ్రదర్శించు స్త్రీపాత్రధారిణియొక్క నటన మఱింతగాఁ గులటయొక్క వ్యాపారమును బ్రోత్సహించులాఁగుననే పర్యవసానమగుచున్నది. వక్షోజములను, నాభిని, తొడలను జూపుట, వికారశృంగారములు ప్రదర్శించుట, ఆలింగనములు చుంబనములు పరపురుషుడైన పురుషపాత్రతోఁ గావించుట వీటివలనఁ బ్రేక్షకులమనసులు చలించునేకాని అందువలన నీతిని గ్రహించెదరు అనునది ఆలోచనము లేనిమాట. ఒకవేళ స్వపురుషుఁడైనను ఇట్టివి గావింపరాదు కదా. ఏది ఇతరులుచూడరానిదో అది ప్రదర్శనముగావించి సంఘమున కుపకృతిగావించెదము అని తలంచుట తెలివితక్కువయే యగును. సంఘము బాగుపడుట కేది ప్రదర్శింపవచ్చునో, ఎట్టిది వ్రాయవలయునో అది చక్కఁగ విమర్శింపవలసియున్నది. భావప్రకటనమువలన, మాటలవలన, విషయమువలన ననేకవిధములుగా సాధింపవలసినవి గలవు. అవన్నియుఁ బ్రదర్శనము మూలముననే సాధించెదము అని తలంచుటచేతనే అస్వాభావికమైన ప్రదర్శనములు, నీతిబాహ్యప్రదర్శనములు, వాటికిఁ బ్రోత్సాహములు జరుగుచున్నవి. అందువలన నేఁటికళోపాసన అన్యమార్గమును బట్టుచున్నది. అన్నివిషయములు సహజస్వరూపమునఁ జూపుటకూడదు. చూపుటకు దానినిగూడ ననేకములుగలవు. ప్రేమప్రవాహమును సంపూర్ణముగఁ జూపించునట్టి ఏకాంతరంగమునందుఁగూడ కుచగ్రహణము, సంభోగము చూపించలేరుగదా. అట్లు చూపినపు డవి అస్వాభావికమే యగునుగాని స్వభావసిద్ధమెట్లగును. (దిగంబరసంఘములు ప్రబలిన నాఁ డొకవేళ స్వభావసిద్ధమగు నిట్టి శృంగారము ప్రదర్శనయోగ్యమగునేమొ!) అట్లే శోకము మొదలైనవిగూడ స్వభావసిద్ధమని ఇప్పటి నటీనటశిఖామణులు రంగమందు నిజముగా నేడ్చుచున్నారు. కాని అందువలన రసభంగ మగుచున్నది. పుత్త్రుఁడు చనిపోయినపుడుగాని, భర్త నిరాకరించినపుడుగాని, కులస్త్రీలు కష్టములఁ బాలగునపుడుగాని

ఏడ్చుట సహజమే. కాని నాటకములోఁ గేవలముగా నేడ్చినందునఁ బ్రేక్షకులమనసు కరఁగదు. పైఁగా విసుగుజనించును. ఆసందర్భము నంతయు వ్యక్తముచేయుచు పలికినమాటలయొక్క యొప్పునుబట్టియు, నటననుబట్టియుఁ బ్రేక్షకులు తన్మయతనొందెదరు. యథార్థమగునపుడు ప్రజలు శోకించెదరు. కాని నాటకప్రేక్షకులు కేవలముగా శోకించుటకు రారు. అది నాటకప్రయోజనముకాదు. శోకముతోఁ బాటువారికి సంతోషముగూడ మిళితమైయుండవలెను. అందువల్లనే మాటలు ముఖ్యముగా వచించి రసవంత మొనరింపవలయును. శకుంతల భర్తృగృహమునకుఁ బోవుసందర్భమున కాళిదాసిట్లు వ్రాసినాఁడు. శకుంతల వెడలిపోవునని కాశ్యపుఁ డిట్లు విచారించెను.

శ్లో. యాస్యత్యద్య శకుంతలేతిహృదయం సంస్పృష్టముత్కంఠయా
కంఠస్తంభితబాష్పవృత్తికలుషశ్చింతా జడందర్శనం,
వైక్లబ్యం మమ తావదీదృశమపిస్నేహా దరణ్యౌకసః,
పీడ్యంతే గృహిణః కథంను తనయావిశ్లేషదుఃఖైర్నవైః. శ. ౪ఽ ౬ఽ

కన్నుల నీరువచ్చుచున్నదని, దృష్టిమాంద్యమైనదని (నిర్వ్యాపారమైనదని), కంఠము కలుషితమైనదని (గద్గదస్వరమువచ్చినదని) కాశ్యపుఁడు నోట వచించినట్లుగా ఈశ్లోకమందుఁ గలదు. ఇది నటనమూలముననే చూపింపవలసియున్నను కాళిదాసు నోటఁ బలికించినాఁడు. నోట పలికించినచో ఆభావముతోఁబాటు (అనుభవదృశ్యముతోఁబాటు) సంతోషము మిళితమైయుండును. పాత్రలయొక్క బాహ్యప్రవర్తనమే కాక హృదయమందలి భావములనుగూడఁ జెప్పించిన నాటకము మిక్కిలి శోభించునని యెఱుంగవలయును. మఱియు నితర పాత్రలయొక్కయు, ప్రధానపాత్రయొక్కయు స్వభావములకు మెఱుఁగుపెట్టి నట్లొప్పియుండును. కావున స్వగతములు, జనాంతికములు అవశ్యముండవలయును. శ్లోకములు, పద్యములు అవశ్యముండవలయును. పూర్వకవులందఱు నిట్లే వ్రాసియున్నారు. నాటకము సహజముకాదని గ్రహింపవలసియున్నది. స్త్రీపాత్ర స్త్రీ, పురుషపాత్ర పురుషుఁడు ధరించినంతమాత్రమున సహజత్వము సిద్ధించుననుకొనుట వెఱ్ఱి.సాహసోదగ్రుఁడగు యుద్ధవీరుని వ్యాపారము, చక్రవర్తియొక్క మహావైభవోపేత సుకుమారసంచారములు, పరమ

పతివ్రతా సౌశీల్య నమ్రభావభక్తిప్రవర్తనయు, వారియొక్క శుభ సౌందర్యాదిలక్షణములు నటకులయందు సహజముగా వర్తించునను కొనుట వెఱ్ఱికాదా. సాంఘికనాటకములందుఁ గూడ నిట్టివా రుందురు గావున నాటకము సహజముకానేరదు. ఉత్తమస్థితియందున్న వాని అతి శయము అధమపరిస్థితియందున్న వాఁ డెట్లు చూపఁగలఁడు ఉత్తమస్థితి యందున్నను గూడ చూపలేఁడు. నాటకాదులు సహజము కానపుడు రస వంతమైన అస్వాభావిక విషయములను జేర్పవలసియేయున్నది. కావుననే పూజ్యులందు ఏకవచనప్రయోగమున్నను, సంబోధనలుండినను నాటక ములు హృదయాహ్లాదకరము లగుచున్నవి. పరిస్థితులనుబట్టి దీర్ఘమైన స్వగతములు, సంభాషణలు మొదలగునవి వ్రాయవచ్చును. ప్రదర్శింప వచ్చును. "మాయామేయజగంబె నిత్యమని" అనుపాదమును హరి శ్చంద్రలోనివి రెండు మూడు మాఱులు చదివినను అస్వాభావికము కాక మఱియు రసపోషకమగుచున్నది. అట్లే వచనమందుఁగూడ, పాటయొక్క పల్లవియు నట్లే. సంస్కృతశ్లోకములకుఁ బిమ్మట నపూర్వమైన యద్భుత మైన రసమును వెలువరించు పద్యములుగల్గిన దేశభాషలందుఁ దెనుఁగులెస్స అని ఖ్యాతినొందిన ఆంధ్రభాష పద్యములులేని నీరసపు నాటకముల కెట్లు సంతోషించునో కదా. వాడుకలోనున్న భాష మాత్రమే నాటకాదులందు వ్రాయుట అసమంజసము. భాషను జులు కనచేసినట్లగును. ఆంధ్రసాహిత్యముయొక్క ఘనతనుగూర్చి మన పూర్వులు చిరకాలము క్రిందటనే గుర్తించియున్నారు. అట్లే భారత దేశమందలి అన్యభాషాకోవిదులు గూడ గుర్తించియున్నారు. వీరంద ఱునుగూడ భారతదేశప్రధానభాషయగు సంస్కృతమున కుచితస్థాన మును స్థిరపఱచియే స్వదేశభాషలను వృద్ధినొందించియున్నారు. పూర్వులు సంస్కృతగ్రంథములను యథామాతృకగ భాషాంతరింపకుండ స్వేచ్ఛఁ గొని అందు స్వశక్తినిఁ జూపించియున్నారు. నేఁడ నేకులు యథామాతృ కగ భాషాంతరీకరించుటలో స్వశక్తినిఁ జూపించుచున్నారు. ఎందఱెంద ఱెన్నెన్నివిధముల భాషాంతరీకరించినను, సంస్కృతవాఙ్మయమున కున్న ఘనత, ప్రాముఖ్యత ఇంచుకంతయుఁ గొఱయగుటలేదు. ఎప్పుడును దాని ప్రాముఖ్యము నశించదు. అదిగాక వారందఱును సంస్కృతవాఙ్మయ

ప్రాముఖ్యమును మనస్సునందిడుకొనియే భాషాంతరీకరించియున్నారు. సంస్కృతభాషయందున్న ఘనత, పవిత్రత, ఏకీభావము నందఱు గుర్తింపవలసియున్నది. వేదశాస్త్రము లాభాషయందున్నవి. ఆసేతు హిమాచలపర్యంతము అనాదికాలమునుండి ఎట్టిమార్పులను ఆభాష పొందలేదు. ఏకరీతినున్నది. పర్వతములవ్యాప్తి, నదీప్రవాహములు భరతఖండ మొకేదేశమనియుఁ, బ్రజలందఱు భారతీయులనియు స్పష్టము చేయుచున్నది. కావుననే పర్వతనామములు, నదీనామములు అన్నియు సంస్కృతశబ్దములై యున్నవి. సంస్కృతశబ్దములు అన్ని దేశభాషలందు మిళితమైయున్నవి. ఇందున్న ప్రాముఖ్యతనుగుర్తించి దేశభాషలందవశ్యము సంస్కృతశబ్దములు వాడుకచేయవలసియున్నది. దేశకాలములను బట్టిమారిన ప్రభుత్వములు మాఱుచుండుననియు, స్వాతంత్ర్య పారతంత్ర్యములు ప్రతిదేశమునను గలుగుచుండుననియుఁ దెల్లమగుచున్నది. ఇందువలనఁ బ్రజలకుఁ గన్న దేశభాషలకే హెచ్చుఅపకారము జరుగుచున్నది. ఈసంగతి యందఱికిని విశదమైయున్నది. వ్యావహారికపదములనే వాడుకచేయవలయు ననుమూహ యిందువలన నపోహమగుచున్నది. కొన్నిచోట్ల భావార్థములు వ్రాసియుఁ, గొన్ని చోట్ల ఏయర్థమును వ్రాయకయుఁ, గొన్నిచోట్ల స్వభాషాపదములు తెలియకను అనేకమైన ఇంగ్లీషుపదములను మనవారు నేఁడు విరివిగ వాడుచున్నారు. ఈవ్యావహారికపదజాలమంతయు స్థిరస్థాయిగనుండి మన ముందుసంతతివారి కందఱకు నర్థమగునని తలంచు వారొక్కరు కూడ నుండరనునది స్పష్టమే. దేశభాషలకు ఇంగ్లీషుపదములు గావించుచున్నంత అపకారము మఱేదియుఁ గావించలేదనునదిగూడ యథార్థమే. కావున అన్యభాషాపదములను (అనఁగా సంస్కృతము తప్ప మిగిలిన స్వదేశవిదేశ భాషాపదము లెవ్వియును) ఉపయోగింపకుండ భాషను రచించవలసియున్నది. ఒకవేళ విధిలేక అట్టిపదములు వాడుకచేయవలసి వచ్చినట్టి పట్టులందు అచ్చటనే వాటియర్థములను స్వభాషయందు స్పష్టముచేయవలసియున్నది. (అర్థమువ్రాయ నవసరములేనివిగూడ అన్య భాషాపదములు కొన్నిగలవు.) భాషాపదములను వ్యర్థముచేయక వీలున్న పదజాలము నుపయోగింపవలసియున్నది. అట్లుపయోగింప నపు డాపద

జాలమంతయుం బొల్లుకావలసివచ్చును. తగినంత పదజ్ఞానము హృదయమందు లేనందున పండితుఁడు కాని కవి ఎంత శ్రమనొందినను, ఎన్ని నిఘంటువుల దగ్గఱనుంచుకొనినను, ఎన్ని నానార్థరత్నమాలలను త్రిప్పినను రసవత్తరమైన పద్యము రచింపనేరఁడు. పండితుఁడైన కవి సునాయాసముగ సహజముగ నొసర్పగలఁడు. పదజాల మెంత వశమందుండునో కవి అంతగారాణించును. విద్వజ్జనులు వానిపరిశ్రమనుగుర్తించి ఆనందించెదరు. కాళిదాస తిక్కనాది మహాకవులందఱు ననేకములైన పదములను వాడియున్నారు. వారి ప్రయోగమాధుర్యము ననేకులు గ్రోలుచు ఆనందమొందుచున్నారు "శోకరసము వర్ణించునపుడును రామభద్రునకు శ్లేషలు, సాంస్కృతిక దీర్ఘసమాసములు వీడరాని చీడలాయెఁగా అనియు, దశరథుఁడు నానార్థరత్నమాలను ఎదుటనుంచుకొని పుటలఁ ద్రిప్పుచు నేర్చినాఁడో యనునట్లు దరిద్రముపట్టిన శ్లేషాలంకారములు పెట్టి 'కానకకన్న సంతానంబు'...ఇత్యాదిరీతులఁ బ్రలాపించెననియు, నట్లే చంద్రమతియు దీర్ఘసమాసములో లోహితాస్యునిగూర్చి ఏడ్చినదిగావున నామె శ్వాసకోశములు ఘనములని యాశ్చర్యమయ్యెడిని" అనియు రెడ్డిగా రాక్షేపించియున్నారు. శోకములో శ్లేష ఉపయోగించిన దరిద్రమట, దీర్ఘసమాసము లుండరాదట. ఇది అసందర్భము. ఇంతకును రెడ్డిగారికి శ్లేష, దీర్ఘసమాసములుఁ జూచినపడదు. విద్వాంసులు కాని వారికి అర్థముకాదని తలంచి అనేకులు నేఁడిట్టి విపరీతాభిప్రాయమునే కల్గియున్నారు. అదిగాక కావ్యము సహజస్వభావమున నుండవలెనని యను కొన్నందునఁ గల్గినపెద్ద యిబ్బంది యిది. నాటకమందే సహజత్వము కుదురనపుడు కావ్యమందు సుతరాంకూడదు. ఇప్పటి వారి కనేకులకుఁ గావ్యదృష్టి, కావ్యప్రయోజనము తెలియదుకదా. హనుమంతుఁడు సీతాదేవిని లంకలోఁగాంచి ఆమెను బలుకరించిన విధము నిట్లుగా వాల్మీకి వ్రాసెను.

శ్లో. కానుపద్మపలాశాక్షీ క్లిష్టకౌశేయవాసినీ,
ద్రుమస్య శాఖామాలంబ్య తిష్ఠసిత్వమనిందితే. సుం. 33-3

(పద్మపత్రములవంటి నేత్రములుగలదానా! మాసినపట్టు చీరగలదానా! ఉత్తమురాలా! శింశుపావృక్షశాఖను బట్టుకొనియున్నావు నీవెవరు?

శ్లో. కిమర్థం తవనేత్రాభ్యాం వారిస్రవతి శోకజం,

పుండరీక పలాశాభ్యాం విప్రకీర్ణమివోదకమ్

(తామరపత్రములనుండి రాలుచుండు ఉదకమువలె ఆనందబాష్పములు విడుచుటకు తగిననేత్రములనుండి, యౌవనికులమును నాశముసేయుటకు, లేక, ఏమి మనసులోనుంచుకొని, దుఃఖించి కన్నీరు విడుచుచున్నావు.)

శ్లో. సురాణా మసురాణాం వా నాగగంధర్వ రక్షసాం,
యక్షాణాం కిన్నరాణాం వా కాత్వం భవసిశోభనే.
కాత్వం భవసి రుద్రాణాం మరతాంవా వరాననే,
వసూనాం వా వరారోహే దేవతా ప్రతిభాసి మే,
కిన్ను చంద్రమసా హీనా పతితా విబుధాలయాత్,
రోహిణీ జ్యోతిషాం శ్రేష్ఠా శ్రేష్ఠసర్వగుణాన్వితా,
కా త్వం భవసి కల్యాణి త్వ మనిందితలోచనే,
*కోపాద్వా యది వా మోహా ద్భర్తార మసితేక్షణే,
వసిష్ఠం కోపయిత్వా త్వం నాసి కల్యా ణ్యరుంధతీ,
కోను పుత్రః పితా భ్రాతా భర్తా వా తే సుమధ్యమే.
అస్మాల్లోకాదముం లోకం గతా త్వ మనుశోచసి.

(ఓసుందరాంగీ! సురలు, అసురులు, నాగులు, గంధర్వులు, రాక్షసులు, కిన్నరులలో నీవెవ్వరిదానవు. (౫) అందమగు ముఖముగల ఓఉత్తము రాలా! ఏకాదశరుద్రులు, సప్తమరుత్తులు, అష్టవసువులలో నీవెవ్వతెవు. నాకు దేవతా స్త్రీవలె నగపడుచున్నావు. (౬) రమ్యమగు నేత్రములు గలదానా! శోభనాంగీ! శ్రేష్ఠమైన ఉత్తమగుణములు గల నీవు చంద్రుని నెడఁబాసి, స్వర్గమునుండి భూలోకమునకువచ్చిన, కాంతిగల పదార్థము లలో శ్రేష్ఠమైన రోహిణీదేవతవా! నీవెవతెవు (౭, ౭౫) నల్లని కన్నులు గలదానా, కల్యాణీ? నీవు కోపముచేతనో మోహాముచేతనో వసిష్ఠ మహర్షితోఁ గోపముచేసికొని స్వర్గలోకమునుండి భూలోకమునకువచ్చి యుండు అరుంధతీ దేవివని తలంచెదను. (౮౫) సన్నినడుముగల

* వసిష్ఠు డీక లమున శ్రీరామాదులకుఁ బురోహితుఁడై యున్నాఁడు. ఆయి నను నక్షత్రరూపమున నాకాశమం దున్నట్లుగా నిచ్చట చెప్పఁబడినది. మనుష్యులు నిరంశజీవులు. ఒకేమాఱు రెండుదేహములు వీరికి లభ్యముకావు. దేవతాదులు సాంశ జీవులు. వారి కొకదేహమున్న వేఱొకదేహము కల్గును.

దానా! స్వర్గలోకమునుండి భూలోకమునకువచ్చి దుఃఖించుచుండు నీకు కొడుకెవఁడు, తండ్రియెవఁడు, తోడబుట్టిన వాఁడెవఁడు, మగఁడెవఁడు.)

శ్లో. రోదనా దతినిశ్వాసా ద్భూమిసంస్పర్శనాదపి,
న త్వాం దేవీమహం మన్యే రాజ్ఞస్సంజ్ఞావధారణాత్.
వ్యంజనాని చ తే యాని లక్షణాని చ లక్షయే,
మహిషీ భూమిపాలస్య రాజకన్యాసి మే మతా.

(దుఃఖించుచుండుటవల్లను, విశేషముగ శ్వాసము విడుచుచుండుటవల్లను, భూమినంటియుండుటవల్లను, రాజస్త్రీ లక్షణములు నీదేహమునం దగ పడుచుండుటవల్లను నిన్ను దేవతాస్త్రీగ భావించలేకున్నాఁడను. (౧౦౪) నీయవయవములను, వానిలోనుండు సాముద్రికశాస్త్రసమ్మతమైన శుభ రేఖలను, జూడఁగా నీవు రాచకన్యకవని రాజుయొక్క పట్టపుదేవివని నాకుఁ దోఁచుచున్నది.)

పద్మపత్రవిశాలాక్షీ = పద్మపత్రములవంటి నేత్రములుగలదానా అని హనుమంతుఁడు యథార్థముగ సంబోధించెనా? తామరపత్రముల నుండి రాలుచుండు ఉదకము అని ఉపమానముతెచ్చి శోకించుట కనర్హురాలవు అని ఇట్లు అలంకారయుక్తముగా హనుమంతుఁడు పలుకరించెనా! పూజ్యురాలగు సీతను శోభనే (సుందరాంగి) యని, వరాననే (అందమగు ముఖముగలదానా) యని, అనిందితలోచనే (రమ్యమగు నేత్రములుగలదానా) యని, అసితేక్షణే (నల్లని కన్నులుగలదానా) యని, అంతియకాక సుమధ్యమే (సన్నని నడుముగలదానా) యని ఇట్లుగా సంబోధించునా? చంద్రునినెడఁబాసి, స్వర్గమునుండి భూలోకమునకువచ్చిన కాంతిగల రోహిణీదేవతవా యని పలుకరించుట యథార్థమగునా? అదిగాక కోపముచేతనో, మోహముచేతనో వశిష్ఠునితోఁ గోపముఁ జేసుకొనివచ్చిన యరుంధతీదేవివని తలంచెదను అని పలుకుట కూడునా? అరుంధతీదేవియొక్క ఏకాంతవిషయముఁగూర్చి హనుమంతుఁ డట్లుగా పూజ్యురాలియెదుట పలికెనా? ఇన్ని అసహజమైన విషయములున్నను ఈభాగము మనోహరముగానుండి సీతాసౌందర్యము, సౌకుమార్యము, పాతివ్రత్యము, ఆమెయొక్క దుర్భరమైన శోకము, ఆశోకమును గనులార గాంచినందువల్లఁ గలిగిన హనుమంతుని సంతా

పము, పలుకరించుటయందలి వివేకము వ్యక్తమగుచున్నవి. సహజముగఁ గూడఁ గనఁబడుచున్నది కదా.

శ్లో. అస్యా దేవ్యా మనస్తస్మిం స్తస్య చాస్యాం ప్రతిష్ఠితమ్,
తేనేయం స చ ధర్మాత్మా ముహూర్తమపి జీవతి. సుం. ౧౫-౫౩

(ఈసీతమనసు రామునియందే లయించియున్నది. రామునిమనసు సీత యందేయున్నది. కనుకనే యీసీతయు, ధర్మాత్ముఁడగు శ్రీరాముఁడును జీవించియున్నారు అనఁగా వీరియన్యోన్యప్రీతియే 'సీత మనసు రాముని యందుండిపోవుట, రాముని మనసు సీత యందుండిపోవుటయే' ఉభయులు జీవించియుండుటకుఁ గారణమైనది.) అని హనుమంతుఁడు మనస్సులోఁ దలంచెను. ఇది సీతారాముల ప్రీతివిశేషమును వ్యక్తము చేయుచున్నది. ఈశ్లోకాభిప్రాయము యథార్థమగునా యని విచారించుట అరసికత యగునుగదా.

శ్లో. నిర్ధూతకేశీయువతీ ర్యథా మృదితవర్ణకా
నిష్పీత శుభదంతోష్ఠీ నఖై ర్దంతైశ్చ విక్షతా,
తథా లాంగూలహస్తైశ్చ చరణాభ్యాం చ మర్దితా
బభూవాశోకవనికా ప్రభగ్న వరపాదపా. సుం. ౧౪-౧౮, ౧౯

(చెదరిపోయిన వెండ్రుకలుగలదియు, నలిగిన చందనాది యనులేపనము గలదియు, బాగుగ నధరపానము సేయఁబడినందున దంతములవలె తెల్లగనుండు పెదవిగలదియు, నఖక్షతములు దంతక్షతములుగల యౌవనస్త్రీవలె, హనుమంతుని తోఁక చేతులు కాళ్లచే నలుపఁబడి విరిగిన వృక్షములుగల్గి అశోకవనము ప్రకాశించెను.)

సీతను బలుమాఱు లంకలో వెదకి వేసారియున్న హనుమంతుఁడు అశోకవనమునకుఁ బోవుసందర్భమున వాల్మీకి వనమును శృంగారనాయికతోఁ బోల్చివ్రాసెను. కావునఁ గావ్యదృష్టి నెఱుఁగవలసియున్నది. కావ్యములన్నియు నిట్టిదృష్టినే కల్గియున్నవి. పాత్రల సంభాషణలే కాకుండ వారివారి మనోగతాభిప్రాయములు, ఎట్లు ప్రవర్తించినదియు, నట్లే ప్రకృతివిశేషములు, అవెట్లుండినదియుఁ గవి కావ్యమందు వ్రాయవలసియున్నది. వసిష్ఠుఁ డిట్లు పలికెను. 'కైకేయి! రాముఁ డొకఁడే అడవిలో వసించవలయునని కోరితివి.

సదా అలంకారము చేసికొనుటకుఁ దగియుండు ఈసీత బాగుగ నలంకరించుకొని శ్రీరామునితోడ నడవిలో నుండవలయును. రథములతోను, వాహనములతోను, పరిచారకులతోను, వస్త్రములు, పదార్థములతోను సీత అడవికిఁ బోవలయును. ఈమె నారచీరలు ధరించి పోవలయునని నీవు వరముకోర లేదు.'

శ్లో. తస్మింస్తథాజల్పతి విప్రముఖ్యే సురా నృపస్యాప్రతిమప్రభావే
నైవస్మసీతా వినివృత్తభావా ప్రియస్య భర్తుః ప్రతికారకామా. అయో్యా. 3 ౭-3 ౭.

(బ్రాహ్మణులలో ముఖ్యుఁడును దశరథునికి ఆచార్యుఁడును అసమానమైన మహిమగలవాఁడును నగు వసిష్ఠుఁడు ఇటులచెప్పగా ప్రియుఁడగు భర్తతోడ అరణ్యావాసముసేయుటకుఁ గోరుచుండు సీత నారవస్త్రములు ధరించుటలోనే యిష్టముగలదియై యుండెను.) వాల్మీకినిఁగూర్చి బ్రహ్మ యిట్లు పలికెను.

శ్లో. రహస్యం చ ప్రకాశం చ యద్వృత్తం తస్య ధీమతః,
రామస్య సహ సౌమిత్రేః రాక్షసానాం చ సర్వశః.
వైదేహ్యాశ్చైవ యద్వృత్తం ప్రకాశం యది వా రహః,
తచ్చాప్యవిదితం సర్వం విదితం తే భవిష్యతి.
న తే వాగనృతా కావ్యే కాచిదత్ర భవిష్యతి,
కురు రామకథాం పుణ్యాం శ్లోకబద్ధాం మనోరమామ్. బాల. ౨ స. 3 3౪-3 ౫౪

(లక్ష్మణునితోఁ గూడియుండువాఁడును, బుద్ధిమంతుఁడును నగు రాముని యొక్కయు, రాక్షసులయొక్కయు, సీతయొక్కయు రహస్యముగను, ప్రకాశముగను నీకు తెలియకనుండు చరిత్రలు అన్నియు నీకు విశదమగును గాక! (3 3౪, 3 ౫౪) నీవు రచింపఁబోవు కావ్యములో నీవాక్కు కొంచెమైనను పూర్వోత్తరవిరుద్ధముగ నుండదు. పాపహరముగను, మనసుకు ఇంపుగను, శ్లోకబద్ధమైనదిగను నుండు రామకథను జేయుము.) అని పలికెను. కావ్యము వ్రాయుటయందుఁ గవి నిరంకుశుఁడని యెఱుంగవలయును. లోకహితము, రసవంతము నగునట్టి కావ్యమునుగవి ఎట్లువ్రాసినను వ్రాయవచ్చును. సంపూర్ణమైన హక్కు కవికిఁగలదు. కావున రెడ్డిగారు వ్రాసిన ఈక్రిందివాక్యములు సమంజసములు గానేరవు. "అలంకారములంగూర్చిన ముఖ్యపద్ధతు లెవ్వియన, అయ్యవి ప్రయత్నములేకయ

వచ్చినంత సహజముగ నుండుట. కథలోని స్త్రీపురుషులు మాటాడు నపుడు పాత్రోచితములైన కొన్నింటిమాత్ర ముపయోగించుట. కవియే వర్ణించునపు డొకింతయెక్కువగ నలంకారములు వాడినను దోషము లేదు. కాని భావములు మహోజ్జ్వలములుగ రేగునపుడు ప్రకృతము నందే యవధానము నింపుటమంచిది. అట్టి తరుణముల నలంకారములు సాధారణముగ నసంబద్ధప్రలాపముల" (౧౮) అని వ్రాసినది సమంజ సము గానేరదు. మఱియు రామాభ్యుదయములోని 'కానకకన్న సంతానంబు' అను పద్యముపైనను, హరిశ్చంద్రోపాఖ్యానములోని 'అకటా! చేరెఁడు నేలకుం దగఁడె' అను దీర్ఘసమాసభూయిష్ఠమైన పద్యముపైనను రెడ్డిగారు వ్రాసినది యుక్తముగాలేదు.

సీ. కానకకన్న సంతానంబుగావునఁగానకకన్న సంతానమయ్యె
నరయగోత్రనిధానమై తోఁచుఁగావున నరయగోత్రనిధాన మయ్యె నేఁడు
ద్విజకులాదరణ వర్ధిష్ణుండు గావున ద్విజకులాదరణ వర్ధిష్ణుఁడయ్యె
వివిధాగమాంత సంవేద్యుండుగావున వివిధాగమాంత సంవేద్యుఁడయ్యెఁ
తే. గటకటా! దాశరథి సముత్కట కరీంద్ర కటకలిత దాన ధారార్ద్ర కటకమార్గ
గామి యెట్లు చరించు నుత్కట కరీంద్ర కటకలిత దానధారార్ద్ర కటకతటుల.

లేకలేక కల్గిన సంతానము అయ్యో! అడవిపాలయినది కదా. వంశనిధానమై తోఁచు సంతానము అయ్యో! నేఁడు అడవిపాలయినది కదా. బ్రాహ్మణాదరణవలన వర్ధిల్లువాఁడు (రాముఁడు) వనముచేరి ద్విజ (పక్షి) కులాదరణవర్ధిష్ణుఁ డయ్యెనుగదా. సకలశాస్త్రకోవిదుఁడైన నా కొడుకు కొండలసమీపమున వర్తించువాఁడయ్యెను. కటకటా! దాశరథి (నాకొడుకు) పట్టపేనుఁగచే శోభించు రాజమార్గమున సంచరించు నా కొడుకు కోఁతులుసంచరించు కొండచఱియలలో నెట్లు సంచరింపగలఁడు. నాకొడుకు సద్గుణగరిష్ఠుఁడు కాఁబట్టియే అడవులఁ నిడుమలఁబడుటకుఁ బోయెను. దశరథుఁడు ప్రాణాధికుఁడైన కుమారునిఁగూర్చి ఇట్లుగా విచారించెను. విద్వాంసుల మెప్పు, బ్రాహ్మణాశీర్వాదముపొంది కుల శేఖరుఁ డనఁ బ్రసిద్ధినొంది ప్రజలకుఁ బ్రీతిపాత్రుఁడై విలసిల్లిన రాముఁడు,(తనకొడుకు) అడవికిఁ బోవలసివచ్చెనుగదా యని దశరథుఁడు విచారించెను. కవి శ్లేషపదములనుగూర్చి విద్వద్వినోద మొనగూర్చెను.

అడవికై (అందు మూలమున రాక్షసులను సంహరించుటకుఁగాను)కన్నట్టి సంతానముగాఁబట్టి కాననప్రవేశమునకే అయినది. గోత్రనిధానమై తోఁచుగావుననే (తండ్రిమాట చెల్లించుటకై రాజ్యముపీడి అడవికివెళ్లినందున) గోత్రనిధానమైనది నేఁడుకదా. బ్రాహ్మణాదరణచే వృద్ధినొందెను గావుననే మునివృత్తినొంది ద్విజకులాదరణ వర్ధిష్ణుఁడయ్యెను. వేదవేద్యుఁడు గావుననే సార్థకముగ నడవులందు సంచరించువాఁడే ఆయెను. మహావిభవాభిశోభితమగు రాజమార్గమునఁ బోవువాఁడగు రాముఁడు జన్మసార్థకమైన వానరనివాసభూతమైన కొండచఱియలను జేరెను. అయోధ్యావైభవము విడిచి ప్రసిద్ధికిఁగారణులైన వానరులుండు కొండచఱియలనుజేరెను. రాముఁడు రాజమార్గగామియగుటకు జన్మించలేదు. వానరసేవితుఁడై కొండచరియల సంచరించుటకే పుట్టెనుగదా. ఈసంగతి నెఱుఁగలేక కటకటా, నాకొడుకా, ఎట్లడవిలో సంచరించెదవు అని పుత్రవాత్సల్యమున దశరథుఁ డేడ్చెను. రసవత్తరమైన ఈపద్యము నుదాహరించి దశరథుఁడు ప్రలాపించెను అని రెడ్డిగారు వ్రాసిరి. రెడ్డిగారిట్లు ౧౭౭, ౧౭౮ పుటలందు ఇట్లు వ్రాసియున్నారు.

"స్వభావమును మఱపింపఁజేయునట్టిశిల్పము శిల్పముగాని యన్యము కృత్రిమము. ప్రకృతిననుసరింపనిచోఁ గళకు సత్యమురాదు. మఱి యనుసరించుటఁ దప్ప నింకే విశేషములేకున్న సత్యమున్నను సొగసుండదు. అనుసరించినట్టేపోవుచుఁ గ్రమక్రమముగ మీఱిమెఱయుట కళా సామ్రాజ్యము. ఒకానొకరుచెప్పినరీతి, ప్రకృతియాకారము. ఆయాకారమును చక్కఁగా నలంకరించి మెఱుఁగుపెట్టినరీతిని తగినవిషయముల సంగతిని బొదిగి సజీవమై లేచివచ్చునట్లుచేసిన నయ్యది కళ" అని వ్రాసిరి. ఇట్లు వ్రాసియు వారిందున్న యథార్థమును గుర్తించలేదు. హరిశ్చంద్రోపాఖ్యానములోనిది 'అకటా! చేరెఁడునేల కుందగఁడె' యనుపద్యము గూడ రసవంతమైనదే. కావ్యదృష్టి నెఱుఁగని వారికి యథార్థమవగాహన మగుట కష్టము. కవిత్వతత్త్వమునుగూర్చి ఇట్లు వ్రాసిన రెడ్డిగారు ఇంతతోవిరమించక 'కవిత దేశీయులనడవడిక సూచకము (౧౧౮) అని ఇట్లు వ్రాసిరి.

---

# కవిత్వతత్త్వవిచారవిమర్శనము.

## శ్రీయుత కట్టమంచి రామలింగారెడ్డిగారి పుస్తకవిమర్శనము.

### భారతదేశము—వైదికమతాచారములు.

శ్రీ రెడ్డిగా రిట్లు వ్రాసిరి. "పాశ్చాత్యులయొక్కయు హిందువులమగు మనయొక్కయు శృంగారవాక్యముల తారతమ్యవిమర్శనముచేఁ దేలినవి కవిత్వతత్త్వవిషయములే కావు. మఱి కాలదేశములచే సిద్ధాంతములైన జనుల జీవితములకును గృతులకును నిత్యసంయోగ ముండుట యింకను బ్రధానమైన యంశము. కావ్యములు ఊహామాత్రము లనుట గొంతవఱకుఁగాని సమగ్రముగ నిజముగాదు. ఎంత యూహింపఁజాలిన నేమి? మనచుట్టుఁ బట్టువారల భావముల గతులస్పర్శ యేమాత్రమును లేని యూహలఁజేయ మనకు సాధ్యమా? జనుల నావరించియుండు స్థితులు కొంతకుఁ గొంతయేని దప్పక కావ్యదర్పణమునఁ బ్రతిబింబింపకపోవు. కావ్యపరిశీలనము చక్కఁగఁ జేసితిమేని జనుల నడవడి, చరిత్రము, జీవించువిధములును బొత్తిగా గోచరింపకపోవు. ప్రబంధములయొక్క దౌర్భాగ్యము దేశదౌర్భాగ్యముయొక్క ప్రతిబింబము. నిష్కారణముగ భాషనుబట్టి పీడించిన పిశాచిగాదు" (౧౧౮, ౧౧౯) అని వ్రాసిరి. మహమ్మదీయపరాభూతమైన కాలము ప్రబంధకాలము గావునఁ దత్కర్తలు పందతనము గలిగి ప్రబంధములను బాడొనరించిరని రెడ్డిగారు వ్రాసిరి. అప్పటి మనపూర్వులు న్యాయవంతులనియు, గోవుపైనను గోమాంసముపైనను బ్రమాణముచేయవలసి వచ్చినందున న్యాయస్థానమునకుఁ బోయెడివారు కారనియు, మతమందు గొప్పయభిమానముఁగలవారనియు, స్వభార్యల యం దనురక్తిగలవారనియు, దేశము సుభిక్షమనియు, నొక్కొక్కపుడు ౫౦ కోట్లమంది ప్రజలీదేశమున సౌఖ్యవంతులై యున్నారనియుఁ జరిత్రకారులు వ్రాసియున్నారు. ఆసుశీల మిపుడు నశించుచున్న దిగదా. అప్పటి కాలములోఁబుట్టిన గ్రంథములేపాడుగ నున్నపుడు ఏవిధమునఁగూడ

నుత్సాహములేని నేటికాలపు గ్రంథము లంతకన్నఁ బాడుగానుండవల యును గదా. కాని రెడ్డిగారిందులకు వ్యత్యాసముగా వ్రాసిరి. దాని కర్థమేమియోకదా. నిజపరిస్థితులను బరికించివ్రాసితిమని వ్రాసినచరిత్ర కారుల వ్రాఁతలను నిర్లక్ష్యమొనరించి రెడ్డిగారిట్లాకవుల నాక్షేపించుట సమంజసమగునా. ఈవిషయమై రెడ్డిగారింకను నిట్లు వ్రాసిరి.

“హిందూదేశములోని కవులు స్వబుద్ధి నుపయోగింపక శాస్త్రములు, ప్రాచీనగ్రంథకర్తలు పోయినదారినే గొఱ్ఱెలమందవలెఁ బోయిన వారగుట వారి కావ్యములఁ బరిశోధించుటచే నాకాలమున దేశస్థితి జనులనడవడి ఇత్యాది చారిత్రకాంశములగుఱుతెఱుంగుట దుర్ఘట”మని యొకానొకరు నుడివిరి. ఇందు సత్యము లేకపోలేదు. కాని యీకవులు వర్ణించిన జాడలును తమకాలమునాఁటివారి జీవితముచే ఘనముగఁ గాకున్నను నల్పముగనైన నిర్ధారితములుగాన, వీనిచేఁ జరిత్రాంశములఁ గనుఁగొనవచ్చుననియు, భాషయొక్కయు దేశముయొక్కయు చరిత్రమును అన్యోన్యసామ్యముం దాల్చిన యవిగాని యేమాత్రము సంబంధములేనివగుట యశక్యమనియు, స్థిరీకరించుట యీదీర్ఘవ్యాఖ్యానము యొక్క ముఖ్యతాత్పర్యము. (౧౬౨) అనివ్రాసిరి. రెడ్డిగారు విశేషముగఁ బరికించి ప్రబంధకవులందుఁ బందతనము మొదలైనవి కలవని వ్రాసిరి. ఇట్టి విచారసమయమున ప్రబంధములతోఁబాటు దేశచరిత్రమును గొంచెమేనియు వారు విచారించలేదు. గుణగ్రహణపారీణులగు మనపూర్వులు దోషములను బేర్కొనరు. దోషములను గ్రహింపవలయునే కాని లోకమునకుఁ బేర్కొనరాదనియు, గుప్తముగావింపవలయు ననియు మనవారి యుపదేశము. గుణములను మాత్రమే పరులనుండి పరిగ్రహింపుఁడు అని మనవారి యుదారప్రార్థనము. దోషములు తనవిగాని, ఇతరులవిగాని బహిరంగపఱుపకుండుటయందు సంఘశ్రేయమున్నదనియు, నదియే సత్పురుషలక్షణమనియు మనవారిబోధనము. సాధ్యమగునంత వఱకు గోప్యముచేయుట మనవారిలక్షణము. కావుననే మనవారు నేఁటి వఱకు నీతిమంతులైయున్నారు పూర్వులందు గౌరవబుద్ధిగల్గియున్నారు. ఇతరదేశములందిది లేదు. లోకమునకు హానిరానివిధమున మాత్రమే కొన్నియెడల నార్యులు దోషములను బేర్కొనియున్నారు. ఆపేర్కొ

నుటయందు ధర్మనీతివర్తనములకుఁ బ్రాధాన్యమీయఁబడియున్నది. అనఁగా మాటలభేదముచే ధర్మనీతివర్తనమే చెప్పిరి అని యర్థము. ఏది వ్రాసినను, గావించినను మానవోద్ధరణరూపకముగ నిహపరశ్రేయస్సాధకముగ నుండవలయును. ఇందుకై వ్రాయఁబడినవి మనశాస్త్రములు. కావుననే ప్రాచీనకావ్యములు శాస్త్రముల ననుసరించియున్నవి. మన శాస్త్రములు, ప్రాచీనకావ్యములు మానవస్వభావమును వ్యక్తముచేసినవనియు, ప్రపంచక్షేమమునుగోరి వ్రాయఁబడినవనియుఁ గావున వాని ననుసరించుట, అనుసరించివ్రాయుట ముఖ్యమనియు మనవారు నిర్ణయించుకొనియున్నారు. ఇదితెలియక మనపూర్వులందును శాస్త్రములందు అవివేకముగ నిరసనభావముచూపువారికి యథార్థము గోచరముకాదు. మహమ్మదీయయుగములోని మనవా రన్నివిధముల మనకన్న మేలైన స్థితియందున్నవారు, దైవప్రతిఘటనచే నస్వతంత్రులైనారు అని చరిత్రకారులు వ్రాయఁగా రెడ్డిగారిట్లు వ్రాసిరి.

"ప్రబంధములకు దేశక్షయమునకుగల సంబంధము:—శ్రీకృష్ణదేవరాయలకాలములో విజయనగరమెంతో విఖ్యాతిఁగాంచియుండెను. రాయచూరు మహాయుద్ధమున హిందువులు మహమ్మదీయులనోడించి వారిరాజ్యములం బ్రవేశించి యడ్డులేనియధికారము వెలయించువారైరి. దేశమునఁ బౌరుషము దేదీప్యమానముగా నున్నందునఁ గావ్యముల యందును నది ప్రతిఫలింపకపోలేదు. రాయకృతమైన యాముక్తమాల్యద, మనుచరిత్ర, పారిజాతాపహరణము, కాళహస్తిమాహాత్మ్యము దీనియందెల్ల నవ్యతయనుగుణమున్నది. మఱియుఁ గొన్నికొన్ని భావములు కవి నిండుహృదయంబుతో వ్రాసియుండుటయుఁ దేటతెల్లంబ. తాళికోటయుద్ధమున హిందువులు పరాజితులైరి. మహమ్మదీయులు విజయనగరమును ధ్వంసముచేసి పాడుగోడలుతప్ప నింకెవ్వియు నందు నిల్వకపోయిన వెనుక దేశమున నరాచకము ప్రవర్తిల్లెను. చిల్లరపాళయగాండ్రు స్వతంత్రులైరి. విచ్ఛేదము దౌర్బల్యమునకు మూలముగదా! అంతటితో హిందువులు మఱలనైనఁ బగసాధించి నష్టమును బూరించికొందమను నాశను వదలుకొనిరేమో! ఇట్టి పశ్చాత్తాపకాలమున బుద్ధి యెట్లుపారును? హృదయ క్షే యానందము దొరుకునని వికసించును?

కావున నన్నిశక్తులుఁబోయి పండితులకు నేకశక్తియైన జ్ఞానశక్తిమాత్రము మిగిలెఁ గాఁబోలు! అసలు పూర్తిగానడుగంటని వసుచరిత్రకాలములో నున్నంతప్రజ్ఞయు, మగంటిమియు, తరువాతి నాళ్లవారమైన మనకు నందరానివైనందున నేమో, రసహీనములు, ఏకక్రమములు, అనవ్యములునైన కావ్యములు పుంఖానుపుంఖములుగ వెడలినవి. ఇవియులేక పోయియుండిన దేశము పరిపూర్ణాంధకారము పాలయియుండుఁగాన, నీమాత్రము వెలుతురైన నిలిపినందులకుఁ బండితులను బొళయగాం ద్రను మనము కొనియాడవలయు" (౭౮-౭౬) అనివ్రాసిరి. పదునాల్గవ పుటయందుఁగూడ నిదేయంశము వ్రాయుచు నాకాలమువారు కుక్షింభరులనియుఁ, బాండిత్యబలము విశేషముగనున్న ను పందతనమొకటి యెక్కువగా నాకవులయందున్న దనియు, ధైర్యముతోఁ దలయెత్తికొని మనుష్యులలో మనుష్యులుగాఁ దిరుగుటకుఁ దగినయుత్సాహ మంతగా వారియందుఁ గాన్పింపదనియు వ్రాయుటయేగాక మనయొక్క రాజుల దినములలో నైతమలవడనంత విన్యాసము నేఁడు కలదనివ్రాసిరి. నేఁడు మనమే విషయములో బాగున్నాము. ప్రపంచమంతటిలోన మనమే హెచ్చు దైన్యస్థితియందున్నాము. మహమ్మదీయకాలములోని మనపూర్వులే ఘనతవహించియున్నారు. అట్టిస్థితిలో మన రాజులకాలమువారివిషయమై చెప్పవలయునా. ఆప్రశస్తకాలముకన్న నేఁడుబాగున్నదని వ్రాయుటకన్న నన్యాయ మింకొకటికలదా. వృత్తులునశించుటకు, మతమందవిశ్వాసముదయించుటకు, అన్నివిధముల మనము చెడిపోవుచుండుటకుఁ గారణము పాశ్చాత్యవ్యామోహమని మనవారేకాక పాశ్చాత్యులుఁ గూడ చెప్పుచున్నారు. విషయమిట్లుండఁగా దేశచరిత్రమును గమనింపక లేక అలక్ష్యమొనరించి, నేఁటి మనస్థితికివగవక నేఁటిపరిపాలనావిధానమును బొగడుచు సకలానర్థదాయకమైన పాశ్చాత్యవ్యామోహము ననుసరించి పాశ్చాత్యులను బొగడుచు మనరాజుల దినములనుండియుఁ గూడ నున్న ఆచారములను, గవులను, మనపూర్వులను నిందించుచు రెడ్డిగా రిట్లు వ్రాసిరి.

"ఐరోపావారు శృంగారవర్ణన మెంతో దివ్యముగఁ జేసియున్నారు. వారు రాజసతేజులు. మనలో నాలుకంబట్టినది సత్త్వగుణము. మనసుం

బట్టినది తమోగుణము. పాశ్చాత్యుల శృంగారవర్ణనము:—వారి యొక్కయు మనయొక్కయు శృంగారమునకు ముఖ్యతారతమ్యము లేవనఁగా: మనవలె వారంగవర్ణన మంతగాఁజేయరు. చేసినను మొగము కన్నులు మొదలగు బాహిరభాగముల మాత్రము ప్రశంసింతురు. మనలో నఖశిఖాపర్యంతము విప్పివిప్పిచూపుట యందఱు నాశ్రయించిన కావ్యలక్షణము. పడకటింటిలోనికివెళ్లిన వెనుకఁగూడ చెలికత్తె లామెను వదలినను వదలుదురుగాని కవి యేమో యొకనిముసమైనవదలఁడు. ఱెప్ప వేయక యట్లే చూచుచుండును. రవిగాననిచోఁ గవిగాంచుట, మనలోని ముఖ్యసంప్రదాయము. వేదాంతవిద్యాదీప్తిమంతమైన యీపుణ్యభూమిలో నీరుచి ముదిరియుండుటకుఁ గారణమేమన, స్త్రీలను జాగ్రత్తగ మఱుఁగుననుంచుటయే! శీలరక్షణార్థము చేయఁబడినయేర్పాటే యశ్లీలములకెల్ల మూలము! ఎట్లన, నివారింపఁబడిన దానికుండు చవి యనివారితములకుండదు. చూడవలదన్న నేగదా యన్నింటికైన నందము! సమ్మోహనాస్త్రమన్ననిదే! వలదనియడ్డగించితిమేని దానియందలివలపు అనర్గళమగును. దమమునుజెఱుచునది నిర్బంధము. నిలుపునది స్వాతంత్ర్యము. అతిరహస్యము బట్టబయలు, అన్నట్లు ఎయ్యదిగుప్తమో దానియందే యందఱకు దృష్టి. ఇంకను బరిష్కారముగ సాంగోపాంగముగ విమర్శించి చూతమను కుతూహలము సహజము. మనదేశములో నెవతెయైన నొకస్త్రీ నాగరికతగలయది వీథిలోఁబోవునేని, ఆయూరివారికన్నులన్నియు బిఱ్ఱబిగిసి యామెపైఁబడు మీకుఁదెలియదా? ఈమర్యాదలేమికేమి కారణమో పచ్చిపచ్చివిశదవర్ణనలకును నదియె కారణము. చూపునకుండు తహతహను దెరలచే నాఁపవచ్చును. మనోదృష్టి మేరమీఱి చూడఁ బ్రయత్నించిన నివారకసాధనమేమి? సౌమనస్యము. అది మనవారిలో నింకను దగినంత వృద్ధికిరామి తెల్లంబు.

అంగములవర్ణించునపుడును, ఐరోపాలోని కవులు ఆయంగములేరీతిభావమును బ్రదర్శించుననుటఁ జూపుదు రేకాని, భావస్థగితంబులుగాని యవి యసంభావ్యములని వానిమాటఁ దలపెట్టరు. భావములను వెలువరించుట ముఖనేత్రాదులకుఁగల చక్కందనమున కాదిమమైనట్టియు హృద్యమైనట్టియు లక్షణము. వీనిలోఁ గొన్నింటిమాత్ర మనుభావము

లను పేర మనశాస్త్రకారులుగణించి, వారాంగనల యభినయమురీతి, శిక్ష మేరకు నడుపఁబడు త్రిప్పుటలలోఁజేర్చిరిగాని, మొత్తముమీఁద నంగ వర్ణనమును మనసుతోఁ గలసినట్లుచేయుశక్తి, యీయాధ్యాత్మికదేశములో బ్రుంగుడువోయి యెన్నోశతాబ్దములైనవి.

స్త్రీలగుణగణములను శ్లాఘనతో వర్ణించుట పాశ్చాత్యులలోని సదాచారము. ఏలన, గుణములగణింపక యాకారమును మాత్రము చూచి వలపుగొనుట యాజనములలో నభావ్యము. స్త్రీపురుషులు ధారాళముగ నొండొరులతోఁ గలసిమెలసియుందురు; కాన, రూపమునకుఁ దళుకుతక్కువ. ఇఁక వలపుజనింపవలయునన్న నడవడి, చరిత్రము, చదువు, సద్గుణములు, కీర్తికరములగు కార్యములయం దాసక్తి మొదలగు నాత్మసంబంధములైన యోగ్యత లావశ్యకములు. కావున నాయికానాయకులకు నివి యుద్దీపనవిభావములగుట వీనిని వర్ణించుట శృంగార కావ్యములలో ముఖ్యము.

మనవారిలో స్త్రీలకు మనోవికాసములేని గతిపట్టినది. కావున రూపమొక్కటియె మోహమున కాలంబనము. పశుప్రాయకృత్యమే కామితార్థము. దీనికిందగిన వర్ణనలమాట చెప్పవలయునా ? అపారములు.

పురుషులు గడింపనెంచు సాహసోద్యములలో సైతము స్త్రీలు తోడుపడఁగలవారని పాశ్చాత్యులనమ్మిక. ప్రకృతిశాస్త్రములు, తత్త్వములు మొదలగువిద్యలఁ గృషిచేయుటయందును భార్యలు భర్తలతో సంగమింతురు. వారు సహాధ్యాయులైన స్నేహితులట్లు నానావాంఛితంబుల సఫలముఁజేయఁ జూచుచుందురుగాన, శృంగారకావ్యములు శుక్రాచార్యుల రీతిని ఒంటికంటితో నొకేస్థలముననే తిక్కెత్తినట్లు చూచుచుండునవి గావు.

హిందువులలో స్త్రీలకుండుస్థితిని నేనేల వివరింప ? వంటిల్లు పడకటిల్లు ఈరెంటికి వెలియైన నెందులకుం బనికిరారు ! పురుషులకు వారికిని దేహసాంగత్యమే కాని మనస్సాంగత్య మెక్కడిది ? వారుచేరి మాట్లాడుట యరుదు. మాట్లాడవలయునని నవీననాగరికులు పంతమువట్టినను అన్నవస్త్రవిహారాదిసరసములు దప్ప నింకేపలుకులకు వీలులేదు ! కావుననే కావ్యకన్యకలు సంభోగవిషయములం దప్ప నింకే ప్రపంచముఁ దెలియ

నట్టివారుగా నుండుట. రాజకన్యలు గావున పాపము వంటపనియుందెలియదు. మఱితెలిసిన దొక్కటే! ఈదేశములోని స్త్రీలు విషయ వాంఛాపూర్తికి ననుకూలములయిన పాత్రములుగఁ జూడఁబడుచున్నారే కాని, పురుషులతో సమానముగ నన్ని విధముల వెలయుశక్తిగల వారుగాఁ జూడఁబడుటలేదు. ఇప్పటి వారిస్థితిలో నట్లుచూచుటకును గాదు. బ్రిటిషువారి ప్రోత్సాహము సౌరాజ్యము వీనిచే నీకముందు బాగుపడుదురేమో కాని, యాయౌన్నత్యము వారధిష్ఠించువఱకు జీవించియుండి సుఖించుటకు నావంటివారు మార్కండేయులుగారు! (గాంధీమహాత్ముని ప్రభావముచే నీపరిణామము ఇటీవల సృష్టికివచ్చినది. ఇందునకు దేశసేవిక లొకదృష్టాంతరము.)

కామమనునది పురోభివృద్ధిహేతువని యూరోపియనుల భావన. ఎట్లన, వరించుస్వాతంత్ర్యముండఁబట్టి యేదే నొకహృదయాకర్షకమగు విశేషముగలిగియో నేర్చియో యున్నంగాని యేకాకులుగా జీవనము గడుపవలసినదే. కాఁబట్టి స్త్రీల మెప్పుకొఱకై యెల్లరుశ్రమకోర్చి శక్త్యనుసారము గొప్పతనము నందఁజూతురు. మఱియు, స్త్రీలును దెలివితేటలఁ దేఱినవారుగాన నట్టివారి సావాసము శ్రేయోహేతువు. ఒకానొక కవి యాదేశించినరీతి శూరునిలక్షణ మేమనఁగా,

తే. ఒక్కకాంతనుగోరి మహోద్యమములఁ, బూని సాధించుటలచేతఁ బూజనేసి
రాజ్యమును దైవమును భార్యరాగమడరఁ, బ్రీతులంజేయుఁటయకాని వేఱుగాదు.
(టేనిసన్)

అట్లగుట స్త్రీలమీఁది మోహము వీరకృత్యములకుఁ బ్రేరేపకము. అభ్యుదయకారకము. హిందూదేశములో స్త్రీలు అధఃపతితలై యున్నందున వారివెంటంబోవుట పాతాళయాత్ర. మఱి వెంటంబోకున్నఁ దీఱదుగనుక, వారిని విద్య, స్వాతంత్ర్యము మొదలగు దానంబులచేత, నుత్తమపదవికిం దెచ్చిననేకాని యీదేశ మెన్నటికి శుభములకుఁ బాత్రంబుగాదు. ఇపుడు వేయిసంవత్సరములుగ మనదేశములలో నుత్పన్నములగు గ్రంథములలో స్త్రీలు గొప్పదశకుఁ బురికొల్పువారనుమాట తుట్రాగా లేదుగదా? ప్రబంధములలోని నాయికలు. నామీఁదవచ్చిపడు, మనుటదప్ప నింకే యశస్కరములగు పాటులకైన నాయకులఁ బురికొల్పుట

చూచినారా? ఇది శుద్ధపశుప్రాయమైన కేళి. దీనిఁ గామ మనరాదు. అన్నచోఁ బురుషార్థమును సూచించు నాపదము చెడును! కాముకులు గర్హణీయులనియు నికర్ష హేతువులనియు విరక్తివ్యాఖ్యానము లెన్ని యో యున్నవి. తొలుత మగవారు మగతనము గోలుపోవుటచేఁగదా యాఁడువా రీపాడుస్థితికివచ్చిరనుట మఱచి తమదోషములచేఁ దప్పులై, కీడ్వడిన వారిని, దామే దూషించుటంజూడ, మనవారు మనుష్యులా కారా యను సంకోచము రాకమానునా? ఇఁకనైన వారిని మీఁదికిఁ దేవలయునన్న ప్రోత్సాహవాక్యములచే ధైర్యవతులం జేయవలయునే కాని తిట్లచే వారు ముందుకు రాఁజాలుదురా? (౧౧౦—౧౧౪) అనివ్రాసిరి.

సాంగోపాంగవర్ణనముఁ గావించుట దోషముగా నేరదు. బాహిర భాగములను మాత్రము పాశ్చాత్యులువర్ణింతురని రెడ్డిగారు వ్రాసిరి. అదిమాత్ర మెందులకుఁ జేయవలయును. కవియుఁ, గవితోఁబాటు ప్రజలు వాటినిఁ బరికించెదరా. రెడ్డిగారభిప్రాయ మేమియో కదా. సకలానుభవ పూర్వకభావనాశక్తి ప్రాధాన్యులైన రెడ్డిగారు అంగవర్ణనముతోఁ గవి కేమిప్రయోజనమని తలంచిరోకదా. కామియైనవాఁడు బాహిరఅంగములను మాత్రమే పరికించునా. అదిగాక నేఁటి స్త్రీలదుస్తులనుబట్టి బాహిర అంగములు రహస్యాంగముల నెట్లుగా రెడ్డిగారు విభాగింతురో కదా. రసభంగము కానియెడలఁ గవి యెట్లువర్ణించినను వర్ణింపవచ్చును.

పడకటింటికి వెళ్లినవెనుక చెలికత్తెలు రాణిని విడిచివచ్చెదరు కాని కవిమాత్రము విడిచివెళ్లడని వారా క్షేపించిరి. ఇట్లా క్షేపించుటకుఁ గారణము అది రహస్యమనియు, రహస్యాంగములనియు. భాగవతమందు గోపికావస్త్రాపహరణము, గోపికాశృంగారము వర్ణింపఁబడినది. ఆభాగము అశ్లీలమని యెవరైనవందురా. రెడ్డిగారుమాత్రము 'అశ్లీషము మనసదాచారములలో నొకటి.' (౧౨౦) అని వ్రాసిరి. సమయ ముచితమైనపుడు రసభంగము కానపుడు కవు లెట్లయినను వ్రాయుదురు. కావుననే వారు నిరంకుశులు. రవిగాంచనివిషయములు చూపువారు.

స్త్రీలను మఱుఁగున నుంచినందున మనదేశము, సంఘము, కావ్యములుపాడైనవని రెడ్డిగారు వ్రాసిరి. ఇట్లు తలంచినవారు చరిత్రజ్ఞానము లేనివారే యని స్పష్టముగాఁ జెప్పవచ్చును. నాగరికతఁగలయది వీథిలోఁ

బోవుచో మనవారామెను మర్యాదలేక చూచెదరనియు నీమర్యాద లేమికిఁ గారణము స్త్రీనిరోధమనియు వారు వ్రాసిరి. నిబంధనను విడిచివచ్చి నందునఁ జూచెదరనియా లేక కామాంధులై బిట్టబిగిసిచూచెదరనియా, రెడ్డిగా రేమనితలంచిరోకదా. భారతీయులు తుచ్ఛమైన కామాంధ కారముగలవారని వారు తలంచిరి కాఁబోలును. మనదేశములో నాగర కతగలస్త్రీనిఁ బరికించెదరని వారు వ్రాసిరి. కాని పాశ్చాత్యదేశములందు సంచరించియు అచ్చటిపరిస్థితిని గ్రహింపలేకపోయిరి కదా. సినీమాల లోను, బహిరంగప్రదర్శనములలోను నగుచున్న అల్లరులనావుటకై ఆదేశము లతితీక్ష్ణముగ నాలోచించి రాజకీయముగాఁ జట్టములుగావించు చున్నవి. ఈమర్యాదలేమి కేమికారణమో వారు మనస్సులోనైన నూహించిరో లేదోకదా. మనలో నాలుకంబట్టినది సత్వగుణము, మనసుం బట్టినది తమోగుణమని వారాక్షేపించిరి. ఇప్పుడట్లే కొందఱున్నారు కదా. పాశ్చాత్యులకు అన్నిటఁ దమోగుణమే. వారి సహవాసమున నెంతచెడిపోయియున్నను వారిస్థితికి మనవారు రాలేదు. అట్లు చెడకుండు టకుఁ గారణము మనపూర్వులేర్పఱచిన నిబంధనలేయని గ్రహింపవల యును. మనస్త్రీలకు మఱుఁగునున్నందున మనోవికాసముఁ లేనిగతి పట్టెన దన్నారు రెడ్డిగారు. విషయపరిశీలన లేనివారందఱు నిట్లే తలంచు చున్నారు. పాశ్చాత్యదేశములలో స్త్రీపురుషులు కలసిమెలసియుండుట వలన ననేకములైనయిబ్బందులు గలుగుచున్నవి. స్త్రీకి సహజముగనుండ వలసినసిగ్గు నశించినది. అందువలన ననేకములైన అశ్లీలములు బహిరంగ ముగఁ జరుగుచున్నవి. ముద్దులపోటీలు, సౌందర్యమునకుఁ బోటీలు జరుగుచున్నవి వీనికి అచ్చటిపాలకులు అనుమతినిచ్చుచున్నారు. సంఘ దృష్టిలేని స్వేచ్ఛాసంబంధములు మితిమీఱినవి. కడకుఁ గొన్నిదేశము లలో నిందుకై సంతలుగూడ జరుగుచున్నవి. సంతలో సంబంధము గుదుర్చుకొనుట పశుప్రాయకృత్యముకాదా. ఇట్టిసంతలు జరుగుటకుఁ గూడ అచ్చటి పాలకు లనుమతినిచ్చుచున్నారు. ఇదంతయు స్త్రీస్వాతం త్ర్యము పెచ్చుపెఱిగినందునఁ గలిగిన విషమపరిస్థితియే అవినీతియే. స్త్రీపురుషులు కలసిమెలసితిరిగిన విజ్ఞానమభివృద్ధియై దేశము రాణించునని రెడ్డిగారి యభిప్రాయము. ఇట్టియభిప్రాయమే నేఁడు కొందఱికిఁగలదు.

అది ఘోరపాటనియు, మీఁదుమిక్కిలి దేశక్షోభగలిగించుననియుఁ బాశ్చాత్యదేశములు బుజువుఁజేయుచున్నవి. స్త్రీకి సహజముగ నుండవలసిన సుగుణము లిందువలన నచ్చట నశించుచున్నవి.మాతృభావము వహించుట పురోభివృద్ధికి ఆటంకమనియు, దేహసౌందర్యము నశించుననియు విద్యాధికుల మనుకొను నచ్చటిస్త్రీలు సంతాననిరోధము గావించుచున్నారు. ఇందువలనఁ గడకు కొన్ని దేశములలో డబ్బునిచ్చి పిల్లలఁ గనిపించవలసిన పరిస్థితి యేర్పడియున్నది. మనసున కేమాత్ర మిష్టములేకుండినను పురుషులను వారువిడిచెదరు. వారికించుకంతయు జంకుగొంకులేదు. స్వల్పవిషయములకుఁగూడ కడకు విషయమక్కఱలేకనే విడాకులు అచ్చట ప్రబలఁ జొచ్చినవి. పరస్పరము ప్రేమించి సంబంధమేర్పఱచుకొనునట్టి సంబంధములు నిలుచుటలేదు. ఆస్తులువేఱగుటను, ఉద్యోగములు వేఱగుటను, గుటుంబభారము లేనందునను నచ్చటి స్త్రీపురుషులు విషయవాంఛాపూర్తికిమాత్రమే అన్యోన్య మాశ్రయించుకొనుచున్నారు. ఐశ్వర్యములు హెచ్చుటవలనఁగాని, పదవులు హెచ్చుటవలనఁగాని, అయిష్టతవలనఁగాని, బదలాయింపులవలనఁగాని, అదివఱకున్న సంబంధములు విడిచి నూతన నూతనప్రియు లగుచున్నారు. దేహసాంగత్యమే సముగాలేనపుడు వారికి మనస్సాంగత్య మెక్కడిది. కడకు పురుషుల నెందుకు వివాహమాడవలయును. అని అచ్చటిస్త్రీలు నేఁడుచెప్పుచున్నారు. పశుప్రాయకృత్యమే వారికి కామితార్థమయినది కదా. దిగంబరసంఘములచ్చట ప్రబలఁజొచ్చినవి. ఈవిషమసంఘటనమునకు సహింపలేక ఈవిడాకులచట్టమువలదని, సంతాననిరోధముకూడదని, స్త్రీలు బహిరంగముగఁ దిరుగరాదని, స్త్రీపురుషప్రకృతులు భిన్నములని, స్త్రీలుగృహమందే యుండి గృహకృత్యములు జరిగించవలయునని పాశ్చాత్యదేశములవారే చెప్పుచున్నారు. కొన్ని దేశములు మితిమీఱిన స్త్రీస్వాతంత్ర్యమును అరికట్టుచున్నవి. పాశ్చాత్యదేశము లిట్లు చెడుచుండుటను జూచియు రెడ్డిగారు యథార్థమును గుర్తించలేదు. పాశ్చాత్యవ్యామోహ మంకురించినందున మన పూర్వనిబంధనలు వారి కర్థముకాలేదు. కావ్యకన్యకలు సంభోగవిషయములందప్ప నింకేప్రపంచము దెలియనట్టివారఁట, 'నామీఁదవచ్చిపడు' అని పలికెదరట. కావ్యకన్యకలు చక్కనినడవడి, చరి

త్రము, చదువు, సద్గుణములు, కీర్తికరములగు కార్యములం దాసక్తి గల్గియున్నారన్న సంగతి రెడ్డిగారు గ్రహించలేదు. నిరసనమే ప్రధానముగాఁ గల్గినవారికి యథార్థము అగోచరమగునేమొ. స్త్రీపురుషప్రేమ లజ్జాయుక్తమైనదని మనవారు చెప్పియున్నారు. లజ్జాశూన్యమైనందుననే ఆదేశములు సంకటపడుచున్నవి. స్త్రీలమీఁదమోహము పాశ్చాత్యదేశములలో వీరకృత్యములకుఁ బ్రేరేపకమని రెడ్డిగారు వ్రాసిరి. అట్లుండవచ్చును. కుట్రలు, హత్యలు, దుర్వినియోగములు, వంచనలు, బలాత్కారములు, వేఁడుకొనుటలు అనేకమైన రాజకీయతంత్రములవంటివి ఉండినఁగాని స్త్రీలువారికిఁ జిక్కరు. మనదేశపుపద్ధతి యదిగాదు. మోహవంతులకు సిగ్గు స్వభావముగ నుండును. శృంగారనైషధములో నిట్లు చెప్పఁబడియున్నది.

సీ. జాగరోద్భూత దృగ్రాగంబుమాణిక్య కర్ణకుండలదీప్తిఁ గప్పిపుచ్చు
రాజకార్యపరంపరాఖేదమిషమున నిట్టూర్పుగాడ్పుల నిహ్నవించు
ఘనసార బహుళచందనవిలేపనమున నాపాండుభావంబు నపలపించు
దోరంతరన్యస్తతారహారంబుల నంతఃపరీతాపమపనయించు
గీ. మాననీయ శశాంకకోమలములైన, యామినీ సమయములు బర్యంకములును
సాత్త్వికులుగనొంచువలవంత జనవిభుండు, కన్నెకూర్మి ప్రకాశంబుఁ గాకయుండ.

నలుఁడు స్వతంత్రుఁడు, మగవాఁడు, భూమండలమంతయుఁ దనమాటయే శాసనముగఁ గలవాఁడు. అయినను సిగ్గుఁగొనియెను. ఈసిగ్గు లేనందుననే పాశ్చాత్యదేశములు నిజముగఁ బాడగుచున్నవి. అవినీతి బహిరంగపఱచుటకుఁగాని, అవినీతిప్రసంగములుఁ జేయుటకుఁగాని సంకోచము వారికిలేదు రూపమొక్కటియే మనవారికి మోహమున కాలంబనమని రెడ్డిగారు వ్రాసిరి. స్వయంవరాదులందుఁగూడఁ ఎన్నివిషయములోఁ దెలిసినఁగాని పురుషునిమెడలో స్త్రీలు పూలమాలవేయలేదు. ప్రబంధములు, పూర్వకావ్యములు చదివియున్నను రెడ్డిగారి కిది తెలియలేదు. మనస్త్రీలకు రూపముకూడ మోహమున కాలంబనముగాదు. తలిదండ్రులయేర్పాటే దాంపత్యమూలము. ఈవిషయమునుగూర్చి రెడ్డిగారిట్లా క్షేపించిరి.

"మనలోఁ బెండ్లికి మనసునకును సంబంధములేదు. పరిణయము వ్యవహారములలో నొకటి. చిత్తజముగాదు. మఱి పితృపితామహాజము. మనసునునిరోధించి పీడించువర్గములలో ముఖ్యములు జాతిభేదములు. తమతమయుపశాఖలను మీఱి హృదయము వ్యాపింపఁగూడదఁట" దీని వలనఁ గలుగుఫల మేమనఁగా, అమనస్కవివాహములు. అనఁగా దేహ మొకచోట, చిత్తమింకొకచోట, మాటలిక్కడ, తలఁపులక్కడ, చిత్తము శివునిమీఁద, భక్తి రంకులాఁడిమీఁద!

అట్లగుట వధూవరసంగమము ఆచారానుసరణముగాఁ జేయఁ బడుకర్మము. ప్రాయికముగ కామితమనుటకల్ల. పెండ్లింబట్టి చిత్తవికృతి యను శృంగారభావమును, చట్టదిట్టముల ప్రకారము అలంకారాదిశాస్త్ర సూత్రముల యాదేశముచొప్పునఁ, బోవువినయమర్యాదలుగల మంచి వస్తువనియెంచిరో! సందేహమేల? యెంచిరి మనవారినమ్మిక మీఱెటుఁ గరా? కూఁతురా! ఫలానాపక్కీరుశాస్త్రి నీకు పురుషుఁడు. నేను నిర్ణ యించినాను. నగలతోడ నీమనస్సును మూటంగట్టి వానియింట్లో పదిల ముగానుంచి సుఖపడవలసినది. నామాటయిది ఇంక నీకేమి యీపనితోఁ బెత్తనము? చెప్పినట్లుచేయుమనియే గదా తలిదండ్రులసంభావన! పెండ్లిలో నన్నిమంత్రములుఁ దంత్రములు నుండును. ఒక్కటిదప్పు! ఎయ్యది? ఆత్మతంత్రము. వివాహము సంస్కారమఁట! హృదయబహి ష్కార మనఁగూడదేమో! (౨౧౩, ౨౧౪) అని వ్రాసిరి. జర్మనుదేశీ యుఁడు జర్మనుయువతినేగాని ఇతరస్త్రీనిఁ బెండ్లాడరాదని ఆదేశమం దొకనియమముగలిగినది. రెడ్డిగారిందువిషయమై యేమనెదరో. స్వతం త్రముగా వరించి సంబంధమేర్పఱచుకొనునవి చిరకాలము నిలుచుటలేద నియు, బాల్యమందుఁ గావించినవివాహములు అందు ముఖ్యముగాఁ దలి దండ్రులు గావించిన వివాహములు స్థిరముగ నుండుచున్నవనియుఁ బాశ్చాత్యులు నేఁడు కనుఁగొనుచున్నారు. మనలో వివాహమన్నది తలిదండ్రులుచేయునట్టి యేర్పాటైయున్నది. నీకు వీఁడు భర్తఅని తలి దండ్రులు నిర్ణయించినవానియందు భక్తిగలిగి పతివ్రతాశ్రేష్ఠలై సుఖ పడి కుటుంబసౌఖ్యముఁ గూర్చినస్త్రీలే అనాదికాలమునుండి మనదేశ ములో నున్నారు. అట్లే పురుషులుంగూడ. శ్రీరామాదులవివాహమును

గూర్చి దశరథుఁడు, మంత్రులు, పురోహితులు నాలోచించిరి. అని రామాయణమందుఁ గలదు. స్త్రీలమీఁద మోహము వీరకృత్యములకుఁ బ్రేరేపకము అని మనవారు తలంచలేదు జీవయాత్ర కొనసాగుటకును, బ్రపంచ సేవఁగావించుటకును, దానుసుఖపడి ప్రపంచశాంతికిఁ బాటుపడుటకును మనవారు వివాహమును నిర్ణయించినారు. భార్యాభర్తృత్వము ఇహపరశ్రేయస్సాధకమని మనవారి నిర్ణయము. మనవారు జీవితమునంతయుఁ బ్రతివిషయమును నిట్లే నియమించియున్నారు. విద్య, జీవనము అన్నియు నిహపరశ్రేయస్సాధనములే. జ్ఞానమువచ్చువఱకుఁ దలిదండ్రులు పెంచెదరు. గురువువిద్య నేర్పును. పెద్దలు గృహస్థునిఁజేసెదరు. కావుననే 'పెద్దలు నిశ్చయించినారు' అని వివాహశుభలేఖలలో మనవారు వ్రాయుదురు. ఇట్లుగా బాల్యదశనుగడచి విద్యావంతుఁడై పిదప గృహస్థుఁడై పురుషుఁడిహపరములను సాధించుచున్నాఁడు. కావునఁ బ్రతివాఁడును దలిదండ్రులకు, గురువునకుఁ, బెద్దలకు విధేయుఁడై యుండవలయును. ఇంతియగాక పరసాధకులైన దేవతలను, ఋషులనుగూడ నాహ్వానించి వారిసమక్షమున గృహస్థునిఁ గావించుచున్నారు. కావున వారియందుఁగూడ భక్తిశ్రద్ధలు గల్గియుండవలయును. ఇట్లే స్త్రీలుగూడ విధేయలై యుండవలయును. కావున వివాహమన్నది కులముతోను సంఘముతోను సంబంధము గల్గినయేర్పాటుగాని ప్రేయసీప్రియు లిద్దఱితోడనే సంబంధము గలదికాదు. విశాలదృష్టితోఁజూచిన వారికి భారతీయవివాహపద్ధతి సంఘోన్నతికారకమని, శాంతికారకమని, సౌఖ్యవంతమని గోచరింపక పోదు. పెద్దలు నిర్ణయించినందున భార్యాభర్తృత్వము గల్గుచున్నది గాని తామే యేర్పఱచుకొన్నందునఁ గలుగదు. కావుననే బహుకాలఁది మందికిఁగాను ఏర్పడిన స్వయంవరాదులందుఁ గూడ వైదికతంత్రము విధింపఁబడియున్నది. పెద్దలునిర్ణయించిన సంబంధమును దలిదండ్రులు తమసంతతికిఁ గావించెదరు. ఈఆచారము మనలో నేఁటికినిఁగలదు. ఇట్టి సంబంధమందు మనసుపోదు అనుట ఆలోచనము లేనిమాట కామమును నది పురోభివృద్ధిహేతువని గ్రహించినవారు మనవారు. కావుననే దానిని తుచ్ఛముఁగావింపక పవిత్రతఁజూపి శాశ్వతత్వము నెలకొల్పినారు. పాశ్చాత్యు లిందలితత్త్వము నెఱుంగకఁ గేవల మోహామే (స్త్రీ

మీఁదఁ బురుషునకుఁ బురుషునిమీఁద స్త్రీకి కల్గినమోజుమాత్రమే) కామ మనితలంచిరి. అదియే శృంగారతత్త్వమని వారు దలంచిరి. ఇందువలనఁ బాశ్చాత్యదేశములు విషమపరిస్థితికి వచ్చినవి. కామము పురుషార్థము గావున దానినిఁ దుచ్ఛముగావింపక ఇష్టమువచ్చినరీతిని వినియోగింప నీయక కట్టుపాటుచేసి, పవిత్రతఁజూపి సంఘశ్రేయము, శాంతి మన వారు నెలకొల్పినారు. అదితెలియక రెడ్డిగా రిట్లువ్రాసిరి.

"ప్రాచీనులమోహతాపము:—నిజము చూడఁబోయినఁ బ్రభా వతీప్రద్యుమ్నముశైలి నొక్కదానిందప్ప తక్కినవిషయములలో సామా న్యప్రబంధముల మీఱినదిగాదు. కథ మిక్కిలి సన్నము. చిత్రరూప ములు, దూతికలు మొదలగు మధ్యవర్తులమాటలు, వీనిచే నాకాలము వారికిఁ గామాగ్నియున్నట్టుండి ప్రభవిల్లి మనసులను దేహములను దహింపఁజేయునంత తైక్ష్ణ్యమును బహుత్వరలోఁగాంచుట సర్వసాధా రణమేమో! బహుశః వారెల్ల నెండినకట్టెలో! ఇప్పు డింగ్లీషుముక్కలు చదువువారు, నేరుగాఁజూచి మాట్లాడిననే కాని యీదందహ్యమానత మాకుఁ బట్టువడదు" అని ఆక్షేపించుటఁ జూడఁగా కాలవైపరీత్యము బోధపడియెడిని. మనది ప్రత్యక్షమోహము. మనపెద్ద లింతకన్న నుద్రే కము గలవారగుటంబట్టి విననే చాలును! గుప్పునమండెడివారు. వకీళ్ల మూలమైన పరోక్షమోహము వారికి ప్రధానము. అయిన నాకొకసంశ యము. మనపెద్దలు వేదవేదాంతవికాసభాసుర విచిత్రచరిత్రులే. రాగ రహితులే. శమదమాదిసంపత్సమేతులే! అట్టుండియు నీయొక్కవిషమ విషయంబునమాత్ర మేల యింత చాంచల్యమువడసిరో తెలియఁజాలము గదా! అవ్యాజాద్భుతములలో నిదియొకటి. నిర్హేతుకజాయమానచిత్త విభ్రమమును వేదాంతవిచారమును సమ్మేళించియుండుట యాశ్చర్యము గదా! ఆశ్చర్యమైనను అప్రకృతమా? కాదేమో! ఎట్లన, ఇంద్రియ ములు నిగ్రహింపవలయు నిగ్రహింపవలయునని జపముచేయుచుండు వారు, ఆయింద్రియములయందే నిగాయుంతురుగాన, నది యొకవిధమైన యున్మాదహేతువు. కాకున్న నందఱికన్న ముందుగ జితేంద్రియులైన మహర్షు లప్సరసలఁ జూచిచూడకమున్న యేల యువ్విళ్లూరుదురు! గంతులువేయుదురు! మఱియు భరతఖండము క్షీణదశకువచ్చినది

మొదలు గొప్పగొప్పప్రయత్నములు గొంతెమకోరికలైనందున నేమో కాని తుచ్ఛములు స్వార్థైకవిషయములునైన సుఖములందప్పు నింకెందును బుద్ధిపాఱుట యరుదాయెను. చిల్లరచింత లెక్కువ. కీర్తికరములసాధ్యములైనందున భోగములే పరమార్థములని గణింపవలసిన వారమైతిమి. జీవితమనునది యుండఁగా కాలక్షేపము పొంటెనైనఁ బురుషార్థ మొకటి యుంచుకొనకతీఱునా? 'వ్రతముపోయె. యశస్సుపోయె! ఇంద్రియానుభవమైన దక్కనీ' యని మనకుం దెలియక మన మనసీజాడల కుపక్రమించెనో! (౧౦౮—౧౮౦) అనివ్రాసిరి. ప్రత్యక్షమోహము అందులో బహిరంగమోహ మెచ్చైచ్చ, మిక్కుటమై సినీమా మొదలైన వాటియందు కామినీకాముకులుచేయు అత్యాచారములను రాజకీయ శాసనముల మూలమునఁగూడ నణఁచలేకుండనున్నవి కొన్నిపాశ్చాత్య దేశములు. అట్టి ప్రత్యక్షమోహము, ప్రళయాంతకమోహము మన దేశమున కింకనురాలేదు. దూతికలు, మధ్యవర్తులు సంబంధములు గూర్చుట సంతబేరములకన్ననయమని రెడ్డిగా రెంచలేదేమొ. స్థిరసంసారములకు రాచబాటవేసిన మనపూర్వుల నన్యాయముగ రెడ్డిగారు నిందించిరిగదా. వేదాంతభాసితులకు రాగముండదని తలంచుట అవివేకత్వమును లోకజ్ఞానశూన్యత్వమును వెల్లడించును. ఇహపరములను సాధించువారు మనవారు. రాగము, వైరాగ్యము మనవారియందుఁ బరిపూర్ణముగ నుండును. ఇది సంఘసంస్కర్తలకుఁ దెలియదేమొ. ప్రస్తుతపరిస్థితి, వెనుకటిదేశచరిత్ర తెలియనివారికిఁ దత్పూర్వకాలముకన్నఁ బ్రాచీనకాలమందున్న పురుషులసంగతి ఎట్లు తెలియఁగలదు. ప్రపంచమంతటిలోను సహజముగా సారవంతమైనది, పుణ్యమైనది భారతదేశము. కావుననే ఇచ్చట అనాదిశాస్త్రములు కట్టుపాట్లుచెడిపోక నేఁటికిని నిలిచియున్నవి. అందుకై సంతోషింపక వాటిని నవగాహనమొనరించుకొనుశక్తిలేక మీఁదుమిక్కిలి నిందించువా రెంతటి మాతృద్రోహులోకదా. భారతీయు లెంతటిపరాక్రమవంతులైనను నాయకత్వమువహించుటకుఁ దగరనియుఁ, బాశ్చాత్యులే పరిపాలింపవలయు ననియుఁ జెప్పిన పాశ్చాత్యు లున్నారు. ప్రపంచసుఖము గలుగవలయునన్న భారత దేశము బాగుపడవలయుననియు, నది మార్గదర్శకమైననాఁడు ప్రపంచ

శాంతిగలుగుననియుఁజెప్పిన పాశ్చాత్యులుగూడ నున్నారు. న్యాయముగ నాలోచించువారికి యథార్థము బోధపడకమానదు. అట్టి దృష్టిగలిగిన నాఁడుగాని దేశము బాగుపడదు. దేశము స్వతంత్రమైనది కావచ్చును. లేక అస్వతంత్రమున నుండవచ్చును. పై విషమపరిస్థితినశించి స్థిరసంసారములు ప్రతిష్ఠితమగునపుడుగాని శాంతిగలుగదు. ఏ కారణముచేతనైన నేదైన నొకయాచారము ఇబ్బందిగఁ దమకుఁదట్టినఁజాలును. ఇంక ఋషులను, వేదశాస్త్రములను, బూర్వులను నిందించివేయుదురు. ఇట్టివారు నేఁడు కొంద ఉన్నారు. వారికట్టిబుద్ధి పోవలసియున్నది. విషయగ్రహణము గావింపవలసియున్నది. ఆనాఁడుగాని దేశమునకు ముక్తిలేదు. స్త్రీలకెందుకునిర్బంధముగలిగినది అట్లుగా మనవారెందుకు విధించియున్నారు. ఇందువలనఁ గలుగులాభమేమి అని విచారించి తెలిసికొనవలయునే కాని నిందించుట కూడనిపని. అది తెలియక రెడ్డిగారెంతయో దానిని నిందించిరి. వారిట్లు వ్రాసిరి.

"శుద్ధాంతములఁట! పోఁతుటీఁగకైనం బోలయరానిచోట్లఁట! శుద్ధాంతవాసప్రభావము:—సరి! కలలకు గోడలడ్డమా! మనసునకు బీగములు బంధములా! శుద్ధాంతము లేర్పఱుచుట యనులఘుకార్యముచే శుద్ధాంతరంగములు సమకూఱునా? మఱియు, నీమఱుఁగేగదా మానము విడుచుటకుఁ బ్రేరకము! ఎట్లన, ఇట్టివారు చెలులు, దూతికలు, దాసీజనులు మొదలగు మధ్యవర్తులమూలముగాఁదప్ప నితరములగు నుత్తమమార్గములఁ దమనైజమగువలపును దృష్టిఁబొందింపఁజాలరు. మధ్యస్థము పిలిచిన పిమ్మట మౌనముఁగొనియుండుటెట్లు? మఱుఁగుగానైన సగము చూపిచూపక యుండుటెట్లు? శుద్ధాంతమనఁగా సేవకులు మొదలగు నీచులతో సావాసమన్నమాట! గరువతనమున కిదె యనుకూలమా? మఱియు, నట్టి కన్యకలకు నితరచింతలే యుండవుగాన తమచింతయే ప్రధానము. రాజ్యము, దేశము, జ్ఞానము, ధర్మము వీనింగూర్చిన విచారములు సున్న. అప్రయోజకముగా నుంచఁబడియుండుటచే మనసు పరిశ్రమలేక కృశించి నశించును. ఇట్టివారు స్వసుఖపరాయణులగు టేమి చిత్రము! మఱి సుఖమనఁగా వీరికి దేహసుఖమనుటఁ దప్ప నింకేయర్థమైనఁ గలనైనఁ దోఁపగలుగునా? ఏపనిపాటులును లేక తిని, కండ

క్రొవ్వి, మదాంధులై కాలము భారముగనుండునట్టి జవ్వనులు శుద్ధాంత ములనున్నను సంతసానులట్ల ప్రవర్తింతురు. విచ్చుకత్తులపారా లెక్కువ యాకొలఁది సందుదొరికినంజాలు! సమయము వ్యర్థపుచ్చక త్వరలోఁ గార్యము దీర్చుకొందమను తొట్రుపాటును గలుగును. అది యుదయ మయ్యెనేని, మానము, మఱుఁగు, సౌమనస్యముఁగల శృంగారమెక్క డిది? శృంగారమునకు బదులు జావళీలు వచ్చిచేరును. పాపము. మన దేశములో నెందఱో స్త్రీలకు దూతికాముఖమైన మోహమేకదా గతి! కన్నులుపయోగింపఁబడనందున వీరి కవి మందము లగునేమో! చెవులు అనవరతోద్యోగములో నుండునవిగాన చుఱుకుగల వగునేమో! చిత్ర ఫలకమో, చెప్పుడుమాటయో కామసందేశపద్ధతులు! ఇవిదప్ప వేఱు మార్గములు మృగ్యములు."

'పురుషుఁడే దేవుఁడు. ప్రస్వేదగాత్రుఁడైనను అస్వేదగాత్ర తుల్యుఁడు' అని పద్మగంధులు యోజించుటకును యోజింపఁజేయఁబడు టకును గలకారణములలో శుద్ధాంతనివాస మొకటి. ఎట్లన బయటఁ బోయినఁగాని లోకవర్తమానము తెలుకకురావు. కూపస్థమండూకముల కాకూపమే పాలసముద్రము. రాజ్యాంగముల నుద్ధరించుటలో నిపుణు లైనమంత్రులు, దేశభక్తిచేవిరాజిల్లు ప్రతినిధులు, యుద్ధరంగమున శత్రు వులనోడించి నిత్యయశోభాసితులై దేశదేవతలఁబోని సేనానాయకులు, ప్రకృతిశాస్త్రవిచక్షణులు, తత్త్వార్థదక్షులు, ఇత్యాదిచరితార్థులసంగతి పొంతఁబోక గుమ్మములోఁగూరుచుండి దొరతనము—అనఁగా నింటి వారిమీఁద—చేయు మహారాజునుదప్ప నింకెవరినిజూడని భార్యకు వాఁడే యఖండపరిపూర్ణుఁడుగాఁ దోఁచునేమో! ఒకేయాకారము గుఱివెట్టి యస్ఖలితంబుగఁ జూచుచుండిన నది నిరాకారబ్రహ్మమట్టులు పరిణమించు నేమో! కాకిబిడ్డ కాకికిముద్దు. తమతల్లినిమించిన రూపవతులు గుణ వతులు లేరని చిన్నబిడ్డలు నమ్ముదురు. పెద్దవారై యనేకులంజూచిన పిమ్మటఁ బోల్చిజూడ నారంభించి తక్కినమ్మల యుత్తమత్వము నొప్పికొనుటగలదు. ఇంకొక రెక్కువవారున్నారనినంతనే తల్లిమీఁద ప్రేమపోవునా? పోవు నని బుద్ధిశాలియైన యేతల్లియేని నసూయవహించునా? జనములతార తమ్యనిరూపణకృత్య మొకటి. అనురాగపాత్రములని భావించుకృత్యము

వేఱొకటి. ఈరెండును సర్వత్ర నైక్యభావముం బూనునవిగావు. చూడుఁడు. శంకరాచార్యుఁడు ఘనుఁడైన తార్కికుఁడన్న మాత్రముననే యతనిని కౌఁగిలించుకోవలయునని యందఱకు బుద్ధిపోడముట యావశ్యకమా? నైజమా? తర్కము బలముగా నుండవచ్చును. రూపము దక్కువగానునికి, గుణము సర్వసమ్మతముగామి, దానితో సంశ్లేషింపఁజాలిన ప్రకృతులు విరుద్ధములుగావు. అట్లగుట వలపున కుత్పాదకములగు వేయిహేతువులలో నొకటియున్నయెడ సర్వస్త్రీలును వానిపైఁబడుదురని నమ్మువారును, నమ్మి యట్లునడచువారును మనుష్యులా జడులా? స్త్రీలవిషయమై మాత్సర్యముం దాల్చువారికి రెండువిధములగు భ్రమలు గలవు. ఏవియన, తాము పరిపూర్ణులైయున్నంగాని వారు హృదయపరిపూర్ణముగఁ దమ్ము తరువాత గామింపరనియు, నెవనియందైన నేదైన సుగుణము అధికముగా దేదీప్యమానమైయున్నచో,వాఁడుగంటఁబడెనేని తక్కిన గుణములసంగతి యాలోచింపక, వానిపై నుద్దండముగాఁ బడుదురనుటయు, ఈయెన్నికలు రెండును హేతురహితములు. సర్వగుణసంపన్నుఁడైనవానితో విసుగుదవిలిన మనసుతో గుజ్జుపువాని వలచువారు లేరా? తుదకు ఉన్నతులగు పురుషులునైతము, ఎన్నో తబ్బిబ్బులకు లోపములకు నాకరములైన భార్యలమీఁదఁజూపు ప్రేమావేశమును, నిరంజనుఁడైన దేవునియందుఁ బ్రకటింపఁజాలుదురా? చిత్తము పలుపోకలఁ బోవునది. గోడలచే నెట్లు నిరుద్ధముగాఁజాలదో యట్లే కారణమునకును దుర్నిరోధము. ఇది స్వభావసిద్ధమని యందఱెఱింగియుండియు, నైరోపాకవులు ప్రయోగించినట్లు ఈన్యాయము మనవారు తమకృతులలో వ్యాప్తికిఁ దెచ్చియుండలేదు.

మీఁదవివరించిన భ్రమలవలనఁ గలిగినక్షోభములు రెండు. రాజుగారు దేవినొకదాని సంపాదించి పురమున నూరేగునపుడు పౌరస్త్రీలందఱుఁ గామాతురలమై వానింజూడ పరిపరివికారవేషములతోవచ్చిరని ప్రబంధముల వర్ణింపఁబడియుండుట. ఈకవులయూహా యేమనఁగా 'రాజు! ఇంకవానిం గలయఁగోరక తరుణు లెట్లోర్తురు! మనము రెండణాల దక్షిణనాశించి యేతారతమ్యములనెంచక ధనికులను దొంగభక్తి నాశ్రయించుచున్నాముగదా! స్త్రీలును, మనకన్న నెట్లుశ్రేష్ఠలు! నికృష్ట

జన్మలేగావున వారిలో నిట్టిపిచ్చి యెక్కువ!' యని కాంబోలు! రెండ వది 'భర్త దేవుఁడు. గుఱుకపెట్టెడు ప్రాణాయామ బ్రహ్మ! వాని నేయంశమందైన మీఱినవా రెవ్వరులేరు. ఒక్క లేరనుటయే కాదు. సృజింపఁబడరు. పడఁజాలరు!' అని భక్తిఁ దాల్చియుండవలయునను పాతి వ్రత్యధర్మప్రకటనము. ఏమి యీాజనులకుఁగల దైన్యమహిమ! పరి పూర్ణులని తలంపఁబడ రేని భార్యలు చీయని వదలిపోదురా! భార్యలు మాత్ర మంతపరిపూర్ణులా? మనుష్యులలో మనుష్యులమని యెల్లరు నున్న సంసారముసాఁగదా! మఱి సభలకుఁ బిలిచికొనిపోయిన వివేకా నందస్వామి, గోకులే, మున్నగు మహనీయులంగాంచి, 'వీరు గొప్పవారు' అని భార్యలుమెచ్చుకొని రేని, మనసు మాఱినవారౌదురను భయముం దాల్చు మగవారినీచతకొలఁది నిర్ణయింపఁబోలునా? స్త్రీలు గుణము కొలఁది వలచువారై రిపో. అది శ్రేయోహేతువేగాని యనిష్టసాధ కమా! వారి హృదయానందము నర్థించియైనఁ బురుషార్థము సాధింపఁ జూతుముగదా!

మోహప్రకృతి:—మనగ్రంథములలో చిత్తవిజ్ఞాన మత్యల్పము. అనఁగా పూర్వకావ్యములఁదప్పఁ దక్కిన యర్వాచీనగ్రంథములలో ననుట. పురుషుఁ డెందఱుస్త్రీలనైన గోరవచ్చునఁట! తప్పులేదు! తప్పేల? దక్షిణనాయకుఁడు! కృష్ణమూర్తి! స్త్రీలు అన్యపురుషులమీఁద మనసు పోనిచ్చి రేని, అయ్యో ఎంతపాపము! పాతాళమును మఱింతలోతుగాఁ ద్రవ్వినఁగాని యీాపాపము నింపలేము! కన్నుగదల్చినఁజాలు! ఆపె బంధకి! దుర్మార్గురాలు! మగవారి కొకన్యాయము, స్త్రీలకొకన్యాయ ముగా నేలవిధింపఁబడెనో చెప్పువారులేరు! అది యటుండనిండు! స్త్రీ యనునది జడముగాదు. తిర్యగ్జంతువుఁగాదు. ఆత్మగలిగిన మనవంటిచేత నము. మన మేరీతిని స్నేహితులు, బంధువులు, అన్నదమ్ములు, కొడు కులు, భార్యలు (బహువచనము హిందూజనులలో నయోగ్యముగాదు.) మొదలగు ప్రాణసములతో సహేతుకముగనో, నిర్హేతుకముగనో, కాలవశమున భేదింతుమో ఆరీతినే స్త్రీలును భేదముఁగొనకుండుటకు వారేమి యంత్రములా! మానవులుగారా! భేదముగొనినంత నే మనల నెవ్వరుఁ దుచ్ఛులనిగణింపరు. మఱి కారణములారసి తీర్మానింతురు.

మనలో స్త్రీనడవడింగూర్చి సిద్ధాంతముచేయునప్పుడు ఖండనమేగాని విచారమెక్కడిది? అట్లగుట గొప్పబుద్ధిచేఁ బ్రేరితమైన భర్తమీఁది విరక్తియనునది యొకటున్నదని మనవారికిఁ దెలిసినను, బహిరంగముగ నొప్పుకొనరు. కావ్యముల నిట్టి చిత్రచరిత్రలు వర్ణింపఁబడియుండ లేదు. చూడుఁడు. తనభర్త కులాభిమానము విడిచినవాఁడైనఁ బత్ని యేల వానిని వదలరాదు. అన్యాసక్తుఁడై యిచ్చినబాస మఱచినఁ దనకు నట్టి మఱపేల రాఁదగదు. లంచములకో ఱకో పగచేతనో మాతృద్రోహముఁ జేయువాఁడై తనదేశమునకు నాశముఁగోరి శత్రురాజులకు సాయము చేయఁగడఁగెడు దురాత్మునిభార్య శిరచ్ఛేదనముఁజేసిన నకృత్యమా, సుకృత్యమా? మఱి దేశభక్తుఁడై నిరంతరయత్నములచే దేశాభ్యుదయము నభివృద్ధిఁజేయువాని నేల ప్రీతిపాత్రుఁడని చేరువఁజేర్చికొనరాదు! ఒక్కపతివ్రతాధర్మమున్న నింకేధర్మములును బనికిరావా? అవి యస్తమించునా? వాని నుపాసింపకున్న నవి కీడు లేకుండునా? ఈపాడు పాతివ్రత్యము నుద్ధరించుప్రకృతి యొక్కగృహముమాత్రమె. అదియే పతిభక్తికి రంగస్థానము! దేశోద్ధారకధర్మములకైన నిదియొక్కవయా? అలనాఁడు మహమ్మదుగోరికి నాహ్వానసందేశమంపి దేశము నొరులకు సమర్పించిన జయచంద్రున కతనిరాణి విషమో తవుడో పెట్టియుండిన నామె కొకదేవాలయము కట్టించి పూజసేయకుందుమా? పతిభక్తి నేటఁ గలిపినవారందఱు నొకలెక్క యనుట మన యాచారము! పతులను గుణములకొలఁది వర్ణించి, వారిని విసర్జించిన భార్యల యుద్దేశ్యములను గారణములనుగణించి, వీరియందును గౌరవలాఘవముల నిరూపించి చూచితిమేని, భర్తను వదలినవారిలో ననేకులు మహాత్మురాండ్రనియేర్పడును. మఱియు వదలనివారిలో ననేకులు పేదబుద్ధిగలవారని, పిఱికివారని, నీచాత్మురాండ్రనియుఁ దెలియకపోదు!

ఏదేని యొక్కధర్మమును మాత్రముపట్టి మనుష్యులచరిత్రల గణింపఁజూచుట మౌఢ్యము. అందును ఆధర్మమునుండి తొలఁగిన వారి స్వభావము, స్థితిగతులు, కారణములు, కాంక్షలు, వేనినిం బాటింపక తీర్పు చేయుట కన్నులుపోయిన కబోదిమతము.

దీనిచేఁ గావ్యములకు గొప్పలోపము సంభవించినది. ఏదియన, శృంగారమనిన నేకవిధమైన శరీరరాగమని యెట్లుభ్రమించిరో, యట్లే జారశృంగారము నేకగతిం బోవునదియని యోజించి, నరులమనసులు నానారూపములైన చిక్కులందాల్చినవనుటఁ దెలిసికొనక, విసుగుపుట్టించు నంతయభిన్నవర్ణనలఁజేయు దౌర్భాగ్యము. జారస్త్రీలెల్లఁ జెడ్డవారయఁట! కండకావరముచే నన్యులఁగోరువారఁట! ప్రబంధములలోని పతివ్రతలు మాత్రము కండకావరముచేఁ గోరువారుగారా? ఇంకేవరము వారి కున్నది? శృంగారము నీచశృంగారము. దానికిఁదగినట్లు జారత్వమును నీచముంజేసి జతఁగూర్చిరి. మనుష్యస్వభావమును బరిశీలించి వ్రాయక యలంకారశాస్త్రములఁ దలనిడికొన్నందుకుఁగలిగినయధోగతి యిది!

సరాసరికి నీగృహాకృత్యపతివ్రతలకన్న నైరోపామొదలగు వృద్ధిభూములలోని పలుగాకులుమేలు. రుష్యావారికిని జపానువారికిని కొన్నియేండ్లక్రింద ఘోరయుద్ధము ప్రాప్తమైనపుడు, రుష్యావారి రణసన్నాహములయొక్కయు, కోటలయొక్కయు, సైన్యములయొక్కయు మర్మముల నెఱుంగ జపానురాజ్యములోని నారీమణులుకొందఱు బుద్ధిపూర్వకముగ వేగుపనికిఁబూనినవారై, తరుణములందు శత్రుసేనానాయకుల పరిరంభణములకుంగూడ సమ్మతించి, యమూల్యవృత్తాంతములను దేశమునకు దానముచేసి యుపకారరాజ్యపట్టమహిషులైరని వినియున్నాముగాదె! వీరిని నీచచరిత్రలని భావింపనొప్పునా? గృహధర్మము, దేశధర్మము విరుద్ధగతులం బోవునవియైనచో దేశధర్మమునెడ నెక్కువగౌరవముఁగలవారా నికృష్టులు! గృహమునకు మించినదిలేదనువారా? యోజింపుఁడు! దృష్టిననుసరించి కొలఁదులేర్పడును. సంఘపరమైనదృష్టితో తత్త్వపరిశీలనము చేయువారికి హిందువులనీతులు మొత్తముమీఁద హీనములనితోఁపక మానవు. (౧౫౨...౧౬౦) అని వ్రాసిరి. మఱియుఁ బాతివ్రత్యతత్త్వము అని యిట్లువ్రాసిరి.

'నడవడియను వస్త్ర మమూల్యముగా కుదురవలయునన్న నొకేతరగతిపోగులు రంగులుఁబేర్చినఁ జాలునా? నానావిధములైన వర్ణములు గల తంతువులు విచిత్రరీతి నొండొంటికి పన్నె యలవడుమాడ్కి మిశ్రపఱిచినఁగదా నాణెముసిద్ధించును? ఈతత్త్వము నెఱుంగమింగాదె పతివ్రత

లన్న నొక్క పతిచింతదప్ప నింకేదియులేని మూఢురాండ్రని భ్రమించి యుండుటయు,తద్ద్వారా దేశమునకేకాదు స్త్రీలకుసైతము దైన్యకారణము లైన నీతులబోధించుటయును! ఒకానొకపతివ్రత పురుషుఁడెవతెనో యొక స్త్రీనిగోరిన దానినివలపించి తేఁబోయనఁట! అందుచేనామెకు పంచభూత ములను వశపరచుకొనునంతమాహాత్మ్యము సేకుఱెనఁట! భార్యను దూతి కగాఁజేయువాఁ డెంతమాత్రపుమగవాఁడో భర్తకై యన్యస్త్రీలఁ జెరుపఁ జూచునదియు నామాత్రపుటాఁడుదియే! పతియేయఁటదైవము! వేఱు దేవుఁడు, దయ్యము, దేశము, జాతి, మానము, గౌరవమును దేనిని సడ్డ సేయరాదఁట! ద్రౌపదీదేవి ఉద్యోగపర్వములోను మరికొన్నియెడలను జేసినరీతిఁ బురుషులకు వ్యతిరిక్తముగా మాట్లాడుట మహాపాపము! పురు షునివాక్యము నపౌరుషేయమగువేదముగా భజించుటయ శాస్త్రవిహిత ధర్మము, కరము! ఈదౌర్భాగ్యప్రలాపముల మొత్తపుటర్థమేమనఁగా, 'మగవారమైనమాకు నాఁడువారైనమీరు బానిసలుగానుండుఁడు. మఱి మాపనులన్ని నో కారణముఁజెప్పి న్యాయములు గౌరవప్రాప్తములు అని చూపఁగాదు. ఏలనన రాష్ట్రము, స్వాతంత్ర్యముఁగోలుపోయి దాసులమై యుండుటఁబట్టి యొరుల కనుసన్నల మెలఁగవలయునేకాని, క్షాత్రభంగిని మానము మనస్వాత్మ్యము నిరూపించినత్రోవఁబోవ మావలనఁగాదు. అట్లు గుట మాచర్యలంగూర్చి చర్చింపకుఁడు. ఏమియని యడుగకుఁడు, మీ రట్లు చేసితిరేని బయటనేగాదు మాయింటఁగూడ మాకుగౌరవముదక్కదు. అందఱియొద్దఁ దన్నులువడి వచ్చువారము. మీరైనఁబూజింపకున్న మా కభిమాన మబ్బుటెట్లు? మేము దాసులము. మీరు మాకుదాసులైనచో దాసానుదాసులయ్యెదరు. అనఁగా దేవసన్నిభులరు, సేవచేత దేవతలగు సూక్ష్మము ఈకర్మభూమిలోఁ దొలుతఁగనిపెట్టఁబడినహాయిదైనతంత్రము! దానిలాభమంతయు ధారాళముగ మీరేయనుభవింపుఁడు!' అనుట! పతినిదప్ప నింకేమియు స్మరింపఁగూడదఁట! ఈస్వరూపములనే యవికల మగుదృష్టితోఁ జూచుచుండిన నెటువంటివారికైనఁగనులు నిల్చునా? ఎంత గొప్పప్రతాపమూర్తులైనశూరులు వీరులని వీరినేయెంచుచుండుట సాధ్య మగును! దేశము గొప్పగా నుండుకాలములో స్త్రీలకు నొకకుటుంబము మీఁదనేకాదు, రాజకార్యములు, చరిత్రాదిశాస్త్రములు, సైన్యములు

మొదలగు మానరక్షకప్రకృతులు ఇత్యాది లౌకికగణంబులయందెల్ల శ్రద్ధాదృష్టివాఁచుచుంట సహజము. గాంధారి ద్రౌపది మొదలగుభారత స్త్రీలును, గార్గిమైత్రేయీ ప్రభృతులగు ఋగ్వేదయుగములోని లోకో త్తరచరితలును, మనవారినుండియే యీవిషయమునం జూపఁదగుసాక్షులు. రాజ్యము స్వాతంత్ర్యములేనిదయ్యేనేని నిల్లువిడిచి బయటికివచ్చుటకు భయము. ఏలన, తమవారికిఁ దమమానమురక్షించుశక్తి లేమింజేసి పౌరు షోద్ధురులైన పతులయెడ స్త్రీలకు స్వాభావికమగుతవులు మెండు. అదిలేని పతులు ఇఁక నీతిశాస్త్రములచేతనైనను దమయందు వారిహృదయములను భద్రపఱచికొంద మనుయుక్తిఁబన్ని పతివ్రతాలక్షణములం బ్రకటించి రేమో! సాహసవంతుఁడు జనములనాకర్షించుట నీతిచేఁగాదు. మఱి ప్రకృతిచే. మఱియు, 'ఇల్లు గ్రామము కులము వీనిందప్ప, పెఱవానిజోలి మనకేల ? అధికప్రసంగము లీనాళ్లలో నపాయకరములు' ఉడుముననేటి కయ్యా ఊరిలోపెద్దతనము!' అని యన్నిపరాక్రమములు నుడిగి గుమ్మము కచేరీలకుదిగిరేని స్త్రీలకేకాదు పురుషులకునైతము గృహచింతదప్ప మఱేమియుండఁగలదు ? పాతివ్రత్యమొక్కండుదక్క స్త్రీలకేధర్మములు గూడవనుసిద్ధాంతము దేశమునఁ బురుషులు భంగమునకులోనయి నిరా శచే నిరుద్యోగులైయుంటచే వచ్చినచేటేగాని, బాగుగావిచ్చలవిడివర్తించు ఋషులశాసనముగాదు' (౧౦౫...౧౦౮) అనివ్రాసిరి. శుద్ధాంతవాస మనఁగా రెడ్డిగారికర్థముకాలేదు. శుద్ధాంతమనఁగా నీచులసహవాసమన్న మాటయని వారు వ్రాసిరి. ఇంతకన్నఘోరమైనవ్రాఁత మఱియుండదు. శుద్ధాంతమందున్న స్త్రీలు పురుషులను జూడవచ్చును. దేవవివాహాదిశుభ కార్యములందు వారు సంచరింపవచ్చును. దేశమునుజూడవచ్చును. రాజ స్థానమందు జరుగునట్టివిశేషములను వారు కనుఁగొనుటకుఁ బ్రత్యేక స్థలము లేర్పడియుండెడివి. స్త్రీలిట్లు కొలఁదులకొలఁది మఱుఁగుననున్నందు ననే, అది మర్యాదయని తలంచినందుననే మనదేశము న్యాయవంతము, నీతివంతమై నేఁటికినిఁ బ్రసిద్ధికెక్కియున్నది. ఈయాచారము అనాదికాల మునుండి గలదుగాని మధ్యవచ్చినదిగాదు. అట్లుచెప్పుట కాధారములేదు. విచ్చలవిడిగా స్త్రీలుతిరుగాడుచున్నందుననే పాశ్చాత్యదేశములు పాడగు చున్నవి. స్త్రీలమనసును స్వాధీనముచేసికొనలేక మనదేశపుఁబురుషులు పతి

భక్తియనికల్పించి స్త్రీలనుబంధించిరనియుఁ,దాముపరిపూర్ణులైయున్నఁగాని స్త్రీలు హృదయపరిపూర్ణముగఁ దమ్ముగామింపరనియు మఱియు నెవనియం దైన నేదైనసుగుణ మధికముగాఁ గనఁబడినయెడల, వాఁడుగంటఁబడెనేని, వానిపైఁ బడిపోయెదరని మనవారికి భ్రమగలదనియు రెడ్డిగారు వ్రాసిరి. తామే యందఱికన్నఁబరిపూర్ణులని స్త్రీలనుకొనునట్లు ప్రవర్తింపవలయునని పాశ్చాత్త్యులు, తద్వాసనగల్గినవారు మెలఁగ నెంచెదరేమోగాని భార తీయుఁ డట్లుతలఁపఁడు. ప్రవర్తింపఁడు. స్త్రీ తమ్ము విడిచిపోవుననుభయము పాశ్చాత్త్యులకు, తద్వాసనగల్గినవారికి విశేషముగ నుండవచ్చును. ఎందు వలన ననఁగా, సహేతుకముగనో, నిర్హేతుకముగనో కాలవశమున భేదిం చుట (౧౪౭) వారిసిద్ధాంతము. భర్తమీఁద విరక్తిని వారు బహిరంగ ముగ నొప్పుకొందురు. అందువలన వారి కీపెద్దచిక్కు పదేపదేతటస్థించును గాన లేనిపరిపూర్ణత్వమునకై వారు పాటుపడకతప్పదేమొ! మన కట్టి చిక్కులేదు. మనస్త్రీలు సర్వాత్మనాభర్తలను దైవతముగాఁ జూతురు. వారిసేవఁజేయుట విహితమనితలంతురు. వారిమాట వారికి సుగ్రీవాజ్ఞ. తమభర్తలే పరిపూర్ణులని మనస్త్రీ లెంచరు. యథార్థమును వారు చక్కఁగ గుర్తించెదరు. సౌఖ్యవంతులైన దంపతులనుగూర్చియు, దేశమహా నీయులఁగూర్చియు నిమున్నగువారినిఁగూర్చి మనస్త్రీలు యథేచ్ఛముగా భర్తలయెదుట ముచ్చటించెదరు. అది తప్పుగానెంచు పురుషులు భార తీయులలో లేరు.

ప్రపంచమున నున్నవారందఱు సోదరులే. కావుననే ప్రపంచ మంతయు సౌఖ్యముగ నుండవలయునని మనవారు ప్రార్థించునాచారము గలదు. ప్రపంచమంతయు సోదరులతోఁగూడియున్నను దేశీయసోదరులు అందులోఁదిరిగి ఏకోదరు లనువిభాగ మేర్పడియున్నది. కావుననే ప్రపం చముకన్న దేశము, దేశముకన్న గృహము ముఖ్యమగుచున్నది. గృహము ముఖ్యమని దేశమునుగాని, దేశముముఖ్యమని ప్రపంచమునుగాని మఱపు గొనరాదు. వాటిసౌఖ్యమునకు భంగముతేరాదు. ప్రపంచమెట్టిది, దేశ మెట్టిది, గృహమెట్టిది, రాజెట్టివాఁడు, ఉద్యోగమెట్టిది, సోదరసోదరీ మణు లెట్టివారు, మిత్రు లెట్టివారు, బంధువు లెట్టివారు, గురువెట్టివాఁడు, తలిదండ్రు లెట్టివారు, భార్యాభర్త లెట్టివారు, ఇహపరము లెట్టివి అనియు,

ఇందు పరస్పరవిరోధము తటస్థించినప్పు డెట్లుగాఁ బ్రవర్తింపవలయును అనువిషయములను మనవేదశాస్త్రములు, పురాణేతిహాసములు చక్కఁగ బోధించుచున్నవి. ప్రపంచమంతయు నొకే కుటుంబమైనను వేలువేలు కుటుంబములుగ జీవించుట ప్రకృతిధర్మమై యున్నది. ఎవరికుటుంబమును వారు చక్కఁగ నెఱవేర్చుటవలనఁ బ్రపంచసుఖ మొనఁగూడుచున్నది. కావునఁ గులమే అనఁగా గృహమే ప్రపంచసౌఖ్యమునకు మూలస్థానమగుచున్నది. గృహమనఁగా ప్రపంచసంబంధముగల సన్నిహితమైన ఒక కూటము అనిభావము. కుటుంబమును బాడొనరించినవాఁడు ప్రపంచద్రోహియే యగుచున్నాఁడు. కులమును నలక్ష్య మొనరించినవాఁ డెన్ని ఘనకార్యములు చేసినను నవి హర్షింపఁదగినవి కానేరవు. కులమును బాడొనరింపఁజూచుచున్న మేము ఘనకార్యము చేయుచున్నామని తలంచుట సమంజసము కాదనియే అర్జునవిషాదయోగమందలి సారాంశము. దుర్యోధనుఁడు బ్రాహ్మణాదిభక్తిగల్గినవాఁడు. పాండవులనువిడిచి దుర్మార్గమైన యాలోచనముగలవాఁడు కాఁడు. పాండవులనుబురస్కరించుకొనియే వానికిఁ గృష్ణద్వేషము గలిగినది. వానియం దున్నదోషము పాండవద్వేషము. అందువలనఁ గులఘాతకుఁడు కావలసివచ్చినది. దానిచే దుర్మార్గుఁ డనిపించుకొనినాఁడు. దైవవిరోధముగూడఁ దటస్థించినది. కావునఁ గులపోషణమే సమస్తసుఖములకు మూలమైనది.

గృహమును జక్కఁగనిర్వహించుట కనేకమైనపనులు గావింపవలసియున్నది. ధర్మార్థకామమోక్షములను సాధింపవలసియున్నది. గర్భోత్పత్తిమొదలు ప్రసవమగువఱకును గర్భిణీస్త్రీకి అనేకనియమములుగలవు. మఱియుఁ బాలువిడుచువఱకు జాగ్రత్తగఁ బిల్లలను బెంచవలసియున్నది. అటుపిమ్మటనుగూడ వివాహమై సంసార మొనరించువఱకును గూడ సంతానమును బెంచవలసియున్నది. సంసారము కొనసాగుటకు పైనివ్యాపకము చేయవలసియున్నది. పిల్లలు పెద్దవారగుటతోడనే తలిదండ్రులయవసరమునశించినదని తలంపరాదు. ప్రపంచము ననుభవించుటకును, సంసారబంధమునుండి ముక్తినందుటకు ననేకవిధముల కారణులైన తలిదండ్రులను వారి వృద్ధదశయందు సంతానము గాపాడవలసియున్నది. మఱియుఁ గులధర్మములను గాపాడవలసియున్నది. కులమనఁగా నిరువదియొక్క

పురుషాంతరములతోను, గృహ (కుల) దేవతలతోను సంబంధించినది అని తెలియవలయును. జన్మాంతరసంబంధములనుగూడ సంవత్సరమునకొక మాఱు సంస్మరించుటగూడఁ గలదుగదా. ఇంతియగాక అతిథిఅభ్యాగతుల నాదరింపవలసియున్నది. గృహకృత్యములలోనిది మిక్కిలిప్రాముఖ్యముఁ గలిగియున్నది. కార్యార్థులై వచ్చిన అతిథిఅభ్యాగతుల కీయాదర మెంత యేని సౌఖ్యమైనది స్వగృహతుల్యమైనది. సమస్తప్రాణులందుఁ గని కరముఁజూపుట గృహధర్మములలో నొకటి యైయున్నది. గృహమును సొంతముగ మంచిగనెఱవేర్పవలయునన్న నీపనులన్నియు విధిగ జరుగు చుండవలయును. గృహపోషణము వెలుపల నాధారపడియున్నది. కావున సంపాదనార్థము పైని బంధింపఁబడినవాఁడు గృహస్థుఁడు (పురుషుఁడు). ఆతెచ్చినది సద్వినియోగముగావించునది గృహిణి (స్త్రీ). గర్భో త్పత్తి, స్తన్యమొసఁగుట, శిశుపోషణము స్త్రీధర్మములుగఁ బ్రకృతియేర్ప ఱచియున్నది. ఇందువలన స్త్రీలు ఇంటనుండవలసినవారు, పురుషులు పైని సంచరించువారు అను భిన్నధర్మము లేర్పడినవి. నేఁడు ప్రపంచమును మరామత్తు చేయఁజూచువారు ఇందుకు వ్యత్యాసమును దలపెట్టు చున్నారేకాని ఆవాసనలేనిచోట్ల, పైధర్మమే సాగుచున్నది. ఏదేశమం దైన నిది నవీనముగా బయలుదేఱినదేగాని అనాదికాలమునుండి లేదు. ఈప్రకృతిధర్మమునుబట్టియే సంపాదనాదులచేఁ బైనిబంధింపఁబడిన పురు షునివద్దకు స్త్రీ వెళ్లవలసివచ్చినది. కావుననే స్త్రీ (భార్య) పురుషునింటికి (భర్తయింటికి) వెళ్లుటయనునది అనాదిఆచారమై యున్నది. ప్రాజ్ఞతవచ్చు సరికి ఆడపిల్లలు భర్తృగృహముఁజేరుట, మగబిడ్డలు స్వగృహమున నుండుట సంభవించుచున్నందునఁ దలిదండ్రులను గుటుంబమునుబోషించు వాఁడు మగవాఁడైనాఁడు. కావున నాస్తి కధికారి పురుషుఁడైనాఁడు. స్త్రీల కిందువల్లనే ఆస్తిసంక్రమించలేదు. స్త్రీలుగూడ సంపాదనాపరులైన యెడల ననేక సమయములలో నుపయోగించునుగదా. పురుషుఁడు తెచ్చి నది చాలనపుడు పనికివచ్చునుగదా. అది విశాలదృష్టియగునుగదా. వారి కట్టిఅవకాశము నేల పాడొనరింపవలయును. కావున నవకాశమున్న స్త్రీ

లేల సంపాదనాపరులు కాఁగూడదు అనిశంకించుట పొరపాటు. *సంఘ చరితము లేనందున ననఁగాఁ గట్టుబాటునశించినందుననే నేఁడు ప్రపంచ మున విషమపరిస్థితి గల్గినది. పెద్దలుచెప్పినట్లుగాఁగాని, తమలోఁ దాము గాని కుదురుఁబాటునకు వచ్చుస్వభావము సంఘమున నశించియున్నది. ప్రతివిషయము న్యాయస్థాన మూలముననే పరిష్కారము కావలసి యున్నది. ఎవరియిష్టము వారిదే కాని సంఘమున కెవరును కట్టుపడియుండ లేదు. గృహమునకు, సంఘమునకు, దేశమునకు, ప్రపంచమునకు సౌఖ్య మునుగూర్చునది మనసంఘనిబంధనము. ఆపూటకు లేనివానికి ఏనిబంధ నమో చక్రవర్తికిని అదేనిబంధనము. చక్రవర్తికూఁతురికైనను ఆస్తి విభాగములేదు. పునర్వివాహములేదు. ఇట్లుగా భారతదేశమందు సంఘ నిబంధనము గలదు. చక్రవర్తికొమార్తెకు పుట్టినింటివారు ఆస్తివిభాగ మని కాకపోయినను విశేషధనము నిచ్చుచుండెడివారు కదా అని శంకిం చుటతగదు. పుట్టింటివారందఱును ఆడపిల్లలకు కొద్దిగనో గొప్పగనో యిచ్చుచునే యున్నారుగదా.

భారతదేశసంఘనిబంధనములో ముఖ్యమైనది వృత్తినిబంధనము. ఎవరివృత్తివారిది. ఆవృత్తిని విడిచి యితరవృత్తులకుఁ జొరనీయదు ఇచ్చటినిబంధనము.అట్లగుటవలన నన్నివృత్తులకు ఘనమైనరక్షయుండెడిది. ఒత్తిడి యేమాత్రముండెడిదికాదు. జన్మచేతనే ఉద్యోగము సిద్ధమై యుండెడిది. నిరుద్యోగసమస్యకే యవకాశములేదు. అందువల్లనే అవకాశ మున్న స్త్రీపురుషులు మేలుగలిగినను గూడ నితరవృత్తు లాశ్రయింపఁ గూడదు అని మనసంఘనిబంధనము శాసించుచున్నది. అవకాశమున్న వారు ఇతరవృత్తుల నాశ్రయించినయెడల సంఘక్షేమమునకు, సంఘ నిబంధనకు హానికలుగునని మనవారుచెప్పియున్నారు. ఇప్పుడట్లే యేర్పడి యున్నదికదా.

ఆస్తి లేక సమస్తమును విడిచివచ్చినస్త్రీని భర్త లేక అత్తవారు నిరాదరించినచో ఆస్త్రీగతి యేమిఅనినచో నట్టిస్త్రీకి ఉచితపరిస్థితిని మన వారు కల్పించియేయున్నారు. అట్లేర్పఱచిన దానివలన స్త్రీలకు ఉదరపోష

* మనదేశమున గృహకృత్యములకు అడ్డురానిపనులను స్త్రీలాచరించి సంపాదించి నది గృహమునకు వినియోగమగుచున్నది.

ణము జరుగుటలేదు. పెక్కుఅవస్థలకు అట్టివారు గుఱియగుచున్నారు. వారిబీదస్థితికి వగచువారులేరు. సంబంధమువీడినందున లేక పడనందున అత్తవారు, తమబాధ్యతపోయినదనితలంచు పుట్టింటివారును నిరాదరము సేయుటవలన నట్టిస్త్రీలబ్రతుకులు మిగులహైన్యస్థితియం దుంటున్నవి. కావున స్త్రీలకుఁగూడ ఆస్తివిభాగ మేర్పఱచిన నిట్టిచిక్కులు గలుగవు కదా అనిచెప్పుటకూడదు. మనపరిస్థితులనుబట్టి శాశ్వతమైన కట్టుపాట్లను దూలనాడరాదు. అట్లే మనపరిస్థితులనుబట్టి వెనుకటిస్థితిని విమర్శింప రాదు. తమ్ముదామము సంరక్షించుకొను పరిస్థితియందు మనసంఘము లేదు. తల్లిని, తండ్రిని, కుమారుని, కుమార్తెను, భార్యను, భర్తనుగూడ వం చించుచున్న దీప్రస్తుత దుర్భరబీదపరిస్థితి. కట్టెదుర వారివారిదుర్భరావ స్థలఁ బరికించుచున్నను నేమియుఁజేయలేని పరిస్థితియందు మనసంఘ మున్నది. అందఱితోఁబాటుగనే కొందఱుస్త్రీల కిట్టిహైన్యస్థితి గలుగు చున్నది. భారతదేశోద్ధరణ ఫలించిననాఁడు అందఱితోఁబాటు స్త్రీలస్థితి గతులుగూడ సరిపడునుగదా.

కన్యను వివాహమాడిననాఁడు గృహస్థుఁడగుచున్నాఁడు. కావున భార్యతోడనే గృహస్థుఁ డగుచున్నాఁడు. ప్రపంచమర్యాదనుస్మరించుచు భార్యాభర్తలు చక్కఁగ సంసారములు సాగింపవలయును. వా రన్యో న్యమువిడిచి వర్తింపరాదు. మఱియు నట్లే తల్లిదండ్రులనుగాని, అన్న దమ్ములనుగాని, కుమారులనుగాని విడిచియుండరాదు. అందఱును గలిసి యుండుట క్షేమము. ప్రేమనువృద్ధిచేయును. అదియే శుభకరము. కుటుంబభారము సంఘక్షేమకరము. కుటుంబభారము సన్నగిల్లు చున్నందునఁ బ్రేమ సన్నగిల్లి అవసరసమావేశములే ముఖ్యమై పాశ్చాత్యదేశములు అస్థిరసంసారములు గలవగుచున్నవి. తండ్రి చనిపోయినతోడనే లేక ఆశ్రమాంతరము ప్రవేశించినంతనే కుమా రులు స్వతంత్రు లగుచున్నారు. అది ప్రకృతిధర్మమైయున్నది. వా రన్యోన్యము కలిసియుండవచ్చును లేక వేఱుకావచ్చును. కావున భార్యా భర్తలే సంసారమూల మగుచున్నారు. వారు విడివడియుండరాదు. విడి వడియున్నందున లోకద్రోహ మొనరించినంతపాపము గలుగుచున్నదని పరమార్థము. తండ్రిమాటను గొమాథుఁడు, భర్తమాటను భార్యయు

శిరసావహింపవలయును. కొమారుఁ డాత్మజుఁడనియు భార్య అర్థాంగి యనియు మనశాస్త్రములు చెప్పుచున్నవి కుమారుఁడు ఆత్మరూపుఁడని చెప్పఁబడినదిగాని కుమారునిరూపుఁడు తండ్రియని చెప్పఁబడలేదు. అట్లే భార్య అర్థాంగియని చెప్పఁబడినదికాని భర్త అర్థాంగుఁడని చెప్పఁబడలేదు. ఇందున్న పరమార్థమేమి కుమారుఁడు సర్వాత్మనా తండ్రి మాట వినవలయును. కుమారుఁడు తండ్రిని శాసింపఁగూడదు. అట్లే భార్య భర్తమాటను శిరసావహింపవలయును. భర్తను భార్యశాసింపఁగూడదు. కుమారునకును భార్యకును హితముపదేశించు స్వాతంత్ర్యము గలదుగాని శాసించునధికారములేదు. తండ్రికిని, భర్తకును శాసించు నధికారముకలదు. తండ్రిమీఁదఁ గొమారునకు: గోపముగల్గినను, కుమారునిపైని తండ్రికిఁ గోపముగల్గినను, ద్వేషవంతులైనను, విడివడియుండినను దండ్రి కుమారులే యగుదురుకాని ఆసంబంధమునకు భంగమురాదు గదా. అన్నదమ్ములును అట్లేకదా. అట్లే భార్యాభర్తలసంబంధముగూడ విడరానిదియని యెఱుంగవలయును. కన్నవానిని విడిచి యితరునిఁ దండ్రియని కుమారుఁ డెట్లుపిలువఁడో అట్లే కట్టుకొన్నవానినితప్ప ఇతరుని భర్తయని స్త్రీ వచింపఁగూడదు. అది జన్మములో నొక్కమాతే కలుగునుగాని పలుమాఱుకలుగదు. పాతివ్రత్యమనఁగా నదియే. కట్టుకొన్నవాఁడే విభుఁడని నమ్మియుండుటయే. ఇది ప్రకృతియేర్పఱచిన ధర్మము. అంతియకాని ప్రతివ్రతయైనదానికి వేఱుదేవుఁడు, దయ్యము, దేశము ఇతరమేమియు నక్కఱలేదనికాదు. దైవవిరోధులగు భర్తలకు దైవభక్తిగల్గిన భార్యలు, కఠినాత్ములకు సౌమ్యవతులును, లోభవంతులకు దానశీలముగలవారును నగు భార్యలుగలరని పురాణేతిహాసములందుఁ జెప్పఁబడినది.

పాతివ్రత్యముగల్గినట్టి స్త్రీలు సద్గుణముల కొలఁది ప్రపంచమును బంచభూతములనుగూడ లోఁబఱచుకొనఁగలరు. వారిమహిమ అపారము. భార్యను దూతికగాఁ జేసినాఁడొకఁడు. భర్తను మోచికొనిపోవు సమయమున భర్తకు ముప్పుగలిగినది. త్రోవలోనున్న ఋషినిఁ దన్ని వేసినది. ఆఋషి శపించినాఁడు. అందువలన సూర్యోదయమగునెడల భర్తకు మరణము గలుగుచున్నది. కావున సూర్యోదయమే గాకుండ శపించి

నదా యిల్లాలు. ఒక్క తనభర్తకొఱకు ప్రపంచక్షోభ నేకల్పించినదా యిల్లాలు. ఈఐతిహ్యమును నిందాపూర్వకముగ నుదాహరించి రెడ్డిగారు శాస్త్రవిహితధర్మమును దూలనాడిరి. పురాణము లబద్ధమని తేల్చిరి. ఇది పతివ్రతాలక్షణముకాదనిరి. ఋషినిఁ దన్నినదోషమునకుఁ దనకు శాపము రావచ్చునుగాని నిరపరాధియగు భర్తకు ఆపదరారాదు. అందువలనఁ బ్రపంచక్షోభకైన నొప్పుకొన్నది. అపరాధము లేనప్పుడు ఎంతవచ్చినను బ్రాణహానికి సమ్మతింపరాదు. లక్షలకొలఁది కుటుంబములతోడ, బంధువులతోడ రావణుఁడు నశించుచున్నను తనయం దెట్టిదోషము లేనందున సీత ప్రాణత్యాగ మొనరించలేదు. తనమూలమున ననేకకుటుంబములు నశించినను ఆదోష మామెకుఁ గలుగలేదు. తనమూలమునఁ బ్రపంచక్షోభగలుగునని తెలిసినను ధర్మరాజు చనిపోక జీవించియేయుండెను. మహామహిమాన్వితులగు అట్టివారి చరిత్రములం దధర్మమునకు జయము రాదు. ఆనిశ్చయము వారికిఁగలదు. ద్రౌపదికి మానభంగము జరుగదని భీష్మాదులకు నమ్మకముగలదు. పైపతివ్రతయు ప్రపంచక్షోభజరుగదని యెఱుఁగును.

సత్పురుషులకుఁ గార్యసానుకూలమున కెట్టి అవకాశము గలుగని నాఁడు ఆపురుషులు యుద్ధమందుఁ బ్రాణములర్పించియు వారిస్త్రీలు సహగమనముఁజేసియుఁ గుల దేశ ప్రపంచగౌరవములను నిల్పియున్నారన్న సంగతి చరిత్ర స్పష్టముచేయుచున్నది. అట్లాచరించుటవలన నసత్ఫలము గలుగదని మనశాస్త్రములు చెప్పుచున్నవి.

భార్యాభర్తలకు, తండ్రికుమారులకు, తల్లికొమారులకు, అన్నదమ్ములకు, ప్రభుసేవకులకు అందఱికిని ఒకరిమీఁద నొకరికి విరక్తిగలుగ వచ్చును. విరక్తిగలిగినపుడు స్వేచ్ఛమాత్రము వారికి మనసంఘనిబంధన మీయదు. కులముయొక్కమర్యాద నెవరును నతిక్రమించరాదు. అట్లే రాచమర్యాదను నతిక్రమించరాదు. కావుననే భీష్మాదులు కౌరవులను విడువలేదు. కాని వారు పాండవులయందు (ధర్మమందు) అభిమానము చూపియున్నారు. విదురుఁడు పాండవుల నాపదనుండి సంరక్షించినాఁడు. పాండవులడిగినప్పుడు భీష్ముఁడు తనకు మరణము సంభవించురీతినిఁ జెప్పియున్నాఁడు. ఇట్లు ప్రవర్తించినను వారు ప్రభుద్రోహము చేయనేలేదు.

అట్లే భర్తకు, తండ్రికి, అన్నకు, ప్రభునకు, యజమానికి ద్రోహముచేయ రాదు. వీరధర్మమార్గమునఁ బ్రవర్తించినపు డెట్లుచేయవలయును అను అనేకవిషయములను విస్తారముగ మన వేదశాస్త్రపురాణేతిహాసములు బోధించియున్నవి.

అన్న, ప్రభువుఅయిన రావణునివిడిచి శత్రువగు శ్రీరామునిఁ జేరుటయేగాక వానిగుట్టుమట్టములనుగూడ విభీషణుఁడు దెల్పియున్నాఁ డని రామాయణమందుఁ గలదు. కులస్త్రీకి మానభంగమగు సమయమునఁ గూడ భీష్మాదులు ప్రభుని విడువలేదు. లేచిపోలేదు. అని భారతమందుఁ గలదు

రావణుఁడు నిందించి రాజ్యమునుండి పొమ్మన్నందున విభీషణుఁడు లంకను విడిచివచ్చెను. అట్లే ధృతరాష్ట్రుఁడు విదురుని పొమ్మన్నప్పు డాతఁడు వెడలిపోయెను. రావణుఁడు పరస్త్రీవాంఛగలవాఁడు, కుల స్త్రీనిఁ జెఱుపనెంచినవాఁడు, లోకకంటకుఁడై యున్నందున యుద్ధాభి ముఖుఁడై యున్నశత్రుని (శ్రీరామునిఁ) జేరి విభీషణుఁడు మర్మముల నెఱిఁగించియున్నాఁడు. అదియు రావణుఁడుపొమ్మనినపుడేచేసియున్నాఁడు. అంతకుముందుగాఁ (బదినెలలకు ముందుగనే) రావణుఁడు సీతను దెచ్చి యున్నాఁడు కాని రావణుఁడు సభలో మంత్రాంగ మొనర్చినపుడే విభీ షణుఁ డందువిషయమై తగువిధమునఁజెప్పెనుగాని అంతకుముం దావిష యమై ప్రసంగించలేదు. అపకారికాలేదు. ప్రసంగముగల్గినపుడే సత్పురు షులు ప్రసంగించెదరు. అట్లనుటచేఁ బ్రసంగము కల్పించుకొనరాదని యర్థముకాదు. ప్రసంగముగల్పించుకొని చెప్పవలసినవికూడ గలవు. భారతమందలి దిట్టిసందర్భముకాదు. దుర్యోధనునకు ద్రౌపదిపై వాంఛ లేదు. ఈర్ష్యమాత్రమున్నది. అవమానపఱుపవలయుననియే వానియుద్దే శ్యము. ద్యూతానంతరము దుర్యోధనుఁ డిట్లు పలికినాఁడు.

(విదురా *పాండవప్రియపత్నియైన ద్రౌపదినిఁ దోడ్కొనిరమ్ము. పనికత్తెలతోఁగూడి యింటిపనులు చక్కఁబెట్టవలయును ) అని పలికినాఁడు.

---

* ద్రౌపదినిజయించిన దుర్యోధనుఁడు ద్రౌపదినిఁగూర్చి పాండవపత్నియనియే వచించియున్నాఁడు. భార్యాభర్తల సంబంధము విడువనిది. కావున దాసిగాఁ జేసుకొను నధికారముమాత్రమే దుర్యోధనునకుఁ గలిగినది.

శ్లో. ఏకవస్త్రా త్వధో నీవీ రోదమానా రజస్వలా
సభామాగమ్య పాంచాలీశ్వశు రస్యాగ్రతోభవ. ౬౬-౧౯
అథత్వా మాగతాం దృష్ట్వా రాజపుత్రీం సభాంతదా
సభ్యాః సర్వే వినిందేరన్ మనోభిర్ధృతరాష్ట్రజం. (కుం. ౮౯—౩౧, ౩౨.)

విదురుఁ డది తగనిపనియని హిత ముపదేశించినాఁడు. దుర్యోధనుఁడు వినలేదు. విదురునిదూషించి ప్రాతికామియను వానిని ద్రౌపదినిఁ దెచ్చుటకుఁబంపినాఁడు ఆమె ధర్మజు నొక్కధర్మసందేహ మడిగిరమ్మన్నది. 'తన్ను ముందుగాఁ దానోడిపోయెనా లేక నన్నోడెనా' అని యడిగిరమ్మనినది. అందులకు ధర్మజుఁ డేమియు బదులు పలుకలేదు. సభకువచ్చియే యడుగవచ్చును గొనిరమ్మని తిరుగ దుర్యోధనుఁ డా ప్రాతికామినిఁ బంపినాఁడు. కాని ఈమాఱును ద్రౌపది సభకురాలేదు. సభికులనే ధర్మమడిగిరమ్మనినది. ద్రౌపది సభకురావలయునని దుర్యోధనుని అభిప్రాయము. సభకుఁబోఁగూడదని ద్రౌపదితలంపు. దుర్యోధన నిర్బంధమున సభికులేమియు మాటాడలేదు. సభకువచ్చిన పిమ్మటనే యడుగవచ్చునను నభిప్రాయమును దుర్యోధనుఁడు గనఁబఱచెను. సుశీలవతియగు ద్రౌపది సభకురాదని గ్రహించి ధర్మజుఁ డామెకు నమ్మకమైన దూతనొకనిఁబిలిచి

శ్లో. ఏహి క్షత్త ర్ద్రౌపదీమానయస్వ ప్రియాం భార్యాం సమ్మతాం పాండవానామ్,
సంమార్జతాం వేశ్మ పరైతు శీఘ్రం తత్రాస్తు దాసీభిరపుణ్యశీలా.
సభా. ౬౭-౧ (కుంభ. పుట. ౮౯-౧.)

'ఒంటిచీరతోనున్నను, కోఁక ముడియూడిపోయినను, రజస్వలవై యున్నను నేడ్చుచువచ్చి మామగారియెదుట నిలువుము. అదిచూచి సభ్యులందఱు వారి మనంబులందు దుర్యోధనుని దూషింతురు.' అని కబురంపెను. బుద్ధిపూర్వకముగా ధర్మజుఁడు తానై ద్రౌపదినొడ్డలేదు. శకునిప్రేరణమునఁ బందెమొడ్డెను. ధర్మజునిచే నింక నాతని కాస్తిలేదని యనిపించవలయునని శకునిపట్టుదల. చక్రవర్తియైన ధర్మజుఁడు 'లేదు' అనిపలుకఁజాలకుండెను. కావునఁ దనభార్యయైన ద్రౌపదిని శకుని ప్రేరేపించిన పిదపఁ బందెముగానొడ్డెను. తానొనర్చినది ధర్మమే అయినను ద్రౌపది ప్రశ్నకు ధర్మజుఁడు సమాధానమీయఁజాలకుండెను. సిగ్గుపడియెను. కావుననే రహస్యముగా ద్రౌపదికి కబురంపెను. సభకువచ్చుట తప్పదని కబురంపెను. అట్లు కబురంపనిచో నెట్లయిన శీలమును గాపాడుకొనునే

కాని ద్రౌపది సభకురాదు. ప్రాతికామి దుర్యోధనాజ్ఞ ననుసరించువాఁడైనను దిరిగి ద్రౌపదియున్న కడకుఁబోవుటకు మిగుల భయపడుచుండెను. దుర్యోధనుఁడు పాండవుల మోములఁజూచి వారు ధర్మపాశబద్ధులై యున్నారని గ్రహించి, వారేమియుఁ జేయఁజాలరని యెఱిఁగి, భయపడుచున్న ప్రాతికామినిఁ బొమ్మని ద్రౌపదినిఁదెచ్చుటకై దుశ్శాసనునిఁ బంపినాఁడు. ద్రౌపది సభకు రాకుండుటకై మఱి కొన్ని ప్రయత్నములు చేసినది. దుశ్శాసనుఁడు వచ్చినతోడనే గాంధారి మున్నగువారున్న కడకుఁ బాఱిపోయెను. ఆనీచుఁ డచ్చటనే రాజసూయావభృథమందు మంత్రపూతమైన జలముచే నభిషేకింపఁబడి పవిత్రతనొందినసాధ్వి ద్రౌపదియొక్క కురులను బాండవుల పరాక్రమమును దిరస్కరించుచు నొడిసిపట్టెను. 'ఇది ధర్మము కాదు. నన్ను సభకుఁగొనిపోరాద'ని దుశ్శాసనునితో నామె మెల్లఁగఁజెప్పినది అందుకు వాఁడు మీఁదు మిక్కిలిగా మాటాడెను. ద్రౌపది చేసినప్రయత్నములన్నియు వ్యర్థములయినవి. దుశ్శాసనుఁడు ద్రౌపదిని సభలోనికీడ్చుకొనివచ్చి 'దాసీ, దాసీ' యని పిలిచినాఁడు. ధర్మజుఁడు రమ్మన్నందుననే ద్రౌపది సభాముఖమును . జూచినదికాని లేనిచో రానేరాదు. లజ్జతోఁగూడియున్నది గావున సభకుఁ దిన్నగా రాలేకపోయినది. ద్రౌపది నట్లుసభకుఁ దెచ్చునధికార మాకౌరవులకుఁ గలదుగావుననే పాండవు లోర్చియుండిరి. సభలోని పెద్దలుకూడ ద్రౌపది జయింపఁబడినదనియే తలంచియుండిరి. అదిగ్రహించియే కర్ణుఁడు పాండవుల యొక్కయు ద్రౌపదియొక్కయుఁ గట్టుఁబుట్టములను దెమ్మని దుశ్శాసనునితోఁ జెప్పినాఁడు. మయసభలోఁ బరాభవమొంది దుర్యోధనుఁడు పాండవు లిచ్చినబట్టలను గట్టుకొనవలసివచ్చినది. అప్పుడు పాండవులు ద్రౌపదియు వానినిఁజూచి నవ్వియుండిరి. తత్ప్రతిక్రియకై ప్రియస్నేహితుఁడగు కర్ణుఁడు వారివస్త్రముల నపహరింపఁదలపడెను. దాసులైనవారికి రాజోచితమైన దుస్తులుండరాదని వారిదుస్తులను గొనితెమ్మనినాఁడు. పాండవులు తామే తమదుస్తులను దీసివేసి కూర్చొనిరి. (వేఱుదుస్తులను ధరించిరి.) కర్ణుఁడు అనరానిమాట లాడఁగా భీముఁడు పట్టరానికోపముతోఁ గూడినవాఁడై, వేఁడినిట్టూర్పునిగిడించుచుఁ, గోపానలంబుచే ధర్మజుని దహించుచున్నట్లు కన్నులెఱ్ఱఁజేసి ధర్మరాజుతో నిట్లనియె.

శ్లో. నాహం కుప్యే సూతపుత్రస్య రాజన్నేష సత్యం దాసభావం (దాసధర్మః) ప్రవిష్టః,
కిం విద్విషోవై మామేవం వ్యాహరేయు ర్నాదేవీ త్వం యద్యనయా నరేంద్ర.
౭౦-౮ (కుం. ౯౨-౨౫.)

(రాజేంద్రా, దాస్యధర్మమునుజూచుటచేఁ గర్ణుఁ డన్న పలుకులకు నాకు రోషములేదు. నీవీద్రౌపదినోడ్డి జూదమాడకున్నఁ బగతు రిట్లు మనలఁ బరిహాసంబుఁ జేయనోపరుగదా.) అని పలికెను. కావుననే కర్ణుఁడు చెప్పిన మాటపైననే పాండవులు కట్టుబట్టలను దీసివైచిరి. తానడిగిన ప్రశ్నకు సమాధానము రానందునను, బాండవులయానతి లేనందునను ద్రౌపది వస్త్రముచేయుటకు సమ్మతించలేదు. అధికారము గల్గినట్టిప్రభువులు తిరస్కారము నున్నవారిని శిక్షించిరైనఁ దమయాజ్ఞను జెల్లించు కొందురుకదా.

శ్లో. తతో దుశ్శాసనోరాజన్ ద్రౌపద్యా వసనం బలాత్,
సభ్యామధ్యే సమాక్షిప్య వ్యపాక్రష్టుం ప్రచక్రమే. ౬౭-౪౦ (కుం. ౯౦—౪౦.)

(దుశ్శాసనుఁడు ద్రౌపదికట్టినబట్టను బలాత్కారముగాఁ బట్టిలాగి సభలో నొలువఁబూనెను.) బలాత్కారమునఁ దీయఁదలపడెను. అది గాంచియుఁ బాండవులేమియు మాటాడలేకపోయిరి. ధర్మమునుమిషపెట్టి దుర్మార్గప్రభువులు గావించుకృత్యము లమానుషములుగదా. అప్పుడు ద్రౌపది శ్రీకృష్ణునిఁ బ్రార్థించినది. ఆమహానుభావుఁడు ద్రౌపది ప్రార్థనము నాలకించి వేవేగఁ బాన్పునుండి దిగి రుక్మిణీదేవినిఁగూడ విడిచి, ద్రౌపదియున్నకడకువచ్చి, అంతర్హితుఁడగనుండి అనేకములైన వస్త్రముల నొసంగుచుండెను. కౌరవులనొమ్మయిన చీర (ద్రౌపదికట్టియున్న చీర) ఒలువఁబడెను కాని ద్రౌపది మేన రాజలాంఛనము గనఁబఱచు చీరయేయుండెను. అప్పుడు 'దుశ్శాసనుని ఱొమ్ముప్రచ్చి రక్తము పానము చేసెదను' అని భీముఁడు గంభీరముగాఁ బ్రతినఁబూనెను. తన్నుఁగూర్చి ద్రౌపది మొఱలిడినది గావున శ్రీకృష్ణుఁ డామెకుఁ జీరల నొసంగినాఁడు. ద్రౌపది యిట్లు పరాభవింపఁబడుచుండినను, గౌరవులు కర్ణుఁడును సహింపరాని మాటలాడుచుండినను ధర్మపాశబద్ధులైయున్నందునఁ బాండవులు సహింపవలసివచ్చినది. అట్టి మహాత్మురాలికి మానభంగము కారాదు. సతీత్వమునకు భంగమురారాదు. వంచనమై యిట్లాటుసింహాములను

మెలఁకువతో నాడించుచున్న కౌరవులకు విధి తగిన పరాభవము చేసినది. పాండవులిచ్చిన దుస్తులనుగట్టుకొని దుర్యోధనుఁడు లోఁగడ సిగ్గుపడినాఁడు దుశ్శాసనుఁ డాఁడుదాని చీరతీయలేక శ్రమపడి యిప్పుడు సిగ్గుపడినాఁడు. ద్రౌపది తనమానమును గాపాడుకొనఁగల్గినది. కౌరవులు దుర్మార్గులు. నీచకార్యము గావించిరి. అని యనిపించినది. పాండవులయశమును గాపాడినది. కీర్తిగాంచినది.

ద్రౌపది జయింపఁబడినదనియుఁ, గాని యామె ప్రశ్నలో స్వారస్యముగలదనియు, నవి పరిష్కరించుటకు రాని ప్రశ్నయన్నియుఁ బాండవులు గ్రహించియుండిరి. విధి తమ కనుకూలమైనదనియుఁ, బ్రస్తుతపరిస్థితి తమకనుకూలమగుననియు భీముఁడు గ్రహించినాఁడు. ద్రౌపదియొక్కమాన మప్పుడే కదా కాపాడఁబడినది. కావుననే దాసత్వమున నున్నను ధర్మవిరుద్ధము కాదని నిర్ణయించుకొనియే భీముఁడు 'దుశ్శాసునిఁ జంపెదను' అని ప్రతిజ్ఞ చేసినాఁడు. అంతకుముం దీద్రౌపదియొక్క బాధలను, గౌరవుల తీక్ష్ణవచనములను సహించెనే కాని మాటాడుటకు సాహసించియుండలేదు.

శ్లో. యద్యేతదేవ ముక్త్వాహం న కుర్యాం పృథివీశ్వరాః,
పితామహానాంపూర్వేషాం నాహంగతిమవాప్నుయాం.
అస్య పాపస్య దుర్బుద్ధే ర్భారతా పసదస్యచ,
నపిబేయం బలాద్వక్షో భిత్వాచే ద్రుధిరంయుధి.

౬౭-౫౩, ౫౪ (కుం. ౯౦, ౫౬, ౫౭.)

(యుద్ధరంగమున భారతకులంబునకు వేలువిత్తయిన యీదురాత్ముండగు దుశ్శాసనుని ఱొమ్ము వ్రచ్చి వానిరక్తంబుఁ ద్రావెద. అట్లు నేఁజేయకున్న నాపితృపితామహాదులగతిని నేఁబొందఁజాలను.) అని ప్రతినఁబూనెను. దాసధర్మమున నుండునంతసేపు వీని నేమియుఁజేయను. ఈయవస్థదాటి యుద్ధముసంభవించినపుడు రక్తమే పానముచేసెదను అని పలికెను. ఇంతకుముందుగా దుశ్శాసనుఁడు సభలో నీడ్వఁగాఁ బైఁట కొంగు జాఱిపోవుచుండ నేడ్చుచున్నదియు, నట్టి భంగపాటునకుఁ దగనిదియు, రజస్వలయైన ద్రౌపదినిఁజూచి, భీముఁడు మిక్కిలి నొచ్చినవాఁడై యుధిష్ఠిరునిపైఁ గడుఁగోపగించి యిట్లనెను. 'యుధిష్ఠిరా, జూద

రులయిండ్లలో అంకులాఁడులుందురు. వారుగూడ వారినొడ్డి జూద మాడరు. ప్రేమతోఁ జూచుకొందురు. సమస్తైశ్వర్యమును, రాజ్యమును, మమ్ములను, నిన్ను జూదములోఁ బరులు హరించిరి. నాకందువిషయమై కోపము లేదు. నీవీసమస్తమునకుఁ బ్రభుఁడవై యున్నావు. కాని ద్రౌపది నొడ్డుటమాత్ర మతిక్రమమైన పనియని తలంచెదను. నీనిమిత్త మీద్రౌపది కౌరవులచేఁ గడుబాధనొందుచున్నది. ఈద్రౌపదినిమిత్తముగా నీపై నేను గసిఁదీర్చుకొందును. నీబాహువుల నిపుడే కాల్చెదను. సహదేవా, 'అగ్నిఁదెమ్ము' అని భీముఁడు పలుకఁగా నర్జునుఁ డిట్లు పలికెను. 'నీవింతకు మున్నెప్పు డిట్టిపలుకులు పలుకఁగఁ జూడలేదు. ఈదురాత్ములవలన నీధర్మ గౌరవము (ధర్మమునందు మర్యాద-ధర్మరాజునందు గౌరవము) నష్ట మయ్యెఁగదా. పగతురకోరిక లీడేర్పకుము. శ్రేష్ఠమైన ధర్మమునే యాచ రింపుము. ధార్మికుఁడైన యన్నను నెవ్వఁడతిక్రమింపనగును. జూదమునకు రమ్మనిపిలువఁగ యుధిష్ఠిరుఁడు క్షత్రియధర్మము దలంచుచుఁ బరకామము చేత జూదమాడవలసివచ్చినది. ఇది మనకు మఱియుఁ గీర్తికరమేకదా' అని నివారించియున్నాఁడు. తరువాత వస్త్రాపహరణము జరిగినది. ఈ రెండుచోట్ల (కొప్పుపట్టి దుశ్శాసనుఁ డీడ్చినప్పుడును, చీరలువిప్పినపు డును) భీముఁడు కోపగించెను. ఇందొకవిశేషముగలదు. ఈరెండుచోట్ల ద్రౌపదిని బాధించినవాఁ డొక్కఁడుదుశ్శాసనుఁడే. అయినను భీముఁడు కొప్పుపట్టి యీడ్చినపుడు దుశ్శాసనునిపైఁ గోపగింపక ధర్మరాజుపైఁ గోపగించెను. వస్త్రాపహరణమప్పుడు దుశ్శాసనునిఁ బైననే 'రక్తము పానముచేసెదను' అని ప్రతినఁబూనినాఁడు. దుశ్శాసను నేమియు నన లేనిపరిస్థితియందప్పుడుండుటచే (ధర్మపాశబద్ధుఁడైనందున) భీముఁడు ధర్మజునిపైఁ గోపగించినాఁడు. వస్త్రాపహరణమప్పుడు సమయ ముచితమై యున్నందున దుశ్శాసనునిపైఁ బ్రతినఁబట్టఁగల్గినాఁడు. ఉత్తముని వాక్చ స్త్రముచే నొప్పించుట ధర్మాత్ముల ధర్మము. నోటననుటయేకాని క్రియ యెప్పుడును జరుగదు. ధర్మజునిచేతుల నప్పుడే కాల్చెద ననెను. దుశ్శాస నుని యుద్ధము సంభవించినపుడు చీల్చెద ననెను. కాని ధర్మజునిచేతుల నెప్పుడును గాల్చలేదు. దుశ్శాసనుని యుద్ధములోఁ జంపియేయున్నాఁడు. ఉత్తములు ధర్మముమీఱి నడువరు, ధర్మమైనపుడు ప్రళయాంతమైనఁ

గావింతురు. ధర్మముకానపు డణఁగియుందురు. దుర్యోధనుఁడు ద్రౌపదికి నెడమతొడఁజూపి సంజ్ఞచేసినపుడు భీముఁడు "నీతొడలు నాగదతో విఱుగఁగొట్టెదను" అని ప్రతిజ్ఞఁబూనెను. కులస్త్రీ నట్లు సంజ్ఞ చేయుట యధర్మము. కావున భీముఁడు ప్రతిజ్ఞచేసెను దుర్యోధనుఁడు సంజ్ఞ మాత్రము చేసినాఁడు. కావున భీముఁడు ప్రతిజ్ఞమాత్రము పట్టినాఁడు. దుర్యోధనుఁడు ద్రౌపదిని బలాత్కరించియుండిన భీముఁ డప్పుడే దుర్యోధనుని సంహరించియుండును.

శకుని జూదములో ధర్మరాజుయొక్క రాజ్యమును సమస్తమును వంచనమై హరించి నకుల సహదేవార్జునులను జయించి 'భీమునినొడ్డి యాడుము. ఇది యొక్కటియేకదా నీకు మిగిలియుండు ధనమ'ని పరిహాసించెను. 'భీమునిజయించి నీవోడకయున్న ధనమున్నదే' యని యడిగెను. 'నేనొక్కఁడనే మిగిలితిని' అని తన్నుఁగూడ నోడిపోయెను. 'నీకు ధన మింకనుగలదు. ద్రౌపదినొడ్డియాడుమని శకుని ప్రేరేపించెను. ధర్మపత్నిగావున తన ధనమనితలఁచి ధర్మరాజు ద్రౌపదినొడ్డి యోడిపోయెను. ద్రౌపదినిగెలిచి 'ఇంకేమి యొడ్డెదవని యడిగెను. ధర్మరాజున కింకొకభార్యగలదు. దానినొడ్డుమని శకుని యడుగలేదు. ధర్మజుఁడొడ్డలేదు. ద్రౌపదిపై దుర్యోధనున కీర్ష్యగలదుగావున శకుని ద్రౌపది నొడ్డుమని ప్రేరణచేసెను. ధర్మపత్నిగావున ద్రౌపదిని ధర్మజుఁ డొడ్డెను. కావున ధర్మజుఁడు ద్రౌపది జయింపఁబడిన దానిఁగా నంగీకరించెను.

ద్రౌపదినొడ్డుట అన్యాయమని తలంచెదనని భీముఁడుపలికి ధర్మజునిపై నాగ్రహమొందినప్పుడు అర్జునుఁడు 'ధర్మజునిలోఁ దప్పులేదు. వారు పిలిచినందున వచ్చియున్నాఁడు. ఇదిమఱియు మనకుఁ గీర్తియేకదా' యని భీముని నూరడించెను. కావున భీమార్జుననకులసహదేవులుగూడ ద్రౌపది జయింపఁబడినదని తలంచిరి. కావునఁ బాండవులైదుగురును ద్రౌపది జయింపఁబడిన దానిగాఁ దలంచి యుండిరి.

దుశ్శాసనుఁడు కొప్పుపట్టి సభకీడ్చుకొనివచ్చుచున్నప్పుడు వానితో ద్రౌపది యిట్లు పలికినది.

శ్లో. ధర్మస్థితో ధర్మసుతో మహాత్మా ధర్మశ్చ సూక్ష్మో నిపుణో పలభ్యః, (ప్యః)
వాచాపి భర్తుః పరమాణుమాత్ర మిచ్ఛామి దోషం న గుణాన్ విసృజ్య. ౬౬-౩౮
(సం. ౭౯-౯౦)

(సమర్థుఁడయినను ధర్మజుఁడు ధర్మమునకు లోఁబడియున్నాఁడు. ధర్మసూక్ష్మము పండితులుగూడ నెఱుఁగఁజాలరు. అతనియెడ గుణము లనేతప్పఁ బరమాణుమాత్రమైన దోషము నయితము వాక్కుచేఁజెప్పి ననుగూడ నిచ్ఛగింపను అని వచించినది. కావున ద్రౌపదిగూడ ధర్మ సుతుఁడు గావించినది ధర్మమేయని తలంచినది.

"సభికులను ధర్మసందేహమడిగిరమ్మని ద్రౌపది ప్రాతికామినిఁ బంపి నది. ద్రౌపది సభకు రావలయునను ఉద్దేశ్యమును దుర్యోధనుఁడు గనఁ బఱచినందున సభికులెవరును మాటాడలేదు. ద్రౌపది సభకువచ్చినపైని భీష్ముఁడు 'నీప్రశ్నకు సమాధానమీయఁజాలకున్నాన'ని చెప్పెను. వెంటనే ద్రౌపది సభికులను అదేప్రశ్న వేసినది. సభికులెవరును మాటాడలేదు. వికర్ణుఁడు భీష్ముని, ధృతరాష్ట్రుని, విదురుని, ద్రోణుని, కృపుని, రాజు లను 'ద్రౌపదియొక్కప్రశ్నకు సమాధానమిండు' అని పలుమాఱడిగి నను ఎవరును మాటాడలేదు. ద్రౌపదీవస్త్రాపహరణసమయమునఁగూడ నెవరును మాటాడలేదు. వస్త్రాపహరణప్రయత్న మైపోయినది. ద్రౌపది ప్రశ్న యట్లే నిలిచియున్నది. అనంతరము 'ద్రౌపదిప్రశ్నకుఁ గౌరవులు సమాధానమీయలేద'ని సభలో సుజను లఱచుచుండిరి. విదురుఁడప్పుడు కౌరవులనేగాక సభ్యులందఱినిఁ బ్రశ్నించెను. విదురుఁ డిట్లుపలికెను. 'సభ్యులారా, ద్రౌపది ప్రశ్నయడిగి యనాథమాడ్కి విలపించుచున్నది. మీర లాప్రశ్నకు సదుత్తరం బిండు లేనిచో ధర్మహానియగును. ఆపన్నుఁడు సభనుబొందినపుడు సభ్యులు వానిని సత్యముచేతను, ధర్మము చేతను శాంతినిఁబొందించుట ధర్మము. యోగ్యుఁడు విమర్శించి సత్యముఁ దప్పకయు, ధర్మవిరుద్ధము గాకుండను నుత్తరంబీయవలయును. పక్ష పాతముగలవారు కామక్రోధాదులకులోఁబడి దీనులప్రశ్నలకు విరుద్ధ ముగ నుత్తరంబొసంగుదురు. వికర్ణుండును దగినంతమట్టునకు నుచితమైన యుత్తర మొసఁగె. (వికర్ణుఁడు చెప్పినది నిందించుచుఁ గర్ణుఁడు కొంత వచించియున్నాఁడు. అది సదుత్తరము కాదని విదురుఁడు తేల్చినాఁడు) నరాధిపులారా, మీరును మీమీబుద్ధికుశలతకుఁ దగినటుల నీప్రశ్నకు

సదుత్తరంబిండు. ధర్మములనెఱింగినవాఁడయ్యు సంశయముబాపని సభ్యుఁడసత్యవాదియొక్క సగముఫలంబు నొందును. ధర్మము నెఱింగియు న్యాయవిరుద్ధమైన యుత్తరంబిచ్చువాఁ డనృతవాదియొక్కఫలంబుఁ బూర్తిగానొందును' అని పలికి ఇందు కుదాహరణముగా నొకకథ నిట్లు చెప్పెను. ప్రహ్లాదపుత్రుఁడు విరోచనునకును, సుధన్వునకు నొక కన్య నిమిత్తమై వివాదము సంభవించెను. ప్రహ్లాదుఁడు పుత్రవాత్సల్యమున నేమియుఁ బలుకకుండెను. అప్పుడు సుధన్వుఁడు అసత్యముపలికినను, ఏమియుఁ బలుకకుండినను నీశిరమును దేవేంద్రుఁడు వజ్రాయుధముచే నూఱుతునియలు చేయును" అని పలికెను. ప్రహ్లాదుఁడు భయపడి కశ్యపునికడ కేగి యిట్లడిగెను. 'సభ్యులు ధర్మమునెఱింగియు వివాదము విచారింపకున్నను, లేక యసత్యముఁజెప్పినను వా రేయేలోకములను బొందుదురో చెప్పుమనియెను. కశ్యపుఁ డిట్లుచెప్పెను.

శ్లో. జాన న్నవిబ్రువన్ ప్రశ్నాన్ కామా త్క్రోధా ద్భయా త్తథా,
సహస్రం వారుణాన్ పాశా నాత్మని ప్రతిముంచతి.
సాక్షీ వా వి బ్రువన్ సాక్ష్యం గోకర్ణశిథిలశ్చరన్,
సహస్రం వారుణాన్ పాశా నాత్మని ప్రతిముంచతి.
తస్య సంవత్సరే పూర్ణే పాశ ఏకః ప్రముచ్యతే,
తస్మా త్సత్యం తు వక్తవ్యం జానతా సత్యమంజసా. ఉ౭-౭౫-౭౭
(కుం. ౯౦-౭౬-౭౮)

(తానెఱిఁగియుఁ గామముచేతనో, ద్వేషముచేతనో, భీతిచేతనో వివాదము విచారింపనివాఁడును, నుభయపక్షంబులఁ దాఁకుచుఁ దప్పు సాక్ష్యముఁ బలుకుసాక్షియు వేయి వరుణపాశంబులంగట్టికొని, యొక్కొక్కయేఁడునిండఁగనే యొక్కటొక్కటిగాఁ బాయుచుండు కావునఁ దెలిసినంతసత్యముఁ జెప్పవలయును.) కశ్యపుఁడు మఱియు నిట్లుచెప్పెను.

ఎచ్చట ధర్మమునకు నధర్మమువలన హానిగలుగునో, యచ్చటి సభాసదులు అధర్మముచేఁ గొట్టువడి ధర్మము నుద్ధరింపఁజాలకుందురు. న్యాయము విచారింపకున్న నాపాపంబులో నర్ధమును సభానాయకుఁడును, నాలవభాగము చేసినవారును, మఱి నాలుగవపాలు సభాసదులును నొందుదురు. తప్పుచేసిన వానిని దండించి ధర్మము పరిశీలించిన సభానాయకునికిని, సభాసదులకును బాపములేదు. కర్తయొక్కఁడే యా

పాపము నొందును. ఎఱిఁగియు ధర్మవిరుద్ధంబుగఁ బలికెరేని తమవంశమున ముందేడుతరముల వారియొక్కయు, వెనుకటి యేడుతరములవారి యొక్కయు నిష్టాపూర్తాదిపుణ్యఫలంబులఁ జెఱుతురు. అని విస్తరించి కశ్యపుఁడు చెప్పఁగాఁ బ్రహ్లాదుఁడు సుధన్వునితో 'నాతనయునికంటె నీవుత్తముఁడవు' అని పలికెను.

శ్లో. ఏవం వై పరమం ధర్మం శ్రుత్వా సర్వే సభాసదః.
యథా ప్రశ్నంతు కృష్ణాయా మన్యధ్వం తత్ర కిం పరమ్.
విదురస్య వచః శ్రుత్వా నోచుః కించన పార్థివాః. ౬౭-౮౯౫-౮౦
(కుం. ౯౦-౭౦-౭౧)

(కావున సభాసదులారా, ధర్మం బింతయుత్తమంబని యెఱిఁగి ద్రౌపదియొక్కప్రశ్నంబు విచారించి యుత్తరముఁజెప్పుఁడు అని విదురుఁడు సభ్యులతోఁజెప్పెను. సభ్యులందఱు విదురునివాక్యము వినియు బదులుసెప్ప కూరకుండిరి. (పరిష్కరించుటకు రానిప్రశ్నగావున ధర్మనిర్ణయము చేయకుండుటగాని మౌనముగానుండుటగాని దోషముకాదను నభిప్రాయము విదురవాక్యము మూలమునను నందుపై సభికులమౌనము మూలమునను దేలుచున్నది.) పిమ్మట ద్రౌపది సభకు నమస్కరించి అంతవఱకు నమస్కరింపకుండుటకుఁ గారణముచెలిపి తిరుగ ప్రశ్నవేసెను. భీష్ముఁ డిది నిర్ధారణ చేయఁజాలననియు, ధర్మజుఁడే చేయవలయుననియుఁ జెప్పెను. (ఇతరులెవ్వరును నిర్ణయించలేరని భీష్ముఁడుతేల్చెను.) పెద్దలెవరును మాటాడలేదు. ద్రౌపది యెన్నిమార్లడిగినను విదురుఁ డెన్నిమార్లుచెప్పినను సభికు లెవ్వరును మాటాడలేదు. కావున సభికులందఱికి ద్రౌపది జితయైన దను నమ్మకముగలదు. కావుననే ద్రౌపదిపాటును వారెల్లచూచుచు సహించియుండిరి. కౌరవుల నెవరును అడ్డలేదు.

ధర్మజునకు, భీమాదులకు, ప్రశ్నించుచున్న ద్రౌపదికిని, భీష్మద్రోణవిదురులకు, సభికులకు అందఱికిని ద్రౌపది జితయైన దనునభిప్రాయమే గలదు. అయినను గడవఱకు ద్రౌపది ప్రశ్నవేయుచునేయున్నది. నిర్ణయముచేయలేనని భీష్ముఁడును, నిర్ణయముచేయ రేమని విదురుఁడు, సభ్యులును బలుకుచుండిరి.

మఱియొకవిశేషము. ద్రౌపదిని కొప్పుపట్టుకొనియీడ్చిన దుశ్శాసనునిఁజూచి ఉగ్రుఁడై ధర్మజునిపై కోపించుచున్న భీముని నర్జునుఁడు

నివారించియున్నాఁడు. అది స్వపక్షములోని సంగతి. దుర్యోధనుఁడు ద్రౌపదిప్రశ్నను బాండవులే నిర్ణయించవలయునని చెప్పినపుడు భీముఁ డిట్లు పలికియున్నాఁడు.

శ్లో. న హి ముచ్యేత మే జీవన్ పదా భూమి ముపస్పృశన్,
మర్త్యధర్మా పరామృశ్య పాంచాల్యా మూర్ధజా నిమాన్. ౬౯-౧౪ (కుం. ౯౨-౧౪)

(మేము ధర్మపాశమునకుఁ గట్టుపడమేని, యెదుటఁ బాంచాలి యొక్క తలవెండ్రుకలబట్టిలాగిన మానవుఁడు కాలిక్రిందఁబడక భూమిపై బ్రతికియుండఁగలుగునే.)

శ్లో. ధర్మపాశసితస్త్వేవం నాధిగచ్ఛామి సంకటమ్,
గౌరవేణ నిరుద్ధశ్చ నిగ్రహాదర్జునస్య చ. ౬౯-౧౬ (కుం. ౯౨-౧౬)

(ధర్మపాశముచేతను, యుధిష్ఠిరునందలి గౌరవముచేతను, అర్జునుని యడ్డంకిచేతను నివారితుండనై ద్రౌపదిని సంకటమునుండి తప్పింపఁ జాలకున్నాఁడను)

శ్లో. ధర్మరాజ నిసృష్టస్తు సింహః క్షుద్రమృగా నివ,
ధార్తరాష్ట్రా నిమాన్ పాపా న్నిష్పిషేయం తలాసిభిః ౬౯-౧౭ (కుం. ౯౨-౧౭)

(ధర్మరాజనుజ్ఞయిచ్చిన, సింహము క్షుద్రమృగములవలెనే పాపులైన ధార్తరాష్ట్రుల నఱచేతఁజఱచి నుగ్గుచేయుదును) అని పలికెను. అప్పుడు,

శ్లో. తమువాచ తదా భీష్మో ద్రోణో విదుర ఏవ చ,
క్షమ్యతా మిదమిత్యేవం సర్వం సంభావ్యతే త్వయి. ౬౯-౧౮ (కుం. ౯౨-౧౮)

(భీష్మద్రోణవిదురులు భీమునిఁజూచి, భీమసేనా! నీయెడ నంత శౌర్యమున్నది. కాని యిపుడదనుగా దోర్చియుండుమని శాంతపఱచిరి)

కావున భీష్మద్రోణవిదురులకు ద్రౌపది జితయైనదను నభిప్రాయము గలదని తెలుచున్నది. ధర్మమునుమిషఁబెట్టి స్వకులజులను బాధింపుచుఁ గౌరవులు (లోక) విద్దూరమైన పనికిఁ బూనియున్నారుగావున భీష్మాదులు భీముని నోదార్చిరి. ధర్మమనుమిషగలదు గావున కౌరవుల నడ్డగింపలేకపోయిరి. సభికులు ధృతరాష్ట్రుని కౌరవులను నిందించిరి. విదు

రుఁడు 'ఇంతటి అన్యాయము జరిగినందున ధార్తరాష్ట్రులు భీమునివలన మరణ మొందుదురని పలికి చీవాట్లు పెట్టెను. 'నిన్నిట్లు భంగపఱచుటం జేసి యీకురువంశమునకు శీఘ్రింబె నాశముగలుగు'నని కులజ్యేష్ఠుఁడైన భీష్ముఁడు పలికెను. ఇట్లుగా నయమున భయమునఁ గౌరవుల కందఱును హితముపదేశించిరి. కాని వారు వినలేదు.

ద్రౌపదిప్రశ్నపై వికర్ణుఁడు తనయభిప్రాయము నిట్లుచెప్పెను:— వేఁటాడుట, మద్యపానము, జూదము, స్త్రీలయం దత్యంతాసక్తియను నాలుగువ్యసనములు రాజులకుఁగలవు. వీటియందుఁ దగులుగల మను జుఁడు ధర్మముమీఱివర్తించును. అట్టివాఁడొనర్చినపనిని లోకులు మన్నిం పరు. జూదరులుపిలువఁగా జూదమునకువచ్చి ధర్మరాజు ద్రౌపదినొడ్డెను. ద్రౌపది పాండవులకందఱికిఁ బొదువయినసొమ్ము. ధర్మరాజు మున్నుగాఁ దన్నునోడి పిదప ద్రౌపది నొడ్డెను. శకునియు నొడ్డుగోరి, ద్రౌపది నొడ్డుమని ప్రేరించెను. ద్యూతవ్యసనంబుచే ధర్మరాజు పరికింపక ద్రౌపది నొడ్డెను. ఇదంతయు విచారించిన ద్రౌపది జయింపఁబడలేదని నాకుఁ దోఁచుచున్నది' యని చెప్పెను. ధర్మరాజు జూదమం దాసక్తి గల్గినవాఁడుకాని జూదరికాఁడు. సాధ్యమగునంతవఱకు జూదము తగదనివారించి వీలులేనియవస్థ గల్గినపుడే జూదమాడెను. పాండవులంద ఱికి ద్రౌపది భార్యయే కాని ధర్మపత్నిగాన ధర్మరాజునకు ద్రౌపదిపై పూర్తియగు నధికారముగలదు శకుని ప్రేరణచేసినందునను, దన కధి కారముకలదని తలంచినందునను ధర్మజుఁడు ద్రౌపదినొడ్డెను. కావున వికర్ణుఁడు చెప్పినది అంత సమంజసముకాదు.

వికర్ణుని నిందింపుచు కర్ణుఁడిట్లు తనయభిప్రాయమును జెప్పెను:— "ద్రౌపది పలుమాఱడుగుచున్నను, అదిన్యాయముచే గెల్వఁబడినదని తలంచియే పెద్దలందఱు బదులుసెప్పకయున్నారు. పాండవాగ్రజుఁ డెప్పుడు దన సర్వస్వమ్మునొడ్డెనో, అప్పుడే దానిలో నీద్రౌపదిచేర లేదా. అట్లుండ నీద్రౌపది జయింపఁబడలేదని యెట్లు నీవు తలంచెదవు. ద్రౌపది తనభర్తలయనుమతిదైన దాసినయ్యెదనని వచించె. పాండవులును నానతి నొసంగిరి. అట్లుండ దేనినిఁబట్టి పాంచాలి యోడలేదనితలంతువు. పలు పురుషులోఁబడిన దగుటచే నీద్రౌపది అంకులాడియని తప్పక చెప్పనొప్పి

యున్నది. అట్టిదానిని సభకుఁదెచ్చుటయు, నొంటిచీరఁగట్టుకొని యున్న దనుటయు, లేక దెస మొలతోనున్నదనుటయు నొకవింతకాదు. పాండవులను, వారి సకలధనంబును, ద్రౌపదిని, శకుని ధర్మముగా జయించెను' అనిపలికెను. ధర్మజుని సర్వస్వములో ద్రౌపదికూడ చేరియున్న యెడల శకుని పునరుల్లేఖించుట సమంజసముకాదు కదా. 'సభికులు ద్రౌపది న్యాయముగా జయింపఁబడినదని తలంచియు నామెప్రశ్నలో నర్థము గలదని తలంచియుండిరి. కావుననే ద్రౌపదిప్రశ్నకు సమాధానమీయ రేమని సుజనులు వస్త్రాపహరణానంతరము సభలోఁ గేకలిడిరి. పాండవులుగాని, కౌరవులుగాని, పెద్దలుగాని పాంచాలిప్రశ్నకు సమాధాన మీయనేలేదు. ద్రౌపదిప్రశ్న తప్పని యనలేదు. ద్రౌపది సభకువచ్చిన తోడనే ఇందలి గుణదోషంబుల విచారింపఁజాలకున్నా నని చెప్పి భీష్ముఁడా మెప్రశ్నలో నర్థముగల దను నభిప్రాయమును దెల్పెను. ద్రౌపదియుఁ బలుమాఱు ప్రశ్న వేయుచున్నదికదా. ద్రౌపది పతివ్రతకాదని కర్ణుఁ డాక్షేపించెను. నీచసహవాసమునఁ గర్ణుఁడెంత పాలుమాలిన వాఁడైనాఁడో ఇది వ్యక్తముచేయుచున్నది భర్తలు అనుమతి నొసంగ లేదు. భర్తలయనుమతినైన దాసి నయ్యెదనని ద్రౌపది వచించియుండ లేదు. కావునఁ గర్ణుఁడు చెప్పినది సమంజసము కాదు. విదురుఁ డిట్లు చెప్పెను:—

శ్లో. న హి దాసీత్వమాపన్నా కృష్ణా భవితుమర్హతి,
అనీశేన హి రాజ్ఞైషా పణే న్యస్తేతి మే మతిః. ఉ౬౮-౪ (౮౯-౪)

(ద్రౌపది దాసికాఁదగదు. ప్రభుత్వముపోయి అస్వతంత్రుఁడై యున్న ధర్మజుఁ డీమెను బందెమొడ్డెనని నాయభిప్రాయము) అని దుర్యోధనునితోఁ జెప్పెను. సభ్యులతో నిట్లుపలికెను. 'జూదరియగు ధర్మజుఁడు తానోడకమున్న ద్రౌపది నొడ్డియుండెనేని యపు డతఁడే యామెకుఁ బ్రభువని చెప్పనొప్పును. అనీశుఁడైనవాఁ డొడ్డిన ధనమునుజయించుట స్వప్నమందులభించిన ధనమువంటిది. కావున శకునిమాట విని ధర్మముఁ జెఱుపకుఁడు.' అనిచెప్పెను. తానోడకముందు ధర్మజునకుఁ బ్రభుత్వసంపదగలదు. అప్పుడు ద్రౌపదినొడ్డుట కాతని కధికారముండును. ధర్మజుఁడు జూదములో రాజులను, వారి యాభరణములు, జంతువులను,

దాసదాసీజనమును, సైన్యమును, దమ్ములను ఓడిపోయియున్నాఁడు. సైన్యములోఁ బెద్దయుద్యోగులుగలరు. వారిభార్యలు, సామంతరాజుల భార్యలు దుర్యోధనునియింట దాసీపనిచేయుటకై ధర్మజుఁ డొడ్డిన వాఁడు కాదుకదా. కావుననే తమ్ములనుగూడ దాసులుగా ధర్మజుఁడొడ్డ లేదు. తన్ను నొడ్డుకొనునప్పుడు మాత్రము కౌరవులకు దాస్యము చేసెదనని ధర్మరాజిట్లు పలికెను

శ్లో. అహం విశిష్టః సర్వేషాం భ్రాతౄణాం దయితస్తథా,
కుర్యామహం జితః కర్మ స్వయమాత్మ న్యుపప్లుతే. ౬౮-౫౪ (కుం. ౭౮-౫౮)

(తమ్ములకందఱకుఁ బ్రియుఁడయిన నేనొక్కఁడనే మిగిలియున్నాను. నన్ను నేనోడితినేని మీకు దాస్యంబు చేయుచుండెదను,) అని పలికెను. అట్లుగాఁ దానోడి దాస్యమునకు సమ్మతించెను. సుభద్రాదులను ధర్మరాజెట్లు పనికత్తెగా నొడ్డలేదో అట్లే అర్జునాదులభార్యయైన ద్రౌపదిని దాసిగా నొడ్డుట ధర్మరాజునకు ధర్మము కాదు. తమ్ములనే దాసులుగా నొడ్డలేని ధర్మజుఁడు వారిభార్య నెట్లు దాసిగా నొడ్డగలఁడు. కావున ద్రౌపది దాసి కాఁదగదు అని విదురుఁ డభిప్రాయపడెను. కాని ద్రౌపది ధర్మజునకుఁ బూర్తియగుభార్య కావున జయింపఁబడవచ్చును. ఆతఁ డొడ్డవచ్చును అనున్యాయము కనఁబడుచున్నందునఁ గౌరవులదుర్నయమున కడ్డులేకపోయెను కొంతవఱకు మిన్నకుండవలసివచ్చినది. అయిదుగురికి సమానమైన హక్కుగల్గినదానిని ధర్మజుఁడొక్కఁడే యొడ్డవచ్చునా అనుసంశయము మాత్రము తీర్పరానిదై యున్నదని విదురుని యభిప్రాయము. దాసికావచ్చునా లేదా ఏదియు నిర్ధరించుటకురాదని విదురునకుఁ దెలియును. కావుననే తన యభిప్రాయమును దెల్పుచునుగూడ సభికులు నిర్ణయముచేయవలయునని విదురుఁడు పలుమా ఱడుగఁజొచ్చెను.

ప్రాతికామివచ్చి సభకుఁ గొనిపోయెద నని పలికినపుడు ద్రౌపది మున్ను తన్నోటువడియెనో, లేకున్న నన్నోటువడియెనో దీని నెఱిఁగి రమ్ము అని కబురంపఁగా రాజేంద్రుల నడుమనున్న ధర్మజునిఁజేరి వాఁడు ద్రౌపదీవచనమును దెల్పెను అప్పుడు ధర్మరాజు:—

శ్లో. యుధిష్ఠిరస్తు నిశ్చేతా గతసత్వ ఇవాభవత్,
న తం సూతం ప్రత్యువాచ వచనం సాధ్వసాధు వా. ౬౬-౧౧ (కుం. ౯౮-౨౩)

(యుధిష్ఠిరుఁ డప్పలుకులువిని నిశ్చేష్టితుఁడై యేమియుఁదోఁచక మంచిగాని చెడ్డగాని సూతపుత్రున కేమియుఁజెప్పక యూరకుండెను.) ధర్మరా జిట్లుగుటకుఁ గారణమేమి. ధర్మజుఁడు దాసుఁడగుటకు సమ్మతించెను. కావుననే ధర్మజుఁడు దాసులుగా నొడ్డియాడకున్నను భీమాదులు గూడ దాసత్వమున కొడంబడియుండిరి. పాండవులందఱును దాసత్వము నకు సమ్మతించినను ద్రౌపది సమ్మతించలేదు. భర్తలతో సహా దాసీత్వము గలుగవలయునే కాని పృథక్ దాసీత్వము (పాండవధర్మపత్నియైన తన్ను వేఱుగాఁ బందెమొడ్డి దాసినిచేయుట) న్యాయముకాదని ఆమె తలంచినది. అర్జునుఁడు దాసుఁడైనయెడల సుభద్ర ఆతనితో దాసీపని చేయవచ్చును. కాని వేఱుగా దాసికానక్కఱలేదు. అట్లే పాండవు లైదుగురు దాసులైనయెడల ద్రౌపదికిఁగూడ దాసీత్వము గలుగవచ్చును. అంతియకాని వారందఱు జయింపఁబడిన పిమ్మట వేఱుగాఁబందె మొడ్డి దాసినిచేయుట ధర్మముకాదని ద్రౌపది అభిప్రాయము కనఁబఱచినది. కావుననే నేను జయింపఁబడితినా అని ప్రశ్నించినది. వేఱుగాఁ బందె మొడ్డుటచే అంతకుముందు జయింపఁబడలేదని స్పష్టమగుచున్నది. అంతకు ముందు జయింపఁబడనందున దాసీత్వము రాలేదు. పృథక్ దాసీత్వము కూడదు. కావున తరువాత జయింపఁబడరాదు. ద్రౌపదిని వేఱుగా గెల్చినగాని దాసికాదని శకుని తలంచి పందెమిడఁ బ్రేరేపించెను. కావున సుభద్రాదులు దాసీలు కారనుభావము స్పష్టమగుచున్నది. సుభద్రాదులు కానపుడు తానును (ద్రౌపదియు)దాసి కాలేదు. ధర్మజుడు జయింపఁబడిన పిదప అర్జునాదుల భార్యయగు ద్రౌపదికి దాసీత్వము గలుగఁజేయుట ధర్మజునిపట్ల సమంజసమగునా. అని ద్రౌపది అభిప్రాయమును సూచించినది. కావుననే ధర్మరాజు నిశ్చేష్టితుఁడై యేమియుఁదోఁచనివాఁడాయెను. ధర్మజుఁ డెట్టిసమాధాన మొసఁగనందున ద్రౌపది సభికుల నదేప్రశ్న నడిగిరమ్మన్నది. ద్రౌపదికి సభకువచ్చు నుద్దేశము లేదని గ్రహించి యుధిష్ఠిరుఁడు రహస్యముగా నామెకుఁ గబురంపినాఁడు.ఇందువలన ద్రౌపదినిఁ బందెమొడ్డుట ధర్మవిరుద్ధముకాదని ధర్మరా జంగీకరించినట్లయినది. ద్రౌపదిప్రశ్న సమర్థించుటకు రానిది అని అతఁడు గ్రహించినాఁడు. కావుననే సభకు రమ్మనెననికూడ చెప్పవచ్చును. భీష్ముఁడు నిర్ణ

యము చేయలేనని చెప్పఁగా ద్రౌపది కౌరవులను బ్రశ్నించినది. ఎవరును మాటాడలేదు. పిమ్మట సభకు నమస్కరించి ద్రౌపది యిట్లు పలికెను.

శ్లో. స్వయంవరే యాస్మి నృపై ర్దృష్టా రంగే సభాగతైః,
న దృష్టపూర్వా చాన్యత్ర సాహమద్య సభాం గతా. ఉ.౭.౪౫(కుం. ౭౧-౪)

(స్వయంవరంబున సభలో నున్న రాజులు నన్నుఁ జూచిరిగాని మఱి యొకచో నన్నొరు లింతవఱకుఁ జూచియెఱుఁగరు. అట్టినే నీదినంబున సభకు రావలసివచ్చెను.)

శ్లో. యాం న వాయు ర్న చాదిత్యో దృష్టవంతౌ పురాగృహే,
సాహమద్య సభామధ్యే దృష్టాస్మి జనసంసది. ఉ.౭-౫౫ (కుం. ౭౧-౫)

శ్లో. యాం న మృష్యంతి వాతేన స్పృశ్యమానాం గృహే పురా,
స్పృశ్యమానాం సహంతేఽద్య పాండవాస్తాం దురాత్మనా. ౬౫ (కుం. ౭౧-౬)

(ముందు గృహంబున నెండయు గాలియు సోఁకని నేను నేఁడు సభలో రాజులనెల్లఁ జూడవలసివచ్చె. వాయువు తాఁకినను నోర్వని మహాత్ములయిన పాండవులు దురాత్ముఁడయిన యీదుశ్శాసనుచే నివ్విధంబున నీడ్వఁబడుచుండు నన్నుఁజూచి యోర్చియున్నారు.) కౌరవులకుఁ గూఁతువంటిదియు, కోడలునైన నేనిట్టియవమానంబులకుఁ దగనిదానను భంగపాటునొందుచుండఁ జూచుచు నోర్చియున్నారు. ఇదియొక కాల విపర్యాసం బనియెంచెద.) పతివ్రతయు, సుమంగలినగు నేను సభామధ్యంబున నిట్లు వగచుటకంటె వేఱొక్క నీచకార్యముగలదా. హా, రాజ ధర్మ మెక్కడికేగెనో కదా.

శ్లో. ధర్మ్యాం స్త్రియం సభాం పూర్వే న నయంతీతి నః శ్రుతమ్,
స నష్టః కౌరవేయేషు సర్వో ధర్మస్సనాతనః. ఉ.౭-౯౫ (కుం ౭౧-౭)

(పతివ్రతలైన యంగనలఁ బెద్దలు సభలకురప్పింపరని వినియుండుదు. ఈకౌరవులందు శాశ్వతమైన ధర్మంబులెల్ల నష్టములయ్యె.)

శ్లో. కథం హి భార్యా పాండూనాం పార్షతస్య స్వసా సతీ,
వాసుదేవస్య చ సఖీ పార్థివానాం సభామియామ్. ఉ.౭-౧౦౫ (కుం. ౭౧-౧౦)

(పాండవులకు భార్యనై, ధృష్టద్యుమ్నునకుఁ జెలియలినై, కృష్ణునకు నెచ్చెలినై నేనిట్లు సభకు రావలసివచ్చెగదా.)

అని సభలో నేడ్వనారంభించెను. స్త్రీలింటనుండవలసినవారనియుఁ గులస్త్రీ(భార్య)నితరపురుషు లంటరాదనియు,సభలకుఁ బోఁగూడదనియు, గొప్పతన మెచ్చినకొలఁది ఘోషా హెచ్చుగానుండవలయుననియుఁ గావు ననే అట్టివారికి భార్య, అట్టివారికిఁ దోఁబుట్టువు, అట్టివారికి నెచ్చెలినైన నేను సభకు రావలసివచ్చినదనియు ద్రౌపదియేడ్చినది. సనాతనధర్మము నశించి అన్యాయము జరుగుచున్నందులకు ద్రౌపది యేడ్చినది. పెద్దలంద ఱూరకుండుట కాలవిపర్యాస మనఁదగియున్నది. అని వచించినది. విషయ మిట్లుండఁగా రెడ్డిగా రిట్లు వ్రాసిరి. "దేశము గొప్పగానుండు కాలములో స్త్రీలకు నొక కుటుంబముమీఁదనే కాదు, రాజ్యకార్యములు, చరిత్రాది శాస్త్రములు, సైన్యములు మొదలగు మానరక్షకప్రకృతులు ఇత్యాది లౌకికగణంబులయందెల్ల శ్రద్ధాదృష్టివాఱుచుంట సహజము. గాంధారి ద్రౌపది మొదలగు భారతస్త్రీలును, గార్గీమైత్రేయీ ప్రభృతులగు ఋగ్వేదయుగములోని లోకోత్తరచరితలును, మనవారినుండియే యీ విషయమునం జూపఁదగుసాక్షులు." (౧౦౭) అని వ్రాసిరి. స్త్రీలకు రాజ్య కార్యాదులందు దృష్టియుండునుగాని కుటుంబమును బాడొనరించు వ్యాపారమున లేక తాము విచ్చలవిడితిరుగుటచే నితర కుటుంబములను బాడొనరించు వ్యాపారమున వారు లేరు. వా రెప్పుడును భర్తలనువిడిచి యుండలేదు. సభలకుఁబోలేదు. పరపురుషులతో విచ్చలవిడి సంచరింప లేదు. రాజసభకు రావలసివచ్చినందులకు ద్రౌపది యిట్లు విచారించి తిరిగి యిట్లనుచున్నది.

శ్లో. తామిమాం ధర్మరాజస్య భార్యాం సదృశవర్ణజామ్,
బ్రూత దాసీ మదాసీం వా తత్కరిష్యామి కౌరవాః. ఉ౭-౧౧౪(కుం.౭౧-౧౧)

(కౌరవులారా! ధర్మరాజునకు భార్యను, సమానజాతియందుఁ బుట్టినదానను నైన నేను దాసినయ్యేదనో కానో విచారించిచెప్పుఁడు. మీరు చెప్పిన చొప్పునఁ జేసెదను)అనిపలికెను. వెనుకటిశ్లోకమున పాండవ పత్నినని పలికినద్రౌపది ఇచ్చట ధర్మజునిభార్యనని పలికినది. అనఁగా పట్టపు దేవిని. అనిభావము. సమానగౌరవము గల్గినవర్ణమం దుద్భవించియున్న దానను. నేను దాసినగు నెడల మీకే అపఖ్యాతిగదా యని చెప్పి మఱియు నిట్లనినది.

శ్లో. జితాం వా హ్యజితాం వాపి మన్యధ్వం మాం యథానృపాః,
తథా ప్రత్యుక్తమిచ్ఛామి తత్కరిష్యామి కౌరవాః. ఉ-౧౩౫ (కుం. ౯౧-౧౩)

(నేను జయింపఁబడినదాననో కానో ఈనృపాలు రేమని తలంచుచున్నారో ఈకౌరవులు నిర్ణయించి చెప్పవలయును. మీరువిధించిన చొప్పున చేసెదను) అని ద్రౌపది పలికినది.

కౌరవులపై ద్రౌపది భారముపెట్టినందున భీష్ముఁడది నిర్ధారణ చేయలేనని పలుకుటయేగాక ఇంకెవరును నిర్ణయించలేరని తెల్పువాఁడై పాండవునిపైననే ఆభారముమోపి ధర్మరాజే నిర్ణయింపవలయునని యిట్లు పలికెను.

శ్లో. ఏతే ద్రోణాదయశ్చైవ వృద్ధా ధర్మవిదో జనాః,
శూన్యైః శరీరైస్తిష్ఠంతి గతాసవ ఇవానతాః. ఉ-౨౦౫ (కుం. ౯౧-౨౦)

(ధర్మవిదులైన ద్రోణుఁడు మున్నగాఁగలపెద్దలు జీవన్మృతుల మాడ్కిఁ దలలువాంచి మిగులఁ జింతనొందుచున్నారు.

శ్లో. యుధిష్ఠిరస్తు ప్రశ్నేఽస్మిన్ ప్రమాణమితి మే మతిః,
అజితాం వా జితాం వేతి స్వయం వ్యాహర్తు(వ్యాఖ్యాతు)మర్హతి. ఉ-౨౧౫
(కుం ౯౧-౨౧)

(ధర్మరాజే నీవు జయింపఁబడినదానవో కావో యనుసందియము బాప నర్హుఁడు) అనిచెప్పెను. విదురాదులును, సభ్యులెందుకు సమాధానమీయఁజాలకుండిరో ధర్మజుఁడును అందులకే సమాధానమీయ లేనివాఁడైయుండెను. ధర్మమనిగాని అధర్మమనిగాని చెప్పుటకురాని దాప్రశ్న. మొదట నందఱియొక్క అభిప్రాయమును దాఁకుచు భీష్ముఁడిట్లు చెప్పియున్నాఁడు.

శ్లో. నధర్మసౌక్ష్మ్యాత్సుభగే వివేక్తుం శక్నోమి తే ప్రశ్నమిమం యథావత్, [త్యు.
అస్వోమ్యా(అస్వామ్య)శక్తః పణితుం పరస్వం స్త్రియాశ్చ భర్తుర్వశతాం సమీ
త్యజేత సర్వాం పృథివీం సమృద్ధాం యుధిష్ఠిరో ధర్మమథో న జహ్యాత్,
ఉక్తం జితోఽస్మీతి చ పాండవేన తస్మాన్న శక్నోమి వివేక్తుమేతత్.
ఉ-౪౭-౪౮ (కుం. ౬౯-౧౯, ౬౦)

(ధర్మసూక్ష్మ మెఱుఁగరానిది గాన నీప్రశ్న కుత్తరంబుఁ దగినట్లియ్యఁజాలకున్నాను. ధనములేనివాఁ డితరులసొమ్ము నొడ్డఁజాలఁడు.

స్త్రీలు భర్తలకులోఁబడినవారు. ధర్మరాజు సకలసంపత్సమృద్ధమైన రాజ్యమైన విడుచునుగాని ధర్మమును విడువఁడు. అట్టి ధర్మరాజు జయింపఁబడితిని అనఁగా ద్రౌపది నోటువడితిని అనిచెప్పెను. కావున దీనిని వివరింపలేకున్నాను. శకుని జూదమున సాటిలేని ప్రజ్ఞగలవాఁడు. అట్టి వానితో ధర్మజుఁడు జూదమాడ నొప్పుకొనియె. ధర్మజుఁడు నిన్నోడుట మోసమనియెంచఁడు కావుననే నీప్రశ్న కుత్తరమీయఁజాలను' అని భీష్ముఁడుచెప్పెను. ఇట్లు ధర్మజునియొక్క నిర్ణయమునుజెప్పినట్టి భీష్ముఁడు కడకు ధర్మజుఁడే నిర్ణయింపవలయునని చెప్పెను.

పర్యవసానము:—ధర్మజుఁడు మొదలుకొని అందఱును సమాధానమీయఁజాల కూరకొనవలసివచ్చినది. ధర్మజుఁ డూరకుండుటఁజూచి ద్రౌపదిప్రశ్న కెవరును సమాధానమీయలేరని గ్రహించి ద్రౌపదివేసిన యెత్తునకుఁ బైయెత్తువేయుట కది సమయమని నిశ్చయించుకొని దుర్యోధనుఁ డించుకనగుచు 'పాంచాలీ! ఉదారులైన భీమార్జున నకులసహదేవుల నడుగుము. నీపతులే యీనీప్రశ్న కుత్తరము చెప్పుదురుగాక. పాంచాలీ! సభ్యులనడుమ వారు యుధిష్ఠిరుఁడు నీకు ప్రభువుగాఁడని చెప్పి, ధర్మజు నసత్యముపలుకు వానినిజేసిరేని, నీవు దాస్యభావమునుండి విడువఁబడుదువు. ధర్మప్రకారము నడుచువాఁడును, దేవేంద్రతుల్యుఁడునైన మహాత్ముఁడగు ధర్మసుతుఁడే తాను నీకుఁ బ్రభువగునో కాదో చెప్పునుగాక. అట్లైన నీవొక్కనినే పొందుము. (పాండవు లైదుగురినిఁ బొందక ఒక్కనినే పొందుము అని ఆక్షేపించెను.) ఈసభ్యులందఱు దుఃఖసాగరమున మునిఁగినవారలై, యదృష్టహీనులైన నీమగలంజూచి యేమియుఁ జెప్పఁజాలకున్నారు' అని దుర్యోధనుఁడు పలికెను. అప్పుడు భీముఁ డిట్లుచెప్పెను. 'మాకందఱకు మహాత్ముఁడగు ధర్మరాజు గురువు ప్రభువుగాఁడేని మే మీధార్తరాష్ట్రుల నింతసేపుగ నోర్చియుందుమే. మాపుణ్యతపంబులకుఁ బ్రాణములకుఁ బతియైన యుధిష్ఠిరుఁడు తన్నోడినట్టుగఁ దలఁచునేని, మేము నోడినవారము' అనిచెప్పెను. ఉగ్రుఁడగుచున్న భీముని భీష్మద్రోణవిదురులు వారించిరి. అందుకుఁ గనలి కర్ణుఁ డనరానిమాటలు ద్రౌపదినిఁగూర్చి పలికెను. దానికి నొచ్చినవాఁడై భీముఁడు 'ధర్మజా, పగతు రిట్లనినందున దాసభావమునున్న నాకు

రోషములేదు. నీవీ ద్రౌపది నోడ్డియాడకున్న పగతు రిట్లు మనలఁ బరిహాసముఁ జేయనోపరుగదా' యని పలికెను.)

శ్లో. భీమసేనవచః శ్రుత్వా రాజా దుర్యోధన స్తదా,
యుధిష్ఠిర మువాచేదం తూష్ణీంభూతమ చేతనమ్. ౭౦-౯ (కుం. ౯౨-౨౬)

(భీముఁడనిన పలుకులకు బదులుచెప్పక మౌనముతోనుండుయుధిష్ఠిరుంజూచి దుర్యోధనుఁ డిట్లనియెను.) సమయజ్ఞుఁడైన ధర్మజుఁ డపుడు మాటాడలేదు ధర్మస్వరూపుఁడు జగజెట్టులైన భీమాదుల కాతఁ డగ్రజుఁడుగదా.

శ్లో. భీమార్జునౌ యమౌ చైవ స్థితౌ తే నృప శాసనే,
ప్రశ్నం బ్రూహి చ కృష్ణాం తా మజితాం యదిమన్యసే. ౭౦-౧౦ (కుం.౯౨-౨౭)

'భీమాదులు నీయానతియందున్న వారు. సమాధాన మొసంగుము. ద్రౌపది జయింపఁబడలేదని తలంచెదవా' యని పలికెను. భీష్ముఁడుచెప్పిన దానికిగాని, భీముఁడుచెప్పిన దానికిగాని, దుర్యోధనుని పరిహాసమునకుగాని ధర్మరాజు సహా మాఱుపలుకలేదు. పాండవులు పూర్తిగా నిప్పటికి తిరస్కరింపఁబడిరని తలంచి ద్రౌపదిని హేళనచేయువాఁడై తన యెడమతోడఁజూపి సంజ్ఞచేసెను. భీముఁడు గదతోఁ గొట్టెదనని వెంటనే ప్రతినపూనెను. విదురుఁడు మరల దుర్యోధనుని యవినీతికి సహింపక వానిమీఁదఁ గోపగించి "యుధిష్ఠిరుఁడు తానోడకమున్న ద్రౌపది నోడ్డియుండెనేని యపు డతఁడే యామెకుఁ బ్రభువనిచెప్ప నొప్పును. కాని అట్లు జరుగలేదుగావున సభ్యులారా ఆలోచింపుఁడు. ధర్మముఁ జెలుపకుఁడు" అని మఱల ప్రశ్నించెను. సభలో నిర్ణయము గాకుండుట దోషముగావున నిర్ణయార్థము మరల నడిగెను. అప్పుడు దుర్యోధనుఁడు,

శ్లో. భీమస్య వాక్యే తద్వదేవార్జునస్య స్థితోఽహం వై యమయోశ్చైవమేవ,
యుధిష్ఠిరం తే ప్రవదంత్వనీశ మతో దాస్యాన్మోక్ష్యసే యాజ్ఞసేని. ౭౦-౨౦
(కుం. ౯౨-౩౮)

యాజ్ఞసేనీ భీమార్జున నకులసహదేవుల మాటచొప్పునఁ బోదు నంటివిగదా! వారు యుధిష్ఠిరుఁడు ప్రభువుగాఁడనిచెప్పి రేని నీదాస్యంబు వాయును. అని పలికెను. అప్పు డర్జునుఁడు,

శ్లో. ఈశో రాజా పూర్వమాసీద్గ్లహే నః కుంతీసుతో ధర్మరాజో మహాత్మా,
ఈశస్త్వయం కస్య పరాజితాత్మా తజ్జానీధ్వం కురవస్సర్వఏవ. 20-22
(కుం. ౯౨-౩౯)

(ధర్మరాజు జూదమునకుముందు మాకెల్ల ప్రభువై యుండె. పరాజితుఁడైన పిదప ఎవరికిఁ బ్రభువగునో కౌరవులే వివరించి చెప్పవలయును.)

అని పలికెను. మరల ద్రౌపదీప్రశ్న యథాస్థితికి వచ్చినది. అంతట ధృతరాష్ట్రమందిరములో నక్కలుఅఱచుట, గాడిదెలుగూయుట మొదలగు దుర్నిమిత్తములు పొడకట్టుటయు అది తెలిసి ధృతరాష్ట్రుఁడు దుర్యోధనుని నిందించి పాంచాలినూఱడించి వరము లొసంగుటయు జరిగినది.

ద్రౌపది భర్తయొక్కఆజ్ఞను అనుసరించినది. రాజాజ్ఞను దిరస్కరించలేదు. పట్టుదలవిడువలేదు. సతీత్వమును గాపాడుకొనినది. ధర్మసంకటముననున్న పాండవులకు ధైర్యముఁ గలుగఁజేసినది. భీమాదులు అన్నగారియం దుండవలసిన మర్యాదను నిలఁబెట్టుకొనిరి. రాజాజ్ఞను దిరస్కరించలేదు. ధర్మమును గాపాడుకొనిరి. జూదమునకు రాకుండిన నింతటివిపత్తు చేకూరదుకదా. దూరదృష్టిగల్గిన ధర్మజుఁ డట్లేలచేయలేదు ? అనినచో జూదమాడరమ్మని పినతండ్రి కబురంపినాఁడు. నూతన గృహప్రవేశ మహోత్సవాహ్వానమది. తమయాహ్వాన మంగీకరించి అంతకుఁ గొలఁది దినములక్రిందటనే కౌరవులందఱు రాజసూయమునకు వచ్చియుండిరి. కావున ధర్మజుఁ డప్పుడు కౌరవుల దరికి పోవకతప్పినది కాదు. జూదమాడుటతప్పే. అయినను నది సుహృద్ద్యూతము. విదురుఁడు పిలువవచ్చినాఁడు. అదిగాక ధర్మజున కొకనిబంధనముగలదు. ప్రతివారును అస్త్ర విద్యనేర్చికొనునవసరమున నొకప్రతిజ్ఞచేయుదురు. అట్లే 'జూదమునకుఁ బిలిచినపుడు మఱలను' అని ధర్మజుఁడు నియమము చేసికొనియున్నాఁడు. ఈజూదమువలనఁ జెడుగుగలుగునని యెఱిఁగియు ధర్మజుఁడు పోవకతప్పినదికాదు. ధార్మికుఁడై నందున ధర్మజుఁడు గావించినదాని నెవరును నడ్డలేదు. జనసమ్మతమైయొప్పినది. కౌరవులు గావించిన దాని ననేకులు ప్రతిఘటించిరి. జనవిరోధమైనది. ద్రౌపదియుఁ బాండవులును ఇట్లుగాఁ గులధర్మము, రాజధర్మము మొదలుగాఁగల ధర్మములను మెలఁకువతోఁ బరిపాలించిరి. ధర్మజుఁడు దాసిగా నొడ్డినపైనికాని

కౌరవులు ద్రౌపదిని సభకుఁగొనిరాలేక పోయిరి. ప్రభుత్వమును దుర్వినియోగ మొనరించుట మహాపాపమనియు ననర్థదాయకమనియు నెఱుంగవలయును. కౌరవు లిందువల్లనే నిందకుఁబాల్పడిరి. చెడిపోయిరి. కౌరవులు కులధర్మమును రాజధర్మము నతిక్రమింపక పాండవులను ద్రౌపదిని వెతలఁబెట్టిరి. ధర్మమనుమిషగలదు. కావుననే పాండవులు సహింపవలసివచ్చినది. ధర్మమను మిషనుబెట్టి పాండవులను మఱియు వెతలఁగుడిపించుట కెట్టియవకాశము లభించనందుననే, కౌరవులు యుద్ధముచేసిరిగాని లేకున్న నట్టిప్రయత్నమునే వారుచేసియుందురు. దాస్యధర్మమున నున్నవారు ప్రభునాజ్ఞను మన్నింపవలయును గావునఁ గౌరవసభలోఁ బాండవు లనేకములగు చిక్కులుపడిరి. దాస్యధర్మముననున్న హారిశ్చంద్రుఁడు చంద్రమతి నిర్దోషురాలని యెఱిఁగియు భార్యను సంహరించుటకు సమ్మతించెను. ప్రభుత్వము చెడ్డదగునపుడు అనేక కుటుంబములకు హానిగలుగును. అట్టిచెడుగు మిక్కుటమైనపుడు దేశప్రముఖులు ప్రతిఘటించి సక్రమపద్ధతి నిలుపవలయునని ధర్మశాస్త్రము చెప్పుచున్నది. అయినను భారతయుద్ధమందు భీష్మాదులు పాండవులను జేరలేదు. అన్యాయమునఁ బాండవరాజ్య మపహరించిన కౌరవులకు రాజ్యపదచ్యుతిచేయలేదు. పైఁగాఁ గౌరవులకే సహాయముచేసి ధర్మాత్ములైన పాండవులకందఱికన్న నెక్కువగా సంకటమునుగల్గించిరి. అ ట్లేలచేసిరి. కౌరవులనేల శిక్షించలేదు ? అనినచో పాండవులకే సమస్తరాజ్యము రావలసియున్నను గులజ్యేష్ఠుఁడైన భీష్ముఁడు విరోధము పరిహరింపనెంచి *పాండవులకర్ధరాజ్యము, కౌరవుల కర్ధరాజ్యము నిప్పించియున్నాఁడు. దీనికందఱును

* పాండవులు ద్రౌపదిని వివాహమాడిరి అని తెలిసిన పిమ్మట జరిగిన కౌరవమంత్రాంగములో భీష్ముఁడు కలహము గలుగకుండుటకై

'యది ధర్మస్త్వయాఃకార్యో యదికార్యం ప్రియంచమే
క్షేమం చ యది కర్తవ్యం తేషామర్ధం ప్రదీయతాం' (కుం. ౨౨౨-౧౮)

అని పలికెను. దీనికి ద్రోణవిదురాదు లంగీకరించిరి. అర్ధరాజ్యము పాండవుల కొసంగునపుడు ధృతరాష్ట్రుఁ డిట్లు పలికెను.

'సంరక్షమాణా న్పార్థేన త్రిదశానివవజ్రిణా
అర్ధం రాజ్యంతు సంప్రాప్య ఖాండవప్రస్థమావిశ' (కుం. ౨౨౭-౧౭)

(రాజ్యములో సగముపుచ్చుకొని ఖాండవప్రస్థము ప్రవేశింపుము) అని పలికెను.

సమ్మతించిరి. అర్ధరాజ్యమున కీవిధముగ నధికారులైన కౌరవులయొద్దనే (మొదటనుండి నివసించిన స్థలమందే) భీష్మాదు లుండిపోయిరి. విధిమూలమున పాండవులు వేఱుగాఁ బోవలసినవారైరి. (కౌరవుల ప్రధానోద్దేశ్యమే యిది) పాండవులవద్దకు భీష్మాదులుపోలేదు. పోవునవకాశము కూడ లభింపలేదు. కౌరవరాజ్యములోని వారగుటచే భీష్మాదులు కౌరవులకు సాహాయ్యము చేయవలసివచ్చినది. కౌరవులు వారిరాజ్యమున కేమియు నపకారము గావించలేదు. వారొనర్చిన దుష్కృత్యము. పాండవరాజ్య బలవదాక్రమణము. అది కూడనిపనియని భీష్మాదులు బోధించిరికాని కౌరవులు వినలేదు. వినలేదని వారిని విడిచిరారాదు. తగినంతకారణమున్నఁగాని రాజు నెదిరించరాదు. కౌరవు లట్టి క్రూరకార్యమును గావించలేదు. పాండవుల విషయమై అమానుష కార్యములు గావించిరి. అయినను భీష్మాదులు లేచివచ్చుటకుఁగాని, కౌరవులను శిక్షించుటకుఁగాని అవి తగినకారణములు గావు. భీష్మాదులనెవరిని రాజ్యమునుండిపొమ్మని వా రనలేదు. కలుపుఁగోలుతనమును బ్రకటించిరి. వారిదయను సంపాదించిరి. రాజ్యములో వేరూనిరి. భారతయుద్ధమువలనఁ గులమునశించినదిగాని కులధర్మములు నశించలేదు. (నిర్వంశముకాలేదు.) మీఁది ధర్మయుద్ధమైనందున మీయీయుద్ధమువలనఁ గులధర్మములు నశింపవనియే భగవద్గీతలో శ్రీకృష్ణుఁ డర్జునునకు బోధించియున్నాఁడు. కావుననే పాండవులు యుద్ధమునకుఁ దలపడిరి. న్యాయముగాఁ దమకు రావలసిన రాజ్యముకొఱకు పాండవులును, రాజవిధికొఱకు భీష్మాదులును యుద్ధముచేసిరి. ధర్మాత్ములైన వీరందఱికి ధర్మపక్షాభిమానము గలదు. కావునఁ గులము, దేశము, ప్రపంచము, రాజ్యము వీటిధర్మములను విమర్శించి కార్యమును గావింపవలయును. భారతాదిగ్రంథము లీయంశమును బోధించుచున్నవి. రష్యావారికిని జపానువారికిని ఘోరయుద్ధము సంప్రాప్తమైనపుడు శత్రువుల మర్మములనెఱుఁగ జపానురాజ్యములోని నారీమణులు కొందఱు బుద్ధిపూర్వకముగ వేగుపనికిఁ బూనినవారై, తరుణములందు శత్రుసేనానాయకుల పరిరంభణములకుంగూడ సమ్మతించి, యమూల్యవృత్తాంతములను దేశమునకు దానముచేసి యుపకారరాజ్య పట్టమహిషులైరనియు, వారు గృహధర్మమునువిడిచి దేశధర్మము నెక్కు

వగా గౌరవించినందున నుత్కృష్టులనియు రెడ్డిగారు వ్రాసిరి. ఇది సమంజసమగునూహ కానేరదుకదా. దేవలోకమున కంతటికి నుప కారముఁ జేయఁదలఁచి శత్రుగురువగు శుక్రునివద్దనున్న మృతసంజీవనీ విద్య నంటివేయుటకుఁ బూనివచ్చిన బృహస్పతి కుమారుఁడు కచుఁడు ఆవిద్యసంప్రాప్తమగుటకుఁ గారకురాలైన దేవయాని ప్రార్థించినను ప్రేమించలేదు. కులగౌరవమును సంస్మరించియే గురుపుత్రిని వివాహ మాడ నిరాకరించియున్నాఁడు. పైఁగా శపించినాఁడు. గర్భశత్రువైన పాదుషాను బట్టియిచ్చుటకుఁ గరారుచేసి ప్రతిఫలము పరిరంభణము నపే క్షించిన వనితను గులగౌరవమును సంస్మరించియే శివాజీ మహాశయుఁడు నిరాకరించియున్నాఁడు. కులధర్మమును బాడొనరించుచు స్త్రీలు రచ్చ కెక్కుచుండుటవలనను, గులధర్మమునెడల నలక్ష్యమొనరించుచుఁ బురు షులు దేశసేవకుఁ గడంగుచున్నందునను నేఁడు మనదేశము పాడగు చున్నది. జపానుదేశమున కీపైసంగతి అత్యంత మవమానమునుగూర్చునే కాని కీర్తికరము కాదు. ఇది స్త్రీస్వాతంత్ర్యము ప్రబలినందునఁ గలిగిన చేటేగాని మఱేమియుఁగాదు. స్త్రీలు చెడినందుననే యనర్థముగలుగునని మనశాస్త్రములు చెప్పుచున్నవి. అది నేఁడుప్రపంచమందుఁ బ్రత్యక్ష ముగఁ గనఁబడుచున్నది. అభిమన్యుఁడు చనిపోయినందులకు యుద్ధ నైపుణ్యము గల్గియున్నను సుభద్ర యింటనేడ్చినదేకాని యుద్ధరంగము నకు రాలేదు. యుద్ధమునకుఁ బురికొల్పిన ద్రౌపదిగాని, సుతాభివృద్ధికేఁ గాను జీవించియున్న కుంతిగాని, కేవలపాతివ్రత్యధర్మమునకై (కులధర్మ మునకై) కన్నులుకట్టుకొన్న గాంధారిగాని,మఱేయేస్త్రీగాని యుద్ధరంగము నకురాలేదు. 'వీరపత్నినిఁగావలయును, నీవు నన్నిపుడుగొనిపోవుటకు సమ్మతింపను' అని హనుమంతునితోఁజెప్పిన సీత యుద్ధమునకు రాలేదు. కౌరవబలము క్రమక్రమముగా క్షీణదశ నొందుచుండినను గూడ కౌరవ పత్నులు యుద్ధరంగమునకురాలేదు. రెడ్డిగారుచెప్పినట్లు భర్తల శిర చ్ఛేదముచేయలేదు. విషముత్రవుడు నీయలేదు. పాండవులను జేరను లేదు. అట్లే మండోదరి రావణుని శిరచ్ఛేదముచేయలేదు. అభ్యు దయముచేయు శ్రీరామునిఁజేరలేదు. కౌరవధర్మపత్నులు, మండోదరి అకృత్యమొనర్చిరనియే రెడ్డిగారి అమూల్యాభిప్రాయమేమొ! సీత,

ద్రౌపది, కుంతి, గాంధారి వీరందఱును రాజకీయములోఁ బ్రసంగించి యున్నారు. కులధర్మమునువీడలేదు. సభలకుఁబోలేదు. *యుద్ధముచేయలేదు.

తండ్రికుమారుల ననేకుల నాత్మజులని పిలుచును గాని ఆకుమారులందఱు ఒక్కనినే తండ్రియని పిలిచెదరు తండ్రి కనేకులు ఆత్మజులుండ వచ్చును. ఆయాత్మజులకుఁ దండ్రి యొక్కఁడేకదా యుండవలయును. అట్లే భర్తకు అనేకభార్య లుండవచ్చును. భార్యకుమాత్ర మనేకులు భర్తలుండరాదు. స్త్రీలు పురుషునధీన మగుచున్నందునను, అస్వతంత్రులై నందునను, కావుననే ఆస్త్రీవిభాగమున కనర్హులైనందునను, అది ప్రపంచ క్షేమమగుచున్నందునను,ధర్మశాస్త్రములు పురుషునకు అన్యభార్యయుండ వచ్చునని యంగీకరించుచున్నవి. ధర్మశాస్త్రము ఇహపరశ్రేయస్సాధనమైనది. ఇట్లు అన్యభార్యాత్వ మంగీకరించినను దుర్వినియోగమునకు మాత్రము ధర్మశాస్త్రమంగీకరించదు. అట్లుగా వాటియం దుల్లేఖింపఁబడియున్నది. ప్రపంచస్వభావమును గుర్తించి ఇట్లుగాఁ జక్కనియేర్పాట్లను మనధర్మశాస్త్రములు (మానవధర్మశాస్త్రములు) నిర్ణయించియుండఁగా ఆధర్మశాస్త్రములవల్లనే మనము పాడైనామనియు, సంకుచితస్వభావమునకు హేతువైన వర్ణధర్మములువచ్చి మనదేశము పాడైనదనియు రెడ్డిగారిట్లువ్రాసిరి.

ఐరోపాలో రాజులు నాశమెత్తినను ప్రజయను నింకొక ప్రకృతి ప్రతాపవంతమైయుండుఁ గావున, కవిత కేవలము నగరినాశ్రయించి బ్రతుకువిద్యగాదు. హిందూదేశములో మనుస్మృతి దెబ్బదగిలిననాఁటి నుండి ప్రజ యీావఱకును లేవలేకపడియున్నది. దానిది పరాశ్రయమైన బ్రదుకు! కృష్ణదేవరాయలు, శివాజీ వీరింబోలిన మహనీయు లవతరించిరేని, జనసామాన్యమును వారివెంట కుక్కలగుంపువలెఁబోయి యెవరి మీాఁదఁబడుమన్నను బడునుగాని, నాయకులులేనిచో దిక్కులు దెలియక మరలఁ బ్రాచీనకర్మమును బారంపర్యహీనస్థానమును అవలంబించును.

* కైకేయి లోకాంతరమందు జరిగిన దేవాసురయుద్ధమునకుఁ బోయినది. అట్లే సత్యభామయు యుద్ధమునకు వెడలియున్నది.

క. ఏమీ! రాజులుమంత్రులుఁ, దామతి దుర్బుద్ధులైన ధరయెల్లను గ్రిం
దై మాఁడి మడియునో! జన,సామాన్యము సంఘచరిత చక్రానిదైనన్.

మనవారిలో సంఘచరితమను భావమేయున్నదో లేదో! భావమే లేనిది ప్రవృత్తియెక్కడిది? తమతమ కుటుంబములయు, తెగలయు క్షేమచింతయేగాని రాష్ట్రీయముం గూర్చినచింతలు లేనివారగుటంజేసి, వీరి ప్రారంభములచే దేశమున కేమాత్రము మానప్రాణరక్షణములు సమకూఱవు. అట్లగుట వీరకృత్యములు గంభీరోద్యమములు. వీరిచేఁ దెలివియు విరివియుఁగాంచుకవిత సాధారణజనులపై నేలదృష్టియుంచును? తనకడుపుమీఁదఁదప్ప నింకెద్దానిమీఁదను గన్నుమనసుఁ బోనివానిపైఁ బరులకన్నులు మనసులు నేలపాఱును? చీయనివాపోవుటకుఁదప్ప! ఐరోపాలోని కవీశ్వరులు గొందఱు కాఁపువారు, సైనికులు మొదలైన తక్కువ వృత్తులవారిబ్రదుకులును వర్ణనార్హములని భావించి యెంతో సుందరముగఁ గావ్యములలో వ్రాసియున్నారు. మనగ్రంథముల మాత్రముచదివి యీపుణ్యక్షేత్రమైన కురుక్షేత్రముయొక్క స్థితిగతుల నరయఁజూచువారికి, ఈదేశము బీదసాదలపై నాదరముగలకవి యెవఁడైన నున్నాఁడా? తుదకు, బీదసాదలైననున్నారా? యను సంశయముపట్టినను దప్పువారిదిగాదు! శోకరసము వర్ణింపవలయునన్న ననుకూలమగు సందర్భమెయ్యది? క్రొవ్వుకాఱెడు నాయికానాయకుల యూహామాత్రములైన కష్టములా? ప్రజలు దినదినమునఁ గన్నీరుగార్చుటకైన నవకాశము లేక కుడుచుచుండు పరిపరివిధములైనగోడులా? శాంతరసమునకుఁ బోషకమెయ్యది? తమకు నష్టముఁ దేనట్టివైన రాజులయొక్క యుదారచర్యలా? ఆఁకటమాఁడి మలమలమాడుచు నింటికివచ్చి వంటసిద్ధముకాకుండినను భార్యపైఁగోపింపక కన్నులుమూఁత వడుచుండ విధినిధ్యానించుచు నొకమూలఁ గూర్చుండు పొలముకాఁపు యొక్క నడవడియా? ఆహా! జనసామాన్యముయొక్క ప్రతిదినవృత్తములలో నెంతభావము, రసము, గుణము ఉపగతములైయున్నవో మన కవులకుం దెలియవుగదా! రాజపుత్రులను, రాజకన్యలను, చాలనందులకు బ్రాహ్మణులను, వేశ్యలనుబట్టి ఝుంఝూటమాడుటదప్పఁ గవితకు మేలైన యన్యకర్మములు లేవా?

సామాన్యజను లీరీతి నలక్ష్యముగాఁ జూడబడుటకు హేతువు లెవ్వియన: ఈదేశమునఁ బ్రజ సాధించుటకుఁ జేయి, తన్నుటకుఁ గాలు, మొఱపెట్టుటకు నోరు ఏదియు లేనిపశువు! ఐరోపాలోనిజనులు రాజస గుణశోభితులు. మనపాలిటిభాగ్యము తామసమో, దానితోఁబుట్టువగు సత్త్వమో యేదోయొక జడత్వబీజము! జాతిభేదములవలన శ్రేష్ఠకులు లకు తదితరపక్షమున మర్యాదయు గౌరవమును గలుగమి శ్రేష్ఠులకు మాత్ర మర్థింపఁదగినదనునియతిని విద్యదాల్చినదగుట. దీనివలని దుర్ద శలు రెండు. మొదటిది, విద్యవచ్చిన యుత్తమవర్ణులకు తక్కినవారితోడి సాంగత్యము తక్కువగావున వారింగూర్చి వ్రాయఁజాలినను వ్రాయ నేరరు. రెండవది, విద్యాదానమునకుం బాత్రముగాని జనబాహుళ్యము ఎంతదెలిసినదయ్యును అక్షరములు రానిలోపంబున వ్రాయనేరరు. అథవా ఒకరిద్దఱు కవితాశక్తి నెట్లోసంపాదించిరిపో! ప్రాశస్త్యమున నున్నపద్ధతిరీతిఁజెప్పి యగ్రజాతివారిని మెప్పింపవలయు ననిగదా వారు ముఖ్యముగాఁ దలంతురు! అట్లగుట నల్పజీవితమును వారు సరకుసేయు దురా? చేయరు. జాతికీజాతికి స్పర్థయేర్పడుటవలన పాండిత్యము ప్రక టించి బ్రాహ్మణుల మీఁఱవలయునని రామరాజభూషణుఁడు యత్నించె నేమోయనుట విచార్యము! ఏదియెట్లున్ననేమి? అగ్రజాతులవారి యహంభావము, అశ్రద్ధ, ఆచారము ఇవివేరుగను, అన్యజాతివారిని దమ మార్గమునకు నధీనులఁగాఁజేయుటయు, కవితోచితమైన విషయమును మిక్కిలి సంగ్రహపఱచినవి. ఒక్కరాజులను రాజకన్యలను వదలినయెడఁ గవితకు గతిమోక్షము నుండవుగాఁబోలు! ఆంధ్రకవిత్వము రాజులను రాణులనునమ్మి జీవనము జరుపుకొనునది గనుక, వారైశ్వర్యమును గోలు పోయినతోడనే తానును వైరస్యమును వికృతవేషమును దాల్పవలసిన దాయెను. ప్రజలలో సత్త్వము స్థిరముగ లేనిది కవిత నిత్యసౌభాగ్యము పడయనేర్చుటెట్లు?

మనయొక్క రాజులదినములలో నైత మలవడనంత విన్యాసము నేఁడు ఆంధ్రమునుజెందియుండుటకు, బ్రిటిషువారి పరిపాలనమాహాత్మ్య మును, దానిచే మనయందు ప్రభవిల్లినవృద్ధి నతిశయముగఁ జెందుదమను నుత్సాహమును ముఖ్యకారణములు. విద్యయు నెల్లరు శక్తికొలఁది

నిరాతంకముగ గ్రహింపవచ్చును. ఔన్నత్యమునకు సంఘదురాచారముల నిర్మూలము జేయుట విడువరాని సమయముగావున, నాంధ్రసాహితీ పునరుద్ధరణప్రభావులైన శ్రీవీరేశలింగముగారిచే దారిచూపఁబడిన యనేకులు, ప్రజలయొక్క మేలిమినాసించి, వారలకుఁదెలియునట్లు అనేక ముఖ్యవిషయములఁగూర్చి వ్రాయుచుండుటచే, భాషయందలి ప్రీతియు, గౌరవమును, అభిలాషయు, కుతూహలమును మునుపెన్నఁడుఁ దాల్చియుండనంతవ్యాప్తినిఁ బెంపును వహించుచున్నవి. ప్రకృతము కావ్యములు, నాటకములు, ప్రహసనములు ఇత్యాదికృతులతో నివేదింపఁబడు విషయము లసంఖ్యములు. సర్వజనహితములు. ప్రాఁతమార్గముల నేయాపద్ధతు లరిగిపోవునట్లు గొఱ్ఱెలమందలవలెఁ బోవునవిగావు. మఱియు దేశాభ్యుదయమను మహోద్దేశముగలవౌటఁ బౌరుషోద్దీపకములు. నాయికానాయకులు సగమునకు సగము పలాయితులైరి. రాజులు రాణులును ప్రచ్ఛన్నులై యేమూలందాఁగిరో యెందడఁగిరో! వెతఁబడువారు లేరు. వెదకువారును లేరు! కలియుగాదినుండి యింతదాఁక జమకు ఖర్చునకు రాని సాధారణజనులు నేఁటికిఁగదా గణ్యులైరి! ఇఁకముందు పూజ్యులగుదురుగాక.

తే. అక్కజంబుగనిప్పు డత్యంతదీప్తి, వెలుఁగుచున్నావు భారతీ! విమలమహిమ
నాంధ్రదేశంబుతో మార్పులనుభవించి, యేమిచెప్పుదుఁ? గలికాల మింక నెట్లొ?

(౭౬-౮౦) అనివ్రాసిరి.

ప్రజలలో సంఘీభావమున్నది గాన ఐరోపాలోని జనులు సంఘచరితముగలవారని మనకట్టి సంఘీభావము లేదని రెడ్డిగారు వ్రాసిరి. సంఘచరిత మనునది మనదేకాని ఐరోపావారిదికాదు. దైవవైపరీత్యమున మనము చెడుచుంటిమి. అయినను ఇప్పటికిని సంఘీభావమన్నది మనలోనేయున్నదికాని వేఱొకదేశమందు లేదు. సంఘమర్యాద నతిక్రమించుటకు మనవారు భయపడినట్లు ఇతరదేశములవారు భయపడరు. రాజు దుర్నీతినడచెనేని వానినిఁ బదభ్రష్టునిఁగావించి వేఱొకనిని రాజుగా నియమించునధికారము ప్రజలకుఁగలదని మనధర్మశాస్త్రములు చెప్పుచున్నవి. ఈఅంశమును సమర్థించుటకు ఇతిహాసములుగలవు. సంఘచరితము మనలోలేనందున కృష్ణదేవరాయలు, శివాజీ మొదలగు మహాను

భావులు పుట్టినను మనదేశము వారు గతించినవెనుక మరలఁ బ్రాచీనకర్మ మును బొందుచువచ్చినది అని రెడ్డిగారు వ్రాసిరి. ఏదేశమైనను దగిన నాయకుఁడు లేనిది వృద్ధిలోనికి రాదు. అదియు దైవబలముండినపుడే సంప్రాప్తించును. యుద్ధమందు సర్వవిధముల నోడిపోయిన జర్మనుదేశము జయముఁబొందిన దేశములమించి అచిరకాలములో మరలఁ దలయెత్తు టకుఁ గారణము తగిన నాయకత్వమే. దైవము తిన్నగఁజూచినందున నిది సంప్రాప్తించినది. అదిలేనినాఁడు ప్రారంభ మెంతనిపుణముగనున్నను ప్రయత్నము లెంతఘనమైనను నిష్ఫలమగును. శివాజీ మొదలగు మహనీయులు స్థాపించినరాజ్యము లంతరించిపోయి దేశము పాడగు టకుఁ గారణము దైవవైపరీత్యమే. ఆరాజ్యములోనివారే ద్రోహము గావించి మహారాష్ట్రదేశముతోఁబాటు భారతదేశమును బాడొనరిం చిరి అని చెప్పెదరు. దైవము తిన్నగజూచిననాఁడు ఇట్టి వైపరీత్యములు అడ్డురానేరవు. ఈస్టుఇండియాకంపెనీవారు భారతదేశములో రాజ్య మును స్థాపించిరి. ఆకాలములో నాకంపెనీలో నౌకరిపై నౌకరికిఁబడెడిది కాదు. వారి దేశస్థులకు (ఇంగ్లాండువారికి) వీరిపై ద్వేషముండెడిది. బల సంపదా పిసరంతలేదు. స్వదేశసంస్థానములతో మిక్కుటమైన విరోధము గలదు. అయినను ఎందుకును బనికిరానివాఁడని భారతదేశమునకుఁ బంపఁబడిన క్లైవు స్థాపించినరాజ్యము దినదినాభివృద్ధినొంది భారతదేశము నంతయు వ్యాపించినది. మాధవాచార్యులు, శివాజీ మొదలగు మన నాయకులు స్థాపించినరాజ్యములు నశించినవి. ఇది దైవవైపరీత్యము కాక ఇంకేమగును.

సంఘచరితము లేనందున మనవారు జనసామాన్యము నలక్ష్యు మొనరించిరనియుఁ గావుననే కావ్యములలో సాధారణుల కష్టసుఖ ములు వర్ణింపఁబడలేదనియు రెడ్డిగారు వ్రాసిరి. మనదేశమునకు నితర దేశములకు భేదముగలదు. మనదేశములోఁ బాడిపంటలు సమృద్ధిగా నున్నవి. మహమ్మదీయులు ఈదేశమును దండెత్తినపుడు మనవారు ప్రతి ఘటించియున్నారేకాని దేశమునుండి వెడలఁగొట్టు ప్రయత్నముఁజేయ లేదు. మనపూర్వులుగాని ఆవచ్చిన మహమ్మదీయులుగాని పాశ్చాత్యు లను వెడలఁగొట్టుప్రయత్నముచేయలేదు. వారి కాశ్రయమొసంగిరే

కాని పోష్మనలేదు. ఎండలువచ్చినను జాలినంతగలది మనదేశము. పాశ్చాత్యదేశము లట్టివికావు. వారిదేశములలోఁ దిండిదొరకనందున జీవనోపాధికై ఆదేశపుఁబ్రజలు వేఱొకదేశమునకుఁబోవక తప్పినది కాదు. జీవనోపాధికై పూర్వము వారు తక్కిన దేశములకువెళ్లిరి. ఇప్పుడావిక్కులు అట్లేయుండఁగా స్వదేశసంరక్షణార్థము ఇతరరాజ్యములు వారికి కావలసివచ్చుచున్నవి. కావున వారు ఇతరదేశముల నాక్రమింపఁజూచుచున్నారు. మహమ్మదీయులు రాకమునుపు మనదేశము బంగారమే. వారువచ్చిన పిమ్మటఁగూడఁ బాడిపంటలకు లోపములేదు. ఇప్పటికిని మన కాలోపములేదు. కాని పాశ్చాత్యులవలెనే మనవారును జీవనోపాధికై నేఁడు అన్యదేశములకుఁ బోవలసివచ్చుచున్నది. వారివలెనే ఇతరదేశములకుఁబోయినను జీవనోపాధి చక్కఁగ జరుగలేదు. (అనఁగా విషమపరిస్థితి దేశమం దట్లేయున్నదని భావము.) సర్వమానవసమానత్వ మీనాఁటి కీరితిని సమకూర్చినదైవము బలీయముకదా. స్వదేశసంరక్షణమునకు, జీవనోపాధికి ఆదేశము లితరదేశములపై నాధారపడవలసియున్నది. మనదేశమున కిప్పటికికాదు మఱెప్పటికిని ఆ చిక్కురాదు. సంరక్షించుకొనిన నంతయు దేశమందేయున్నది. దైవము తిన్నగఁజూచిన నాఁడది సమకూరకమానదు. మనదేశస్థులు జీవనోపాధికిఁగాను బాధపడుట ఇదివఱ కెప్పుడును లేదు. ధర్మమునకు జయమనియు, పరముగలదని పూర్తినమ్మకము మనవారికిఁగలదు. ప్రతివిషయము అనాదిగావచ్చుఫక్కినే నడిపించిరి. వాటినే అనువదించిరి. పురాణాదులను వ్రాసిరి. కావ్యములనువ్రాసిరి. మహమ్మదీయులతో జరిగిన యుద్ధములను వర్ణించిరి. అనేకములగు గ్రంథములనువ్రాసిరి. కాని జీవనోపాధికి జరుగని వారినిఁగూర్చి వ్రాయలేదు. (కుచేలుఁడు మొదలగు వారివిషయమై వ్రాయఁబడియున్నవి.అవి ఈసందర్భమునఁ బరికింపఁబనిలేదు. వారత్యంతము భిన్నులు. ఎప్పటికిని జీవనోపాధిలేనివారలే యిచట గ్రాహ్యులు.) అట్టి పరిస్థితి ఈనాఁడువచ్చినదిగాని మఱేనాఁడును మనదేశమునకురాలేదు. ఐరోపావారు అట్టివారినిఁగూర్చి కావ్యములువ్రాసిరి. అనఁగా వారిస్థితి యటువంటిది. నేఁటి పరిస్థితినిఁబట్టి అట్టివి మనలోఁగూడ నిప్పుడు బయలుదేరుచున్నవికదా. రెడ్డిగా రిది సుగుణమనివ్రాసిరి. రాజులు

రాణులు పలాయనులగుటకు సంతోషించిరి. వారిరాజ్యములు నశించి నందులకు ధన్యవాదములర్పించిరి. పాశ్చాత్యపరిపాలనమాహాత్మ్యము నుగ్గడించిరి.

మనకవులు, ప్రజలు లంకను, కురుక్షేత్రమును దలంచిరేకాని అన్యమును దలంపలేదు. పరసాధనమే ప్రధానముగాఁగల్గినవారును, ఇహమందు జీవనోపాధికి ఇబ్బందిలేనివారును, సహజమైనవృత్తిగలవారును నగుటను మనవారు వాటినే సదా తలంచుచుండెడివారు. నేఁటికిని అట్లే తలంచుచున్నారు. పరము ప్రధానముగావుననే మంచిశీలము మన వారియందుఁ బ్రకాశించినది. సహజమైనఆదర మందఱిపైఁగల్గియుండెడిది. కావుననే అతిథి అభ్యాగతి సత్కారములచేతను, దానధర్మములచేతను మనదేశము ప్రకాశించినది. సత్యము, నీతి, సత్ప్రవర్తనముగల్గి ప్రకాశించినది. కావ్యములలో బీదలవిషయమై ఆలోచించవలసినంతఅగత్యము నిజముగా మనదేశమున కెప్పుడును గలుగలేదు. కావుననే ఎడతెగని కష్టపరంపరలోనున్న బీదజనులు కావ్యములకెక్కలేదు. అందుకుగర్వించి సంతోషించి నేఁడుమనగతికి వగవవలసి యున్నది.

ప్రతిజాతికిని సహజమైనవృత్తి మనదేశములో నుండెడిది. అందువలనఁ బ్రతివానికి వృత్తి యేర్పడియుండెడిది. ఆయావృత్తులలో వారి వారికి మిక్కిలి నేర్పుండెడిది. ఈవర్ణనిబంధనవలన నిదిహీనమైనపని అనుభావము గలుగకుండ స్వవృత్తుల నందఱాదరించెడివారు. స్వవృత్తిగావించుట గౌరవప్రదమనియు నితరవృత్తు లెట్టివైనను ఆశ్రయింపఁగూడదనియు నమ్మియుండిరి. కావుననే వివిధకళలు అనాదికాలమునుండియు మనదేశమున వన్నెకెక్కియున్నవి. ఇది మహమ్మదీయకాలమందుఁగూడ గలదు. ఇతరదేశములలోలేని వర్ణవిభేదము మనదేశమం చెందుకుండవలయునని యోజించుటపొరపాటు. ప్రపంచములో నేదేశమందులేని పాడిపంటలయొక్కసమృద్ధి మనదేశముననే యేలకలుగవలయును. భూలోకరత్నము భారతదేశము. సంఘక్షేమదాయకము వర్ణాశ్రమవిభాగము. వర్ణాశ్రమములం దభిమానముండుటయే నిక్కమగు భారతదేశాభిమానమగును. అదికలిగిననాఁడు ఆస్తిక్యబుద్ధిగలుగును. అందువలన నిహాపరములందు శ్రేయము గలుగును. ప్రజ్ఞాచక్షువులైన మనపూర్వు లిట్లా

చరించి తరించియుండిరి. ఇహపరములను సాధించిరి. భారతదేశము భూలోకరత్నము, కర్మభూమియను ప్రసిద్ధినిఁగల్గించిరి. విషయమిట్లుండఁగా రెడ్డిగారు మనమతతత్త్వముల నిట్లా క్షేపించిరి.

"తుచ్ఛశృంగారములకుఁ గారణములు మన యనాచారములు:- ప్రభావతీప్రద్యుమ్నములోని దోషములం గూర్చిన ప్రస్తావము మనసు గట్టిచేసి యెట్లో చేసితిమిగాన, కవిపరమైన ప్రతివాదములును ఇట సమర్పింపంబూనుట సహజమును సంతోషకరము నైనధర్మము. శృంగార రసవిషయములగు నాభాసములకుఁగవి కాదు ఉత్తరవాది. మఱి యట్టి యనిష్టములే యింద్రభోగములని రోతఁజెందక గ్రహించు మన సంఘము! భావనాశక్తి యెంతయుద్ధురమైయుండిననేమి? హనుమంతుఁడు సముద్రము దాఁటఁజాలినను దననీడఁదా దాఁటఁజాలునా? అట్లే, తన యావజ్జీవము నెట్టిస్థితిగతులనడుచునో వానిసాంగత్య మేమాత్రము లేని తలంపులను దెచ్చుట తరముమీఱినకోరిక. ఇందులకు మతతత్త్వముల నుండియే ప్రబలప్రమాణముల జూపవచ్చును. దేవలోకమననేమి? ఈ లోకములోని సుఖములు లభించుటకు నాస్పదమైనపదవియేకదా! అనఁగా నీలోకములోనిదుఃఖములు నిర్మూలింపఁబడినట్లును సుఖములు అమేయ ములైనట్లును భావించిన దేవలోక మేర్పడును. పరమనునది యిహముచే సృజింపఁబడిన ప్రతిబింబమేగాని యన్యముగాదు. యౌవనము మంచిది. ముదిమి చెడ్డది. అట్లగుటచే దేవతలు నిత్యయౌవనులనియు, మనము యజ్ఞములఁజేసిన నిత్యయౌవనుల మగుదుమనియు మనుజుఁడు పేరాసచే నెంచుచున్నాఁడు. నిత్యయౌవనమున్న రంభలుండవలయు. లేనిచో నది నిష్ఫలము. ఈరీతి నైహికములననుసరించి యీప్రపంచమున మనకుఁగల సుఖములు, ఆశలు అను సామగ్రితోఁగట్టఁబడిన మాయాలోకములే వైకుంఠము, కైలాసము మొదలగు పరమపదవులు. తుదకు దేవునినైనను సరే, మనుష్యులం బోనివానిగా నూహించుచున్నామేగాని, యతఁడతీ తుఁడని నోటిమాటయున్నను భావమున నట్టిఁడుగా సాక్షాత్కరింపఁ జేయుట యసాధ్యము. ఆతనికి వేయిచేతులున్నవని సిద్ధాంతముండెఁబో! వేయి మనదిగాకున్నను చేతులును వస్తువులు మనవేగదా! మనయొక్క యంగములు, ప్రాణము, మనసు వీనితో నేమాత్రము సాదృశ్యము లేని

భగవంతునొకనిఁగల్పించి స్మరించుటయలవియా? యోజింపుఁడు! అట్లగుటఁ గావ్యవర్ణనములును అనుభవబద్ధములగు టేమివింత! అవి యీలోకము లోనిరసములను ప్రకటింపఁజేయుకృతులు. కావున సంఘములోనుండు సౌరభమో దుర్గంధమో వానియందును బర్వియుండుట నైజము. అని వార్యము." (౧౪౯-౧౫౧) అనివ్రాసిరి.

సుఖమే కావలయును, దుఃఖము కొంచెమైనను వలదు అని ప్రతి ప్రాణియు నభిలషించుచున్నది. కాని ప్రతిప్రాణికిని కష్టసుఖములు పరం పరగాఁ గలుగుచున్నవి. ఈకష్టసుఖము లనుభవించుటయందు మనుజులే గాక పశుపక్ష్యాదులుఁగూడ సమానములైయున్నవి. కామక్రోధాది అరిషడ్వర్గమందుఁ దగులుకొని జీవులు మిగుల బాధనొందుచున్నారు. సంతుష్టి గలుగనందున శాంతినిఁ బొందలేకుండనున్నారు. అత్యాశవల ననే పరస్త్రీ పరధనాదివాంఛలు గలిగి మానవులు శ్రమనొందుచున్నారు. అందులకయే యీప్రపంచమున ననేకములైన దుర్మార్గములు, కుట్రలు, హత్యలు, ఈర్ష్యలు గలుగుచున్నవి. ప్రపంచచరిత్రయం దిది ప్రత్యక్ష నిదర్శనమై యున్నది.

అనంతమైన విశ్వమందు జీవుఁడు ఒకదేహముతో నుండుకాలము బహుస్వల్పమైనది. ఆదేహము ధరించుటకు ముందుఁ దానెవరో, ఎందుండివచ్చి ఎక్కడికరుగుచున్నాఁడో తెలియుటలేదు. ఈస్వల్పకాల భోగమునకే (ఈదేహమే నేను అని తలంచినందున) జీవుఁడు అధర్మము నకుఁ బాల్పడుచున్నాఁడు.

తానెట్లు తనసౌఖ్యమునకై ప్రయత్నపడుచున్నాడో ఇతరులును అట్లే ప్రయత్నపడుదురు అని యోచింగినవివేకి ఇతరుల సౌఖ్యమున కడ్డు రానేరఁడు. వివేకవంతులైనవారు తమ సౌఖ్యమునకుఁ బ్రయత్నించె దరు. అట్లే ఇతరులకు దుఃఖము గలిగించరు. ఇది మానవసామాన్య ధర్మమై యున్నది.

ఇతరులకు దుఃఖము గలుగకుండుటకును దాము తరించుటకును సద్గుణముల నలవఱుచుకొనవలసియున్నది. దుర్మార్గములను విసర్జించ వలసియున్నది. అంతియగాక అనంతమైన విశ్వమం దుద్భవించియున్న ట్టియు నుద్భవించఁబోవునట్టియు జీవుల క్షేమమును దలంచి సద్గుణము

లను బ్రకాశింపఁజేయవలసియున్నది. అవమానాదులను దొలగించుకొనవలసియున్నది.

లంకలో శత్రుక్షయానంతరము సీతాదేవి చూడవచ్చినపుడు శ్రీరాముఁ డిట్లు పలికెను.

శ్లో. ఏషాసి నిర్జితా భద్రే శత్రుం జిత్వా మయా రణే,
పౌరుషా ద్యదనుష్ఠేయం తదేత దుపపాదితమ్. ౧౧౮-౨

(యుద్ధములో శత్రువును జయించి నిన్ను స్వాధీనము చేసుకొంటిని. పౌరుషముచేఁ జేయవలసినకార్యము నేసితిని.)

శ్లో. యాత్వం విరహితా నీతా చలచిత్తేన రక్షసా,
దైవసంపాదితో దోషో మానుషేణ మయాజితః. ౫
సంప్రాప్త మవమానం య స్తేజసా న ప్రమార్జతి,
క స్తస్య పురుషార్థోఽస్తి పురుషస్యాల్ప తేజసః. ౬

(నన్ను నీవు యెడఁబాసియుండునపుడు చపలచిత్తుఁడగు రావణుఁడు నిన్నపహరించుకొనిపోయెను. దైవముచేఁ గలిగిన యీయవమానమును బురుషప్రయత్నముచేఁ దొలఁగించుకొంటిని. సంభవించిన యవమానమును దనసామర్థ్యముచే నెవఁడు పోఁగొట్టుకొనఁడో అల్పమైన తేజస్సుగల అట్టివానికిఁ బురుషార్థములు సిద్ధింపవు.

శ్లో. విదితశ్చాస్తు తే భద్రే యోఽయం రణపరిశ్రమః,
సతీర్ణ స్సుహృదాం వీర్యా న్న తదర్థం మయా కృతః.
రక్షతా తు మయా వృత్త మపవాదం చ సర్వశః,
ప్రఖ్యాతస్యాత్మవంశస్య న్యంగం చ పరిరక్షతా. ౧౬

(స్నేహితుల పరాక్రమముచే యుద్ధములోఁ గలిగినశ్రమను దాఁటితిని. నీకుగాను నేనింతశ్రమపడలేదని అందఱికిని విశదపడవలయును. ప్రసిద్ధమైన కులముయొక్క గౌరవమును రక్షించుచు అపవాదమును, అయశస్సును బరిహరించుకొనుచుండు నేను యుద్ధములో మిగుల శ్రమపడితిని.

శ్లో. ప్రాప్తచారిత్రసందేహా మమ ప్రతిముఖే స్థితా,
దీపో నేత్రాతురస్యేవ ప్రతికూలాసి మే దృఢమ్. ౧౭

తద్గచ్ఛ త్వాభ్యనుజ్ఞాతా యథేష్టం జనకాత్మజే,
ఏతా దశదిశో భద్రే కార్యమస్తి న మే త్వయా. ౧౮
కః పుమాన్ హి కులేజాతః స్త్రియం పరగృహోషితామ్,
తేజస్వీ పునరాదద్యా త్సుహృల్లేఖ్యేన చేతసా. ౧౯
రావణాంక పరిభ్రష్టాం దృష్టాం దుష్టేన చక్షుషా,
కథం త్వాం పునరాదద్యాం కులం వ్యపదిశన్ మహత్. ౨౦

(నీసచ్చరిత్రము విషయమై లోకముయొక్క సందేహమునకుఁ బాత్రురాలవైన నీవు నాయెదుట నిలిచి, కంటినొప్పి గలిగినవానికి దీపమువలె, నాకు శత్రువుగనున్నావు. జనకునికూతురా, నేను ఉత్తర విచ్చితిని. నీ యిష్టప్రకార మెచటికైనను బోవచ్చును మంగళకరీ, నీతోడ నా కేమియుఁ బనిలేదు. పౌరుషముగల కులీనుఁడగు పురుషుఁడు, అన్యుని గృహములోనుండిన స్త్రీని స్నేహాతిశయముతోఁ గూడినమనసుతో మఱియు అంగీకరించుఁడు. రావణుని తొడమీఁదఁగూర్చుండి నీచుఁడగు అతఁడతనికంటితోఁజూచిన నిన్ను మఱియు గొప్పకులములోఁ బుట్టిన వాఁడనని చెప్పుకొనుచు నెటుల నంగీకరించఁగలను.

శ్లో. తదర్థం నిర్జితా మే త్వం యశః ప్రత్యాహృతం మయా,
నాస్తి మే త్వయ్యభిష్వంగో యథేష్టం గమ్యతామితః. ౨౧

(నాకులముయొక్క గౌరవమును గాపాడుకొనుటకై రావణునిఁ జంపి నిన్నుఁదెచ్చి నాయశస్సును గాపాడుకొంటిని. నీమీఁద నాకను రాగములేదు. నీయిష్టము వచ్చినటులఁ బోవచ్చును)

ఇట్లుఃపలికి స్త్రీకి స్వాతంత్ర్యములేదు గావునను భర్త విడిచినస్త్రీ దేహసంరక్షణకై భర్తయొక్క ఆప్తులయింటిలోనే యుండవలయునను నది శాస్త్రవిధి గావుననుఁ రాముఁడు సీత నివసించుట కర్హములగు నాలుగుస్థలములను (తన కత్యంతము హితులగువారిని నలుగురిని) నిర్దేశించెను. అచ్చటనుండుట సీతకుఁ దగుననియు, అట్లాదేవి సమ్మతింప నపుడు యథేష్టముగాఁ బోవచ్చుననియు శ్రీరాముఁడు అభిప్రాయమును గనఁబఱచెను.

శ్లో. ఇతి ప్రవ్యాహృతం భద్రే మయైతత్ కృతబుద్ధినా,
లక్ష్మణే భరతే వా త్వం కురు బుద్ధిం యథాసుఖం. ౨౨

సుగ్రీవే వానరేంద్రే వా రాక్షసేంద్రే విభీషణే,
నివేశయ మనస్సీతే యథా వా సుఖమాత్మనః. ౨౩
న హి త్వాం రావణో దృష్ట్వా దివ్యరూపాం మనోరమాం,
మర్షయేత చిరం సీతే స్వగృహే పరివర్తినీమ్. ౨౪

(మంగళకరీ, బాగుగ నాలోచించి యిటులఁ జెప్పుచున్నాను. నీదేహ సంరక్షణకై లక్ష్మణునివద్దగాని భరతునివద్దగాని వానరరాజగు సుగ్రీవుని వద్దగాని రాక్షసరాజగు విభీషణునివద్దగాని నీవు ఉండవచ్చును. సుందరమైన రూపముగలిగి మనసును రమింపఁజేయుచు అతని గృహములో నుండిన నిన్నుఁజూచి రావణుఁడు బహుకాలము ఊరకఉండునా.) అని పలికెను. రావణునియింటిలో నున్నందున శంకించినట్లే తనవద్దనుంచుకొనినను లోకులు శంకింతురని శ్రీరాముఁడు ఆ ప్రస్థలములు నాలుగు నిర్దేశించెను. జనకజాజనకుఁడైన జనకుని శ్రీరాముఁ డిచ్చోఁదలంపలేదు. సీత పవిత్రురాలని శ్రీరామునకుఁ దెలియును. అయినను లోకాపవాదమునకు వెఱచియే శ్రీరాముఁ డిట్లు ప్రవర్తింపవలసివచ్చినది. అట్లే సీత కూడ లోకాపవాదమును బాపుకొననెంచి యిట్లు పలికినది.

శ్లో. యథా మే హృదయం నిత్యం నాపసర్పతి రాఘవాత్,
తథా లోకస్య సాక్షీ మాం సర్వతః పాతు పావకః. ౧౧౯-౨౪

(నామనసు రామునివిడిచి యెప్పుడు అన్యథా పోవుటలేదు. అది నిజమైనటులైతే లోకముయొక్క పాపపుణ్యములకు సాక్షిగనుండు *అగ్ని నన్ను అన్నిప్రదేశములలోను రక్షించుగాత.) అని పలికెను. అగ్నిహోత్రుఁడు సీత పవిత్రురాలనిచెప్పి పరిగ్రహింపుమని శ్రీరామునకు సమర్పించినాఁడు. ఆసమయములో శ్రీరాముఁ డిట్లు పలికెను.

---

* అగ్నిలోఁ బ్రవేశింపఁదలఁచిన సీత లక్ష్మణునితోఁ జితిని నేర్పఱుపుమని చెప్పినది. శోకవశుఁడగు లక్ష్మణుఁడు శ్రీరాముని ముఖమును జూచెను.

శ్లో. స విజ్ఞాయ తతశ్ఛందం రామస్యాకారసూచితం,
చితాం చకార సౌమిత్రిర్మతే రామస్య వీర్యవాన్. ౧౧౯-౨౧

(వీర్యవంతుఁడగు లక్ష్మణుఁడు రాముని ఆకారముచే నాతని యభిప్రాయమును దెలిసికొని చితిని నేర్పఱచెను). ఇచ్చట శ్రీరామునిచేతగాని, లక్ష్మణునిచేత మాటలాడించుట సొగసుకాదు. కావున వాల్మీకి కార్యముచే రచించినాఁడు.

శ్లో. అవశ్యం త్రిషు లోకేషు న సీతా పాపమర్హతి,
దీర్ఘకాలోషితా హీయం రావణాంతఃపురే శుభా. ౧౨౧-౧౩
బాలిశః ఖలు కామాత్మా రామో దశరథాత్మజః,
ఇతి వక్ష్యంతి మాం సంతో జానకీ మవిశోధ్య హి.
అనన్యహృదయాం భక్తాం మచ్చిత్తపరివర్తినీం,
అహమప్యవగచ్ఛామి మైథిలీం జనకాత్మజామ్.
ప్రత్యయార్థం తు లోకానాం త్రయాణాం సత్యసంశ్రయః,
ఉపేక్షే చాపి వైదేహీం ప్రవిశంతీం హుతాశనమ్.
ఇమామపి విశాలాక్షీం రక్షితాం స్వేన తేజసా,
రావణో నాతివర్తేత వేలామివ మహోదధిః. ౧౪
న హి శక్తః స దుష్టాత్మా మనసాపి హి మైథిలీం,
ప్రధర్షయితు మప్రాప్తాం దీప్తా మగ్నిశిఖామివ. ౧౫

(రావణుని యింటిలో బహుకాలముండినను బతిభక్తిగలిగి మంగళకరముగనుండు నీసీత పరిశుద్ధురాలేను. అయినను, దశరథునికొడుకును గామాతురుఁడును బాలుఁడును నగు రాముఁడు శోధించక జనకుని కూతురగు సీతను బరిగ్రహించెనని మూఁడులోకములలోను సత్పురుషులు సెప్పుదురని నేనిట్లు పరిశోధించితిని. నాయందే నిలిపియుండు మనసుగలదియు, భక్తురాలును, నామనసును ననుసరించి యుండు నదియు, జనకునికూఁతురగు సీతను నేను దెలిసికొనియున్నాను. మూఁడులోకములకు నమ్మకము గలుగుటకై సత్యమునే ప్రధానముగ నాశ్రయించియుండు నేను అగ్నిలోఁ బ్రవేశించుచుండు జనకునికూఁతురగుసీతను నుపేక్షించితిని. విశాలమైననేత్రములుగలదియు, ఆమెతేజస్సుచేతనే రక్షించుకొనుచుండునదియునగు నీసీత విషయమై సముద్రము ఒడ్డును నెట్లు అతిక్రమించదో, అటుల రావణుఁడు అతిక్రమించి నడుచుకొనలేఁడు. పాపాత్ముఁడగు రావణుఁడు తిరస్కరించుటకు సాధ్యపడనట్టి వెలుంగుచుండు అగ్నిశిఖవలె నుండునట్టిసీతను మనసుచేతనైనను దిరస్కరించనేరఁడు.

శ్లో. విశుద్ధా త్రిషు లోకేషు మైథిలీ జనకాత్మజా,
న హి హాతు మియం శక్యా కీర్తి రాత్మవతా యథా. ౨౦

(ఆత్మజ్ఞానముగలవాఁడు అతనికీర్తిని విడువనటుల మూఁడులోకముల లోను బరిశుద్ధురాలగు జనకునికూఁతురగు సీతను నేను విడువను.) అని పలికెను. శ్రీరాముఁడు కఠినముగా సీతను లంకలోనే పరీక్షించవలసి వచ్చినది. అది కోసలదేశవాసులకు సమ్మకము గలిగినదికాదు. అడవికి సీతను బంపవలసివచ్చినది. ఈమూ రామె నయోధ్యలోఁగూడ నుంచ కూడదని శ్రీరామునకుఁ దోఁచినది. ప్రజలు సౌఖ్యముగ నుండుటకును, న్యాయమును గల్గించుటకును బ్రభువు రాజ్యమేలవలయును. అట్టియెలిక ప్రజల అపవాదమునొంది వారికనిష్ట మగునటులఁ బ్రవర్తింపరాదు. న్యాయాన్యాయములను బరీక్షించి నిర్ణయింపవలసినట్టి యజమాని అల్ప మగుదోషకార్యము గావించినను బహునింద్యమే యగును. ఆతఁడు ప్రజలకై సర్వమును బరిత్యజింపవలసియున్నది. భద్రుఁ డనుదూత శ్రీరామునితో నిటులఁ బలికెను.

శ్లో. శ్రుణు రాజన్యథా పౌరాః కథయంతి శుభాశుభం,
చత్వరాపణరథ్యాసు వనేషూపవనేషు చ. ఉత్త. ४३ సర్గ. ౧౩
దుష్కరం కృతవా న్రామ స్సముద్రే సేతుబంధనం,
అశ్రుతం పూర్వకైః కైశ్చి ద్దేవైరపి సదానవైః. ౧४
రావణశ్చ దురాధర్షో హత స్స బలవాహనః,
వానరాశ్చ వశం నీతా ఋక్షాశ్చ సహ రాక్షసైః.
హత్వా చ రావణం యుద్ధే సీతా మాహృత్య రాఘవః,
అమర్షం పృష్ఠతః కృత్వా స్వవేశ్మ పునరానయత్,
కీదృశం హృదయే తస్య సీతా సమ్భోగజం సుఖం,
అంకమారోప్య హి పురా రావణేన బలాద్ధృతాం. ౧౬
లంకామపి పురానీతా మశోకవనితాం గతాం,
రక్షసాం వశమాపన్నాం కథం రామో న కుత్స్యతే.
అస్మాకమపి దారేషు సహనీయం భవిష్యతి,
యథా హి కురుతే రాజా ప్రజాతమనువర్తతే. ౧౯
ఏవం బహువిధా వాచో వదంతి పురవాసినః,
నగరేషు చ సర్వేషు రాజ న్జనపదేషు చ. ౨౦
తస్యైవ భాషితం శ్రుత్వా రాఘవః పరమార్తవత్,
ఉవాచ సుహృదస్సర్వాన్ కథ మేత న్నివేద్యతాం.
సర్వే తు శిరసా భూమా వభివాద్య ప్రణమ్యచ,
ప్రత్యూచూ రాఘవం దీన మేవమేత న్న సంశయః.

(రామా నిన్నుఁగూర్చి పౌరులు శుభాశుభములను బల్కుచున్నారు. చత్వరములందు, అంగడులందు, రాజమార్గములందు, వనములందు, ఉపవనములందు ప్రజలాడుమాటలను వినుము. దుష్కరమగు కార్యమును రాముఁడొనరించెను. దురాధర్షుఁడగు రావణుని బలముతోఁగూడఁజంపి సమస్తవానరులను రాక్షసులను వశము గావించుకొని కినుకవిడిచినవాఁడై రాముఁడు సీతనుగొని అయోధ్యకేతెంచెను. ఆరామునిమనమందు సీతా సంభోగసౌఖ్య మెట్టిదోకదా! రావణాంకమునఁ జేర్చుకొనఁబడి లంకలో నశోకవనమందు రాక్షసులవశమందుంచఁబడిన సీతవిషయమై రాముఁడేల సంశయింపలేదు. మాభార్యలందుఁగూడ నిట్టిది సహనీయ మేయగును. రాజెటులనాచరించునో ప్రజలటుల నాతనిననుసరించెదరు. ఇట్లుగా నగరములందు జనపదములందుఁ జెప్పుకొనుచున్నారు. ఈవాక్యమునువిని రాముఁడు అత్యంతమార్తుఁడై దరినున్న ఆప్తుల 'నిది యథార్థమేనా' అని యడిగెను. వారందఱును శిరంబులువంచి 'ఔ'ననిరి.)

అనేకస్థలములం దిట్టియపవాదముగల్గియున్నది అని వినినట్టిరాముఁడు సీత నెటుల నయోధ్యయం దుంచఁగలఁడు, ప్రాణసమానయైనసీతను విడనాడుట రామునకు అసహనమే అయినది. తమ్ములఁబిలిపించి 'ఇట్టిఅపవాదు వచ్చుననితలంచియే నాఁడు సీతనుగూర్చి కఠినపరీక్ష గావించితిని. మహేంద్రుఁడాదిగాఁగలదేవతలు సీత పవిత్రురాలుఅనఁగా నామెను బరిగ్రహించితిని.' అని తెల్పి మఱియు నిటులఁ దెలిపెను.

శ్లో. అకీర్తిర్యస్య గీయేత లోకే భూతస్య కస్య చిత్,
పతత్యేవాధమాన్లోకా న్యావచ్ఛబ్దః ప్రకీర్త్యతే,
అకీర్తి ర్నింద్యతే దేవైః కీర్తి ర్లోకేషు పూజ్యతే. ౪౫-౧౪
కీర్త్యర్థం చ సమారంభ స్సర్వేషాం సుమహాత్మనాం,
అప్యహం జీవితం జహ్యాం యుష్మాన్వా పురుషర్షభాః.
అపవాదభయాద్భీతః కిం పునర్జనకాత్మజాం,

.....................................

శ్వస్త్వం ప్రభాతే సౌమిత్రే సుమంత్రాధిష్ఠితం రథం,
ఆరుహ్య సీతామారోప్య విషయాంతే సముత్సృజ.
గంగాయాస్తు పరే పారే వాల్మీకేస్తుమహాత్మనః,

ఆశ్రమో దివ్యసంకాశ స్తమసాతీర మాశ్రితః,
తత్రైనాం విజనే దేశే విసృజ్య రఘునందన,
శీఘ్రమాగచ్ఛ భద్రం తే కురుష్వ వచనం మమ,
న చాస్మిన్ ప్రతివక్తవ్య స్సీతాం ప్రతి కథంచన. ౨౦

(అకీర్తినొందినపురుషుఁడు ఆతనిపేరు లోకమందుండునంతకాలము అధోలోకములందుఁ బతితుఁడగును. అకీర్తిని దేవతలు నిందించెదరు. కీర్తియే లోకములందుఁ బూజింపఁబడును. కీర్త్యర్థమే మహాత్ములు ప్రయత్నించెదరు. అపవాదభయమునొందిననేను జీవములనైనఁ ద్యజించెదను. మిమ్ములనైన విడిచెదను. సీతవిషయమై చెప్పవలయునా. రేపు ప్రాతఃకాలమందు సుమంత్రుఁడుదెచ్చినరథమందు సీతనెక్కించి విషయాంతమందు విడువుము. గంగానదియొడ్డునఁ దమసాతీరమందు దివ్యసంకాశమైన వాల్మీకి ఆశ్రమము గలదు. జనవిహీనమైన ఆప్రదేశమందా మెను విడిచి వేగముగరమ్ము. ఇందువిషయమేమియుఁ బ్రతివచింపవలదు.) అని పలికెను. కీర్తికాముఁడును, ప్రజాభిమతానుసారుఁడును, ధర్మాత్ముఁడునగు రాముఁడు సీతను విడిచిరావలయునని లక్ష్మణున కాజ్ఞాపించెను. విజనప్రదేశమందనఁగా ఘోరాటవియందు విడిచిరమ్మని చెప్పలేదు. తమసాతీరమందున్న దివ్యసంకాశమగు వాల్మీకిఆశ్రమప్రాంతమందే విడిచిరమ్మనెను. లక్ష్మణుఁడు సీత నడవికిం గొనివచ్చి ఆమెతో నిటులనెను.

శ్లో. శ్రుత్వా పరిషదో మధ్యే హ్యపవాదం సుదారుణం,
పురే జనపదే చైవ త్వత్కృతే జనకాత్మజే. ౪౭-౧౧
రామ స్సంతప్తహృదయో మాం నియోజ్య గృహం గతః,
న తాని వచనీయాని మయా దేవి తవాగ్రతః. ౧౨
యాని రాజ్ఞా హృది న్యస్తా న్యమర్షః పృష్ఠతః కృతః,
సా త్వం త్యక్తా నృపతినా నిర్దోషా మమ సన్నిధౌ.
పౌరాపవాదభీతేన గ్రాహ్యం దేవి న తేన్యథా,
ఆశ్రమాంతేషు చ మయా త్యక్తవ్యా త్వం భవిష్యసి.
రాజ్ఞో దశరథస్యేష్టః పితుర్మే మునిపుంగవః,
సఖాపరమకో విప్రో వాల్మీకి స్సుమహాయశాః.
పాదచ్ఛాయా ముపాగమ్య సుఖమస్య మహాత్మనః. ౧౭

(పురమందు జనపదమందుఁగల్గిన నీవిషయమైన అపవాదము సభలో విన్నవాఁడై రాముఁడు సంతప్తహృదయుఁడై యిట్టిపనికి నన్ను నియోగించి లోనికిఁబోయెను. కోపవిహీనుడగు రాముఁడు పౌరాపవాద భయముచేతనే నిర్దోషురాలవైన నిన్ను విడిచెను. ఇంకొక కారణమేదియు లేదు. అట్టినిన్ను నేనిచ్చటవిడిచెదను. నాతండ్రికిష్టుఁడును స్నేహితుఁడు నైన శ్రేష్ఠుఁడగు బ్రాహ్మణమునిపుంగవుఁడు వాల్మికిపాదమునుబొంది యచ్చట నుండుము.) అని వాల్మీకి ఆశ్రమమం దుండుము అని నిశ్చయమును దెల్పినాఁడు లక్ష్మణుఁడు. అప్పుడు సీతాదేవి యిట్లు పలికినది.

శ్లో. న ఖల్వద్యైవ సౌమిత్రే జీవితం జాహ్నవీజలే,
త్యజేయం రాజవంశస్తు భర్తుర్మే పరిహాస్యతే. ౪౮-౮
యథాజ్ఞాం కురు సౌమిత్రే త్యజ మాం దుఃఖభాగినీం,
నిదేశే స్థీయతాం రాజ్ఞశ్శృణు చేదం వచో మమ. ౯
శ్వశ్రూణా మవిశేషేణ ప్రాంజలిప్రగ్రహేణ చ,
శిరసావంద్య చరణౌ కుశలం బ్రూహి పార్థివం. ౧౦
శిరసాభినతో బ్రూయా స్సర్వాసామేవ లక్ష్మణ,
వక్తవ్యశ్చాపి నృపతి ర్ధర్మేషు సుసమాహితః, ౧౧
జానాసి చ యథా శుద్ధా సీతా తత్త్వేన రాఘవ,
భక్త్యా చ పరయా యుక్తా హితా చ తవ నిత్యశః. ౧౨
అహం త్యక్తా త్వయా వీర అయశో భీరుణా వనే,
యచ్చ తే వచనీయం స్యా దపవాదసముత్థితమ్. ౧౩
మయాపి పరిహర్తవ్యం త్వం హి మే పరమా గతిః,
వక్తవ్యశ్చేతి నృపతి ర్ధర్మేణ సుసమాహితః. ౧౪
యథా భ్రాతృషు వర్తేథాస్తథా పౌరేషు నిత్యశః
పరమోహ్యేష ధర్మస్తే తస్మాత్కీర్తి రనుత్తమా. ౧౫
యత్తు పౌరజనో రాజ న్ధర్మేణ సమవాప్నుయాత్,
అహం తు నానుశోచామి స్వశరీరం నరర్షభ. ౧౬
యథాపవాదం పౌరాణాం తథైవ రఘునందన,
పతిర్హి దైవతా నార్యాః పతిర్బంధుః పతిర్గురుః. ౧౭
ప్రాణైరపి ప్రియం తస్మా ద్భర్తుః కార్యం విశేషతః,
ఇతి మద్వచనాద్రామో వక్తవ్యో మమ సంగ్రహః. ౧౮

నిరీక్ష్యమాద్య గచ్ఛ త్వ మృతుకాలాతివర్తినీం
ఏవం బ్రువన్త్యాం సీతాయాం లక్ష్మణో దీనచేతనః, ౧౯
శిరసా ధరణీం గత్వా వ్యాహర్తుం న శశాకహ,
ప్రదక్షిణం తు కృత్వా తాం రుదన్నేవ మహాస్వనః. ౨౦
ధ్యాత్వా ముహూర్తం తామాహ కిం మాం వక్ష్యసి శోభనే,
దృష్టపూర్వం న తే రూపం పాదౌ దృష్టౌ మయానఘే. ౨౧
కథమత్ర హి పశ్యామి రామేణ రహితాం వనే,
ఇత్యుక్త్వా తాం నమస్కృత్య పున ర్నావ ముపారుహత్. ౨౨

(నేను ప్రాణత్యాగ మొనరించిన నాభర్తయొక్క రాజవంశము పరిహాసింపఁబడును. లేనిచో నేనిపుడే గంగలోఁబడి ప్రాణత్యాగ మొనరించియుందును. రాజాజ్ఞను నెఱవేర్పుము. దుఃఖభాగినినైన నన్ను విడిచి పొమ్ము. కౌసల్యకు, నత్తలందఱికినిఁ బ్రాంజలిచేసితినని చెప్పుము. రామ పాదములకు నమస్కరించి ఆతనికుశలము నడిగితినని తెల్పుము. ధర్మమే నియమముగాఁగల్గిన శ్రీరామున కిట్లు తెల్పుము. రామా! సీత పరిశుద్ధురాలని, నీయందు భక్తిగలదని నీకు హితురాలని నీవెఱుఁగు దువు. అట్టినేను జనాపవాదమున నపయశస్సుగలుగునను భయముచేతనే అడవియందు విడువఁబడితిని. అపవాదమువల్ల పుట్టిన దేదిగలదో దానిని నేనును బరిహరించవలసియున్నది. నీవేనాకు పరమగతివి. ధర్మాత్ముఁడగు శ్రీరామునితో నిట్లుచెప్పి మఱియు నామాటలుగా నిట్లుతెల్పుము. తమ్ములను జూచినట్లుగనే పౌరజనులందుఁగూడ ప్రవర్తింపవలయును. అదియే నీకు పరమధర్మము. అందువలన నీ కుత్తమమగుకీర్తి గలుగును. పౌరు లేదిధర్మమనితలంచెదరో అందుకుఁగాను నాశరీరమునుగూడ నేను లెక్కింపను. పౌరాపవాదమును స్మరించి శ్రీరాముఁడు గావించినది యుక్తమైయున్నది. స్త్రీకి పతియే దైవము, పతియే బంధువు, పతియే గురువు, ప్రాణముకన్నఁ బ్రియుఁడు. అందువల్ల భర్తృనియోగ మవశ్య మనుసరింపవలసినది. (భర్తృనియోగము ప్రాణముకంటెఁ బ్రియమైనది.) నానిశ్చయము నిట్లుగా శ్రీరామునితోఁ జెప్పవలసినది. గర్భిణినైన నన్నొకసారిచూచి మఱియు వెడలిపొమ్ము. ఇట్లు సీతచెప్పఁగా లక్ష్మణుఁ డతిదీనుఁడై ఆమెకు నమస్కరించి ఏమియుఁ బలుకఁజాలకుండెను. ఆమెకుఁ

ప్రదక్షిణమాచరించి దగ్గరగా నేడ్చుచు ముహూర్తకాలమైన పిమ్మట నిట్లు పలికెను. తల్లీ, ఏమని పలికితివి. నేనిదివఱకు నిన్నుఁ జూచియుండ లేదు. నీపాదములను మాత్రము దర్శించితిని. అట్టి నిన్ను శ్రీరాముఁడు లేని యీయడవియం దెట్లు చూడఁగల్గుదును. ఇట్లు పలికి ఆమెకు నమస్కరించి నావనెక్కి పోయెను.)

సీతా రామలక్ష్మణులకు సంశయములేకున్నను లోకమర్యాద కొఱకే (లోకము మేలుకోరియే) వారట్లు ప్రవర్తించిరి. లోకమం దపకీర్తిరారాదని వారట్లు ప్రవర్తించిరి.

శ్లో. అథ చేత్త్వమిమం ధర్మ్యం సంగ్రామం న కరిష్యసి,
తత స్స్వధర్మం కీర్తిం చ హిత్వా పాప మవాప్స్యసి. గీ. ౨-33
అకీర్తిం చాపి భూతాని కథయిష్యన్తి తేఽవ్యయాం,
సంభావితస్య చాకీర్తి ర్మరణా దతిరిచ్యతే. 34

(ధర్మసాధనమైన ఈయుద్ధమును నీవొనరింపనిచో నందువలన క్షత్రియ ధర్మమును గీర్తినిఁ బోఁగొట్టుకొని పాపమును బొందెదవు. ప్రజలందఱు నీవిషయమై శాశ్వతమైన అపకీర్తినిఁగూడఁ జెప్పెదరు. ప్రఖ్యాతుఁడైన వానికి అపకీర్తి యనునది మరణము నతిక్రమించియుండును.) అని శ్రీ కృష్ణుఁ డర్జునునకుఁ దెల్పియున్నాఁడు. అజ్ఞాతవాసానంతరము కౌరవుల కడకు ద్రుపద పురోహితుఁడు రాయబారిగ వెళ్లివచ్చెను. అయినను ధర్మరాజు మరల శ్రీకృష్ణుని రాయబారిగఁ బంపుచు నిట్లు పలికినాఁడు.

మ. సుతువాఁడై వినయంబు సేకొనక యేచొప్పుం దగం జెప్ప కా
ధృతరాష్ట్రుం డవినీతి జేసినను సంధింపంగరాదంచు వే
గ తెగంబాఱకు తెంపుసేయు నెడ లోకంబెల్ల మెచ్చం బ్రకా
శితధర్మస్థితి నొంది మామనము నిశ్చింతంబుగాఁ జేయుమీ. ఉ. తృ. ౨౫

అని పలికెను. లోకనింద రాకుండుటకై ధర్మరాజు ప్రయత్నించెను. మఱియొక్క విశేషము. సమయభంగమొనరించి ద్రౌపదీ ధర్మరాజు లున్నచోటుకుఁ బ్రవేశించిన అర్జునుఁడు తత్ప్రతిక్రియకై తీర్థయాత్ర లకుఁబోవ సంకల్పించఁగా ధర్మజుఁడు వలదనెను. నేను సమ్మతించితిని గాన మఱి పోనవసరము లేదనెను.

అయినను సర్జునుఁడు వెడలిపోవుటకే నిశ్చయించి 'కపటముగా ధర్మమాచరింపరాదు' అని పలికెను. ఎవ్వరైనను లోకమందపకీర్తిరాకుండుటకై తగువిధమునఁ బ్రయత్నించవలెను. అపనిందరాకుండుటకై ప్రయత్నించినట్లే కీర్తికొఱకై కూడఁ బ్రయత్నింపవలసియున్నది. ఉత్సాహవంతుఁడై ప్రయత్నింపవలసినది. హనుమంతుఁడు సీత గనఁబడనందున విసిగి వేసారి మరల నిట్లు తలంచెను.

శ్లో. అనిర్వేదశ్శ్రియో మూలమనిర్వేదః పరం సుఖం,
అనిర్వేదో హి సతతం సర్వార్థేషు ప్రవర్తకః. సుం. ౧౨-౧౦
కరోతి సఫలం జంతోః కర్మ యత్తత్కరోతి సః, -
తస్మా దనిర్వేదకృతం యత్నం చేష్టేఽహముత్తమమ్.

(సంపదకు అధికసుఖమునకు నుత్సాహమే ముఖ్యమైన కారణము. ఆయా కార్యములు చేయుటలోఁ బ్రవేశపెట్టునదియు నుత్సాహమేను. ఆయా ప్రాణులు సేయుకార్యములు సఫలమగుట ఉత్సాహమువల్లనే. కనుక, ఉత్సాహముతో నుత్తమమైన కార్యముచేయుటకుఁ గడంగెదను.) అని తలఁచి లంకనంతయు వెదకి ఎట్టకేలకు అశోకవనములో భూమిజను గాంచి యిట్లు పలికెను.

శ్లో. దిష్ట్యా హి మమ న వ్యర్థం దేవి సాగరలంఘనం,
ప్రాప్స్యమ్యహమిదం దిష్ట్యా త్వద్దర్శనకృతం యశః. సుం. ౩౫-౭౮

(ఓతల్లీ, నేను సముద్రము దాఁటివచ్చినది దైవబలమువల్ల వ్యర్థముకాలేదు. 'హనుమంతుఁడే సీతను జూచివచ్చెను.' అనుకీర్తి యీశ్వరకటాక్షమువల్ల నాకు లభించినది.) అని పలికెను. ఇది గర్వముకాదు. అట్లే శ్రీరాముఁడును (అపనిందఁబాపుకొనుటకుఁ వంశగౌరవము నిలుపుకొనుటకు) సీతయెడలఁ గఠినముగా మాటాడెను. ప్రతివాఁడును అపయశస్సును బరిహరించుకొని కీర్తికాములై ఉత్సాహవంతులై లోకమందుఁ బ్రసిద్ధులగుటకుఁ బ్రయత్నింపవలసియున్నది. ఈర్ష్య మొదలగు దుర్గుణములకు వశులుకారాదు. మన ప్రార్థనములలో సమస్తసుఖములు తమకుఁ గలుగవలయుననియుఁ, దమశత్రువులు పరాఙ్ముఖులు కావలయుననియుఁ గలదు. అందఱును ఇట్లే ప్రార్థించెదరను వివేకముగలవాఁడు అన్యాయముగా

శత్రుహానినిఁ గోరఁడు. న్యాయమగునపుడే అది ఫలించునని యెఱిఁగి యుండును. మఱియుఁ దనవారికి, గ్రామమువారికి, దేశమువారికిఁ బ్రపంచము వారికి నందఱికిని క్షేమము గలుగవలయునని మన ప్రార్థనములలోఁ గలదు. రెండు కాళ్ళ జంతువులకు నాలుగు కాళ్లుగల జంతువులకు సౌఖ్యము గలుగవలయుననికూడ మన ప్రార్థనములలోఁ గలదు. మనవారి యుదారభావ మింత యుత్కృష్టమైనది.

ప్రతివారు నెంత ప్రయత్నించినను గష్టములు కలుగుట తప్పలేదు. కావున జీవులు స్వతంత్రులుగారని ఇందువలన స్పష్టమగుచున్నది. మానవప్రయత్న మున నొకే యవస్థయం దిరువురినుంచినను ఒకఁడు సుఖపడుచున్నాఁడు. ఇంకొకఁడు దుఃఖపడుచున్నాఁడు. అది దైవాధీనమనియు, మనదృష్టికి గోచరముకానిచైతన్య మీదేహములో నున్నదనియు మనవారు దెల్పియున్నారు. అందఱికన్నఁ దనదేహము ఘనముగాఁ గనఁబడుటకుఁ దనచైతన్య మాదేహమం దుండుటయే కారణమైయున్నది. చైతన్యరహితములగు దేహములన్నియు సమానములే కదా. ఇతరసహాయ మపేక్షించుచుండు భౌతికశరీరధారులైన జీవులు ప్రపంచక్షేమమునకు భంగమురాని విధమున మెలంగుచు ఆత్మోద్ధరణము గావింపవలసియున్నది. సీతాన్వేషణమున నున్న హనుమంతుఁ డీట్లు తలంచెను.

శ్లో. వినాశే బహవో దోషా జీవన్ భద్రాణి పశ్యతి,
తస్మాత్ప్రాణాన్ ధరిష్యామి ధ్రువో జీవితసంగమః. ౧౩-౪౭

(ప్రాణము విడుచుటవల్ల పాపము లనేకములు సంభవించును. జీవించియుండువాఁడు శుభములను బడయును. కనుక, ప్రాణముతో నుండెదను. బ్రతికియుండిన యెడల శ్రేయస్సుగలుగుట నిజము.) అని తలంచెను. సీత గానరానందున వచ్చినపని నెఱవేఱలేదు. ప్రభువైన సుగ్రీవుని, మిత్రులను, బంధువులను, అందఱిని విడిచి ఏకాకినై శత్రుమధ్యస్థుఁడై యున్నాఁడు. అయినను బ్రాణము విడువఁగూడదనియు బ్రతికియుండిన శ్రేయస్సుగలుగుననియుఁ జెప్పుచున్నాఁడు. తగినంత కారణముండినఁగాని దేహమును విడువరాదు. అందఱిని విడిచినను ఈదేహసంబంధమున సాధించవలసిన పరమార్థము గలదు. దానికై దేహమును

ధరించియుండెదను అని హనుమంతుఁడు తలంచెను. కావున నాత్మోద్ధరణము ప్రతివారికి ముఖ్యము. ఆత్మను బంధమునుండి విముక్తిగావింపఁ బ్రతివారును బ్రయత్నింపవలసియున్నది. రావణ వధానంతరము తన్నుఁ గూర్చి శ్రీరాముఁడు పలికిన నిష్ఠురవచనములను విని సీత యిట్లు పలికినది.

శ్లో. మదధీనం తు యత్తన్మే హృదయం త్వయి వర్తతే,
పరాధీనేషు గాత్రేషు కిం కరిష్యా మ్యనీశ్వరా. యుద్ధ. ౧౧౮-౯

(ఇతరులచే గ్రహించుటకు సాధ్యపడని నామనసు ఆసమయములో నీమీఁదనే యుండినది. ఇతరులు గ్రహించుటకుఁ దగియుండు నాశరీరము విషయములో నాకు స్వతంత్రము లేదు. నేనేమిచేయఁగలను.) అని పలికినది. మనోనిగ్రహముగల్గిన సీతవంటి సాధ్వికిని, జితేంద్రియుడైన హనుమంతునకుఁ గూడఁ గష్టము గలిగినపుడు దుఃఖము సుఖముగల్గినపుడు సంతోషము అనుభవింపక తప్పినదికాదు. కావున నీదేహసంబంధ ముండునంతవఱకు నీకష్టసుఖములు ఎంతటివారికైనఁ దప్పవు. దుఃఖమిశ్రితముకాని పునరావృత్తిరహితమైన శాశ్వతసుఖము ఆత్మస్థుఁడైన పరమాత్మనెఱింగినవారు పొందుదురనియు, దానికొకటే మార్గమనియు నది తెలియనివారు అట్టిసుఖమును బొందక నరకమునకుఁ బోదురనియు వేదము బోధించుచున్నది. దానికి శాస్త్రవిధానము నవశ్యమెఱిఁగియుండవలయును. శ్రీకృష్ణుఁడు గీతలో నిట్లు చెప్పియున్నాఁడు.

శ్లో. య శ్శాస్త్రవిధి ముత్సృజ్య వర్తతే కామకారతః,
న స సిద్ధి మవాప్నోతి న సుఖం న పరాంగతిమ్. ౧౬-౨౩

(శాస్త్రవిధిని వదలివేసి తమ యిచ్ఛవచ్చినట్లు సంచరించువాండ్రకు నీలోకమందు సుఖముగాని పరమందు మోక్షముగాని లభించదు.)

అని తెల్పియున్నాఁడు. బలిచక్రవర్తి మిగుల ధర్మాత్ముఁ డనిపించుకొనినాఁడు. అతిథి అభ్యాగతి సత్కారముగలవాఁడు. దైవబ్రాహ్మణభక్తిగలవాఁడు. గొప్పదాత. యజ్ఞమొనర్చుచున్నాఁడు. అట్టివానిని బంధించి పాతాళమున కణఁగఁద్రొక్కినాఁడు త్రివిక్రముఁడు. ఇన్నిసద్గుణములు గలవాఁడైనను భగవద్విరాధనమున కన్యథా ప్రవర్తించినందునఁ బదభ్రష్టుఁడు కావలసివచ్చినది. దేవలోకమును దేవేంద్రుఁ డేల

వలయును అని భగవంతుని యేర్పాటు. దానికి విరుద్ధముగ నడిచి దేవేంద్రునిఁ బదభ్రష్టునిఁ గావించినాఁడా బలి. భాగవతాపచారము, భగవద్విధానోల్లంఘనము గావించినందున బలి అధోలోకమునకుఁ బంపఁబడినాఁడు. స్వర్గసుఖముల ననుభవించుటకు సృజింపఁబడినవారు ముప్పదిమూఁడుకోట్ల దేవతలు. వీరందఱు ఆత్మజ్ఞానపూర్ణులు. ఎల్లప్పుడును ముప్పదిమూఁడుకోట్లేను. వారికి చ్యుతిలేదు. వారు మోక్షమునకే పోవుదురు. ఒకవేళ అధఃపతితులైనను శీఘ్రముననే మరల వారిస్థానమునకుఁ బోవుచుందురు. *వారిసంఖ్యలో నొక్కఁడు హెచ్చరు. ఒక్కరు తఱుఁగరు. అత్యాశవలన వారిసౌఖ్యములకాసించు నితరులు మాత్రము స్వర్గభోగానంతరము క్షీణపుణ్యులై అధఃపతితు లగుచుందురు. వీరెవ్వరును గూడ ముప్పదిమూఁడుకోట్లదేవతలలో లెక్కకురారు. కావున నిట్టి ఆశను విడుచుకొని బాగుపడవలయుననియే మనశాస్త్రములు బోధించుచున్నవి. రావణాదులు తపోనిష్ఠఁ గల్గినవారై సకాములైనందున దేవతలను బాధించి చెడిపోయిరి. కావున భగవంతుఁ డేర్పఱచిన విధానమును జెఱుపఁజూచుట ప్రాయశ్చిత్తము లేని మహాపరాధము. ఈలోకమందేవి భగవంతుని యేర్పాట్లో అవి వేదశాస్త్రములు చెప్పుచున్నవి. ఆసదాచారములు నాయాజ్ఞలని భగవంతుఁడు వచించినట్లుగా శాస్త్రములు చెప్పుచున్నవి. వాటి నుల్లంఘించినందునఁ బరముమాట యటుంచి నను నిహమందుఁగూడ సుఖముండదని అవి బోధించుచున్నవి. ప్రస్తుత పరిస్థితులవలనఁ బ్రపంచ మెంత తలక్రిందగుచున్నదో అనుభవగోచరమైయున్నది.

శ్లో. తస్మాచ్ఛాస్త్రం ప్రమాణం తే కార్యాకార్య వ్యవస్థితౌ,
జ్ఞాత్వా శాస్త్రవిధానోక్తం కర్మ కర్తుమిహార్హసి. ౧౬-౨౪

(చేయదగినదేదో, చేయరానిదేదో నిశ్చయించుకొనుటకు వివేకివైన నీకు శాస్త్రమే ప్రమాణము. కనుక శాస్త్రవిధినిఁ దెలిసికొని యీలోకమందు నీవు నీకు విధాయకమైన కర్మ చేయుము). అని అర్జునునకు శ్రీకృష్ణుఁడు

* సృష్టికి ఆద్యంతములులేవు. ప్రవాహతః జగత్తు సత్యమైనది. ప్రతి బ్రహ్మకల్పములోను ముప్పదిమూఁడుకోట్ల దేవతలు సృష్టింపఁబడుచుందురు. అని ద్వైతసిద్ధాంతము.

బోధించియున్నాఁడు. కావుననే మనవారు ప్రతివిషయము శాస్త్రానుబద్ధ మొనరించియున్నారు. సదాచారములను గాపాడియున్నారు. నిష్కామకర్మలు గావించి తరించియున్నారు.

సర్వవ్యాపి, నిరాకారుఁడు, నిర్గుణుఁడైన భగవంతునిఁ దెలిసికొనుటకు విగ్రహారాధన మావశ్యకమని మనవారు నిర్ణయించియున్నారు. మనభావనకొఱకేర్పడిన విగ్రహములు మనయూహ నతిక్రమించి యుండనేరవు. ఆకనఁబడు శిలాదులే దేవతలని మనవారు పూజింపరు. అందు భగవంతుఁ డున్నాఁడని ధ్యానించెదరు. ఆత్మజ్ఞానులగుచున్నకొలఁది అందు వారికి విశేషములు గనఁబడుచుండును. అది లేనివారికి శిలాదిప్రతిమయే యగును. ఈభావనలో మనవారు విరాట్పురుషుని ధ్యానింపుఁడని బోధించియున్నారు. ఒకశిలలోనున్న భగవద్రూపమును విశ్వభావన చేయుమన్నారు. అప్పుడెన్నో పాదములు, కన్నులు, శిరస్సులు భావింపఁబడును. ఇహము విషయములోఁగాని పరము విషయములోఁగాని విశ్వభావన యనునది భారతీయులకుఁ బ్రతిదినావశ్యకమైనది. ఇందువలన మనస్సు పరిశుద్ధమై ఇహపరములు రెంటికి నుపయోగించును. మనస్సు నిర్మల మగుచున్నకొలఁది చిత్తైకాగ్రత గలుగుచుండును. భగవంతునియం దట్టిమనసు లీనమగుటకు భగవద్గ్రంథములను సదా శ్రవణ మొనరించుచుండవలయునని మనవారు విధించియున్నారు. పరీక్షిత్తు భాగవతములో నిట్లు పలికియున్నాఁడు.

శా. కల్యాణాత్మక మైనవిష్ణుకథ లాకర్ణించుచుక్ ముక్తవై
కల్యుం డెవ్వఁడు తృప్తుఁడౌ నవి వినంగాఁ గ్రొత్తలౌచుండు సా
కల్యం బేర్పడ భూసురోత్తమ యెఱుంగంబల్కవే రుక్మిణీ
కల్యాణంబు వినంగ నాకు మదిలోఁ గౌతూహలం బయ్యెడిన్.

అని పలికినాఁడు. కావున రెడ్డిగారు వ్రాసినది రుక్మిణీకల్యాణాదులకు పించ్ఛ్ ఒసంగుట అసంగతమగుచున్నది. పురాణాదులనే సదా వినవలసినది. ధ్యానింపవలసియున్నది. తరించవలసియున్నది.

# కవిత్వతత్త్వవిచారవిమర్శనము.

## శ్రీయుత కట్టమంచి రామలింగారెడ్డిగారి పుస్తకవిమర్శనము.

### ఉ ప సం హా ర ము.

శ్లో. పితుర్నిదేశం నియమేన కృత్వా వనాన్నివృత్తశ్చరితవ్రతశ్చ,
స్త్రీభిస్తు మన్యే విపులేక్షణాభిస్త్వం రంస్యసే వీతభయః కృతార్థః.(సుం. ౨౮. ౧౪)

(రామా! నీవు నీతండ్రియాజ్ఞప్రకారము వనవాసముఁజేసి ముగించి, యయోధ్యచేరి, భయములేక కృతార్థుఁడవై విశాలముగనుండు కన్నులుగలస్త్రీలతోఁ రమించుచున్నావు.) అని సీత సుందరకాండలోఁ బలికినట్లు గలదు. సీత పరిశుద్ధురాలని శ్రీరామునకు నమ్మకమున్నను లోకాపవాదశంకంజేసి సీతను బరీక్షించినట్లు యుద్ధకాండలోఁ గలదు. కాని సీతవిషయమై శ్రీరాముఁడు శంకించినట్లు ఎచ్చటను లేదు. శాస్త్రములో స్త్రీకి *పునర్వివాహము లేనందున రామాయణమం దిట్లు వ్రాయఁబడినది.

శ్లో. అద్య త్వాం భగినీ పాపం కృష్యమాణం మయా భువి,
ద్రక్ష్యతేఽద్రిప్రతీకాశం సింహేనేవ మహాగజమ్.(విరా. ౨౨. ౫౨)(కుం. ౨౬-౨౦)

(సింహముచే మత్తగజేంద్రంబుకైవడి నాచేఁ బుడమినీడ్వఁబడు కొండవంటినిన్ను నీయప్ప చూడఁగలదు.) అని భీముఁడు కీచకుని సంహరించునపుడు పలికినట్లు గలదు. †కాని కీచక

---

* యువకులు స్వార్థత్యాగమొనరించి ప్రాణములనర్పించి దేశక్షేమమొనఁగూర్ప వలయునుగదా. అట్లే యువతులు స్వార్థత్యాగమొనర్చి పునర్వివాహమాడకుండ దేశక్షేమ మొనఁగూర్పవలసియున్నది.

† ఉద్దేశపూర్వకముగ వ్రాయఁబడినవిషయములు గ్రంథమందు వేఱొకపట్టును బోషించునదిగ నుండును. దానిని గ్రహించుటలోనే ఘనతయున్నది. వ్యాసభారతమునకు మించినగ్రంథ మీప్రపంచమున నేదియు లేదు. అందలివిషయముల నన్నిటినిఁ బరిపూర్తిగ గ్రహించుట కెవరికిని సాధ్యముకాదు. ఈవిషయము దిఙ్మాత్రముగఁజూపుటకై వ్యాసలిఖ్యనల విరాటపర్వమును విమర్శించి వ్రాయుచున్నాను.

వధానంతరము సుధేష్ణ చూచుటకు వచ్చినదనికాని, రాలేదనికాని, అట్లే విరాటుఁడు వచ్చెననికాని రాలేదనికాని భారతమందు వ్రాయఁబడలేదు. మఱియు నుపకీచకులు ద్రౌపదినిఁ గీచకకళేబరముతోఁ గట్టు డిట్లుగలదు.

శ్లో. హన్యతాం శీఘ్రమసతీం యత్కృతే కీచకో హతః. ౨౩. ౫
అథవా నైవ హంతవ్యా దహ్యతాం కామినా సహ,
మృతస్యాపి ప్రియం కార్యం సూతపుత్రస్య సర్వథా. (కుం. ౨౭-౭౫) ౬
తతో విరాటమూచుస్తే కీచకోఽస్యాః కృతేహతః,
సహానే నాఽద్య దహ్యేమ త దనుజ్ఞాతు మర్హసి. ౭

(ఈ ద్రౌపదినిమిత్తము కీచకుఁడు మృతినొందెనుగాన దీనింజంపుదము. లేదా దీనింజంపకుఁడు. కాముకుఁడైన కీచకునకుఁ బ్రియమొన రింతము. కావున దీని నీమృతకళేబరముతోఁగూడఁ గాల్చెదము. అని తలంచినవారై ఉపకీచకులు విరాటునితోఁ నిట్లు పలికిరి. 'ఈసైరంధ్రినిమిత్తము మృతుండయ్యెఁగానఁ గీచకకళేబరంబుతోఁ దీనిఁగాల్ప నానతిమ్ము' అని యడిగిరి. కులస్త్రీనిఁ జెఱుపనెంచి యొంటరిగవచ్చి శాస్తినొందినకీచకుని విరాటదంపతులు చూడవచ్చినట్లుగా వ్రాయఁబడలేదు. చూడరాలే దని తేల్చినచోఁ బ్రకృతివిరుద్ధ మగును. ఉపకీచకుల మరణానంతరము గూడ విరాటుఁ డాస్థలమునకుఁ బోనటుల చెప్పఁబడలేదు. వచ్చినటులను లేదు. ఉత్తములైన విరాటదంపతులయశస్సును బాడుచేయరాదు. కుల స్త్రీనిఁ జెఱుపనెంచుట పాపములలోనికెల్ల మహాపాపము. ఈరెంటినిఁ గూడ బాగుగసాధించుచు వ్యాసుఁడు భారతమును రచించినాఁడు.

విభీషణుఁడు రావణునివిడిచి వచ్చుటకు గలకారణ మిట్లు రామాయణమందుఁ గలదు. విభీషణునిఁగూర్చి ఇంద్రజిత్తు ఇట్లు పలికెను.

శ్లో. ఇహ త్వం జాతసంవృద్ధ స్సాక్షా ద్భ్రాతా పితు ర్మమ,
కథం ద్రుహ్యసి పుత్రస్య పితృవ్యో మమ రాక్షస. ౮౭. ౧౧
నజ్ఞాతిత్వం నసౌహార్దం నజాతి స్తవ దుర్మతే,
ప్రమాణం న చ సౌదర్యం న ధర్మో ధర్మదూషణ. ౧౨

(రాక్షసుఁడా! ఈలంకలో నీవు పుట్టి పెరిగితివి. నాతండ్రికి సాక్షాత్ తమ్ముఁడవు. ఇటులుండఁగా పినతండ్రివగునీవు కొడుకగునాకు ద్రోహముచేయవచ్చునా. దుర్మతీ! జ్ఞాతియని తలంచలేదు. నీకు స్నేహమును లేదు. జాతియులేదు. మర్యాదయులేదు. సోదరభావమును లేదు. ధర్మమును దూషించువాఁడా! నీయెడల ధర్మచింతయులేదు.) దుర్బుద్ధీ! నీవిషయమై చింతించవలసియున్నది. సాధువులు నిన్ను నిందించెదరు. ఏలననఁగా స్వజనులనువిడిచి శత్రువులవద్ద సేవకుఁడవుగ నున్నావు. తుచ్ఛమైననీబుద్ధి కీతారతమ్యము తోఁచకపోయినది. స్వజనులతోడ వసించుటకును శత్రువులను నాశ్రయించుటకు, నీచుఁడా! తారతమ్యమెంత గలదో చూడుము.

శ్లో. గుణవాన్ వా పరజన స్స్వజనో నిర్గుణోపివా,
నిర్గుణ స్స్వజన శ్శ్రేయాన్ యః పరః పర ఏవ సః. ౧౫
య స్స్వపక్షం పరిత్యజ్య పరపక్షం నిషేవతే,
స స్వపక్షే క్షయం ప్రాప్తే పశ్చాత్తైరేవ హన్యతే. ౧౬

(శత్రువు గుణవంతుఁడుగ నుండినను, స్వజనుఁడు గుణహీనుఁడుగ నుండినను, వీరిలో గుణహీనుఁడుగనుండు స్వజనుఁడే మేలుసేయువాఁడు. శత్రువుగనుండువాఁడు శత్రువేను. స్వజనులనువిడిచి శత్రువులను నాశ్రయించువాఁడు స్వజనులు నాశముపొందినపిమ్మట శత్రువులచేఁ జంపఁబడును.) నీదయాశూన్యత మిగుల ఘోరముగానున్నది. రావణునితమ్ముఁడా! బంధువుగనుండు నీవంటివాఁడే యిట్టికఠినమైనకార్యమును జేయునుగాని అన్యుఁడుచేయఁడు. అని ఇంద్రజిత్తుపరుషముగాఁ బలుకఁగా విభీషణుఁ డిట్లు పలికెను.

శ్లో. అజానన్నివ మచ్ఛీలం కిం రాక్షస వికత్థసే,
రాక్షసేంద్ర సుతాసాధో పారుష్యం త్యజ గౌరవాత్. ౧౭

(రాక్షసుఁడా! నాస్వభావము నెఱుంగనివానివలెనే యేల హెచ్చుమాటలాడెదవు. రావణునిపుత్రుఁడా! అయోగ్యుఁడా! నేను నీకుఁ బినతండ్రినై గౌరవింపఁబడవలసియుండుటచేఁ గఠినమైన మాటలు చెప్పవలదు.) పాపకార్యములుసేయు రాక్షసులకులములో నేను బుట్టితిని. అయినను, నాస్వభావము క్రూరమైనదికాదు. ఈనాసద్గుణమే సత్పురు

షులకుఁ బ్రధానముగ నుండును. దారుణమైన పనిచేయుటలోను,బరులకు హింసగలిగించుపనులలోను నాకు మనసుపోదు. దుష్టస్వభావముగల అన్నతమ్ముని విడిచిపెట్టవచ్చునా. ధర్మములోనుండి తప్పిపోయిన స్వభావముగలవాఁడును, సదా పాపకార్యములు సేయువాఁడును నగుపురుషునివిడిచి, చేతిలోనుండు విషమును బాఱవైచి సుఖపడునటుల సుఖపడవచ్చును. నిప్పుపడి బాగుగ కాలిపోవుచుండు ఇంటిని విడిచిపెట్టునటుల హింసచేయుట పరులసొమ్మును బరులభార్యలను నపహరించుట దురాచారమైనందున విడిచిపెట్టవలయునని పెద్దలు చెప్పుదురు.

శ్లో. పరస్వానాంచ హరణం పరదారాభిమర్శనం,
సుహృదా మతిశంకాచ త్రయోదోషాః క్షయావహాః. ౨౩౺

(పరులసొమ్మును బరులభార్యలను నపహరించుట స్నేహితులను మిక్కిలిగాసందేహించుట ఈమూఁడుదోషములు నాశము గలిగించును.)

శ్లో. మహర్షీణాం వధోఘోర స్సర్వ దేవైశ్చ విగ్రహః,
అభిమానశ్చ కోపశ్చ వైరిత్వం ప్రతికూలతా. ౨౪౺
ఏతేదోషా మమభ్రాతు ర్జీవితైశ్వర్య నాశనాః,
గుణాన్ ప్రచ్ఛాదయామాసుః పర్వతానివ తోయదాః. ౨౫౺
దోషైరేతైః పరిత్యక్తో మయా భ్రాతా పితా తవ. ౨౬

(మహర్షులనుజంపుట,సకలదేవతలతో భయంకరమయిన యుద్ధము చేయుట, అహంకారము కోపము బద్ధవైరము పరులశ్రేయస్సునుగోరకుండుట ఈమొదలగు ప్రాణమును ఐశ్వర్యమును నాశముచేయునట్టి నాయన్నయగు రావణునిదోషములు, మేఘములు పర్వతములను గప్పినటుల, అతనిసుగుణములను గప్పివేసినవి. *ఈదోషము లుండినందుననే నీతండ్రియు నాయన్నయునగు రావణుని విడిచిపెట్టితిని.)

* విభీషణుఁడు రావణున కనేకవిధముల యుక్తమార్గముచూపి చెప్పినాఁడు. రావణుఁడు వినలేదు, పైఁగా దాసునివలెనే అవమానించినాఁడు. ఎట్లును పుత్రమిత్రులతో రావణుఁడు నశింపనున్నాఁడు. లోకములో బహుదుర్మార్గుఁ డనిపించుకొనినాఁడు. శ్రీరాముఁడు ధర్మాత్ముఁడుగఁ గనఁబడుచున్నాఁడు. అట్లుగా వినియున్నాఁడు. సుగ్రీవరాజ్యప్రదానమును బరికించినాఁడు. కావున దేశకాలపాత్రములను గుర్తించిన అర్థుఁ

శ్లో. అద్య తే వ్యసనం ప్రాప్తం కిం మాం త్వ మిహ వక్ష్యసి,
ప్రవేష్టుం న త్వయా శక్యో న్యగ్రోధో రాక్షసాధమ. ౭౮౫

(ఇపుడు నీకు గొప్పయాపదసంభవించినది. ఇపుడు నీ వేమిపలుకఁ గలవు. రాక్షసాధముఁడా! నీవు మఱ్ఱిచెట్టును బొందలేవు.) అని పలికెను. మతసంప్రదాయములను, ఇతరదేశసౌఖ్యములను నడ్డగించుచున్న రాకాసిమూఁకలోనుండియు విభీషణుఁడు సనాతనధర్మము నాశ్రయించి యున్నటుల నిచ్చట వ్యక్తము చేయఁబడినది. మఱియు ధర్మమునకు జయముగల్గిననాఁడు అధర్మ మెట్లు తిరస్కరించఁబడునో సూచింపఁబడినది. విరాటునిఁగూర్చి ధర్మజుఁ డిట్లు పొగడినాఁడు.

శ్లో. మత్స్యో విరాటో బలవా నభిరక్షోఽస్య పాండవాన్,
ధర్మశీలో వదాన్యశ్చ వృద్ధశ్చ సతతం ప్రియః. విరా. ౧. ౧౭ (కుం. ౨-౧౩)

(మత్స్యదేశాధీశుఁడైన విరాటుఁడు బలవంతుఁడు, ధర్మశీలుఁడు, దాత, జ్ఞానవయస్సులలోవృద్ధుఁడు, సుజనులయెడల నెల్లప్పుడు ప్రియుఁడు, పాండవులమగుమనపై మిగులననురాగంబు గలవాఁడు. అని. పలికినాఁడు. తనయెదుట ద్రౌపదినిఁదన్నిన కీచకునిఁజూచియు ధర్మము నాచరించలేని పరిస్థితియందున్న ఆవిరాటుఁడు మొఱలిడుచున్న ద్రౌపదినిఁగూర్చి యిట్లు పలికినాఁడు.

శ్లో. పరోక్షం నాభిజానామి విగ్రహం యువయో రహం,
అర్థతత్త్వ మవిజ్ఞాయ కిన్నుస్యా త్కౌశలం మమ. ౧౬-౩౬ (కుం. ౨౦-౧౬)

డైన విభీషణుఁడు రావణునివిడిచి శ్రీరామునిఁజేరి పరహస్తముకానున్న లంకారాజ్యమును దానుబొంది కలకాల మనుభవించుచున్నాఁడు. లోకులమన్ననకుఁ బాత్రుఁడైనాఁడు. పరిస్థితివిచారించక, తగినకారణముగూడలేకయే జయచంద్రుఁడు దేశద్రోహ మొనరించినాఁడు. ఆదుష్ఫలితము ఎన్నివిధములనో మనదేశమును బీడించుచున్నది. వాల్మీకి విభీషణుని ఉత్కృష్టగుణమును వ్యక్తమొనరించుటకే ఈఘట్టము నిచ్చట వ్రాసినాఁడు. రామవనవాసమున మహత్తరప్రయోజనమే జరిగినను దశరథుని సదుద్దేశముతో పరముకోరనందునఁ గైకేయివిషయమై వాల్మీకి ఇట్టిఘట్టమును వ్రాయలేదు. ప్రయోజనము లేనందునఁ గైకేయి పశ్చాత్తాపమునైనను వ్రాయలేదు. అట్లే అరణ్యకాండలో లక్ష్మణునిఁ గఠినముగా మాటలాడినసీత పిదప నొచ్చుకొనినట్లుగా వాల్మీకి వ్రాయలేదు.

(నీకును గీచకునకునుగల పూర్వవిరోధము నేనెఱుంగను. విషయమంతయు నెఱుంగక నేనెట్లు విచారణచేయఁగలను.) అని పలికెను. ద్రౌపదినిఁ గీచకకళేబరముతోఁ గాల్ప నుపకీచకులు అనుజ్ఞఁగోరునప్పుడిట్లు గలదు.

శ్లో. పరాక్రమంతు సూతానాం మత్వా రాజాఽన్వమోదత,
సైరంధ్ర్యాస్సూతపుత్రేణ సహదాహం విశాంపతిః. ౨౩. ౮ (కుం. ౨౭-౧౨)

(మత్స్యనృపతియు నూటయిదుగురు ఉపకీచకులయొక్క బలిమికి వెఱచి, సైరంధ్రినిఁ గీచకుని కళేబరంబుతోఁగూడఁ గాల్ప నుత్తరువొసంగెను.) కీచకులు హతులైనపిదప విరాటునిఁగూర్చి యిట్లు చెప్పఁబడినది.

శ్లో. కీచకేషు హతే రాజా విరాటః పరవీరహా,
పరాం సంభావనాం చక్రే కుంతీపుత్రేషు వీర్యవాన్. (యుధిష్ఠిరే) ౩౧. ౩
(కుం. ౩౩-౩)

(వీర్యవంతుఁడును, శత్రువీరుల సంహరించువాఁడును నైనవిరాటుఁడు కీచకమరణానంతరము కుంతీపుత్రులందు మిక్కిలిగౌరవంబునుంచియుండెను.) ఉత్తముఁడగు విరాటుని ఉదారభావము కొనసాగినది.

మతము, కుటుంబము, సంఘము, దేశము, ప్రపంచము వీటియందు సాంఘికముగను, ఆర్థికముగను, రాజకీయముగను ప్రాణికోట్లు ఎట్లుప్రవర్తింపవలయునో, దేశకాలపాత్రముల నెట్లు గుర్తింపవలెనో వేదశాస్త్రానుగుణ్యమైన ఆవిషయములను పురాణేతిహాసములు వ్యక్తము చేయుచున్నవి. కావున వేదమున కివి పంచత్వసంఖ్యాపూరకమైన వేదమే అని చెప్పఁబడినది. వీటి నాధారముగఁజేసికొని గ్రంథములు, అలంకారశాస్త్రములు మనదేశమందుఁ బుట్టియున్నవి. *వీటినన్నిటినిఁ బరికించుచు మనవారు కావ్యములు వ్రాసియున్నారు.

---

* అలంకారాదినియమములలో లేనివిషయములను గొన్నిటిని, విరుద్ధమైనవిషయములను మనకవులు వ్రాసియున్నారు. కాని అవి అలంకారగ్రంథముల అభిప్రాయములకు విరోధములుకావు. అలంకారశాస్త్రములందే ఈవిషయము లక్కడక్కడ ఉదాహరింపఁబడియున్నవి.

సంస్కృతము సత్యమైనభాషయనియు, నితరభాషలు వికార భాషలనియు వేదము చెప్పుచున్నది. అట్టిసత్యమైన సంస్కృతభాషయందే మనపూర్వులు గ్రంథములు రచించిరి. కావున నావాఙ్మయప్రాముఖ్యమును, భాషాప్రాముఖ్యమును మనము ముఖ్యముగా గమనింపవలసియున్నది. సంస్కృతభాషాపదములను † సుష్ఠుగఁ బ్రయోగించుటవలన సుఫలముగలుగునని మనశాస్త్రము చెప్పుచున్నది. కావుననే దేశభాషా కవులుగూడ శబ్దములవిషయమై నిబంధనల నొనరించుకొని కావ్యములు వ్రాసియున్నారు. అనంతమైనవిశ్వమందు అనేక కారణములవలన లెక్కలేనన్ని వికారశబ్దములు పుట్టుచునేయుండును. ఈవికారశబ్దములన్నియుఁ గావ్యముల కెక్కకుండుటకును, అన్నికాలములవారికి నవగాహనమగుటకును, మనపూర్వులు కొన్నినిబంధనలను జేసియున్నారు. ‡ అప్పటినుండి భాషల కొకవిధమైనపద్ధతి యేర్పడియున్నది. కావ్యమందుఁ బరమార్థమును సాధించుకవులు తగినపదజాలము నుపయోగించి అపశబ్దములను వ్యావహారికజనులకై విడువవలసియున్నది.

జనసామాన్యము మాటలలో నసభ్యమైన పలుకులుండును, అసభ్యమైన చేష్టలుండును. మఱియు జనులయొక్క కృత్యములలోఁ గొన్ని *వ్యక్తముచేయుటకురానివి గలవు. కొన్ని పేర్కొనఁగూడనివి గూడఁ గలవు. అట్టివాటిని సుకవి విసర్జించియే తీరవలెనుగదా.

---

† "ఏక శ్శబ్ద స్సుష్ఠు ప్రయుక్త స్స్వర్గేలోకే కామదుగ్భవతి" అని గలదు. కావ్యముత్తమమైనధర్మమును(ఉత్కృష్టభావమును) సాధించునుగాన సుష్ఠుపదములనే ఉపయోగింపవలసియున్నది. అపశబ్దప్రయోగము అనిష్టసూచకమని భావము. ప్రమాదవశమున నైనను అపశబ్దప్రయోగము అనిష్టమగునుగాన ఉద్దేశపూర్వకముగ నపశబ్దములను బ్రయోగింపనేరాదని శాస్త్రహృదయము.

‡ పూర్వకవులు ఉపయోగింపనివి, నిబంధనలకు విరోధముకానివి యగుపదములను గొన్నిటిని తరువాతికవులు తమగ్రంథములందుఁ బ్రయోగించియున్నారు. అదిగాక దేశకాలములనుబట్టి కొన్నిశబ్దములు ప్రయోగింపఁబడుచుండును. కావునఁ గవులగువారు భాషాపదములవిషయమై తగుశ్రద్ధ ముఖ్యముగా వహించవలసియున్నది.

* ఉన్నదున్నట్లుగా వ్రాయుఁబూను స్వీయచరిత్రకారులైనను వాటిని లిఖింపఁజాలరు.

ఎంత కుకవియైనను గూడ నీపై వాటిని వ్రాయఁజాలఁడు కదా. ఎవరి కైనను మనసులో నభిప్రాయములు గల్గుచుండును. అందుఁ గొన్నిటిని మాత్రమే బాహ్యాకారములు వ్యక్తము చేయుచుండును. వీటినన్నిటిని వివరింపకుండుటయు నొకలోపమే యగునుగదా. కావ్యములందుఁ గవి వీటినిఁ దనస్వంతమగుమాటలతోఁ దెల్పవలసియున్నది. దృశ్య కావ్యములందుఁగూడ మనోభావములన్నియుఁ దెలియఁబడఁజాలవు. స్వగతములద్వారా వాటిని వెల్లడింపవలసియున్నదికదా. ఏకకాలగత మైన అనేకులయొక్క బాహ్యాభ్యంతర ప్రవృత్తులను గవి వరుసగా వ్రాయవలసియున్న దేగాని ఒకేమాఱు వ్రాయఁజాలఁడుకదా. ఎప్పు డైతే ఉన్నదున్నట్లుగా వ్రాయుటకుఁ గుదరదో అప్పుడు కవి ప్రకృతిని నతిక్రమించవింఁచవలసియున్నది. కేవలముగాఁ బ్రకృతినిమించి వ్రాయుట ప్రయోజనము లేదు. అట్లువ్రాయుటకును రాదు. అందువలనఁ గావ్యము ప్రకృతిననుసరించినట్లే పోవుచుండవలెను. ప్రకృతిని మీఱుచుండ వలెను.

పలుకులు, చేష్టలు, భావములు అసభ్యముగాకుండ వ్రాయవలసి యున్నందున, నుదారభావములు చేకూర్పవలసియున్నందున వాటి యొక్క ఉచితానుచితములను గవి విమర్శింపవలసియున్నదికదా. ఇందుకై శాస్త్రజ్ఞానమును, లోకజ్ఞానమును గవి సంపాదింపవలసియున్నది. కవిత్వ మనునది సహజముగనే పుట్టవలయును. సహజముగఁబుట్టునదియే రాణిం చును. అయినను శాస్త్రలోకజ్ఞానములుగల్గి పండితుఁడైనకవి శబ్దపుష్టి, భావపుష్టిగల్గి లోకమందు మిక్కిలిగా రాణించును.

కావ్యములు (దృశ్యశ్రవ్యకావ్యములు) సహజము కానందునను, కేవలముగా నసహజత్వమున నుండకూడనందునను ఘనులైనకవులు అనేకవిధములుగాఁ బదములను బ్రయోగించి అర్థగాంభీర్యము గల్గించి యున్నారు. లోకప్రసిద్ధమైన విషయములను గ్రహించి అలంకారములను గూర్చి సొబగుఁగూర్చియున్నారు. ఉత్కృష్టభావములు వెదచల్లి ఉత్కృష్ట తను సాధించినారు. కథనునిమిత్తముగఁదీసికొని పదాలంకారభావముల యొక్క స్వారస్యమును వ్యక్తపఱచి తత్కాలమున లోకహితమును లేక

ప్రమోదమును సాధించియున్నారు. కావుననే అసహజమైన విషయము లనేకముగానున్నను కావ్యములు రసవంతమగుచున్నవి.

సినీమాలలోఁ బాత్రకనఁబడకపోయినను నాపాత్రమాటలు వినిపించుచుండును. ఇందువలన నాసమయములోఁ బరికింపవలసియున్న ఇతర ప్రవృత్తి మనకు వ్యక్తమగుచుండును. మఱియు దారిపాట వినిపించుచుండును. (యతిరో, బిచ్చగాఁడో తనదారినిఁబోవుచుఁ బాడుకొనుచుండును.) అది తత్కాలసంఘటనమునకుఁ బ్రయోజనమగుచుండును. వెనుకపాట (బ్యాక్ గ్రౌండుమ్యూజిక్) వినఁబడుచుండును. అది తత్కాలమందలి సంతోషవిషాదపరిస్థితులకు దోహదమొనరించుచుండును. అట్లే జనాంతికములు రంగమందు నూతనపరిస్థితినిఁ గలిగించును. స్వగతములు మనోవృత్తములను వ్యక్తముచేయును. చిన్నచిన్న పదములయొక్క కూడిక ఒకొక్కప్పుడును, దీర్ఘసమాసము లొకొక్కప్పుడును రసపుష్టి గలిగించుచుండును. శ్లేష కొన్నిసమయములలో నాహ్లాదమునుగూర్చును. *శబ్దార్థాలంకారములు సదా మనోల్లాసమును గూర్చుచుండును. మెల్లగను, గంభీరముగను, నింపాదిగాను, తొందరగాను పలుకుమాటలు వణఁకింపుమాటలు, సూటియగుమాటలు ఆయాపట్టులందు రసవంతములగుచుండును. రెండుమూఁడుపర్యాయములు మఱియు పదేపదే ఉచ్చరించుపదములు ఒకొక్కప్పుడు విశేషమైన భావమును వ్యక్తపఱచును. వృత్తములలోఁ జదివినను, పాటలలోఁబాడినను హాయిహాయి అనిపించుచుండును. పూజ్యులందు ఏకవచనము లున్నను, అనవసరసంబోధనలుండినను రాణించుచుండును. ఇన్ని అసహజమైన సంగతులతోఁగూడియున్నను గావ్యములు లోకమున కాహ్లాదము గలిగించుచున్నవి. హితమునుబోధించుచున్నవి. కావుననే కవులు నిరంకుశులని లోకప్రఖ్యాతి గల్గినది.

---

* శబ్దప్రయోగమాధుర్యమంతయుఁ శబ్దాలంకారములు. అర్థగాంభీర్యమంతయు నర్థాలంకారములు. కవి యుత్కృష్టుఁడైనకొలఁది వీటియందుఁ బ్రజ్ఞ మిక్కిలిగాఁ గల్గియుండును. భారతదేశకవులందఱు నీశబ్దార్థాలంకారములను రచించుటలోఁ దిమఘనత్తను జూపియున్నారు. ముఖ్యముగాఁ బ్రబంధకవు లిందు విశేషశ్రద్ధవహించిరి.

ఎంత కుకవియైనను గూడ నీపై వాటిని వ్రాయఁజాలఁడు కదా. ఎవరికైనను మనసులో నభిప్రాయములు గల్గుచుండును. అందుఁ గొన్నిటిని మాత్రమే బాహ్యాకారములు వ్యక్తము చేయుచుండును. వీటినన్నిటిని వివరింపకుండుటయు నొకలోపమే యగును గదా. కావ్యములందుఁ గవి వీటినిఁ దనస్వంతమగుమాటలతోఁ దెల్పవలసియున్నది. దృశ్యకావ్యములందుఁగూడ మనోభావములన్నియుఁ దెలియఁబడఁజాలవు. స్వగతములద్వారా వాటిని వెల్లడింపవలసియున్నదికదా. ఏకకాలగతమైన అనేకులయొక్క బాహ్యాభ్యంతరప్రవృత్తులను గవి వరుసగా వ్రాయవలసియున్నదేగాని ఒకేమాఱు వ్రాయఁజాలఁడుకదా. ఎప్పుడైతే ఉన్నదున్నట్లుగా వ్రాయుటకుఁ గుదరదో అప్పుడు కవి ప్రకృతిని నతిక్రమించవలసియున్నది. కేవలముగాఁ బ్రకృతినిమించి వ్రాయుట ప్రయోజనము లేదు. అట్లువ్రాయుటకును రాదు. అందువలనఁ గావ్యము ప్రకృతిననుసరించినట్లే పోవుచుండవలెను. ప్రకృతిని మీఱుచుండవలెను.

పలుకులు, చేష్టలు, భావములు అసభ్యముగాకుండ వ్రాయవలసియున్నందున, నుదారభావములు చేకూర్పవలసియున్నందున వాటియొక్క ఉచితానుచితములను గవి విమర్శింపవలసియున్నదికదా. ఇందుకై శాస్త్రజ్ఞానమును, లోకజ్ఞానమును గవి సంపాదింపవలసియున్నది. కవిత్వమనునది సహజముగనే పుట్టవలయును. సహజముగఁబుట్టునదియే రాణించును. అయినను శాస్త్రలోకజ్ఞానములుగల్గి పండితుఁడైనకవి శబ్దపుష్టి, భావపుష్టిగల్గి లోకమందు మిక్కిలిగా రాణించును.

కావ్యములు (దృశ్యశ్రవ్యకావ్యములు) సహజముకానందునను, కేవలముగా నసహజత్వమున నుండకూడనందునను ఘనులైనకవులు అనేకవిధములుగాఁ బదములను బ్రయోగించి అర్థగాంభీర్యము గల్గించియున్నారు. లోకప్రసిద్ధమైన విషయములను గ్రహించి అలంకారములను గూర్చి సొబగుఁగూర్చియున్నారు. ఉత్కృష్టభావములు వెదచల్లి ఉత్కృష్టతను సాధించినారు. కథను నిమిత్తముగఁదీసికొని పదాలంకారభావముల యొక్క స్వారస్యమును వ్యక్తపఱచి తన్మూలమున లోకహితమును లేక

ప్రమోదమును సాధించియున్నారు. కావుననే అసహజమైన విషయము లనేకముగానున్నను కావ్యములు రసవంతమగుచున్నవి.

సినీమాలలోఁ బాత్రకనఁబడకపోయినను నాపాత్రమాటలు వినిపించుచుండును. ఇందువలన నాసమయములోఁ బరికింపవలసియున్న ఇతర ప్రవృత్తి మనకు వ్యక్తమగుచుండును. మఱియు దారిపాట వినిపించుచుండును. (యతియో, బిచ్చగాఁడో తనదారినిఁబోవుచుఁ బాడుకొనుచుండును.) అది తత్కాలసంఘటనమునకుఁ బ్రయోజన మగుచుండును. వెనుకపాట (బ్యాక్ గ్రౌండుమ్యూజిక్) వినఁబడుచుండును. అది తత్కాలమందలి సంతోషవిషాదపరిస్థితులకు దోహద మొనరించుచుండును. అట్లే జనాంతికములు రంగమందు నూతనపరిస్థితినిఁ గలిగించును. స్వగతములు మనోవృత్తములను వ్యక్తముచేయును. చిన్న చిన్న పదములయొక్క కూడిక ఒకొక్కప్పుడును, దీర్ఘసమాసము లొక్కొక్కప్పుడును రసపుష్టి గలిగించుచుండును. శ్లేష కొన్ని సమయములలో నాహ్లాదమునుగూర్చును. *శబ్దార్థాలంకారములు సదా మనోల్లాసమును గూర్చుచుండును. మెల్లగను, గంభీరముగను, నింపాదిగాను, తొందరగాను పలుకుమాటలు వణఁకింపుమాటలు, సూటియగుమాటలు ఆయాపట్టులందు రసవంతములగుచుండును. రెండుమూఁడుపర్యాయములు మఱియు పదేపదే ఉచ్చరించుపదములు ఒక్కొక్కప్పుడు విశేషమైన భావమును వ్యక్తపఱచును. వృత్తములలోఁ జదివినను, పాటలలోఁబాడినను హాయిహాయి అనిపించుచుండును. పూజ్యులందు ఏకవచనము లున్నను, అనవసరసంబోధనలుండినను రాణించుచుండును. ఇన్ని అసహజమైన సంగతులతోఁగూడియున్నను గావ్యములు లోకమున కాహ్లాదము గలిగించుచున్నవి. హితమునుబోధించుచున్నవి. కావుననే కవులు నిరంకుశులని లోకప్రఖ్యాతి గల్గినది.

---

* శబ్దప్రయోగమాధుర్యమంతయుఁ శబ్దాలంకారములు. అర్థగాంభీర్యమంతయు నర్థాలంకారములు. కవి యుత్కృష్టుఁడైనకొలఁది వీటియందుఁ బ్రజ్ఞ మిక్కుటిగాఁ గల్గియుండును. భారతదేశకవులందఱు నీశబ్దార్థాలంకారములను రచించుటలోఁ దమప్రజ్ఞను జూపియున్నారు. ముఖ్యముగాఁ బ్రబంధకవు లిందు విశేషశ్రద్ధవహించిరి.

ఎందఱెంద ఱెన్నెన్ని విధములఁ జక్కని కావ్యములు వ్రాసినను, సంస్కృతవాఙ్మయమును దేశభాషలలోని కెన్ని విధములఁ బరివర్తించినను, సంస్కృతవాఙ్మయమున కున్న ఘనత తఱుఁగదు. ప్రపంచమం దన్ని దేశములవారు ఆభాషావాఙ్మయస్వారస్యమును జవిచూచి అందుఁ బూర్ణముగ నాసక్తు లగుచున్నారు. సంస్కృతవాఙ్మయమం దుత్కృష్ట స్థానమును బొందియున్న పురాణేతిహాసములఘనత కొంచెమైనను దగ్గదు. పురాణపురుషుఁడైన వేదపురుషుఁ డావాఙ్మయమం దన్నిచోట్ల నిండి యుండుటచేతనే ఆవాఙ్మయమున కాఘనత గల్గినది. వాటియందున్న రుక్మిణీకల్యాణాదులు ఇహపరశ్రేయస్సాధకము లైయున్నవి. భారతీయులు ముఖ్యముగా వాటిని సదాస్మరించుచు తరించుచుందురుగాక.

సీ. మునికృతమగు నిష్టిఁ బొలుపొంద జననంబు జనకసవనభూమి జననమాట
దశరథజీవమై తగనగ్రజాతంబు జనకాసువై పెద్దతనయయౌటఁ
బ్రాకటంబైనట్టి యేకపత్నీత్వంబు ఘనపతివ్రతలందు ఘనతఁగనుట
సకలవిశ్వంభరప్రకటాధిపత్యంబు బ్రహ్మాండమునకెల్ల రాణియగుట
గీ. నవనిఁ *పితృవాక్యపరిపాలనానుసరణి, శుద్ధసకలాంగసౌందర్యశోభలొప్పు
ప్రణుత జానకీరామ దాంపత్యమహిమ, ప్రోచుఁగావుత భువినెల్లఁ బూర్ణముగను.

శ్రీకృష్ణార్పణమస్తు.

---

* 'ఇయంసీతా' అను రామాయణశ్లోకములో 'సహధర్మచరీతవ' అని జనకుఁడు పలికియున్నాఁడు. ఆ ప్రకారము సీతాదేవి పితృవాక్యపరిపాలన మొనరించియున్నది. శ్రీరాముఁడు పితృవాక్యపరిపాలన మొనరించినవాఁడేకదా.



చెన్నపురి : 'వావిళ్ల' ప్రెస్సున ముద్రితము.

ఎందఱెందఱెన్నెన్ని విధములఁ జక్కనికావ్యములు వ్రాసినను, సంస్కృతవాఙ్మయమును దేశభాషలలోని కెన్ని విధములఁ బరివర్తించినను, సంస్కృతవాఙ్మయమున కున్న ఘనత తఱుఁగదు. ప్రపంచమం దన్ని దేశములవారు ఆభాషావాఙ్మయస్వారస్యమును జవిచూచి అందుఁ బూర్ణముగ నాసక్తు లగుచున్నారు. సంస్కృతవాఙ్మయమం దుత్కృష్ట స్థానమును బొందియున్న పురాణేతిహాసములఘనత కొంచెమైనను దగ్గదు. పురాణపురుషుఁడైన వేదపురుషుఁ డావాఙ్మయమం దన్నిచోట్ల నిండి యుండుటచేతనే ఆవాఙ్మయమున కాఘనత గల్గినది. వాటియందున్న రుక్మిణీకల్యాణాదులు ఇహపరశ్రేయస్సాధకము లైయున్నవి. భారతీయులు ముఖ్యముగా వాటిని సదాస్మరించుచు తరించుచుందురుగాక.

సీ. మునికృతమగు నిష్టిఁ బొలుపొంద జననంబు జనకసవనభూమి జననమాట
దశరథజీవమై తగనగ్రజాతంబు జనకాసువై పెద్దతనయయౌటఁ
బ్రాకటంబైనట్టి యేకపత్నీత్వంబు ఘనపతివ్రతలందు ఘనతఁగనుట
సకలవిశ్వంభరప్రకటాధిపత్యంబు బ్రహ్మాండమునకెల్ల రాణియగుట
గీ. నవనిఁ *పితృవాక్యపరిపాలనానుసరణి, శుద్ధసకలాంగసౌందర్యశోభలొప్పు
ప్రణుత జానకీరామదాంపత్యమహిమ, ప్రోచుఁగావుత భువినెల్లఁ బూర్ణముగను.

శ్రీకృష్ణార్పణమస్తు.

---

* 'ఇయంసీతా' అను రామాయణశ్లోకములో 'సహధర్మచరీతవ' అని జనకుఁడు పలికియున్నాఁడు. ఆప్రకారము సీతాదేవి పితృవాక్యపరిపాలన మొనరించియున్నది. ...డు పితృవాక్యపరిపాలన మొనరించినవాఁడేకదా.



చెన్నపురి : 'వావిళ్ల' ప్రెస్సున ముద్రితము.